# భాగవత కథాసారము

అను

# శ్రీ కృష్ణ చరిత్రము

ద్వితీయ భాగము

శ్రీ బంకించంద్ర చట్టోపాధ్యాయుని వంగభాషాగ్రంథమునుండి
బాలాంత్రపు సూర్యనారాయణరావు ఎమ్. ఏ. గారిచే
ఆంధ్రీకరింపఁబడినది.



పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.

  [వెల రు. 1—8—0

# నవలలు

| | | రు | అ |
|---|---|---|---|
| విషహృదయము | | 1 | 4 |
| కలువలరాణి | | 1 | 0 |
| నేనెవరిభార్యను ? | | 1 | 8 |
| నేనెవరిభర్తను ? | | 1 | 8 |
| **తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి గారి** | | | |
| జీవనప్రభాతము (రఘునాథసీ) | | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | | 1 | 8 |
| అగ్గిరాముడు | | 1 | 0 |
| భయంకరుడు | 1 భా | 1 | 0 |
| నరేంద్రుడు | 2 భా | 1 | 0 |
| రమేశబాబు | | 0 | 12 |
| కర్నల్ రంగనాథన్ | | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | | 1 | 0 |
| చదువుకున్న భార్య | | 1 | 0 |
| నీవే నా ? | | 1 | 0 |
| ఖాందకుడు | | 1 | 0 |
| శక్తికుమారి | | 1 | 0 |
| పంజాబు మెయిల్ | | 1 | 0 |
| కన్నపుదొంగ | 1 భా | 1 | 0 |
| పగటిచుక్క | 2 భా | 1 | 0 |
| డిటో | 3 భా | 1 | 0 |
| (పైమూడుభాగములు చదివిన కథ పూర్తియగును) | | | |
| రమాసుందరి | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |
| రక్తవాహిని (ఐదు హత్యలు) | | 1 | 0 |
| ఇంద్రజాలము | | 1 | 0 |
| రాజద్రోహి | | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు) | | 1 | 0 |
| దురాశ | 1 భా | 1 | 0 |
| డిటో | 2 భా | 1 | 0 |

| | | రు |
|---|---|---|
| దొంగల నాయకుడు | | 1 |
| మోహపిశాచము 270 పే॥ | | 1 |
| కాలసర్పము | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| ఆనందభవనము | | 1 |
| అల్లరిపిల్ల | | 0 |
| మగడు కాని మగడు | | 1 |
| ధర్మరాజు | | 1 |
| హాతింతాయి | | 1 |
| **కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి** | | |
| అహల్యాబాయి | | 1 |
| రాజరత్నం | | 1 |
| కృష్ణవేణి | | 0 |
| ప్రేమలత | | 1 |
| కర్పూరమంజరి | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| రామచంద్రవిజయం | | 1 |
| వినోదములు | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| Tales of Rajasthan అను రాజస్థాన కథావళి | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| మణిమంజరి | | 0 |
| సువర్ణసుప్రభము | | 0 |
| చమత్కారమంజరి | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| **Lives of Great Men మహాపురుషుల జీవితచరిత్రలు** | | |
| | 1 భా | 1 |
| డిటో | 2 భా | 1 |
| డిటో | 3 భా | 1 |

# భాగవతకథాసారము

## ద్వితీయ భాగము

శ్రీబంకించంద్రచట్టోపాధ్యాయుని వంగభాషాగ్రంథమునుండి
బాలాంత్రపు సూర్యనారాయణరావు ఎమ్. ఏ గారిచే
ఆంధ్రీకరింపఁబడినది.



ప్రకాశకులు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి.
1951

# విషయసూచిక

## ద్వితీయభాగము

### చతుర్థఖండము

## పంచమఖండము



## షష్ఠమఖండము

శ్రీ రామచంద్ర.

# భాగవతకథాసారము



## ద్వితీయభాగము

### చతుర్థఖండము

" అకుంఠం సర్వకార్యేషు ధర్మకార్యార్థ ముద్యతమ్
వైకుంఠస్య చ యద్రూపం తస్మై కార్యాత్మనే నమః॥

శాంతిపర్వము 47 అధ్యాయము.

### ప్రథమపరిచ్ఛేదము

### ద్రౌపదీస్వయంవరము

మహాభారతమునఁ గృష్ణకథ యెంతవఱకుఁ గానవచ్చుచున్నదో, అది యెంతవఱకు మౌలికమును, విశ్వాసయోగ్యమును, నై యున్నదో దానిని నిర్వచించుటకుఁ బ్రథమఖండమున వ్రాయఁబడిన నియమముల నన్నిటిని మరల నొకసారి స్మృతిపథమునకుఁ దెచ్చికొన వలయునని పాఠకమహాశయులను వేఁడికొనుచున్నారము.

మహాభారతమునఁ గృష్ణుఁడు ప్రప్రథమమున ద్రౌపదీస్వయంవరమునఁ గానఁబడుచున్నాఁడు. మహాభారతమునందలి యీకథాంశమున మౌలికతనుగూర్చి సందేహించుటకుఁ గారణము లేవియు లేవని మాయభిప్రాయము. లాసన్ దొరగారు పాంచాలాదు లగుపంచభా

తుల యేకీకరస్వరూపమునకుఁ బాంచాలి యని పేరు పెట్టి ద్రౌపది కేవలముగఁ గవికల్పనాప్రసూతయే గాని, మానవి కాదని చెప్పి యున్నారు. ద్రుపదకన్యక యగ్నికుండమున నుద్భవించినదని గాని, ఆమె కేవురు భర్తలు కలరనీ గాని, మేము విశ్వసింపజాలము. కాని, ద్రుపదరాజున కౌరసపుత్రిక జనించుటయును, ఆమెకు స్వయంవర వివాహము జరగియుండుటయును, ఆస్వయంవరమున నర్జునుఁడు లక్ష్య భేద మొనర్చి యామెను గైకొనియుండుటయు నను నీవిషయము లసంభవము లని చెప్పుటకుఁ గారణము లేవియుఁ గానరావు. ఆమె కైదుగురు భర్తలు గలరో, ఒకభర్త కలఁడో, అనువిషయమును గూర్చి విమర్శ చేయుటలో మాకేమియును ప్రయోజనము లేదు. *

కృష్ణుఁడు మహాభారతమున ద్రౌపదీస్వయంవరమున బ్రథమమునఁ గానఁబడుచున్నాఁడు. అందతని దేవత్వ మెంతమాత్రమును సూచింపఁబడి యుండలేదు. ఇతరక్షత్రియులవలెనే యాదవులతోఁ గూడ నతఁడును ద్రుపదరాజుచే నాహూతుఁడై పాంచాలపురమునకు వచ్చెను. ఇతరక్షత్రియు లందఱును ద్రౌపదిని బడయఁగోరి లక్ష్య భేద మొనర్ప బ్రయాసపడిరి. కాని, యాదవులుమాత్ర మందులకుఁ బ్రయత్నింపరైరి.

---

* మహాభారతమునందలి యనుక్రమణికాధ్యాయమున వ్యాసుఁడు భారతమునందలి సంక్షిప్త వృత్తాంతమును 150 శ్లోకములలో రచియించి యుండె నని యిది వఱకే చెప్పఁబడినది. ఈయనుక్రమణిక యందలి సంక్షిప్త వృత్తాంతమున ద్రౌపదీ స్వయంవరకథ గానఁబడుచున్నది. కాని, ద్రౌపది పంచపాండవులకు వివాహము గావింపఁబడినట్లు అందు జెప్పఁబడియుండలేదు. అర్జునునకే యామె లభించినదను విషయముమాత్రమే యందుఁ జెప్పఁబడినది.

"సమవాయే తతో రాజ్ఞాం కన్యామ్ భర్తృ స్వయంవరామ్
ప్రాప్తవా నర్జునః కృష్ణాం కృత్వా కర్మ సుదుష్కరమ్"

# చతుర్థఖండము

పాండవు లీస్వయంవరమునకు విచ్చేసి యుండిరి. కాని, వారం దుల కాహుతులు కాలేదు. దుర్యోధనుఁడు వారికిఁ బ్రాణహాని జేయఁ బ్రయత్నించుచుండ, వారాత్మసంరక్షణార్థము మాఱువేషములతో నరణ్యములలోఁ దిరిగి తిరిగి యిప్పు డీద్రౌపదీస్వయంవరవృత్తాంత మును విని ప్రచ్ఛన్నులై యీసభకు వచ్చియుండిరి.

అందు సమావేశమైన బ్రాహ్మణ క్షత్రియ మండలమధ్య మునఁ గేవలము కృష్ణుఁడు మాత్రమే ప్రచ్ఛన్నవేషధారులయిన పాండవులను గుర్తింపఁ గలిగెను. అతఁడు దైవశక్తి ప్రభావముననే యిట్లు తెలిసికొనఁజాలె నని భారతమున నెంతమాత్రమును సూచింపఁ బడలేదు. ఆతఁడు మనుష్యబుద్ధితోడనే తెలిసికొనఁజాలిన ట్లాతని మాటలవలననే స్పష్టపడుచున్నది. ఆతఁడు బలరామునిఁ జూచి "చూడుము! మహాశయా! అవి స్త్రీగ్ణశరాసనధరుఁడే యర్జునుఁడు. అం దుల కేమియును సందేహము లేదు. తనబాహుబలమున వృక్షమును పెకలించి నిర్భయముగ రాజమండలమధ్యమునఁ బ్రవేశించుచున్న యాతఁడే వృకోదరుఁడు" అని చెప్పెను. అటు తరువాత నుభయు లును గలిసికొనినప్పుడు యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణునిఁ జూచి. "మమ్ము లను నీవెట్లు గుర్తింపఁగలిగితివి?" అని యడిగినట్లును, "నివురు గవిసి నంతమాత్రమున నిప్పు మఱుఁగువడునా?" అని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చినట్లును భారతమునందే చెప్పఁబడినది. ప్రచ్ఛన్నవేషధారు లయిన పాండవుల గుర్తించుట యతికఠినము. ఇతరు లెవ్వరును వారిని గుర్తిం పఁజాల రని చెప్పుటలో నాశ్చర్య మేమియును లేదు. స్వాభావిక మైన మానవబుద్ధితోడనే కృష్ణుఁడు వారిని గుర్తింపఁగలిగె ననుటచేత నాతఁ డితరులకంటెఁ గుశాగ్రబుద్ధియని తేటపడుచున్నది. మహాభారతమునం దెచ్చోటను నీవిషయము విస్పష్టముగఁ జెప్పఁబడి యుండలేదు. కృష్ణుఁడు ప్రతికార్యమును మానవబుద్ధితోడనే యొనర్చుచుండుటసత్యమే కాని,

ఆతఁ డందఱకంటెను, గుశాగ్రబుద్ధి యగుపురుషుఁ డని యాతఁ డొనర్చిన ప్రతికార్యముచేతను దెలియవచ్చుచున్నది. ఆతబుద్ధియం దెందును. ఛిద్రములు గానరావు. ఇతరవృత్తుల యందువలెనే బుద్ధియందు గూడ నాతఁ డాదర్శస్వరూపుఁడు.

అర్జునుఁడు లక్ష్యభేద మొనర్చినతోడనే యచ్చోట సమావేశమయిన రాజబృందముతో నతనికి వివాదము తటస్థించెను. అర్జునుఁడు భిక్షుకబ్రాహ్మణవేషధారి ఒక సామాన్యభిక్షుకబ్రాహ్మణుఁడు మహారాజులముఖగ్రాసము నాక్రమించి కైవసము చేసికొనుటఁ జూచి వారలు సహింపఁజాలకపోయిరి. తోడనే వార లాతనిపై యుద్ధమునకు డీకొనిరి. జరిగినంతవఱకు నాయుద్ధమున నర్జునుఁడే జయలాభము నొందెను. శ్రీకృష్ణునివలన నీవివాదము నివారణ సేయఁబడెను.

మహాభారతకథాసందర్భమునఁ గృష్ణుఁ డొనర్చిన ప్రథమకార్యమిదియె. ఆతఁ డేప్రకారమున నీవివాదమును ముగింపఁజేసెనో దానిని దెలుప నిచ్ఛగించుచున్నాము. వివాదమును దొలఁగించుటకనేకోపాయములు గలవు. కృష్ణుఁడు స్వయముగ విఖ్యాతవీరపురుషుఁడు. అదిగాక బలదేవసాత్యకులు మొదలుగాగల విఖ్యాతవీరపురుషులతనిసహాయులై యుండిరి. అర్జునుఁ డతని కాత్మీయుఁడు—మేనత్తకొడుకు. అతఁడు యాదవసైన్యములఁ దీసికొని, సమరక్షేత్రమున నర్జునునకు సహాయ మొనర్చినయెడల వివాద మంతలో ముగియఁగలదు భీమసేనుఁ డట్లె యొనర్చెను. కాని కృష్ణుఁ డాదర్శధార్మికుఁడు యుద్ధము లేకుండఁగఁ గార్యసాధన మొనర్పఁగలిగినయెడల, నాతఁ డెన్నఁడును యుద్ధమునకుఁ బ్రవృత్తుఁడు గాఁడు. ధర్మసంరక్షణార్థము గాక మఱియితరకారణమునఁ గృష్ణుఁడుయుద్ధప్రవృత్తుఁడైనట్లు మహాభారతమున నెచ్చోటను గానఁబడదు. ఆత్మసంరక్షణార్థము, పరసంరక్షణార్థముఁ, యుద్ధము ధర్మము. ఆత్మసంరక్షణార్థము గాని, పరుల సంరక్షణార్థము

యుద్ధ మొనరింపకుండుట యధర్మము. మన బంగాలీజాతి, యేడువందలసంవత్సరములుగ నీయధర్మఫలభోగము ననుభవించుచున్నది. కృష్ణుం డెన్నండును మఱియే కారణముపై యుద్ధమొనర్చి యుండలేదు. ధర్మస్థాపనార్థము యుద్ధమువలన నాపత్తిలేదు. ఎచ్చోట యుద్ధ మొనర్పకయే ధర్మమున్నతి నొందఁజాలదో యచ్చోట యుద్ధ మొనర్పకుండుటయే యధర్మము. కేవలము కాశీరామదాసును కథకతాకూరును రచించిన మహాభారతమును పఠింప నాదరముగలవారు మాత్రమే శ్రీకృష్ణుండు సకలయుద్ధమునకు మూలమని విశ్వసించుచున్నారు. కాని మూలభారతమును బుద్ధిపూర్వకముగఁ బఠించినయెడల నిట్టివిశ్వాసము నిలువఁజాలదు. ధర్మార్థము తప్పఁ గృష్ణుం డెన్నడు నెవ్వరిని యుద్ధమునకుఁ బ్రోత్సాహపఱిచిన ట్లగుపడదు. ధర్మార్థము తప్ప దానును స్వయముగ యుద్ధము చేయలేదు.

అతఁడు పరాజితులైన రాజులను జూచి 'ఓ భూపాలులారా! ఇతఁడె రాజకుమారికను, ధర్మమూలకముగ సంపాదించుకొనియెను. మీరు శాంతింపుఁడు. ఇఁక యుద్ధమువలన బ్రయోజనము లేదు' అని చెప్పెను. ధర్మచింతన మిప్పు డెవ్వరిహృదయములకు నెక్కుచుండుట లేదు. అప్పటికాలమున ననేకులగు క్షత్రియపుంగవులు ధర్మభీతులై యుండిరి. బుద్ధిపూర్వకముగ నెన్నఁడు నధర్మవృత్తులై యుండలేదు. కాని వారలిప్పుడు రాగాంధులై ధర్మమును మఱచిపోవుచున్నారు. కాని యెవఁడు ప్రకృతిచే ధర్మాత్ముఁడో, ధర్మవృత్తియే, యెవరిజీవనోద్దేశమో యతఁడీవిషయమున ధర్మ [illegible] దానిని మఱచిపోలేదు. ధర్మవిస్మృతి నొందినవారికి ధర్మస్మరణ చేయుటయును ధర్మానభిజ్ఞులకు ధర్మోపదేశమును [illegible] నతనిపని.

అభూపాలకులఁ జూచి కృష్ణుండు 'ఈకుమారిక నీతఁడే ధర్మపూర్వకముగఁ బరిగ్రహించెను, కావున నిఁక యుద్ధమువలన బ్రయో

జనము లేదు.' అని చెప్పెను. అది విని, రాజులు శాంతచిత్తులై యుద్ధమునుండి మరలిరి. పాండవులు తమయాశ్రమమునకుఁ బోయిరి.

ఒకసామాన్యపురుషుఁడు ఆరాజలోకమునకు ధర్మోపదేశమును జేసియుండినయెడల వార లెన్నటికిని, యుద్ధమునుండి విరతులై మరలియుండరు. ఈధర్మోపదేశమును జేసిన యాతఁడు, మహాబలశాలి; గౌరవాన్వితుఁడు; అతఁడు, జ్ఞానమునందును, ధర్మమునందును, బాహుబలమునందును, నందఱకుఁ బ్రధానుఁడై యుండెను. సకలవృత్తులను సంపూర్ణరూపమున బరిశీలన మొనర్చినవానియందే యిట్టి ప్రధానత్వము గలుగుచుండును. సకలవృత్తులును, అట్లనుశీలనము నందక యుండినయెడల నట్టిఫలము లభింపనేరదు. శ్రీకృష్ణచరిత్రమూలకముగ నిట్టిధర్మతత్వము పరిస్ఫుట మగుచున్నది.

---

## ద్వితీయపరిచ్ఛేదము

### కృష్ణయుధిష్ఠిరసంవాదము

అర్జునుఁడు లక్ష్యభేదన మొనర్చి రాజులతో యుద్ధ మొనర్చిన తరువాత భ్రాతృవరులతోఁ గూడి తనయాశ్రమమునకుఁ బోయెను. ఆస్వయంవరమున కరుదెంచిన రాజలోకముగూడ స్వస్థానములకుఁ బోయెను. ఇఁక నప్పుడు కృష్ణుఁడు చేయవలసిన కార్య మేమున్నది? ద్రౌపదీస్వయంవరము సమాప్త మయ్యెను. ఉత్సవ మంతయు ముగిసినది. ఇఁకఁ గృష్ణుఁడు పాంచాలదేశమున నుండవలసినప్రయోజన మేమియును లేదు. ఇఁకఁ నతఁడు స్వస్థానమునకుఁ దిరిగి పోవలసియుండును. ఇతరరాజు లందఱు నట్లే యొనర్చిరి. కాని కృష్ణుఁ డట్లొనర్పక బలరాముని దీసికొని, యప్పుడు పాండవులు వసించుచున్న భార్గవకర్మశాలకుఁ బోయి యుధిష్ఠిరునకు దర్శన మిచ్చెను.

కాని, యీప్రదేశమునకుఁ బోవలసిన యావశ్యకమేమున్నది? ఇంతకుఁ బూర్వ మాతఁడెన్నఁడును యుధిష్ఠిరునితోఁ గలసికొని కాని, మాటాడి గాని యుండలేదు. శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరునియొద్దకుఁ బోయి సాష్టాంగదండప్రణామపూర్వకముగ నాతనిపరిచయము గలుగఁజేసికొనినట్లు మహాభారతకారుఁడే వ్రాసినాఁడు. బలరాముఁడుకూడ నట్లే యొనర్చెను. ఇట్లు నూతనముగఁ బరిచయమును గలుగఁ జేసికొనుటను జూడఁగ, నింతకుఁ బూర్వము వారు పరస్పరము గలిసికొనినట్లు గాని, సంభాషించినట్లు గాని యూహించుటకు వలనుపడదు. కృష్ణపాండవుల కిదియే ప్రథమసమావేశము. కృష్ణుఁడు కేవలము యుధిష్ఠిరాదులను మేనత్తకుమారులని, వెదకికొని, పోయి వారిని సందర్శించి యుండలేదు. లోకమునఁ గొందరు మేనత్తకుమారులుగాని మేనమామకుమారులుగాని, యున్నతపదవియం దున్నప్పు డుపయాచకులై వారిసందర్శన మొనర్చి సంభాషించు నాచారము కలదు. కాని, పాండవు లిప్పుడు సామాన్యభిక్షుకులు. వారిని సందర్శించి, తాను చరితార్థుఁడు కావలయు ననునభీష్టము శ్రీకృష్ణునకు లేదు. వారలతో సంభాషించి కృష్ణుఁడెట్టిలౌకిక కార్యమునైనను నెఱవేర్చికొనిన ట్లగపడదు. అతఁడు కేవలము వినయపూర్వకముగ యుధిష్ఠిరునితో సంభాషించి వారల శుభాకాంక్షియై తిరిగి వచ్చెను. తరువాత పాండవుల వివాహ మగునంతవఱకుఁ బాంచాలదేశమునందలి తనశిబిరమున నివసించి యుండెను. వివాహానంతరమునఁ బత్నీసమేతులైన పాండవులకుఁ బ్రీతిపురస్సరముగ విచిత్రవైడూర్యమణిమయము లగుస్వర్ణభూషణంబులును, వివిధదేశానర్ఘవసనంబులును, రమణీయంబు లగు పర్యంకములును, వివిధము లగుగృహోపకరణములును, ననేకు లగుదాసదాసీజనంబులును, సుశిక్షితము లగుగజవాజిబృందంబులును, అసంఖ్యాకము లగురథములును, నింకను ననేకవిధము లగుకానుకల

నొసంగెను. అప్పుడు పాండవుల కట్టియైశ్వర్యము లేవియును లేవు. ఏల యన;—అప్పుడు వారు భిక్షుకులై దురవస్థయం దున్నారు. మఱియును, నివి యున్నియు నప్పుడు వారికి విశేషప్రయోజనకరములై యుండెను. ఏల యనిన;—వారలు రాజకన్యకను స్వీకరించి గృహస్థులై యుండిరి. కావున. యుధిష్ఠిరుఁడు కృష్ణప్రేషిత మగు ద్రవ్యసామగ్రి నంతయును సాహ్లాదపూర్వకముగ నందికొనియుండెను. కాని; కృష్ణుఁడు వారలను గలసికొనకుండ స్వస్థానమునకు వెడలెను. ఇఁక కృష్ణునకుఁ బాండవులనుగూర్చిన విచార మేమియును లేదు. పాండవులు తమ రాజ్య భాగమును బొంది, ఇంద్రప్రస్థమున నగరనిర్మాణము గావించికొని వాసము చేయుచుండిరి. మరల శ్రీకృష్ణునకుఁ బాండవులతో సమావేశ మెట్లు కలిగెనో, ఆ విషయమును ముందు వివరించెదము.

ఎవఁడు స్వార్థత్యాగము నాచరించెనో, ఎవఁడుదురవస్థాగ్రస్తులకు హితమునుగలుగఁ జేయుటయే తనకు జీవనవ్రతముగఁ దలంచెనో అట్టిశ్రీకృష్ణుని దుష్కార్యాసక్తుఁ డనియును, దురభిసంధియుక్తుఁ డనియును, క్రూరుఁ డనియును, పాపాచరణుఁ డనియును, కొందఱు పాశ్చాత్యులును, వారలశిష్యులును, స్థిరపఱిచి యుండుట చాల నాశ్చర్యకర మగువిషయము. ఐతిహాసికతత్త్వాన్వేషణమున కుచితమగుశక్తి గాని, శ్రద్ధగాని, యత్నము గాని, లేకపోయినయెడల నిట్టియసంబద్ధాభిప్రాయములు గలుగుచుండును. ఇందలి విశేష మేమన:—శ్రీకృష్ణుఁ డాదర్శపురుషుఁడు గాన, ఇతరసద్వృత్తులవలెనే, ప్రీతివృత్తి కూడఁ బూర్ణవికసితమై యాతనియెడ స్ఫూర్తి నొందియుండె నని యూహింపవలసి యున్నది. శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరున కొనర్చినసత్కారము సామన్యముగఁ బూర్వస్నేహముగల వారియెడలమాత్రమే జరుగుట సంభవ మగుచున్నది. యుధిష్ఠిరునితోఁ గాని, యుధిష్ఠిర

కుటుంబముతోఁ గాని, శ్రీకృష్ణున కింతకుఁబూర్వము సంభాషణము
గాని, స్నేహము గాని, యుండియుండినయెడల నాతఁడిప్పట్లనొనర్చి
నది, భద్రజనోచిత మైనసుగుణముగ నెంచవచ్చును—అంతియే కాని
దానినిగూర్చి విశేషించి వర్ణింప నవసరము లేదు. కాని, అపరిచిత
మును, హీనావస్థాపన్నమును, నైనకుటుంబమును వెదకికొని వచ్చి,
తనకుఁ గార్యక్షతియైనను, వారల కుపకారము సేయుట యాధర్మ
ప్రీతిలక్షణము. కృష్ణుఁడొనర్చిన యీకార్యము సామాన్యమైనదియే
కాని సామాన్యకృత్యములే మానవుని యథార్థచరిత్రమును వెల్లడిం
చును. ఒకమహత్కార్యమును దుర్మార్గుఁడుకూడఁ బ్రయత్నించి
చేయఁగలిగి యుండవచ్చును; చేసి యుండవచ్చును. కాని, యల్ప
కార్యములయందుఁగూడ, నెవ్వరు ధర్మము నాచరించుచుందురో వారు
యథార్థముగ ధర్మాత్ములు. ఈకారణమువలనే నేను మహాభారత
మునందలివిషయము నాలోచించునెడలఁ గృష్ణుఁడొనర్చినకార్యముల
నన్నిటిని నల్పములైనను, గొప్పవైనను, నాలోచింపఁ బ్రయత్నించి
తిని. * ఈమార్గము ననుసరించి కృష్ణచరిత్రము నవగాహనము చేసి
కొనఁ బ్రయత్నింపకుండుట చాల విచారకర మగువిషయము. అట్లొ
నర్పక కృష్ణచరిత్ర మధ్యమునఁ గేవలము "అశ్వత్థామా హత ఇతి
గజః" అను నసత్యములును, అనైతిహాసికములును నగుకథల నాధా
రము చేసికొను చున్నారము. ఈకథయందలి మిథ్యాత్వమునుగూర్చి
ద్రోణపర్వాధ్యాయ సమాలోచనకాలమున విశదీకరింతును.

ఈవైవాహికపర్వమునఁ గృష్ణసంబంధమైన యొక వినోదకర
మైన కథ వ్యాసోక్తమైనదిగఁ జెప్పఁబడియున్నది. అది మేము

---

* హరివంశమునందును, పురాణములయందును గూడ విశ్వాసార్హమగు కథ
అను నిర్ణయించుటకు నీసంగతి తెలియదు.

1 ఈసంగతి మహాభారతమునఁ బ్రక్షిప్తమై యున్నది.

విమర్శ చేయఁ బూనుకొనువిషయములోనిది గాకున్నను, దానినిగుఱించి యించుక చెప్ప టావశ్యక మని యోచించినాము. ద్రుపదరాజు తన కూఁతున కేవురు పతులగుదు రని విని వివాహము నాటంకపఱిచెను. వ్యాసుఁ డావిషయమును ఖండన మొనర్చెను. ఖండనసందర్భమున ద్రుపదున కాతఁ డొకయుపఖ్యానమును వినిపించెను. ఉపన్యాసము చాల విస్మయకరముగ నున్నది. అందలివిశేషార్థ మేమనఁగా:— ఒకప్పు డింద్రుఁడు గంగాజలముల నేడ్చుచున్నసుందరిని గాంచి, నీవేల యేడ్చెదవని ప్రశ్నించెను. అప్పు డామె యిటు వచ్చిచూడు మని చెప్పి యింద్రునిపాశక్రీడాసక్తు లగుయువతీయువకు లున్నచోటునకుఁ దీసికొనిపోయెను అప్పు డాయువతీయువకు లింద్రునకు యథోచిత మైనసన్మానము గావింపకపోవుటచే నింద్రుఁడు క్రుద్ధుఁ డయ్యెను. కాని, పాశక్రీడయం దున్నయువకుఁడు సాక్షాత్తుగ మహాదేవుఁడు; కుపితుఁ డైన యింద్రునిజూచి యాతఁడును గుపితుఁడై యింద్రుని నొకగర్త మునఁ బ్రవేశింప నాజ్ఞాపించెను. ఇంద్రుఁడు గర్తమునఁ ప్రవేశించి యచ్చోటఁ దనవంటియింద్రులను మఱినలువురను జూచెను. మహాదేవుఁ డాయైదుగు రింద్రులను బిలిచి, మీరు పోయి పృథివియందు మానవులుగ జన్మింపుఁ డని యాజ్ఞాపించెను. అప్పు డాయేవు రింద్రులును నేమానవునిగర్భమున జన్మింతు మని మహాదేవుని బ్రార్థించిరి. వీరలే పంచపాండవులై జన్మించిరి. నిరపరాధిని యగునాయువతిని వారలకుఁ బత్నిగా జన్మింపు మని యాజ్ఞాపించెను. ఆమెయే ద్రౌపది. ఏడ్చుచుండిన యామెప్రస్తావ మేమియుఁ జెప్పఁబడి యుండలేదు. ఇందలిరహస్యవిషయ మేమనిన:—నారాయణుఁ డీసంగతి విన్నంతనే తనతలమీఁదినుండి రెండువెండ్రుకల నూడఁబెఱికి పాఱవై చెను. అం దొకటి నల్లనిది. రెండవది తెల్లనిది. తెల్లదిది బలరాముఁడు—నల్లనిది కృష్ణుఁడు !!!

ఈయుపాఖ్యానము మహాభారతమునందలి తృతీయకోశములో నిది. అనఁగా నిది మూలమహాభారతములోనిది కాదని బుద్ధిమంతు లగు పాఠకులకు బోధపడఁ గలదు. ఈకథారచనయును, నిప్పటిబంగాళా దేశమందలి యుపన్యాసలేఖకుల యుపన్యాస (నవల) రచనల కంటెఁ జాల నికృష్టముగా నున్నది. మహాభారతమునందలి ప్రథమ ద్వితీయకోశములను రచించిన ప్రతిభాశాలురైనకవు లిట్టియుపాఖ్యాన రచనాదోషమునకుఁ గడంగియుండరు. అంతియే గాక, మహాభారతమునందలి యితరభాగములకును, దీనికిని నెట్టిసంబంధమును లేదు. ఈయుపాఖ్యానమునందలి వృత్తాంతము నంతయుఁ దీసివైచినను, మహాభారతమునందలి యేకథయును నస్పష్టముగఁ గాని, నిష్ప్రయోజనముగఁ గాని యుండనేరదు. ద్రుపదరాజొనర్చిన యాక్షేపణమును ఖండించువిషయమునఁ గూడ దీనిప్రయోజన మేమియును లేదు. ఏలయనిన:—ఈ యాక్షేపణము వ్యాసోక్తమైన మఱియొకయుపాఖ్యాన మూలకముగ ఖండింపబడుచున్నది. ఆయుపాఖ్యాన మీయధ్యాయమునఁ జెప్పఁబడుచున్నది. అది సంక్షిప్తమును, సరళమును, నైయున్నది. అది ప్రాచీన మహాభారతములోనిదియైన నైయుండవచ్చును. ఇదివఱకుఁ జెప్పబడిన యుపాఖ్యానము దీనికి విరుద్ధముగఁ గానఁబడుచున్నది. ఈ రెండింటియందును ద్రౌపదిపూర్వజన్మవృత్తాంతము భిన్నభిన్నముగ వర్ణింపఁబడి యున్నది. కావున నందులో నొకటి ప్రక్షిప్తమైనదని సిద్ధాంతము చేయవలసియున్నది. అంతియే కాక, ప్రథమోక్తమైన యుపాఖ్యానము మహాభారతమునందలి యితరవిషయములకు విరుద్ధముగఁ గదఁబడుచున్నది. మహాభారతమునం దంతటను నొక్కయింద్రుఁ డనియే చెప్పఁబడుచున్నది. కాని, ఇందు నైదుగు రింద్రులు చెప్పఁబడియున్నారు. పాండవులు ధర్మ, వాయు, ఇంద్ర, అశ్వనీకుమారుల యౌరసపుత్రులైనట్లు చెప్పఁబడి యున్నది.

ఇక్కడఁ బాండవు లైదుగురును నైదుగు రింద్రు లని చెప్పఁబడి యున్నది. ఈవిరోధముల సామంజస్యముకొఱ కుపాఖ్యానరచనా కారుఁ డింద్రాదులు వచ్చి "మమ్ములను మానవగర్భమున జన్మింపఁ జేయుదువుగాక!'' అని మహాదేవుని బ్రార్థించినట్లు చెప్పియున్నాఁడు. జగద్విదిత మైనమహాభారత మిట్టిక్షుద్రరచనాకారుల లేఖినులనుండి పుట్టినది కాదని మనము నిశ్చయింప వచ్చును.

ఏమార్గము ననుసరించి మహాభారతమును మూఁడుతరములుగ విభజించితిమో, దాని నుదాహరణరూపముగ నెఱిగించుటకే మేమీయుపాఖ్యానముల నిచ్చో నెత్తి చూపుచున్నారము. అంతియే కాక, ఇందు మూలకముగ నైతిహాసిక తత్త్వ మొకటికూడ నిరూపింపబడుచున్నది. వేదమునందు సూర్యుని మూర్తి విశేషమాత్రముగ నుచ్చతరము లైన పురాణేతిహాసములయందు సర్వవ్యాపకుఁడైన యీశ్వర స్వరూపుడుగను వర్ణింపబడిన విష్ణువు తరువాత కాలపు సామాన్య లేఖకులహస్తములఁ బడి గోపకుఁడుగను, జటారూపుఁడుగను, మార్పుఁ జెందును. ఇవి యన్నియుఁ బ్రక్షిప్తోపాఖ్యానములమూలకముగ దెలిసికొనుచున్నారము. ఈసకలప్రక్షిప్తోపాఖ్యానములును హిందూ ధర్మావనతిని సూచించునాయని వానినిచ్చోట నెత్తిచూపినారము ఎవరో యొకకృష్ణద్వేషి యైన శైవుని మూలకముగ నీయుపాఖ్యానము రచింపఁబడి మహాభారతమునఁ బ్రక్షిప్తము చేయఁబడినదని యోచించినను యోచింపవచ్చును. ఏల యనిన, ఇందు మహాదేవుఁడు సర్వనియంతగను, కృష్ణుఁడు నారాయణుని జటాస్వరూపుఁడుగను వర్ణింపబడియుండెను. మహాభారతమునఁ గృష్ణమతావలంబకులకును, శివమతావలంబకులకును జరగిన వివాదచిహ్నములు కనఁబడుచున్నవి. వానిలోఁ జాలభాగము ప్రక్షిప్తము లై యుండవచ్చు నని యోచించుటకు గారణము లున్నవి. ఇది యథార్థమైనయెడల నీవివాహము ప్రాచీన

మహాభారతప్రచారమునకుఁ జాలతరువాత నగరియుండవలయును. అనఁగా, శివోపాసనమును, కృష్ణోపాసనమును, ప్రబలమైన తరువాత నీవివాదము ఘోరతరమై యుండెను. మహాభారతరచనాకాలమునఁ గాని, తరువాతఁ గొంతకాలమునకుఁ గాని, యీద్వివిధోపాసనంబుల లో నేదియు; బ్రబలత నొందియుండలేదు. ఆ సమయమున వేదోక్త దేవతలు విశేషప్రచారములో నున్నసమయము ఈ రెంటను ప్రబలత నొందినతరువాతనే వివాదములు సధికమయ్యెను. పిమ్మట మహాభారత గ్రంథము వృద్ధిఁబొంద నారంభించెను. ఉభయపక్షములవారి యభి ప్రాయములును మహాభారతము నాధారము చేసికొని నారివారి దేవతల గౌరవాధిక్యములఁ జూపుచుండెను. ఇట్లు చే శైవులు శివమాహాత్మ్య సూచకములైన రచనలను మహాభారతమునఁ బ్రక్షిప్తములుచేయసా గిరి. *దీనికిఁ బ్రత్యుత్తరముగ వైష్ణవులు విష్ణుమాహాత్మ్యసూచకము లగుప్రక్షిప్తములు చేయసాగిరి. అనుశాసనికపర్వమున దీనికి గొన్ని యుదాహరణములు గలవు. ఇచ్చ యుండినయెడలఁ బాఠకు లాపర్వ మును జదివి తెలిసికొనవచ్చును. తఱచుగా నన్నిటియందు నక్కడ క్కడ గర్దభస్వరసౌరభము పొడకట్టుచునే యుండును.

---

## తృతీయపరిచ్ఛేదము

### సుభద్రాహరణము.

ద్రౌపదీస్వయంవరమునకుఁ బిదప సుభద్రాహరణకథాసంద ర్భమునఁ గృష్ణుఁడు కనఁబడుచున్నాఁడు. కృష్ణుఁ డొనర్చిన సుభద్రా హరణమునుగూర్చి పందొమ్మిదవ శతాబ్దమందలి నీతిజ్ఞు లనుమో

---

* వీని నాధారము చేసికొనియే మూర్ మొదలగు పాశ్చాత్యపండితులు కృష్ణుఁడు శైవుఁడని ప్రతిపాదించిరి.

దించియుండ లేదు. కాని, ఇంగ్లీషు దేవశతాబ్దమునందలి నీతిశాస్త్రముననుసరించి జగదీశ్వరుని నీతిశాస్త్ర మొకటి యున్నది—అదియన్ని శతాబ్దములయందును, అన్ని దేశములయందును, వర్తించును. కృష్ణుడొనర్చినదానిని నే నాశాశ్వతమైన లౌకికనీతినిబట్టి పరీక్షించెదను...

ఈవిచారణమునకుఁ బూర్వము సుభద్రాహరణవృత్తాంతము మూలమహాభారతము నందలిదియా, లేక, ప్రక్షిప్తమా, యని కృష్ణభక్తులు చెప్పవచ్చును. ఇది ప్రక్షిప్తమనియును, ఆధునిక మనియును, యోచించుటకుఁ గారణము లుండినయెడల నిఁక వేఱుగఁ జెప్ప నవసరము లేదు. కావున, ఈసుభద్రాహరణవృత్తాంతము మూలమహాభారతములోనిదే యనియును, ఇది ప్రథమకోశాంతర్గతమైనదే యనియును; నావిషయమున నేమియును సందియము లేదనియును, జెప్పవలసియున్నది. అనుక్రమణికాధ్యాయము నందును, బర్వసంగ్రహాధ్యాయమునందును, దీనిప్రసంగ మున్నది. ఈకథారచనము మిక్కిలి సారవంతముగ నున్నది. ద్వితీయకోశమునందలి రచనముకూడ చాలసుందరమైనదియే. ఈప్రథమద్వితీయకోశరచనముల తారతమ్య మేమనఁ బ్రథమకోశమునందలిరచనసరళముగను, స్వాభావికమును గనుపట్టుచున్నది. ద్వితీయకోశమందలిరచన యలంకారములతోడను, నత్యుక్తులతోడను, బాహుళ్యమైయున్నది. సుభద్రాహరణకథయందలి రచనకూడ సరళముగను, స్వాభావికముగను బొడకట్టుచున్నది. అలంకారములు గాని, యత్యుక్తులు గాని యంతబాహుళ్యముగఁ బొడకట్టవు. దీనిని బట్టి యిదిప్రథమకోశములోని దనియు, ద్వితీయకోశములోనిది కాదనియునుజెప్పవచ్చును. అంతియేకాక, మహాభారతమునుండి సుభద్రాహరణవృత్తాంతము తొలఁగించినయెడల మహాభారత మసంపూర్ణగ్రంథ మగును, సుభద్ర కభిమన్యుఁడు జన్మించెను. అభిమన్యునకుఁ బరీక్షిత్తు జనియించెను. పరీక్షిత్తునకు జనమేజయుఁడు పుట్టెను. ఈను

భద్రార్జునులవంశమే బహుశతాబ్దముల వఱకును భారతవర్షమున సామ్రాజ్యాధికారము నెఱపెను—కాని, ద్రౌపదిసంతానము సామ్రాజ్యము నెఱపలేదు. కావున, ద్రౌపదీస్వయంవరకథను విడిచినను విడువవచ్చునుగాని సుభద్రావివాహ వృత్తాంతమునుతొలఁగింపవీలులేదు.

ద్రౌపదవలెనె సుభద్రగూడఁ గవికల్పనాప్రసూతయని పాశ్చాత్యపండితులు విశ్వసింపలేదు. యాదవకులసంప్రీతిరూపక మైనమంగళమే సుభద్రయని లాసన్‌దొరగారు చెప్పియున్నారు. వెబ్బరుదొరగారి యాక్షేపణ మింతకంటె మిన్నగ నున్నది. కృష్ణసోదరియైన సుభద్ర మానవత్వము నేల యంగీకరింపలేదో, వానిని నిరూపించుటకు యజుర్వేదమునందలి మాధ్యందినిశాఖలోని 23 వ యధ్యాయమున 18 వ ఖండమందలి 4 వ మంత్రము నెత్తి చూపియున్నాడు. "ఓఅంబా! అంబికా! అంబాలికా! చూడుఁడు; ఈయశ్వ మిప్పుడు నిద్రించుచున్నది. నేను కాంపిలవాసిని నైనసుభద్రనై యుండియు స్వయముగ దీనిసమీపమునకు (పతిత్వమునుగోరి) వచ్చియున్నాను. ఈవిషయమైన న్నెవరును నియోగించి యుండలేదు.

దీని ననుసరించి వెబ్బరుదొరగా రిట్లు సిద్ధాంతపఱిచియున్నారు.

"Kamhila is a town in the country of the Panchalas. Subhadra, therefore, would seem to be the wife of the King of that district.,, & c.

శాయనాచార్యుఁడు కాంపిలవాసిని యనుశబ్దమున కిట్లర్థవాదమును జెప్పి యున్నాఁడు.

కాంపిలశబ్దమునకు శ్లాఘ్యవసనవిశేష మని యర్థము. కాని, వెబ్బరుదొరగారు తాను శాయనాచార్యునికంటెనుగూడ సంస్కృతమున గొప్పపండితుఁ డనునభిప్రాయముతో నావ్యాఖ్య నంగీకరించి యుండలేదు. కాని, కాంపిలవాసినియైన సుభద్ర యనుపేరుగలయొక కాంత యుండినకారణముచేత సుభద్ర యనుపేరుగలిగిన కృష్ణసోదరి

యేల యుండఁ గూడదో మేము యోచింపఁజాలకున్నారము. అశ్వమేధయాగము చేయురాజులయొక్క పట్టమహిషులీ మంత్రమును బఠింపవలయును. నేను కాంపిలవాసిని నైన సుభద్ర నని వారలకు జెప్పవలయును. సుభద్రాశబ్దమునకు సామాశ్రమిమహాశయుఁడు కల్యాణి అనఁగా సౌభాగ్యవతి యని యర్థము చెప్పియున్నాఁడు కాంపిలనగరవాసినులైన స్త్రీలు బహురూపలావణ్యవతులని మహీధరుఁడు చెప్పియున్నాఁడు. కావున, నీమంత్రమునకు "నేను సౌభాగ్యవతిని, రూపవతిని నై యుండియు, యజ్ఞసమీపమునకు వచ్చియున్నాను" అని యర్థము. కావున, నీమంత్రము నాధారము చేసికొని కృష్ణసోదరియును, అర్జునపత్నియును, నగుసుభద్రకు బదులుగ సుభద్ర పాంచాలి యని యేల కల్పింపవలయునో బోధపడకున్నది. యుధిష్ఠిరుఁ డశ్వమేధయాగమును జేసియున్నాఁడు, అతనికిఁ జాలపూర్వకాలమునం దుండిన రాజులుకూడ నశ్వమేధయాగములను జేసియున్నారు. ఈవిషయము మహాభారతగ్రంథమునందును, నింక నితరప్రాచీనగ్రంథములయందును గన్పట్టుచున్నది. కావున, నశ్వమేధయాగమునందలి యీయజుర్మంత్రము కృష్ణపాండవులకంటెఁ జాలప్రాచీనమైన యుండవలయును. ఇప్పటి కాలపువారలాధునికలేఖకుల కావ్యగ్రంథములనుండి శిశువులకు పేరులు పెట్టువాడుక యెట్లున్నదో, అట్లే పూర్వముకూడ వేదమునందలిపేర్లను శిశువులకుఁ బెట్టువాడుక యుండియుండవచ్చును. ఈమంత్రము ననుసరించియే కాశిరాజు తన ముగ్వురుకుమార్తెలకును "అంబా, అంబికా, అంబాలికా" యని నామములను బెట్టియుండవచ్చును. ఈవిధముగనే కృష్ణసోదరికి సుభద్ర యని నామము పెట్టి యుండవచ్చును. ఈ మంత్రము ననుసరించి సుభద్ర యనుకృష్ణసోదరి యుండఁగూడదని యనుమానించుటకుఁ దగినకారణ మేమియు నగపడదు. కావున, నేను సుభద్రాహరణవృత్తాంతమును గూర్చి యోచింప సమకట్టుచున్నారు.

సుభద్రాహరణవృత్తాంతమును విమర్శ చేయుటకుఁబూర్వము పాఠకుల కొకవిజ్ఞాపనము చేసికొనుచున్నాను. కాశీదాసునిగ్రంథము నుండి గాని, హరికథలనుండి గాని, పితామహీకథలనుండి గాని, నాటకములనుండి గాని, తాము వినియున్నట్టియుఁ జదివినట్టియు సుభద్రాహరణవృత్తాంతము ననుగ్రహపూర్వకముగ మఱచిపోవలసినదని వారిని వేఁడుకొనుచున్నాను. అర్జునునిఁ జూచి సుభద్ర యనంగశరబాధిత యైనట్లును, సత్యభామ మధ్యవర్తినియై యుండినట్లును అర్జునుఁడు సుభద్రను దీసికొనిపోయి రథమునఁ గూరుచుండఁబెట్టుకొని పోవుచుండ యాదవసేనతో ఘోరయుద్ధ మైనట్లును, సుభద్ర యాతనికి రథసారథియై రథము గగనమార్గమునుండి తోలుకొని పోయినట్లును జెప్పు కథలను మఱచిపోవలయును. ఇది చాల మనోహరమైనకథ యగుట సత్యమే. కాని, మూలమహాభారతమున నిది కొంచెమేనియుఁ గనబడదు. ఇది కాశీరామదాసుని గ్రంథమందుననే ప్రప్రథమమునఁ గన్పట్టుచున్నది. ఇదియాతనిసృష్టియో, ఆతనిపూర్వవర్తులసృష్టియో చెప్పుటకు వలనుపడదు. సంస్కృతమహాభారతమున సుభద్రాహరణ మెట్లు చెప్పఁబడియున్నదో, దానిస్థూల మర్మములను జెప్పుచున్నాఁడను.

ద్రౌపదీవివాహానంతరము పాండవులింద్రప్రస్థమున సుఖంబుగ రాజ్యముచేయుచుండిరి. ఏదో యొక కారణమున నర్జునుఁడు పండ్రెండు సంవత్సరములకు నింద్రప్రస్థమును విడిచి విదేశమున సంచరించెను. ఇతర దేశము లన్నియును దిరిగి వచ్చినతరువాత నాతఁడు ద్వారకం బ్రవేశించెను. అచ్చట యాదవు లాతనిని విశేషముగ సత్కరించి యాదరించిరి. అర్జునుఁడు కొంతకాల మచ్చో నివసించెను. ఒకప్పుడు యాదవులు రైవతకపర్వతమున నొకమహోత్సవమును బ్రారంభించిరి. అందు యదువీరులును, యదుకులాంగనలును, నందఱును గలసి

యామోదము నొందుచుండిరి. ఇతర స్త్రీలతోఁగూడ సుభద్ర యుండెను. ఆమెయప్పుడు బాలికగ నుండెను. అర్జునుఁడామెను జూచి ముగ్ధుఁడయ్యెను. కృష్ణుఁ డది తెలిసికొని యర్జునుని జూచి "సఖా! వనచరుఁడవై యున్నను, మన్మథశరములకు లోనైతివా?" అనెను. అర్జునుఁడపరాధము నొప్పికొని "సుభద్ర యెట్లు తనకు భార్య యగునో" యని కృష్ణుని యభిప్రాయమును వేఁడుకొనియెను. కృష్ణుఁడు తన యభిప్రాయము నిట్లు చెప్పెను.

"ఓయర్జునా! స్వయంవరమే క్షాత్రధర్మము. కాని స్త్రీలప్రవృత్తినిగూర్చి యించుకయును జెప్పుటకు వీలులేదు. కావున, నావిషయమున నాకు సందేహము కలుగుచున్నది. వివాహోద్దేశమున బలపూర్వకముగఁ గన్యాహరణమొనర్చుటయే మహావీరులగుక్షత్రియులకుఁ బ్రశంసనీయమైనదని ధర్మశాస్త్రకారులు చెప్పుచున్నారు. స్వయంవరకాలము తటస్థించినదికావున నీవు నాసోదరిని బలపూర్వకముగఁదీసికొని పొమ్ము. ఏలయన:—స్వయంవరకాలమున నామె యెవరియం దనురక్త యగునో యెట్లు తెలిసికొనవచ్చును?"

ఈయభిప్రాయము ననుసరించి యర్జునుఁడు ప్రప్రథమమునఁ గుంతీయుధిష్ఠిరుల యనుమతిఁ బడయుటకై వారికడకు దూతనంపెను. వారియనుమతిని బొందినపిదప నొకనాఁడు సుభద్ర రైవతకపర్వత ప్రదక్షిణ మొనర్చి ద్వారకాభిముఖియై వచ్చుచుండ నర్జునుఁడామెను బలవంతముగ నెత్తికొనిపోయి రథమునఁ గూర్చుండఁబెట్టుకొని ప్రయాణమై పోయెను.

ఇప్పటికాలమున నెవ్వరైనను, వివాహము చేసికొనుతలంపున నేబాలికనైనను బలవంతముగ నెత్తుకొనిపోయిన యెడలనాతఁడు సమాజనిందకును, రాజదండనమునకును బాత్రుఁ డగుననుటకు సందేహము లేదు. మఱియు నీదినములలో నెవ్వరైనను మఱియొకనిఁ

జూచి "మహాశయా! నీవు నాసోదరిని వివాహమాడఁ దలఁపుండిన యెడల నామెను బలవంతముగ నెత్తుకొని పొమ్ము." అని యుపాయము చెప్పినయెడల నాతఁడు జనసమాజమున నిందనీయుఁ డనుటకు సందేహము లేదు. కావునఁ బ్రచారమున నున్న నీతిశాస్త్రానుసారముగఁ గృష్ణార్జును లిరువురును నిందనీయమైనకార్య మొనర్చిరనుటకు సందేహ మేమియును లేదు. లోకులకన్నుల దుమ్ముగొట్టి కృష్ణుని యౌన్నత్యమును గాపాడదలంచుటయే నాయుద్దేశమైనయెడల సుభద్రాహరణపర్వాధ్యాయము ప్రక్షిప్తమని గాని, మఱియేదో యొకమోసము చేసి గాని యీకథను విడిచిపెట్టి యుందును. కాని, ఇది మే మవలంబింపఁ దగినమార్గము కాదు. సత్యమార్గమునఁ గాక మిథ్యాప్రశంసమూలకముగ నెవ్వని మహిమమును బెంపుసేయఁజాలము అందువలన ధర్మమున కవసతి యగును గాని యున్నతి కాఁజాలదు.

కాని, ఈవిషయమును దఱచి చూడవలసియున్నది. ఒక రితరుల బాలిక నపహరించి వివాహము చేసికొనుటవలన దోషమని యేల చెప్పవలయును? దీనికి మూఁడుకారణము లున్నవి. మొదటిది? దీనివలన నపహృతకన్యయెడల నత్యాచారము ఘటిల్లుచున్నది. రెండవది:—కన్యతల్లిదండ్రులకును బంధువులకును నత్యాచారము కలుగుచున్నది. మూఁడవది:—సమాజమున కత్యాచారము కలుగుచున్నది. ఎవ్వరైనను నితరులయెడ ననుచితమైన బలప్రయోగము నెఱపినయెడల సమాజస్థితికి భంగము తటస్థించును. వివాహార్థము చేయఁబడిన కన్యాహరణము నిందనీయమైన కార్యమని యోచించుట కీమూఁడును జాల గురుతరమైన కార్యములు దీనికి మించిన మఱియొక కారణ మేదియును లేదు.

కృష్ణుఁ డొనర్చినయీకార్యమువలన నెవరి కెంతెంత యత్యాచారము ఘటిల్లెనో యోచింపవలసి యున్నది. మొదట నపహృత

కన్యయెడల నట్టియత్యాచారము ఘటిల్లెనో చూతము. కృష్ణుం డామెకు జ్యేష్ఠభ్రాత! మఱియును వంశ శ్రేష్ఠుడు దేనివలన సుభద్ర కన్ని విధముల శుభము కలుగుచున్నదో దానిని జేయుటయే యాతని కర్తవ్యము. ఈపందొమ్మిదవశతాబ్దభాష ననుసరించి యిదియే యితనిధర్మము "Duty" స్త్రీలకు ప్రధానమంగళకరమైనది. సత్పాత్రుని వివాహ మాడుటయే. కావున, నామె యెట్లు సత్పాత్రుని జెట్టపట్టునో, యట్లొనర్చుటయే కృష్ణుడు సుభద్రయెడలం జూపింపవలసిన "Duty" ధర్మము. ఇంక నర్జునునివంటి సత్పాత్రుడు కృష్ణపరిచితులలో నెవ్వరును లేరని మహాభారతమును బఠించిన వారికి వేఱుగం జెప్పనవసరములేదు. కావున, నామె యేకారణము వలన నర్జునుని పత్నియగునో, దాని నొనర్చుటయే సుభద్రవిషయమై కృష్ణుం డొనర్పవలసిన కర్తవ్యము ఆతండు దేనిని జెప్పెనో దానినే యాతండు చూపించెను. బలవంతముగం గాక మఱియేయితరమార్గమునసైనను గర్తవ్యసాధన మొనంగూర్చుకొనుట సందేహాస్పదమైనది. చిరజీవుల శుభసంపాదనమునకై యేమార్గము సందేహాస్పదమైనదో దాని నవలంబింపంగూడదు. ఏకార్య మవలంబించినయెడల శుభప్రాప్తి నిశ్చయమో, ఆమార్గము నవలంబించిపోవలయును. కావునం గృష్ణుండు సుభద్ర చిరజీవమునకుం బరమశుభకరమైనదాని నాకాంక్షించి తత్సాధనముకొఱకు సునిశ్చితమైన మార్గమును జూపి పరమ ధర్మానుమతమైన కార్యమును నెఱపెను. కావున, నామెయెడల నేమియు నత్యాచారము నెఱపియుండలేదు.

దీనికిం బ్రత్యుత్తరముగ రెం డాక్షేపణములు చేయవచ్చును. ఏకార్యమునందు నాకిచ్ఛలేదో యాకార్యము నాకు శుభకరమైనను బలవంతముగ నాకార్యమున నన్నుం బ్రవేశపెట్టుట కెవ్వరికి నధికారములేదనునది మొదటి యాక్షేపణము. నాసర్వస్వమును బ్రాహ్మణులకు దానముచేసినయెడల నాకుం బరమశుభ మగునని పురోహి

తుఁడు యోచింపవచ్చును, అట్లని బలవంతముగ నాసర్వస్వమును బ్రాహ్మణులకు దానము చేయించుట కాతనికట్టి యధికారమును లేదు. శుభోద్దేశసాధనముకొఱకు నిందనీయమైన మార్గము నవలంబించుటకూడ నిందనీయమైనదియే పందొమ్మిదవ శతాబ్దియభావ మనుసరించి దీనినే యిట్లు చెప్పవచ్చును. (The end does not sanctify the means)

దీనికి రెండు సమాధానములు చెప్పవచ్చును. మొదటిది— సుభద్ర కర్జునునియెడ నిచ్ఛగాని, విరక్తిగాని కలిగినట్లు కనబడదు. ఇచ్ఛ యున్నట్లును గనఁబడదు. అనిచ్ఛ యున్నట్లును గనఁబడదు. ఆమెకు మనోభిప్రాయమును వెల్లడిచేయ నవకాశమును లేదు. హైందవకన్యలు పాత్రవిశేషములయెడ నిచ్ఛను గాని, యనిచ్ఛను గాని చూపింపరు. నిజముగవారిహృదయములయందు, ఇచ్ఛగాని, యనిచ్ఛగాని, సామాన్యముగఁ గలుగఁబోదు. కాని యింటియందే యుంచిన వయసువచ్చినపిల్ల కట్టి యిచ్ఛ కలిగినఁ గలుగవచ్చును. ఏదైన నొక కార్యమునందు నాకిచ్ఛగాని యనిచ్ఛగాని లేకుండనుండి యీకార్య సాధనము నాకు శుభకారియైయుండినయెడఁగాని, యట్లుగాక విశేష ప్రవృత్తి లేకపోవుటచేఁగాని, లజ్జావశమునఁగాని, నే నాకార్యమును స్వయముగ సాధింపలేకపోయినప్పుడు బలవంతముగ నన్నందుఁ బ్రవేశపెట్టినయెడల, నాశుభకార్యమును కోరునాగెడు పక్షమున బలప్రయోగముచేయుట యధర్మమా? ఒక గొప్పకుటుంబమున జన్మించిన పిల్లవాఁడు దురవస్థయందుండి నీచిగ్గఱ సేవకవృత్తిని బొంది పొట్టపోసికొనునవకాశము కలుగుచుండ గొప్పకుటుంబమున జన్మించుటచే నట్టి యిచ్ఛ లేకుండినప్పుడు నీవు బలవంతముగఁ దీసికొనిపోయి సేవకవృత్తిలోఁ బ్రవేశపెట్టినచో నిరాటంకముగ నంగీకరింపని యెడ నట్టివానిం జేయిపట్టి బలవంతముగఁ దీసికొనిపోయి యాతనిని సేవకవృత్తిలో

ప్రవేశపెట్టఁ దలఁచెడి నతని నీ వభ్యంతరపెట్టుదువా? అది యాతనికిఁ బీడనము గ్రహింపఁ బడియుండునా? సుఖప్రయుక్తి సరిగ నట్టిదే. హైందవగృహమున జన్మించిన బాలికఁ "ఇందు వచ్చి కూరుచుండుము." అని పిలుచునంతమాత్రమున నతనిలోఁ గూడఁ బోవునా? సహజముగ బలవంతముగఁ దీసికొని పోవుటకన్న నీశుభసాధనమున కుపాయాంతరము లేదు.

"ఏకార్యమందు నాకిష్టము లేదో యాకార్యసాధనము నాకు జాల శుభకరమైనను, నన్నందు బలవంతముగఁ బ్రవేశింపఁ జేయుట కెవ్వరికిని నధికారము లేదు" అను నీయాక్షేపణమునకు రెండు సమాధానములున్నవని చెప్పితిని. మొదటి సమాధాన మిదివఱకుఁ దెలిపియుంటిని. అది యాక్షేపణయథార్థమని యంగీకరించినమీఁదట నిచ్చినది. కాని, యిట్టి యాక్షేపణ మన్నిసమయములయందును వర్తింపదు. రోగి స్వభావసులభమైనవిరాగమువలన నౌషధము సేవింపనంగీకరింపనప్పు డాతనిని బలపూర్వకముగ నౌషధసేవ సేయించుటకు బంధువర్గమున కధికారమున్నది. అపాయకరమైన వ్రణమును నిచ్ఛాపూర్వకముగ బంధు వెవ్వరును శస్త్రచికిత్స చేయఁగూడదు— శస్త్రవైద్యునకే యిట్టి యధికారము కలదు.

బాలకుఁడు చదువను వ్రాయను నేర్చుకొనకుండిన నప్పుడు బలవంతముగ విద్యఁ గఱపుటకు గురువునకును, దల్లిదండ్రులు మొదలగు వారికి నధికారము కలదు, వివాహవిషయముకూడ నట్టిదియే. అజ్ఞానదశయందున్న యువకుఁడు గాని, యువతిగాని, యనుచితమైన వివాహమున కుద్యమించునప్పుడు బలవంతముగ వారిని నిరోధించుటకు దల్లిదండ్రుల కధికారము లేదా? ఇప్పుడు కూడ నాగరికతఁ జెందిన యూరోపియనులలోఁ గన్యావివాహసమయమునఁ గన్యను సత్పాత్రున కొసంగు నాచారము కలదు. పదునైదుసంవత్సరముల ప్రాయముకలిగిన హిందూకన్య నెవరైన సత్పాత్రునకు బలవంతముగ నిచ్చుటకే తల్లి

చంద్రులైననాక్షేపణము సేయుదురా? ఎవ్వఁడైనను బాలికయైనకన్యను బలవంతముగ సత్పాత్రున కొసఁగినయెడల నాతఁడు నిందనీయుఁ డగునా? అట్లు కానియెడల సుభద్రాపహరణమునఁ గృష్ణుని యను మతి నిందనీయ మెట్లగును ?

ప్రథమాక్షేపణమునకు రెండుప్రత్యుత్తరములును జెప్పఁబడి నవి. ఇఁక ద్వితీయాక్షేపమునుగూర్చి యోచింపవలసి యున్నది.

కృష్ణుఁడు సుభద్రకు శుభము చేయ నాకాంక్షించి యిట్టియు పాయము చెప్పెనని యంగీకరింతము. ఆమెను నర్జునకు వివాహము సేయుటకు బలవంతముగఁ దీసికొనిపోవుటకంటె రెండవమార్గము లేదా ? స్వయంవరమున మూర్ధాభిషిక్తునైన బాలిక కేవలము ముఖ వైఖరినిగాంచి యేయుపాత్రునైనను వరింప నవకాశ ముండును దీని కుపాయాంతరము లేదా? కృష్ణుఁడు గాని, యర్జునుఁడుగాని, వసు దేవుఁడు మొదలగు పెద్దలతోఁజెప్పి యొప్పించి వారిచేఁ గన్యాదానము సేయింపలేరా ? యాదవులు కృష్ణునకు వశీభూతులు; ఆతనిమాట కెవ్వరు నడ్డుచెప్పరు. అర్జునుడుకూడ సత్పాత్రుఁడైన వరుఁడు. అందుల కెవ్వరు నాక్షేపింపఁజాలరు. అట్లేల జరుగలేదు ?

ఇప్పటికాలమున నిట్టికార్యము సులభముగ నైయుండును. కాని, సుభద్రార్జునులవివాహము నాలువేలసంవత్సరములకుబూర్వ మున నైనది. అప్పటివివాహాచార మిప్పటియాచారము వంటిది కాదు. అప్పటివివాహాచారము నెఱుఁగకయె కృష్ణునియాదర్శ బుద్ధి యును, నాదర్శ ప్రీతియును, మనకు సంపూర్ణముగ బోధపడఁజాలదు.

మనుస్మృతియందు వివాహము లెనిమిది విధములని చెప్పఁ బడియున్నది. (1) బ్రాహ్మ్యము (2) దైవము (3) అర్షము (4) ప్రాజాపత్యము (5)ఆసురము (6) గాంధర్వము (7) రాక్షసము (8) పైశాచము. ఈక్రమము పాఠకులు మనస్సునందుంచుకొనవలయును,

ఈయష్ట విధములగు వివాహములకు నన్ని వర్ణములవారికి నధికారము లేదు. క్షత్రియులకుఁ గొన్నివివాహములం దధికారము మున్నది. "షడా నుపూర్వ్యా విప్రస్య చతురో వరాన్" అని మూడవయధ్యాయ మున 23 వ శ్లోకమునఁ జెప్పఁబడి యున్నది. ఇందులకు "క్షత్రియస్య అవరా నుపతితనా నాసురాదీం శ్చతురః" అని టీకాకారుఁడైన కుల్లూకభట్టు వ్రాసియున్నాఁడు. అట్లయినయెడల క్షత్రియుల పక్ష మున నాసుర, గాంధర్వ, రాక్షస, పైశాచము లనునాల్గు విధము లగు వివాహములును ధర్మములు: తక్కినవి. యధర్మములు.

"పైశాచ శ్చాసురశ్చైవ నకర్తవ్యో కదాచన" అని 25 శ్లోకమునఁ జెప్పబడినది, పైచాశాసుర వివాహము లందఱికి ననాచర ణీయములు. కావున, క్షత్రియులపక్షమునఁగూడఁ గేవలము గాంధ ర్వము; రాక్షసము మాత్రమే హితములై యున్నవి.

వీనిలో వధూవరు లుభయులకుఁ బరస్పరానురాగముగలవివా హము గాంధర్వ మనఁబడును. సుభద్ర కనురాగము లేనియెడల వివాహ మసంభవ మగును. కావున, నది కేవలము కామజన్య మగును. పరమనీతిజ్ఞులైన కృష్ణార్జును లట్టిదాని నెప్పు డంగీకరించి యుండరు. కావున రాక్షసవివాహము తప్ప మఱియేయితర వివాహ మును శాస్త్రానుసారముగ ధర్మము కాఁజాలదు. మఱియును క్షత్రియుల పక్షమున ప్రశస్తము కాదు. ఇతరవిధము లైనవివాహముల కితరావ కాశము లేదు. బలవంతముగఁ గన్య నెత్తికొనిపోయి వివాహముచేసి కొనుటయే రాక్షస వివాహము, శాస్త్రానుసారముగ నీరాక్షసవివా హమే క్షత్రియులపక్షమున బ్రశస్తమైనది.

"చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయోవిదుః
రాక్షసం క్షత్రియస్యైక మాసురో వైశ్యశూద్రయోః"
మను, 3 అ. 24 శ్లో.

ఏవివాహము ధర్మమో, ప్రశస్తమో, తన భగినీభగినీపతుల కును నిజకులమునకును గౌరవమో కృష్ణు డట్టివివాహమును బ్రోత్సాహపఱిచెను. కావుననే, కృష్ణుఁ డల్లర్జునుని బ్రోత్సాహపఱిచి తన శాస్త్రజ్ఞతయును, నీతిజ్ఞతయును, నభ్రాంతబుద్ధియును, మానసంభ్రమరక్షణములయందలి గౌరవమును, హితేచ్ఛయును, వెల్లడిసెను. ఈవిషయమున మనుస్మృతి ప్రమాణ మెట్లు వర్తించును? మహాభారతయుద్ధ కాలమునాఁటికి మనుసంహిత యుండెననుటకుఁ బ్రమాణమేమి కలదు? అంతటిప్రాచీన కాలమున మనుసంహిత సంకలితమైన దో లేదో యను విషయము వాద ప్రతివాదముల కెడ మిచ్చుననుట సత్యమే. మనుసంహిత పూర్వము ప్రచారములో నున్నరీతి నీతుల సంకలనమాత్రమే యని పండితులమతము. అట్లయిన యెడల యుధిష్ఠిరుని రాజ్యకాలమునాఁటికిఁ బ్రచారములోనున్న వివాహపద్ధతి యిట్టిదియే యని మనము యోచింపవచ్చును. అట్లు కాకపోయినను మహాభారతమునం దీవిషయమునుగూర్చి యెట్లు చెప్పఁబడినదో దానిని బరిశీలింతము. సుభద్రాహరణపర్వాధ్యాయమున నిందుకు సమాధానముగఁ గొన్నిప్రమాణములు కలవు. పాఠకమహాశయులకు మే మెట్టిసమాధానము చెప్పియుంటిమో కృష్ణుఁ డట్టిసమాధానమునే బలరామునకుఁ జెప్పియున్నాఁడు. అర్జునుఁడు సుభద్రను బలవంతముగ దీసికొనిపోయెనని విని యాదవులు కోపోద్రేకమున రణసన్నాహము సేయుచుండ బలరాముఁడు వారిని వారించి, “కృష్ణుఁ డేమిచెప్పునో విందము.” అని కృష్ణునిపై పునకుఁ దిరిగి యర్జునుడు మనవంశమున కవమానమును గలిగించెనని కోపముతోఁ బలికి యాతనియభిప్రాయ మేమని యడిగెను. కృష్ణు డందులకుఁ బ్రత్యుత్తరముగ నిట్లుచెప్పెను.

“అర్జునుఁడు మనకులమున కవమానమును జేసియుండలేదు. అంతియేగాక విశేషముగ మనగౌరవమును గాపాడెను. ఆతఁడు మిమ్ముల నర్థలుబ్ధులని భావింపకుండుటచే నర్థమూలకముగ సుభద్రను వరించుటకుఁ బ్రయత్నమొనర్చియుండ

లేదు. స్వయంవరమునఁ గన్యను బడయుట చాలదుష్కరమైన వ్యాపారము. అందుచే దానికి సమ్మతించి యుండలేదు. తల్లిదండ్రుల యనుమతిపూర్వకముగ నొసఁగఁబడినకన్యను వివాహమాడుట తేజస్వియైన క్షత్రియునకుఁ బ్రశంసనీయమైన కార్యము కాదు. కావున కుంతీపుత్రుఁడైన ధనంజయుఁడు పైదోషముల నన్నిటి నాలోచించియే బలవంతముగ సుభద్రను దీసికొనిపోయెనని నేను యోజించితిని. ఈసంబంధము మనకు నుచితమైనది. మఱియును, కులశీలవిద్యాసంపన్నుఁడైన పార్థుఁడు తన్ను బలవంతముగఁ దీసికొనిపోవుటచే సుభద్రకూడ యశస్విని యగుననుటకు సందియము లేదు.''

ఇందుఁ గృష్ణుఁడు క్షత్రియులకు నాలుగు విధములగు వివాహము లుచితమైనట్లు చెప్పియున్నాఁడు. (1) అర్థము- (శుల్కము) నొసఁగి చేసికొనినవివాహ మాసురము. (2) స్వయంవరము. (3) తల్లిదండ్రులచే నొసంగఁబడిన కన్యను పెండ్లియాడుట ప్రాజాపత్యము (4) బలవంతముగఁ గన్య నపహరించుట రాక్షసము.

వీనిలో మొదటిది కన్యాకులమున కపయశస్కరమైన దని యందఱు నొప్పుకొనిన విషయమే. రెండవదానిఫల మనిశ్చితము. మూఁడవది వరునకు గౌరవహీనమైనది. కావున నాల్గవ దొక్కటియే విహితమైన వివాహము. ఇది కృష్ణోక్తివలననే తేటపడుచున్నది. *

నేను రాక్షసవివాహ పక్షమును సమర్థించుచున్నాఁడ నని యెవ్వరును దలంపకుందురుగాక! రాక్షసవివాహము నిందనీయమని

* మహాభారతములోని యనుశాసనపర్వములోఁ జెప్పఁబడిన వివాహతత్త్వము నిచ్చటఁ జేర్కొని యుండలేదు. ఏల యనిన, నది ప్రక్షిప్తము అందు రాక్షసవివాహము భీష్మునిచే నిషిధింపఁబడి యున్నది. కాని భీష్ముఁడు స్వయముగ కర్తవ్యాకర్తవ్యములు యోచించియే కాశీరాజుముగ్గురుకొమార్తెలను దీసికొనిపోయెను. అందువలన భీష్ముఁడు రాక్షసవివాహమును నిందించుటగాని నిషేధించుటగాని సంభవింపనేరదు. ఏది నిషిద్ధమో ఏది నిందితమో దానిని ప్రాణాంతమైనను చేయఁడని యాతని చరిత్రమే చెప్పుచున్నది. అతనిచరిత్రమును వ్రాసినకవి యతనినోట నిట్టిపలుకు లెన్నఁడును బలికించి యుండఁడు.

వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఆకాలమున క్షత్రియులలోఁ బ్రశంసనీయముగఁ బరిగణింపఁబడుచున్నను కృష్ణుఁడే దాని ప్రచారకర్త కాఁడు.

* * * * * * *

బలవంతముగఁ గన్యాహరణ మొనర్చి చేయు వివాహము మూఁడు కారణములచే నింద్యనీయమైన దని యిదివఱకే చెప్పియున్నారము. (1) కన్యయెడల నత్యాచారము. (2) కన్యపితృకులమునకు జరుగు నత్యాచారము, (3) సమాజముయెడలఁ గలుగు నత్యాచారము. కన్యక కెట్టి యత్యాచారమును ఘటిల్లకుండుటయే గాక విశేషించి యామెకు శుభకర మయినదనియును దెలిపియున్నారము. ఇఁక నామెపితృకులమున కత్యాచారము ఘటిల్లినదేమో చూడవలసి యున్నది. కాని, విశేషావకాశము లేకపోవుటచే సంక్షేపముగఁ జెప్పవలసియున్నది.

కన్యాహరణమునఁ బితృకులమునకు రెండు కారణములవలన నత్యాచారము ఘటిల్లుచున్నది. కన్యక యపాత్రునిచేతులలోఁ బడుట యొకటి. కాని, మనకథాసందర్భమున నట్లు జరుగలేదు. అర్జునుఁ డపాత్రుఁడు కాఁడు. అనభిప్రేత పాత్రుఁడును గాఁడు. రెండవది— తమ కవమానము ఘటిల్లుట; ఇంతకుఁ బూర్వము చెప్పినదానినిబట్టి సుభద్రాహరణమున యాదవుల కెంతమాత్రము నవమానము కలిగి యుండలేదని యోచింపవలసి యున్నది. ఈవిషయమున యాదవశ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణుఁడే ప్రతిపాదించి యున్నాఁడు. ఇది న్యాయసంగత మని యోచించియే యాదవు లర్జునుని దిరిగి తీసికొని వచ్చి వివాహకార్య మొనర్చిరి. కావున, నిందువలన వారి కత్యాచారము ఘటిల్లినదని చెప్పుట కవకాశము లేదు. మూఁడవది—సమాజము నెడలఁ గలుగు నత్యాచారము. సమాజములో నెవ్వరికైనను హాని కలిగించు విధివిరుద్ధమైన బలప్రయోగమువలన సమాజమున కత్యాచారము

ఘటిల్లుచున్నది. కాని, యిప్పటి యార్యసమాజమున వలెఁ క్షత్రియులవలన నిట్టి బలప్రయోగము ప్రశస్తమైన దనియును, విహితమైన దనియును, జెప్పఁబడి యుండుటచే నిప్పటిసమాజమున కత్యాచారము ఘటిల్లినదని చెప్పుట కవకాశము లేదు. ఏది సమాజసమ్మతమో దానిమూలముగ సమాజమున కత్యాచారము ఘటిల్లదు.

నే నీవిషయమును సవిస్తరముగ వ్రాయుటకుఁ గారణ మున్నది. సుభద్రాహరణవిషయమునఁ గృష్ణద్వేషులు కృష్ణు నెప్పుడు నిందించి యుండలేదు. దీనికొఱకుఁ గృష్ణపక్ష మవలంబించి సమర్థింప నవసరము లేదు.

---

## చతుర్థపరిచ్ఛేదము

### ఖాండవదాహము

సుభద్రాహరణ మయినతరువాత ఖాండవదాహకథాసందర్భమునఁ గృష్ణుఁడు గానఁబడుచున్నాఁడు పాండవులు ఖాండవప్రస్థమున వాసము చేయుచుండిరి. వారి రాజధానిసమీపమున ఖాండవ మను పేరుగలిగిన పెద్దయరణ్య మొకటి కలదు. కృష్ణార్జునులు దానినిదగ్ధము గావించిరి. ఆవృత్తాంత మిది. ఇది కల్పనాకథవలెఁ గన్పట్టుచున్నది.

పూర్వకాలమున శ్వేతకియను రాజొకఁడు కలఁడు. అతఁడు గొప్ప యాజ్ఞికుఁడు. చాల కాలము యజ్ఞములు చేసెను. అతఁడు చేయు యజ్ఞములవలన ఋత్విక్కులైన బ్రాహ్మణులు చాలశ్రమపడిరి. రాజు వారలకుఁ బీడ కలుగఁజేసెను. అంతట వారలు "ఇట్టికార్యము మావలనఁ గాఁజాలదు. నీవు రుద్రునియొద్దకుఁ బొమ్ము." అని చెప్పిరి. రాజు రుద్రునియొద్దకుఁ బోయెను. రుద్రుఁ డాతనిఁ జూచి "మేము

యజ్ఞము చేయుము. ఆపని బ్రాహ్మణులది. దుర్వాసుఁడను నొక బ్రాహ్మణుఁడు కలఁడుఁ ఆతఁడు నాయంశమున జన్మించినాఁడు. నేనాతనితో నీవిషయమును జెప్పితిని.'' అని చెప్పెను. రుద్రునియనురోధము వలన దుర్వాసుఁడు రాజుచే యజ్ఞమును జేయించెను. అది ఘోరతర యజ్ఞము. పండ్రెండుసంవత్సరములవఱకు నగ్నియం దాజ్యధార హోమము చేయించెను. ఆయాజ్యమును భక్షించుటవలన నగ్ని దేవున కజీర్ణరోగము సంభవించెను. ఆతఁడు బ్రహ్మయొద్దకుఁబోయి ''అయ్యా! చాలవిపద్గ్రస్తుఁడ నయితిని. ఆజ్యభక్షణముచే శరీరమునఁ జాలబాధ కలిగెను. దీని కుపాయమేమి?'' అని యడుగఁగా బ్రహ్మ యతని జూచి ''మంచిది! ఆజ్యభక్షణమున నీకుఁ బీడ కలిగినయెడల మఱియొను భక్షింపుము. ఖాండవవనమును భక్షించితివేని నీబాధ నివర్తియగును.'' అని చెప్పెను. అదివిని యగ్ని ఖాండవవనమును భక్షింపఁబోయి యావనము నాల్గుప్రక్కలను హాహాకారము సేయుచు జ్వలింప నారంభించెను. కాని, యావనమున ననేకము లగుజీవజంతువులు వాసము చేయుచుండెను. అంతట నేనుఁగులు తమతుండములతో జలములను గొనివచ్చి యాయగ్నిని బోయఁదొడఁగెను. అట్లే సర్పములు ఫణములతో జలముల నెత్తికొని యగ్నిలోఁ బోయఁదొడఁగెను. ఈవిధముగ వనమునందు వసించుచున్న పశుపక్షిగణము లగ్ని నార్పఁదొడఁగినవి. అగ్ని యేడుపర్యాయములు విజృంభించెను. ఏడుపర్యాయములు నార్పివేయఁబడెను. అగ్ని యంతట బ్రాహ్మణరూపధారియై కృష్ణార్జునుల సమ్ముఖమునకు వచ్చి ''నేను మిగుల నాఁకలిగొని యున్నాను. విశేషముగ భుజింపవలయు నని యున్నాను. మీరు నన్ను భుజింపఁ జేయుదురా?'' అనెను. అందులకు వారంగీకరించిరి. అప్పుడు తన సమాచారమంతయు వారికిఁ దెలియఁజెప్పి నేను ఖాండవమును భక్షింపఁ బోయితిని. కాని, యింద్రుఁడు వచ్చి వృష్టిధారలచే నన్ను

నివారింపఁ జేసెను.'' అని చెప్పెను. అప్పుడు కృష్ణార్జునులు శస్త్రధారులై వనముచుట్టును దిరుగసాగిరి. ఇంద్రుఁడు వచ్చి వర్షములు గురియఁజేసెను. కాని, అర్జునుని బాణపంజరమున వృష్టి బంధింపఁబడియెను. అది యెట్లు సంభవమయ్యెనో కలికాలపురుషులగు మనకుఁ దెలియఁజాలదు, అట్లు శక్తి యుండినయెడల నతివృష్టినుండి సస్యాదులను రక్షించుకొనుటకు మన మేర్పాటులు చేసికొని యుందుము. అది యేమైనను నింద్రుఁడు యుద్ధము చేయ నారంభించెను. దేవత లందఱు నస్త్రధారులై యాతనికిఁ దోడుపడ సాగిరి. కాని, యర్జునుని దోలఁగింప లేకపోయిరి. ఇంద్రుఁ డాతనిపైఁ బర్వతము నెత్తి వైచెను అర్జునుఁడు దానిని బాణములతోఁ జిన్నచిన్న ముక్కలుగఁ గొట్టివైచెను ఇట్టివిద్య యిప్పుడు మనకుఁ దెలిసియుండినయెడల రైలుమార్గములును, బిలమార్గములును గట్టుట చాలసుకరమై యుండును. తుద కింద్రుఁడు వజ్రాయుధమున నతనిఁ గొట్ట నుద్యమించెను. అప్పుడు దైవవాణి వీరు ప్రాచీనఋషులగు నరనారాయణు లని పలికెను. దైవవాణి యొక గొప్పసుయోగము—ఎవరు చెప్పిరో తెలిసికొనుట కవకాశముండదు—కాని, చెప్పవలసినవిషయము ప్రకాశమగును ఆ దైవవాణిని విని దేవతలు తిరిగి పోయిరి. అంతట కృష్ణార్జునులు స్వచ్ఛందముగ వనమునఁ దిరుగసాగిరి. అగ్నిభయమువలనఁ బశుపక్ష్యాదులు పలాయనము నొందెను. వాని నన్నిటిని వారు బాణములతోఁ గొట్టసాగిరి. వాని మేదోమాంసములను దినుటచే నగ్ని కజీర్ణబాధానివర్తి యయ్యెను. విషమువలన విషము శాంతించును. అంతట నగ్ని కృష్ణార్జునులకు వరదానము చేసెను. పరాభూతులైన దేవతలుకూడ వచ్చి వారికి వరదానమును జేసిరి. సకలపశుములవారును సుఖముగ వారివారి యిండ్లకుఁ బోయిరి.

ఇట్టికల్పితకథ ననుసరించి యైతిహాసిక సమాలోచనమునఁ బ్రయత్నింతుమేని జాల హాస్యాస్పదుల మగుదుము. అంతియే కాని,

వేఱులాభ మేమియును లేదు. మనము వ్రాయఁబూనుకొనిన కృష్ణచరిత్రమున కిది యేమియు సహకారి కాఁజాలదు. ఇందేమైన నైతిహాసికతత్త్వ ముండినయెడల నది యింతమాత్రమేయైయుండును— పాండవులరాజధానిసమీపమున నొక పెద్దవన మున్న దనియును, నందనేకము లగుఘాతుకమృగములు వాసము చేయుచున్న వనియును, కృష్ణార్జును లావనమున కగ్ని నంటించి ఘాతుకమృగముల నష్టపఱిచి యుందుఁ దిరుగుటకు యోగ్యమైనదానిగా నొనర్చి రనియును నిందు మనము యోచింపవలసి యున్నది. కృష్ణార్జును లిట్లొనర్చుటవలన నైతిహాసిక కీర్తిగాని, యపకీర్తిగాని, యేమియుఁ గలుగఁబోదు సుందరవనమును రక్షించువారు నిత్యము నిట్లు చేయుచునే యున్నారు.

ఇట్టివ్యాఖ్య టాల్ బాయిస్ వీల్సు చేసియున్నాఁడు. కాని! మేముకూడ నిట్టితాత్పర్యమును సూచించుటకుఁ గారణ మొకటి యున్నది. ఖాండవదాహకథ చాలవఱకు మహాభారతమున మూఁడవశ్లోకములోనిదై యున్నది. కాని. స్థూలకథయేమాత్రమైనను, ప్రాచీనమహాభారతమున లేదని చెప్పుటకు వీలుపడదు. పర్వసంగ్రహాధ్యాయమునను, అనుక్రమణికాధ్యాయమునను దీని ప్రసంగ మున్నది. ఈ ఖాండవదాహకథనుండియే సభాపర్వము నందలికథ యేర్పడుచున్నది. ఈవనమధ్యమున మయదానవు డొకఁడు వాసముచేయుచుండెను. అతఁడుకూడ ఖాండవవనమునఁ బడి చచ్చుటకు సిద్ధమయ్యెను. అతఁడర్జునునికడకుఁ బోయి ప్రాణభిక్ష నడుగుకొనియెను. అర్జునుఁడుకూడ శరణాగతుఁడైన యతని రక్షించెను. దీనికిఁ బ్రత్యుపకారముగ మయుఁడు పాండవుల కత్యుత్కృష్టమైన సభ నొకదానిని నిర్మించి యిచ్చెను. ఈసభనుండియే సభాపర్వమందలికథ యేర్పడుచున్నది.

సభాపర్వ మష్టాదశపర్వములలో నొకపర్వము. మహాభారతయుద్ధమునకు బీజమిం దేర్పడుచున్నది. కావున దీని నొక్కమాఱుగ

పోలఁగించుటకు వీలు లేదు. అట్లయినయెడల నిందుఁ గొంత యైతిహాసికతత్త్వ ముండవలయును. దానిని విచారించి తెలిసికొనుట యుచితము. సభయును, దాని నుపలక్షించి రాజసూయయజ్ఞమును, మొదలిక ములును, నైతిహాసికములు గని, తీసికొనుట కాక్షేపణము లేమియు యును లేవు. సభ యైతిహాసికమైనయెడల దానినిర్మించినవాఁ డొక్కఁడవశ్యముగ నుండవలయును. దానిని నిర్మించినవాని నామము మయుఁడు. అతఁ డనార్యవంశీయుఁడై యుండవచ్చును. ఇందువలన నతనికి మయదానవుఁ డను పేరు కలిగియుండవచ్చును. అతఁడు విపన్నుఁడై యుండి యర్జునసహాయమున జీవనలాభము నొంది, యందులకుఁ గృతజ్ఞతాపూర్వకముగ సభను నిర్మించు కార్యము చేసియుండవచ్చును. ఇది నిశ్చయమైనయెడల నాతఁడెట్లు విపన్నత నొందియర్జునునిచే నుపకారమును నొందినదియు నాకథ యంతయు ఖాండవదాహమున నేర్పడుచున్నది. కాని, యిది యంతయు యోచనాబలముననే సిద్ధాంతము చేయవలసివచ్చుచున్నది. అట్లే ప్రాచీనైతిహాసిక గ్రంథములు నిర్మింపఁబడినవి.

మయదానవుని వృత్తాంత మంతయును గవిసృష్టియైన నైయుండవచ్చును. ఎట్లయినను గవి కృష్ణార్జునులచరిత్ర దీని కుపలక్ష్యము నేసికొని యెట్లు నిర్మించెనో, యది చాల మనోహరముగఁ గన్పట్టుచున్నది. దానింగూర్చి వ్రాయకుండ నుండఁజాలము. మయదానవుఁడు ప్రాణరక్షణము నొంది యర్జునునిజూచి "మీరు నాకుఁ బ్రాణదానమొసంగితిరి, మీరు నన్ను రక్షించితిరి; కావున, మీకు నేనెట్టి ప్రత్యుపకారమును గావింతునో యాజ్ఞాపింపుఁడు" అని విన్నవించెను. అర్జునుఁడేమియును బ్రత్యుపకారమును గావింపలేదు. కేవలము ప్రీతి భిక్ష నడిగెను. కాని, మయదానవుఁ డూరకుండక యేదో యొక కార్యమును చేయకుండఁ బోననియెను. అప్పు డర్జునుఁ డతనిఁ జూచి

"ఓ మయుఁడా! నీ వాసన్నమృత్యువునుండి రక్షింపఁబడితినని చెప్పి నాకుఁ బ్రత్యుపకారము సేయనిష్టపడుచున్నావు. ఇందుకొఱకు నీవలన నేమియుఁ బనిచేయించుకొనవా కిష్టములేదు." అని చెప్పెను.

ఇదియె నిష్కామధర్మము. క్రైస్తవ మతావలంబనమైన యైరోపాదేశమున నిట్లు కాదు. క్రైస్తవమత గ్రంథము (బైబిలు) విధించిన ప్రకారము స్వర్గముగాని, యీశ్వరప్రీతిగాని, వారి కామ్యమై యున్నది. మనము వీనినిబరిత్యజించి పాశ్చాత్యగ్రంథములనుండి ధర్మమును, నీతిని, నేర్చికొనుటకై ప్రయత్నించుట మన దౌర్భాగ్యము. అర్జునవాక్యములలోఁ జివర నిట్టి నిష్కామధర్మము స్పష్టముగఁ దేటపడుచున్నది. అర్జునున కేదైనఁ బ్రత్యుపకారము చేయఁగలిగిన యెడల మయుఁడు తాను సంతోషింతునని యనుకొనుచుండఁగా నర్జునుఁ డాతని నట్టి సంతోషమునుండి వంచించుట కిష్టములేనివాఁడయ్యెను. కావున, నతఁ డతనినిఁ జూచి నీయభిలాషము వ్యర్థము చేయుటకూడ నాయుద్దేశము కాదు కావున, నీవు కృష్ణున కేదైన నొకకార్యమును జేసిపెట్టుము. అట్లయినయెడల నాకుఁ బ్రత్యుపకారమును జేసినవాఁడ వగుదువని చెప్పెను.

అనఁగా—నీవలన నేదియైనఁ బనిచేయించుకొనవలసివచ్చిన యెడల నదికూడ నితరులపనియై యుండవలయును. నాకార్యమును జేయించుకొనఁగూడదు.

అప్పుడు మయుఁడు కృష్ణునిఁ జూచి "నన్నేమైన నొక కార్యమందు నియమింపుము." అని ప్రార్థింపుము. మయుఁడు దానవవిశ్వకర్మ—కృష్ణుఁడు కూడ తనకార్యమును జేయించుకొనఁ నిష్టపడలేదు ఆతఁడు మయునిఁ జూచి మనుష్యులనుకరించుటకు వీలుకానిసభ నొక దానిని యుధిష్ఠిరునికొఱకు నిర్మింపుము" అని చెప్పెను.

ఇది కృష్ణుని స్వకార్యముకాదు—కాని, స్వకార్యమువంటిదే. కృష్ణుఁడు తనజీవితమున రెండు కార్యముల నేర్పాటు చేసికొనియెనని

యిదివఱకే చెప్పియుంటిమి. అది ధర్మప్రచారము, ధర్మరాజ్యసంస్థాపనము. ధర్మప్రచారవిషయ మింకను బాగుగఁ దెలియఁ జేయలేదు. ఈసభానిర్మాణమే ధర్మరాజ్యసంస్థాపనమునకుఁ బ్రథమసూత్రము. ఇచ్చోటనే యాతఁడు దాని నభిసంధించుటనుగూర్చి ప్రథమపరిచయము కలుగుచున్నది. యుధిష్ఠిరునిసభ నిర్మింపఁబడిన తరువాత జరుగు విశేషము లన్నియును ధర్మరాజ్యసంస్థాపనమునకు బరిణమించినవి. ధర్మరాజ్యసంస్థాపనము జగత్కార్యము. అట్టిది కృష్ణునియుద్దేశమైన యెడల నీసభాసంస్థాపనముకూడ నాతనిస్వకార్యమువంటిదే.

క్రిందటియధ్యాయమున సమాజసంస్కరణమునుగూర్చి కొంత చెప్పఁబడియెను. ఆతఁడు సమాజసంస్థాపకుఁ డగుటకుఁ బ్రయాస పొంది యుండలేదని యిదివఱకుఁ జెప్పియుంటిమి. దేశమునందలి నైతిక, రాజనైతిక, పునరుజ్జీవనమే (అనఁగా ధర్మప్రచారము, ధర్మరాజ్య సంస్థాపనము) యాతని యుద్దేశము. ఇవి నెఱవేఱినయెడల సమాజసంస్కారము దానియంతట నదియే జరుగును. ఇది నెఱవేఱని యెడల సమాజసంస్కారము జరుగనేరదు. ఆదర్శపురుషుఁడు దీని నెఱిఁగియుండును. వృక్షమునకుఁ బాదు చేసి నీరు పోయకుండఁ బైని నీరు చల్లినంతమాత్రమున నది ఫలింపనేరదని యాతనికిఁ దెలియును. మనము సమాజసంస్కరణ మన నేదో యొక యితరకార్య మని యెంచుకొని గందరగోళమును జేయుచున్నాము. మనఖ్యాతిప్రీతియే దీనికి ముఖ్యకారణము. సమాజసంస్కారులమై యుండినయెడల నాఁక స్మికముగ ఖ్యాతిలాభము నందవచ్చును. యూరపుఖండపద్ధతినైనచో మఱియు విశేషము, పనిలేని దంభవాక్యములచే ననుమోదించుచుం దురు. సంఘసంస్కరణము నెఱవేఱినను నెఱవేఱకున్నను కుహుకోప న్యాసములు జరుగుచునే యుండును. అవి చాల నామోదకరమైనవి. ధర్మోన్నతికి భిన్నించి సమాజసంస్కరణ మెట్లు నెఱవేఱునో మేమిద్రా

సాంప్రదాయకుల నడుగుచున్నారము. రాజనీతికిఁగూడ మూలము ధర్మోన్నతియే కావున, నందఱును ధర్మోన్నతియందే మనసుంచవలయును. అట్లయినయెడల సమాజసంస్కరణమునకు వేఱె ప్రయత్నింపనక్కఱలేదు. అట్లు కానియెడల దేనివలనను, సమాజసంస్కారము గాఁజాలదు.

## పంచమపరిచ్ఛేదము

### కృష్ణుని మానవత్వము

కృష్ణచరిత్రపర్యాలోచనమున మేము కృష్ణుని కేవలమును మనుష్యుఁడుగనే పరిగణించితిమి. ఆతఁ డీశ్వరావతారుఁ డగునో, కాఁడో మేమేమియును జెప్పుచుండుటలేదు. ఆప్రస్తావముతోఁ బాఠకుల కేమియును సంబంధము లేదు. ఏల యనిన:—మామతమును స్వీకరింపుడని మేము పాఠకులఁ గోరుటలేదు. అవలంబించుటయు, నవలంబింపకుండుటయుఁ బాఠకులచిత్తముమీఁదనే యాధారపడియున్నది. అవలంబింపుడని బలవంతపెట్టిన లాభములేదు. స్వర్గము కారాగృహము కాదు; దాని కొకద్వారమైన లేదని నేను యోచింపను ధర్మమొక మొకపదార్థము. దానిని సాధించునుపాయము లనేకము లున్నవి—కృష్ణభక్తులును, క్రైస్తవులునుగూడ దానిని బొందవచ్చును. *

కావునఁ గేవలము కృష్ణధర్మము నవలంబింపనివారిని బతితులని యెంచుటలేదు. కృష్ణద్వేషులుగాని, ప్రాచీనవైష్ణవులు గాని, మమ్ములను నిరయగాములుగ భావింపవలదని వేఁడుచున్నారము.

* ధర్మమున కసంఖ్యములైన ద్వారములున్నవి. ఏప్రకారముననైనను ధర్మానుష్ఠాన మొనర్చినయెడల నది నిష్ఫలము కాఁజాలదు. మహాభారతము, శాంతిపర్వము, ౧౭౪ అధ్యాయము.

ఆతనిమానుషప్రకృతిని మాత్రమే యిచట యోచించుచుంటి మని చెప్పుచుంటిమి. ఆతనిని మేమాదర్శపురుషుఁడని యోచించుచుం టిమి. ఇందువలన నాతని మానవాతీతమైన ప్రకృతి యేదియైన నుండి నయెడల దాని వికాసము మాత్రము ప్రతిషిద్ధ మగుచున్నది. ఈశ్వ రుడు లోకశిక్షార్థ మాదర్శమనుష్యస్వరూపమున నీలోకాలయమున జన్మించియుండిన నుండవచ్చునని యిదివఱకుఁ జెప్పియుంటిమి. అట్ల యినయెడల నాతఁడు మానసికశక్తి మూలముననే జగమునందలి మానుషికకార్యము లొనర్చును. అతఁ డెన్నఁడును లోకాతీతమైన శక్తితో లౌకికకార్యములు గాని, యలౌకిక కార్యములుగాని యొనర్పఁడు.

ఏలయనిన—మానవున కలౌకికశక్తి లేదు, దాని నాధారము చేసికొని స్వకార్యసాధన మొనర్చునాతఁడు మనుష్యున కాదర్శపురు షుఁడు కాఁజాలఁడు. ఏశక్తి మనుష్యునకు లేదో, దానిని మనుష్యుఁ డెట్లనుకరింపఁగలఁడు? *

---

* We forget that Christ incarnate, was such as we are, and some of us ars buttling him where he can be no example to us at all. Let no fear of losing the dear great truth of the divinity of Jesus make you lose the dear great truth of the humanity of Jesus. He took upon himself our nature, as a man of the like passions, he fought that terrible tight in the wilderness year by year, as an innocent, man was he persecuted by narrow-hearted jews, and his was a humanity whose virtue was pressed by all the needs of the multitude and yet kept its richness of nature, a humanity which, though given up to death on the cross, expressed all that it is within the capacity of our humanity, and if we really follow him we shall be holy even as he is holy.

Sermon by Dr. Brookly, delivered at Trinity Church, Boston, March 25th 1885.

శ్రీకృష్ణసంబంధమున దీనినే చెప్పుచున్నాను.

కావున, శ్రీకృష్ణుఁ డీశ్వరునియవతారమైనను, నతని కలౌకిక శక్తివికాసము కాని, యమానుష కార్యసిద్ధి గాని, తటస్థింపనేరదు. మహాభారతమునందుఁ గృష్ణుఁ డలౌకికశక్తిచే నొనర్చిన కార్యము లన్నియు నమూలకములనియుఁ బ్రక్షిప్తములనియు, నాయాకథాసందర్భములఁ దెలిపెదము. కృష్ణుఁ డెచ్చటను దా నీశ్వరావతారుఁడగు నని పరిచయముచేయ లేనట్లు చెప్పవలసియున్నది. ఆతని కమానుష శక్తి యుండిన ట్లాతఁ డెచ్చటను బ్రకటించి యుండలేదు. ఎవ్వరైన నాతనియం దీశ్వరత్వ మారోపించినప్పు డతఁ డానిషయము ననుమోదించియుండలేదు మఱియును వారల యావిశ్వాసము దృఢీకృతమగు నట్లుగ నెట్టి యాచరణము నొనర్చియుండలేదు. కాని, యొకచోట "నేను సాధ్యమైనంతవఱకుఁ బురుషకారము ప్రకాశము చేయుగలను, దైవానుష్ఠానమున నాకెంతమాత్రమును శక్తిచాలదు."* అని స్పష్టముగా నాతఁడె చెప్పియున్నాఁడు.

అతఁడు యత్నపూర్వకముగ మనుష్యోచితములైన యాచార వ్యవహారముల నాచరించెను. ఇతరు లెవ్వరైనను దన్ను దేవునిగా భావించుపద్ధతి నాతఁ డెన్నఁడును సంచరింపలేదు.

ఈవిషయము లన్నిటికి నుదాహరణస్వరూపముగ నాతఁడు ఖాండవదహనానంతరము యుధిష్ఠిరునియొద్ద సెలవు దీసికొని ద్వారకకుఁ బయనమైపోవుతఱి నెట్లాచరించెనో యిచ్చోట నెత్తి చూపుచున్నారము. ఇది చాల మనుష్యోచితముగఁ గనఁబడుచున్నది.

'వైశంపాయనుఁ డిట్లు చెప్పెను. భగవానుఁ డైనవాసుదేవుఁడు పరమప్రీతులైన పాండవులచే బూజింపఁబడి కొన్నిదినములు ఖాండవప్రస్థమున వసించెను. చివరకుఁ బితృసందర్శనార్థము చాల నుత్సా

---

* అహం హి తత్కరిష్యామి పరం పురుషకారతః । దైవంతు న మయా శక్యం కర్మ కర్తుం కథంచన. ఉద్యో. 78-అధ్యాయము.

కాము కలవాఁడై స్వభవనమునకుఁ బోవ నభిలషించెను. అతఁడు మొదట ధర్మరాజు నామంత్రణము చేసి పిదపఁ దనమేనయత్తయైన కుంతికి సాష్టాంగప్రణామంబు లాచరించెను. తరువాత వాసుదేవుఁడు తనసోదరియైన సుభద్రకడకుఁ బోయి యర్థయుక్తములును, హితకరములును, నల్పాక్షరసంయుతంబులును, నఖండములును నగువాక్యములతో నామెకనేకవిషయములు బోధపఱిచెను. భద్రభాషిణియైన సుభద్రకూడఁ దనతల్లి మొదలగుస్వజనమునకు విజ్ఞాపనీయములగు వాక్యములను జెప్పి యనేకవిధముల నాతనిఁ బూజించి యభివాదన మొనర్చెను. వృష్ణివంశావతంసుఁడైనకృష్ణుఁ డామెకడ వీడ్కోలు వడసి ద్రౌపదీధౌమ్యులకడకు వచ్చెను; ధౌమ్యునకు యథావిధిగ వందనమొనర్చి ద్రౌపదితో సంభాషించి యామెను వీడ్కొని యర్జునునితోఁ గలసి యుధిష్ఠిరాదిభ్రాతృచతుష్టయముకడకు వచ్చెను. అయ్యెడ భగవానుఁడైన వాసుదేవుఁడు పంచపాండవులచేఁ బరివేష్టితుఁడై యమరగణపరివృతుండైన మహేంద్రునివలె శోభిల్లుచుండెను.

“తరువాతఁ గృష్ణుఁడు ప్రయాణకాలోచితమైనకార్యము లొనర్చుతలంపుతో స్నాన మొనర్చి యలంకారపరిధానముల ధరించి మాలాజపనమస్కారములతోడను, నానావిధసుగంధద్రవ్యములతోడను, దేవతలను, భూసురులను బూజించెను. అతఁడు క్రమముగఁ దత్కాలోచితములైనసమస్తకార్యముల నెఱవేర్చి స్వనగరగమనార్థము బహిర్ద్వారమును వెలువడియెను. స్వస్తివాచకు లగుబ్రాహ్మణులు దధిపాత్రము, స్థలపుష్పములు, నక్షతలు మొదలగు మంగళద్రవ్యములను దీసికొని యచ్చటికి వచ్చిరి. వాసుదేవుఁడు వారలకు ధనదానపూర్వకముగఁ బ్రదక్షిణ మొనర్చెను. తరువాత నత్యుత్కృష్టములైన తిథివారనక్షత్రయుక్తమైనశుభముహూర్తమున గదాసిచక్రశార్ఙ్గప్రభృతులగు శస్త్రములతోఁ గూడి గరుడకేతనాలంకృతమై వాయువేగగామి యగుకాంచనరథం బెక్కి స్వపురమునకుఁ బ్రయాణమయ్యెను. ఆసమయమున మహారాజైన యుధిష్ఠిరుఁడు స్నేహపరతంత్రుఁడై యారథము నెక్కి సారథియైన దారుకుని స్థానాంతరమునఁ గూరుచుండఁజేసి తాను స్వయముగ సారథియై పగ్గములఁధరించెను. మహాబాహుఁడైన యర్జునుఁడుగూడ రథము నధిరోహించి స్వర్ణదండవిరాజితమైన శ్వేతచామరముతో శ్రీకృష్ణునకువీవ

దోడంగెను. మహాబలపరాక్రమవంతుఁడైన భీమసేనుఁడును, నకులసహదేవులును, ఋత్విక్కులును, పురోహితులును, గలసి వానిని వెంబడింపసాగిరి. శత్రునిహంతకుఁడైన వాసుదేవుఁడు యుధిష్ఠిరాదిభ్రాతృవరులచే ననుగమ్యమానుఁడై శిష్యగణానుగతుఁడైనగురునివలె శోభిల్లుచుండెను. అతఁ డర్జునుని గాఢాలింగన మొనర్చి, యామంత్రించి, యుధిష్ఠిర భీమసేనులను బూజించి నకులసహదేవులతో సంభాషించెను. యుధిష్ఠిరభీమసేనార్జును లాతని నాలింగనము చేసికొనిరి. నకులసహదేవు లాతని కభివాదన మొనర్చిరి. తరువాత, క్రమముగ నర్ధయోజన మేగినపిదప శత్రునిషూదనుఁడైనకృష్ణుఁడు యుధిష్ఠిరు నామంత్రణ మొనర్చి, మరలఁ దలఁచిన దని యాతనిపాదములఁ బడియెను. ధర్మరాజు తనచరణములఁ బడినభక్తపావనుఁడైన కమలలోచనుని లేవనెత్తి యాతనిమస్తకము నాఘ్రాణించి స్వభవనమునకుఁ బోవ నాజ్ఞాపించెను. అప్పుడు భగవానుఁడైన వాసుదేవుఁడు పాండవులతోఁ బ్రతిజ్ఞావాక్యము లాడుచు నతికష్టముమీఁద వారలను మరలించి యమరావతికిఁ బోవుమహేంద్రునివలె ద్వారవతికిఁ బయనమై పోయెను. పాండవులు కృష్ణుఁ డెంతవఱకు గనఁబడుచుండెనో, యంతవఱకును ననిమిషనయనములతో నాతని నీక్షించుచు మనస్సులతో నాతని ననుగమింపసాగిరి. కృష్ణునిజూడ వారిమనములు పరితృప్తిఁ బొందకపూర్వమే యాతఁడు వారలదృష్టిపథము దాఁటిపోయెను. అప్పుడు పాండవులు కృష్ణుఁడు కనఁబడుట లేదని యాతనివిషయమై యాలోచించుకొనుచు స్వనగరమునకు మరలిరి. దేవకీనందనుఁడైనకృష్ణుఁడుకూడ, తనతో వచ్చుచున్న సాత్యకితోడను, సారథి యైన దారుకునితోడను, వేగవంతుఁడైనగరుడునివలె సత్వరముగ ద్వారకాపురముఁ బ్రవేశించెను. యుధిష్ఠిరుఁడుగూడ భ్రాతృవరులతోఁ గలిసికొని సుహృజ్జనపరివృతుఁడై స్వపురమునఁ బ్రవేశించి తనసోదరులకును, పితరులకును, బాంధవులకును సెలవొసంగి ద్రౌపదితో నామోదప్రమోదములఁ బొందుచుఁ గాలక్షేపము సేయుచుండెను. ఇటఁ గృష్ణుఁడుగూడఁ బరమాహ్లాదహృదయముతో ద్వారకాపురము ప్రవేశించెను. ఉగ్రసేనుఁడు మొదలగు యదుశ్రేష్ఠు లాతని బూజించిరి. వాసుదేవుఁడు పురప్రవేశ మొనర్చి ప్రథమమున వృద్ధపిత యైనయాహుకునకును, యశస్విని యైనమాతకును, బలభద్రునకును, నభివాదన మొనర్చి పిదప ప్రద్యుమ్నానిరుద్ధ గదసాంబచారుదేష్ణభానుకుల నాలింగన మొనర్చి వృద్ధులయనుమతిఁ గైకొని రుక్మిణీమందిరమునకుఁ బోయెను.'

## సప్తపరిచ్ఛేదము

జరాసంధవధసరామర్శ.

ఈవిధముగ సభానిర్మాణ మయ్యెను. యుధిష్ఠిరుని రాజసూయ యజ్ఞమునుగూర్చి ప్రస్తావ మయ్యెను. అందఱావిషయము నంగీకరించినను యుధిష్ఠిరుఁడు కృష్ణానుమతి లేకుండ దాని కీయకొనుట కనిష్టుఁ డయ్యెను. ఏల యనిన—కృష్ణుఁడే నీతిజ్ఞుఁడు; కావున నాతఁడు కృష్ణునిఁ దోడితెచ్చుటకై చారుల నంపెను. కృష్ణుఁడుకూడ యుధిష్ఠిరునివార్త వినినంతనే బయలుదేఱి ఖాండవప్రస్థమునకు వచ్చిచేరెను.

రాజసూయానుష్ఠానసమయమున యుధిష్ఠిరుఁడు కృష్ణునితో నిట్లు సంభాషించెను. "నేను రాజసూయయాగము చేయనభిలషించుచున్నాను. యజ్ఞము కేవలము నిచ్ఛతోడనే నెఱవేఱునది కాదు. ఏవిధముగ నెఱవేఱునో, యది నీకే విశదమగును. చూడుము! ఎవ్వనిచే సకలమును సంభవించుచున్నదో, ఎవఁడు సర్వత్రపూజ్యుఁ డగుచున్నాఁడో, ఎవఁడు పృథ్వీతలమున కీశ్వరుఁడో అట్టి వ్యక్తియే రాజసూయానుష్ఠానమున కుపయుక్తమైన పాత్రము."

అని చెప్పి యుధిష్ఠిరుఁడు కృష్ణుని జూచి "నే నట్టివాఁడనా? నావలన సకలమును సంభవించుచున్నదా? నేను సర్వత్ర పూజ్యుఁడనా? ఈపృథివి యంతకు నధినాథుఁడనా?" అని యడిగెను. యుధిష్ఠిరుఁడు తనభ్రాతృవరుల భుజబలమువలన నొక గొప్పరాజయ్యెన మాట సత్యమే. కాని, యాతఁడు రాజసూయము సేయ సమర్థుఁడగు పురుషుఁ డయ్యెనా? ఎవరివిలువ యెట్టిదో, యది వారికి సహజముగఁ దెలియదు. దాంభికులును, దురాత్ములును దమగొప్పతనమునుగూర్చి తాము కృతనిశ్చయులై సంతుష్టచిత్తమున నుందురు. కాని యుధిష్ఠిరునివంటి సావధానచిత్తుఁడును, వినయసంపన్నుఁడును, నటు సేయఁ

జాలఁడు. నేను గొప్పరాజు నైతి నని యాతఁడు మనస్సునఁ దెలిసికొనెననుట సత్యమే. కాని తనవిలువయెడలఁ దాను విశ్వాసవంతుఁడై యుండ లేకపోయెను. ఆతఁడు తనమంత్రివర్గమును, భీమార్జునాదిసోదరులను బిలిచి "నేను రాజసూయమును జేయ సమర్థుఁడనా?" అని యడిగెను. "నీ వవశ్యముగఁ జేయఁగలవు. నీవే దానికి యోగ్యమైన పాత్రుఁడవు" అని వారు ప్రత్యుత్తరము చెప్పిరి. తరువాత నతఁడు ధౌమ్యద్వైపాయనాదిఋషులను బిలిచి "నేను రాజసూయమును జేయఁగలనా?" అని యడిగెను. వా రందులకు "అవశ్యముగఁ జేయఁగలవు. నీ వందుల కుపయుక్తమగు పాత్రుఁడవు." అని చెప్పిరి. అప్పటికిని * సావధానచిత్తుఁడైన యుధిష్ఠిరునకు మనోనిశ్చయము గలుగలేదు. అర్జునుఁడైనను, వ్యాసుఁడైనను—యుధిష్ఠిరునియొద్దఁ బరిచితులైనవారలలోఁ గృష్ణుఁడే యందఱికంటెను శ్రేష్ఠుఁడు. ఆతనియొద్ద నీవిషయమునకు సమాధానము పడయక యె యుధిష్ఠిరునిసందేహము పోఁజాలదు. అందుచే నాతఁడు మహానుభావుఁడును సర్వలోకోత్తముఁడును నైనకృష్ణునితో నాలోచింప స్థిరపఱచికొని "కృష్ణుఁడు సర్వకర్త; ఆతఁ డవశ్యముగ నాకు మంచియాలోచనమును జెప్పును." అని యోచించుకొనియెను. అందువలననే యాతఁడు కృష్ణుని దోడితెచ్చుటకై చారులను బంపెను; కృష్ణుఁడు వచ్చినతరువాతఁ దనవృత్తాంతము నాతనికిఁ జెప్పెను.

---

* బుద్ధిమంతులు పాండవులచరిత్రమును సమాలోచనము చేసినయెడల యుధిష్ఠిరుని ప్రధానగుణము సావధానత యని తెలిసికొనఁ గలుగుదురు. భీముఁడు దుస్సాహసి; అర్జునుఁడు తనబాహుబలగౌరవమును దెలిసికొనుటచే నిర్భయుఁడును నిశ్చింతుఁడును. ఈజగమున సావధానతయే యనేకస్థలముల ధర్మముగఁ బరిగణింపఁబడు చున్నది. ఈవిషయ మప్రస్తుతమైనను గురుతరవిషయ మని యిచ్చోటఁ జెప్పవలసి వచ్చినది. ఈసావధానతతో యుధిష్ఠిరుని ద్యూతానురాగ మెంతవఱకు సంగతముగా నున్నదో యావిషయమునుగూర్చి తెలుపుస్థాన మిది కాదు.

"నాసుహృద్వరులు యజ్ఞమును జేయ నా కాలోచనమును జెప్పిరి. కాని నేను నీయాలోచనమును దీసికొనకయే దానిని జేయ సమకట్ట లేదు. ఓకృష్ణా! కొందఱు బంధుభాషణమును బట్టి దోష ప్రకటనమును జేయరు. కొందఱు స్వార్థపరులై ప్రియవాక్యములఁ జెప్పుదురు. మఱికొందఱు తమ కేది హిత మగునో, దానిని స్థిరపఱచి బోధపఱుతురు, ఓమహాత్మా! ఈపృథివిలోఁ బైనిజెప్పినవారలే యధికముగ నుందురు. కావున వారియాలోచనమును దీసికొని యే కార్యమును జేయరాదు. పైని వివరించిన దోషములు నీకడ లేవు. నీవు కామక్రోధవర్జితుఁడవు. కావున నాకు సత్యమైన యాలోచనమును జెప్పుము."

పాఠకులారా! చూడుఁడు! నిత్యమును కృష్ణునికార్యకలాపములఁ జూచుచున్న యాతనియాత్మీయు లాతనిగూర్చి యెట్లు యోచించుచున్నారో చూడుఁడు! మన మాతనిగూర్చి యెట్లుగా యోచించుచున్నారమో! కృష్ణుఁడు కామక్రోధవర్జితుఁ డనియును, అందఱికంటె సత్యవాది యనియును, సర్వదోషరహితుఁ డనియును, సర్వలోకోత్తముఁ డనియును సర్వకార్యకరుఁ డనియును వారలు యోచించుచున్నారు. ఆతఁడు లంపటుఁ డనియును నవనీతచోరుఁ డనియునుగుచక్రి యనియును, రిపువశీభూతుఁ డనియును, ఇతరదోషయుక్తుఁ డనియును మనము యోచించుచున్నారము. ఆతఁడు ధర్మమునకుఁబరమాదర్శస్వరూపు డని ప్రాచీనగ్రంథములు తెలుపుచున్నవి. ఏజాతి యాతనినిన్యూనత పఱిచెనో యాజాతియందు ధర్మలోప మగు ననిన విచిత్ర మేమి?

యుధిష్ఠిరుఁడెట్లు భావించెనో, అట్లే జరిగెను. అప్రియములైన సత్యవాక్యము లెవ్వరును యుధిష్ఠిరునితోఁ జెప్పలేదు. కృష్ణుఁడు మాత్రమే చెప్పెను. యుధిష్ఠిరుని జూచి మధురవచనములతో "నీవు

రాజసూయమున కధికారివి కావు. ఏల యనిన:—సమ్రాట్టువుగాక రాజసూయమున కధికారివి కాఁజాలవు. నీవు సమ్రాట్టువుగావు: మగధాధిపతి యైనజరాసంధుఁ డిప్పుడు సమ్రాట్టుగ నున్నాఁడు. అతని జయింపకయె నీవు రాజసూయమున కధికారివి కాఁజాలవు. దానిని సంపన్నము చేయఁజాలవు.'' అని చెప్పెను.

కృష్ణుని స్వార్థపరునిగను కుచక్రిగను భావించినవారి లిది విని ''ఇట్టిది కృష్ణమత మగుట సంగతముగనే యున్నది. జరాసంధుఁడు కృష్ణునిపూర్వశత్రువు. కృష్ణుఁడు స్వయముగ నాతని వెడలఁగొట్ట లేక పోయెను. ఇప్పుడు బలవంతులైనపాండవుల మూలకముగ నాతనివధ సాధన మొనర్చి తనయిష్టసిద్ధిఁ గావించుకొనుటకు మంచి సమయము వచ్చినదని యిట్టియాలోచనమును జెప్పియుండును.'' అని చెప్పవచ్చును.

ఇంకొకమాట చెప్పవలసి యున్నది. జరాసంధుఁడు సమ్రాట్టే కాని తైమూరులంగు నెపోలియనులవంటి యత్యాచారుఁ డగుసమ్రాట్టు. పృథివి యాతని యత్యాచారములచేఁ బ్రపీడిత మయ్యెను. జరాసంధుఁడు రాజసూయయజ్ఞార్థము ప్రతినయొనర్చి బాహుబలమున సమస్తభూపాలురను బరాజయము నొందించి పర్వతికందరమధ్యమున గజసమూహమును బంధించిన సింహమువలె వారిని గిరిదుర్గమున బంధించెను. రాజులను గారాగారమున నుంచుటకు మఱియొకభయానక మైనయుద్దేశము కలదు. ఆరాజులను యజ్ఞకాలమున మహాదేవునకు బలి యిచ్చుట యాతనియభిప్రాయము. పూర్వము యజ్ఞసమయములయం దెవ్వరైనను నరబలి యిచ్చియుండిన ట్లితిహాసజ్ఞు లెవ్వరును జెప్పియుండలేదు. * కృష్ణుఁడు యుధిష్ఠిరునిఁ జూచి ''ఓభరత

* ఇట్లు నరబలి యిచ్చుట సామాజికాచారము కాదు. నీవెచ్చోటను నరబలినిజూచి యుండలేదు.'' అని కృష్ణుఁ డొకచోటఁ జెప్పి యున్నాఁడు. ధార్మికులైనవార లీభయానకాచారమునకుఁ గడంగలేరు.

కులప్రదీపా! బలిప్రదానార్థమై తీసికొని రాఁబడిన రాజులు ప్రోక్షితులును, బ్రమృష్టులు నై పశువులవలెఁ బశుపతిగృహమున వాసము చేయుచు నతికష్టమున జీవనము గడపుచుండిరి. దురాత్ముఁడైన జరాసంధుఁడు వారల నచిరకాలములోనే వధించును. దీనికై నే నాతనితో యుద్ధమునకు సంసిద్ధుఁడవు కావలసినదని యుపదేశించితిని. ఈ దురాత్ముఁ డెనుబదియాఱుగురు రాజులను దీసికొని వచ్చెను. ఇఁకఁ బదునలుగురు మాత్రము కావలసి యున్నది. వారినిగూడఁ దీసికొని వచ్చినయెడల నిక్కృపాధముఁడు వారలనందఱ నేక కాలముననె సంహరించును. ఓధర్మాత్మా! ఇప్పు డెవ్వరైనను దురాత్ముఁడైన జరాసంధుని క్రూరకర్మమునకు విఘ్నము నాపాదించినయెడల యశోరాశి భూమండలమున దేదీప్యమానముగఁ దేజరిల్లఁగలదు. ఆతని జయింపఁగల్గిన యాతఁడే యీసామ్రాజ్యమును నిశ్చయముగఁ బొందఁగలఁడు.'' అని చెప్పెను.

కావున జరాసంధుని వధించుటకు యుధిష్ఠిరుని బ్రోత్సాహపెట్టుటలోఁ గృష్ణుఁడు తనహితమును గోరి యుండలేదు. యుధిష్ఠిరుఁడుతనయిష్టసిద్ధి నొందుటకూడ నాతని యుద్దేశము కాదు. కారాబద్ధులైన రాజమండలిహితము గోరియును, జరాసంధుని యత్యాచారముచేఁ బ్రపీడితమైనభారతవర్షహితము కోరియును ప్రజాహితమును గోరియును గృష్ణుఁడు యుధిష్ఠిరుని బ్రోత్సాహపఱచెను. కృష్ణుఁడు తాను రైవతకగిరిదుర్గము నాశ్రయించి యుండుటచే నాతఁడు జరాసంధుని బాహుబల కటితుఁడును నజేయుఁడు నై యున్నాఁడు. జరాసంధుని వధించుటలో నాతనికి స్వపక్షమున నిష్టానిష్టము లేవియును లేవు. ఒకవేళ నేవియైన నుండినను దేనివలన లోకహిత మగునో యట్టి యాలోచముననే చెప్పి నాతఁడు ధర్మబద్ధుఁడై యున్నాఁడు. అట్టి యాలోచమువలన స్వార్థసిద్ధి యేమియైన నుండినను దానినే చెప్ప

బాధ్యుఁడు. ఈకార్యమున లోకహితసాధన మగుట సత్యమే కాని, "ఇందు నాకుఁగూడ నేదైన స్వార్థసిద్ధి యుండును—ఇట్టియాలోచనము చెప్పుటవలన లోకులు నన్ను స్వార్థపరుఁ డని యనుకొందురు. కావున నిట్టి యాలోచనములు చెప్పను." అని యెవఁడు తలఁచునో, నిజముగ వాఁడే స్వార్థపరుఁడు; అధార్మికుఁడు; ఏలయన:—అట్టివాఁడు తనమర్యాదనే చూచుకొనును గాని, లోకహితమునుగూర్చి యోచించువాఁడు కాఁడు ఎవఁ డిట్టికళంకము నాదర పూర్వకముగ వహించి లోకహితసాధనమునకై పని చేయునో, యాతఁడే యాదర్శధార్మికుఁడు.

యుధిష్ఠిరుఁడు సావధానవ్యక్తి. సహజముగ జరాసంధునితోడి వివాదమున కొప్పికొని యుండలేదు. కాని, భీమునివీరగర్వోక్తులవలనను, అర్జునుని తేజోగర్భితవాక్యములవలనను, కృష్ణుని యాలోచనమున కెట్టకేలకు సమ్మతించెను. కృష్ణభీమార్జునులు మువ్వురును జరాసంధుని జయించుటకు బయలువెడలిరి ఎవని యసంఖ్యాకములగు సైన్యమునకు భయమంది ప్రబలపరాక్రమవంతమైనవృష్ణివంశము రైవతకపర్వతము నాశ్రయించెనో యట్టి వానిని జయించుటకు మువ్వురు మాత్రమే ప్రయాణమైరి. ఇది యెట్టి యాలోచనము ! ఇది శ్రీకృష్ణుని యాలోచనము. ఈయాలోచనము కృష్ణునియాదర్శచరిత్రముతో సంగతముగనే యున్నది. జరాసంధుఁడు దురాత్ముఁడు, అందువలన నతఁడు దండనీయుఁడే. కాని, యాతని సైనికు లేమి యపరాధ మొనర్చిరి? అట్టి సైన్యముతోఁ బోరుటకు సైన్యమును గూడఁ దీసికొని పోవలయును. అట్టిసైన్య యుద్ధమున నిరపరాధులు కూడ వధింపఁ బడుదురు. అపరాధులకును నిష్కృతి యగును. ఏలయనిన, జరాసంధునకు సైన్యబల మెక్కువగ నున్నది. పాండవసైన్యము దానితో సమము కాఁజాలదు. కాని, యప్పటికాలపు క్షత్రియులలో ద్వంద్వయుద్ధమున కాహూతుఁడైనయెడల నెవ్వఁడును విము

ఖత నందుఁగూడ దనుధర్మము ప్రచారములో నుండెడిది. కావున, నసర్థకముగ లోకక్షయము గావింపక యె తాము ముచ్చురుమాత్రము జరాసంధునిసమ్ముఖమునకుఁ బోయి యాతని ద్వంద్వయుద్ధమునకుఁ బిలువవలయుననియును, నాముచ్చురితో యుద్ధము చేయుటకు నాతఁ డవశ్య మంగీకరించు ననియుఁ గృష్ణునియుద్దేశము. అప్పుడు. ఎవరికి శారీరకబలమును, సాహసమును, శిక్షయు, నెక్కువగ నుండునో, అతఁడే జయము నొందును. ఈవిషయమున నల్వురే శ్రేష్ఠులు. కాని. యుద్ధసంబంధమున నిట్లు సంకల్పము చేసికొని, వారు స్నాతకబ్రాహ్మ ణవేషధారులై పోయిరి. ఈకృత్రిమవేష మేల వేసికొనవలయునో, యది తెలియలేదు. గోపనముగ జరాసంధునిబట్టి వధించుట వారియు ద్దేశమై యుండదు. వారలు శత్రుభావమున ద్వారముకడ నున్న భేరులనన్నిటిని భగ్నము గావించి ప్రాకారమును, యజ్ఞశాలను జూర్ణముగావించి, జరాసంధునిసభలోఁ బ్రవేశించిరి. కావున, గుప్త భావమునఁ బ్రవేశించుట వారియుద్దేశము కాదు. కృత్రిమవేషమును ధరించుట కృష్ణార్జునుల కయోగ్య మైనది. ఇది గాక మఱియొకవిశేష మున్నది. అదికూడ శోచనీయ మనియును, గృష్ణార్జునుల కయోగ్య మైనదనియును బోధ యగును. జరాసంధుని సమీపించినతర్వాత భీమార్జునులు నియమస్థులైరి. నియమస్థు లైనయెడల మాటాడఁగూ డదు. వారేమియును మాటాడి యుండలేదు. కావున, జరాసంధు నితో మాటాడుభారము కృష్ణునిపై బడెను. కృష్ణుఁడు జరాసంధుని జూచి "వీరలు నియమస్థులు; ఇప్పుడు మాటలాడరు. పూర్వరాత్ర మైనతర్వాత నీతోమాటాడుదురు." అని చెప్పెను. జరాసంధుఁడు కృష్ణునిమాటలను విని వారల యజ్ఞాలయమునసుంచి స్వగృహము నకుఁబోయెను; అర్ధరాత్ర మైనపిదపఁ దిరిగి వారలసమీపమునకు వచ్చెను.

ఇదికూడ నొక కళాకౌశలము. కళాకౌశలమె కాని, విశుద్ధమైనది కాదు—చాతుర్యమైనదియే. ధర్మాత్మున కిది యోగ్యమైనదికాదు. ఈకళాకౌశలమున నున్నయుద్దేశ మేమి? కృష్ణార్జునుల నింతవఱకు ధర్మాదర్శస్వరూపులుగఁ దలంచుచున్నాము. ఆకస్మికముగ వారి యీయవనతి యేల? ఈచాతుర్యమున కేదైన నుద్దేశమున్న యెడలఁ దమయభీష్టసిద్ధికొఱకు వీర లిట్టిపన్నుగడను జేసియుండవచ్చును. ఈ కళాకౌశలమువలన శత్రువుల నిర్జించుటకే యీయుపాయ మవలంబించి యుండవచ్చును. కాని, యట్లయిన యెడల వీరలు ధర్మాత్ములు కారనియును, కృష్ణచరిత్రము మనము తలంచినంత విశుద్ధమైనది కాదనియును జెప్పవలసి వచ్చును.

జరాసంధుని వృత్తాంతము నెఱుఁగనివార లేల యిట్టిచాతుర్యమును బన్నవలయునని తలంపవచ్చును. నిశీథసమయమున జరాసంధు డసహాయుఁడుగా నున్నప్పు డాతనిపై నాకస్మికముగఁబడి వధించుటయె యీచాతుర్యముయొక్క యుద్దేశము. ఆయుద్దేశముతోడనే నిశీథసమయమున నాతనిసందర్శనము దొరకునట్లుపాయము బన్నియుండవచ్చును. కాని, వాస్తవముగ నిట్టియుద్దేశము వారికి లేదు. ఇట్టికార్యమును వా రొనర్చి యుండలేదు. నిశీథకాలమున వారలుజరాసంధుని సందర్శించిరి. కాని, యప్పుడు వాని నాక్రమించి యుండలేదు. అట్టిప్రయత్నముఁగూడఁ జేసియుండలేదు. నిశీథకాలమున యుద్ధము చేయలేదు—పగటిపూటనే యుద్ధము చేసిరి. గోపనముగ యుద్ధము చేయలేదు—బహిరంగముగ సకలపౌరవర్గమును, మగధవాసులయు సమక్షముననె; ఇట్లొకరోజునమాత్రమే యుద్ధము జరుగలేదు. పదునాలుగు దినములవఱకు యుద్ధము జరిగెను. ముప్వురును యుద్ధమొనర్చి యుండలేదు, ఒక్కఁడే యుద్ధము చేసెను, ఆకస్మికముగ నాతని నాక్రమించి యుండలేదు. యుద్ధసన్నద్ధుఁ డగుటకు జరాసంధునకు విశేషావ

కాశమీయఁబడెను——ఇంత యెందులకు? యుద్ధానంతరమున నేను చచ్చిపోవుదుననుసుద్దేశముతో జరాసంధుఁడు తనపుత్రునకు రాజ్యాభిషేక మొనర్చునంతవఱ కాతని కవకాశ మీయఁబడెను. అస్త్రముల ధరింపకయె వారు ముప్వురును జరాసంధునియొద్దకు వచ్చియుండిరి. కాపట్యమేమియుఁ జేసియుండ లేదు. జరాసంధుఁ డడిగినతోడనే కృష్ణుఁడు తమవృత్తాంత మంతయు నాతనికిఁ జెప్పెను. యుద్ధకాలమున జరాసంధుని పురోహితుఁడు యుద్ధమువలనఁ గలుగు శరీరవేదన ముపశమించుటకై యుపయోగకరము లైనయౌషధము లన్నియుఁ దీసికొనివచ్చెను. కృష్ణునిపక్షమున నట్టిసహాయ మేమియును లేదు. అట్లయినను, నన్యాయయుద్ధ మని వా రేమియు నాక్షేపించి యుండలేదు. యుద్ధకాలమున జరాసంధుఁడు భీమునిచే విశేషముగఁ బీడింపబడుచుండ దయామయుఁడైన కృష్ణుఁడు భీముని నట్లు పీడింపవలదని వారించెను. ఇట్టిచరిత్ర కలవార లీకార్యమునఁ జాతుర్యమును జూపుదురా? ఇట్టియుద్దేశశూన్య మైన చాతుర్యము సంభవమా? నిర్బోధు లైన వార లుద్దేశశూన్యమైన యిట్టిశఠత్వమును జేయఁగలిగినఁ జేయఁగలుగురు. కాని, కృష్ణార్జునులు మఱి యేమైనను నిర్బోధులుమాత్రము కారని శత్రుపక్షమువారు కూడ నంగీకరింతురు. అట్లయినయెడలఁ జాతుర్యమును గూర్చిన కథ యెందుండి వచ్చెను? ఈజరాసంధపర్వాధ్యాయముతోడ సంబంధము లేనియీకథ యెందుండి వచ్చెను? ఎవరైన దీని నిందుఁ జొన్పియుండిరా? ఇది ప్రక్షిప్తమా? ఈగ్రంథమున దీనికిఁ బ్రత్యుత్తర మేదియును లేదు. కాని, ఈవిషయమింకను గొంచెము విశేషముగ యోచించి చూడవలయును.

మహాభారతమున నొక్కొకచోట నొకయధ్యాయమును, నొక్కొక్కచోట నొక్కొక్కపర్వాధ్యాయమును బ్రక్షిప్తములై యుండినట్లు మనము చూచియున్నాము. అట్లయినయెడల నొకయధ్యా

యమునఁ గాని, యొకపర్వాధ్యాయమునందలియంశవిశేషమునఁగాని, కొన్నిశ్లోకములు ప్రక్షిప్తములై యుండుట సంభవముకాదా? ఇందు విచిత్ర మేమియును లేదు. ప్రాచీనసంస్కృతగ్రంథము లన్నియును నిట్టే మహాకృతిని బొందిన వనుట ప్రసిద్ధవిషయము. ఇందువలననే వేదాదులయందు భిన్నభిన్నములైన శాఖలును, రామాయణాదిగ్రంథములయందు భిన్నభిన్నములైన పాఠములును, శకుంతల, మేఘదూత మొదలగునాధునికగ్రంథములమార్పులు గానఁబడుచున్నవి. సకలగ్రంథములయందును, మాలికాంశమున నిట్టే యొకటి రెండుశ్లోకము లక్కడక్కడఁ బ్రక్షిప్తములు చేయఁబడుచుండుట కానఁబడుచున్నది మహాభారతమునందలి మాలికాంశమునఁ బ్రక్షిప్తములు కానఁబడుచుండుటలో విశేష మేమున్నది?

కాని, నామతమునకు విరోధముగ నున్నశ్లోకముల బ్రక్షిప్తములని విడిచిపెట్టుటలేదు. ఏదిప్రక్షిప్తమో, ఏదిప్రక్షిప్తముకాదో దానిని నిదర్శనపూర్వకముగఁ బరీక్షింపఁదలంచుచున్నాను. ప్రక్షిప్తము లని నేను వేనిని విడిచి పెట్టుచున్నానో, వానియందుఁ బ్రక్షిప్తచిహ్నములు గానఁబడుచున్న వని నేనవశ్యము చూపింపవలసి యున్నది. చిహ్నములను బట్టియే నేను ప్రక్షిప్తము లని చెప్పుచున్నాను.

చాలఁ బ్రాచీనకాలమునఁ బ్రక్షిప్తముగఁ జేయఁబడినదానిని గ్రహించుట కాభ్యంతరికప్రమాణములు తప్ప మఱి యేమియు నాధారము లుండవు. అభ్యంతరికప్రమాణములలో నొకటి శ్రేష్ఠమైన ప్రమాణము—అసంగతి—అనైక్యత—గ్రంథమున నేదైన నొకవిషయము చెప్పఁబడి, యది యాగ్రంథమునందలి యితరభాగమునకు విరుద్ధముగా నున్నప్పు డది గ్రంథకారుని భ్రమప్రమాదవశమునఁ గాని, లిపికారుని భ్రమప్రమాదవశమునఁగాని, తటస్థించి యుండవలయును; కాక ప్రక్షిప్తమై యుండవలయును, ఇట్లు మనము నిర్ధారణము చేసి

కొండము. ఏది భ్రమప్రమాదమో, ఏది ప్రక్షిప్తమో, అదికూడ సహజముగ నిరూపణము చేయవచ్చును. రామాయణగ్రంథమున నెచ్చోటనైనను రాముఁ డూర్మిళను వివాహము చేసికొనియెనని వ్రాయఁబడి యుండినయెడల నది లిపికారుని భ్రమప్రమాదమాత్ర మని మనము సిద్ధాంతము చేసికొనవచ్చును. కాని, రాముఁ డూర్మిళను వివాహ మాడుటకు లక్ష్మణునితో వివాదపడె ననియును, తరువాత రాముఁ డూర్మిలను లక్ష్మణున కిచ్చివేసె ననియును వ్రాయఁబడియుండిన యెడల, నది లిపికారునిగాని, గ్రంథకారునిగాని భ్రమప్రమాదమై యుండవచ్చును. భ్రాతృసౌహార్దరసమును గనఁపఱుచుటకు రసికునిరచన లింద్రుఁ ప్రక్షిప్తము చేయఁబడినవని చెప్పవచ్చును. జరాసంధవధ పర్వాధ్యాయమునందలి పైనుదాహరింపఁబడిన విషయము విచారణము ననుసరించి యాపర్వాధ్యాయము నందలి యన్నిభాగములతోడను, సంపూర్ణముగ విరుద్ధమై యున్నది. అది లిపికారుని భ్రమయని కాని గ్రంథకారుని ప్రమాదమనిగాని, నిర్దేశము చేయుట కవకాశము లేదు. కావున, నావిషయములు ప్రక్షిప్తము లనుటకు మాకధికారము కలదు.

ఇట్టియసంబద్ధము లైనవిషయములఁ బ్రక్షిప్తములు చేయుట వలనఁ బ్రయోజన మేమని పాఠకు లడుగవచ్చును. ఇది యోచనీయ మైన యంశమే. మహాభారతము లందలి కథ మూఁడంతరములు కలదిగా నీవఱకే చెప్పియున్నారము. మూఁడవయంతర మనేకులచే రచింపఁబడినది. కాని, ప్రథమకోశ మొక్కరే రచించిరి. ద్వితీయకోశము కూడ నట్టిదియే. ఈయిరువురును శ్రేష్ఠకవులు; కాని వారిరచనా ప్రణాళులు స్పష్టముగ భిన్నభిన్నముగఁ గనఁబడుచున్నవి. ద్వితీయకోశమును రచించిన యాతనిరచనలయందు గొన్ని [illegible]ములు కలవు. యుద్ధపర్వమునం దాతనిరచనలు విశేషముగఁ

గానఁబడుచున్నవి. ఈపర్వములయందలి చాలభాగమాకవిప్రణీతమే. ఆయావిషయము లాలోచించునప్పు డిది స్పష్టపడఁగలదు. ఆకవి కృష్ణుని చతురచూడామణియని కనఁబఱుచుటకుఁ జాల నిష్టుఁడై యుండిన ట్లాతఁడు రచించినవచనములయం దొకప్రధానలక్షణము కానవచ్చుచున్నది. అన్నిగుణములకంటె నీతఁడు బుద్ధికౌశలము నెక్కువగ నాదరించును. ఇట్టివాఁ డీకాలమునఁగూడ దుర్లభుఁడు కాఁడు, కుశలులైన బుద్ధిమంతులచాతుర్యమే మనుష్యత్వమున కాదర్శలక్షణమని యెంచువార లిప్పుడు సుశిక్షితులైనవారిలోఁ జాలమందికలరు. ఐరోపియను సమాజమున నిది చాలఁ బ్రియమైన యాదర్శము. దానినుండియే యాధునిక (Deplomacy) విద్య యేర్పాటు చేయఁబడినది. బిస్మార్కు ఒకప్పు డీజగత్తునఁ బ్రధాన పురుషుఁడుగా నుండెను. థెమిస్టాక్లిస్ కాలము మొదలుకొని నేటివఱకును నీవిద్యయందుఁ బరిపూర్ణులైనవారలె యైరోపాఖండమున మాన్యులు. (Francis dearless imitation of christ)అను గ్రంథకర్త లెట్లు యోచించు చున్నారు? మహాభారతమునందలి ద్వితీయకోశప్రణేతయగు కవికూడ నట్టియాదర్శమునే భావించి యుండెను. కృష్ణుని యీశ్వరత్వమునం దాతనికి సంపూర్ణవిశ్వాసము. అందువలననే, యాతఁడు పురుషోత్తముని నతి నిపుణునిగఁ బ్రదర్శించియుండెను. ఆతఁడు మిథ్యావచనమూలకముగ ద్రోణవధసంబంధమునఁ బ్రఖ్యాతమైన యుపన్యాసములు రచించి యున్నాఁడు. జయద్రథవధసందర్భమున సుదర్శనచక్రముచే రవి నాచ్ఛాదనము చేసినట్లు నింక ననేకములగు కృష్ణకృతాద్భుతకౌశలముల రచియించిన కవి యితఁడే. జరాసంధవధపర్వాధ్యాయమునం దనర్థకమును, నసంబద్ధమును నైన యిట్టి కౌశలవిషయికములైన శ్లోకములరచించినయాతఁడీతఁడే యనియును, నట్లయినయెడల నందాతని యుద్దేశసంబంధమున వేఱుగ వ్రాయనక్కఱ లేదనియును, జెప్పవల

సియున్నది. కృష్ణునికౌశలప్రపూర్ణునిగఁ బ్రతిపాదించుటయే యాతని యుద్దేశము. కేవల మీయూహయే యాధారముగఁ జేసికొని నేనింతయుఁ జెప్పుటలేదు. జరాసంధవధ పర్వాధ్యాయమున నాతనిచేయి యెంతవఱ కున్నదో యింకను జూపవలసియున్నది.

---

## సప్తమ పరిచ్ఛేదము

### కృష్ణజరాసంధసంవాదము

జరాసంధుఁడు నిశీథకాలమున యజ్ఞాగారమునందు స్నాతక వేషధారులైన యామువ్వురను సందర్శించి వారినిబూజించెను. వారు జరాసంధుని పూజను గైకొనిరో, లేదో యించుకయును జెప్పఁబడ లేదు. కాని, రెండుచోటుల మాత్రమున్నది. మూలముపై నెవ్వరో తమకవిత్వచాతుర్యమును జూపుటచే నిట్టి గందరగోళము కలిగినది.

వారు పరస్పరము సంభాషించుకొనినపిదప జరాసంధుఁడు వారలను జూచి "ఓవిప్రులారా! స్నాతకవ్రతచారులైన బ్రాహ్మణులు సభాగమన సమయమునఁ దప్ప నెన్నఁడును * చందనమాల్యముల ధరింపరని నాకుఁ దెలియును. మీ రెవ్వరు? మీవస్త్రములు రక్తవర్ణములు; శరీరములు పుష్పమాలికలచేతను, అనులేపనములచేతను శోభిల్లుచున్నవి. భుజములయందు జ్యాలాంఛనములు పొడకట్టుచు

* వారుమాలికల నొకమాలావిరచితుని యొద్ద బలత్కారముగఁ దీసికొనినట్లు వ్రాయఁబడియున్నది. రాజసూయయజ్ఞమునకుఁ బ్రవృత్తులైన యంతటి యైశ్వర్యవంతులు పుష్పమాలికలను గొనుటకు బదులుగ నిట్లొనర్చిరనుట చాల నసంభవము. కృష్ణుఁడు ఖ్యాతాపవ్యాప్తమైన రాజ్యము నే ధర్మానురోధమునఁ బరిత్యజించినవారలిట్లు మాలాగ్రహణ మొనర్చిరనుట చాల నసంభవము. ఇవి యన్నియును ద్వితీయశ్లోకమును రచించిన కవిరచనలు. దర్పోద్ధతమైన క్షత్రియతేజమును వర్ణించుటకే కథలు

న్నవి. ఆ కారదర్శనమునమాత్ర తేజము స్పష్టముగఁ గానఁబడుచున్నది. కాని, మీరు బ్రాహ్మణులని చెప్పియున్నారు. కావున, సత్యమును జెప్పుఁడు. మీరలెవ్వరు? రాజసమక్షమున సత్యమే ప్రశంసనీయమైనది. మీరేల ద్వారమునుండి ప్రవేశింపక నిర్భయముగఁ జైతకపర్వతశృంగమును భగ్నముచేసి లోనఁ బ్రవేశించితిరి? బ్రాహ్మణులు వాక్యములచేత వీరత్వమునుఁ బ్రకాశింపఁ జేయుదురు. కాని, మీరు కార్యములయందు వీరత్వమునుగనఁబఱిచి చాల విరుద్ధముగ సంచరించితిరి. అంతియేగాక మీరలు నాసమీపమునకు వచ్చితిరి. నేను మిమ్ము విధిపూర్వకముగఁ బూజించితిని. అట్టి మీరేల నాపూజను గైకొనలేదు? మీరిచ్చోటకు వచ్చినకారణమేమో తెల్పుఁడు" అనియడిగెను.

దీనికిఁ బ్రత్యుత్తరముగఁ గృష్ణుఁడు స్నిగ్ధగంభీరస్వరమున మూలికమహాభారతమున నెచ్చటను గృష్ణుఁడు చంచలస్వభావముతోఁ గాని, క్రోధముతోఁ గాని, మాటాడినట్లు కనఁబడదు. అతని కరిషడ్వర్గము వశీభూతమై యున్నది.) నాతనిఁ జూచి "ఓరాజా! నీవు మమ్ములను జూచి స్నాతకబ్రాహ్మణు లని యనుకొనుచున్నావు. కాని, బ్రాహ్మణక్షత్రియవైశ్యు లనుమూఁడుజాతులవారును స్నాతకవ్రతమును బూనవచ్చును. వీరలకు విశేషనియమములును, నవిశేషనియమములును గూడఁ గలవు. క్షత్రియజాతివారలు విశేషనియతులైనయెడల సంపత్తిశాలు రగుదురు. పుష్పధారులు నిశ్చయముగ శ్రీమంతులగుదు రని మేము పుష్పములను ధరించితిమి. క్షత్రియులు బాహుబలముననే బలవంతులు; వాగ్వీర్యశాలురు కారు. ఇందువలన వారలు ప్రగల్భ వాక్యములు చెప్పవలసియున్నది." అనియెను.

ఈకథ శాస్త్రోక్తముగను, చాతుర్యముగను, నున్నదనుట సత్యమే. కాని, కృష్ణునకు యోగ్యమైనట్లు లేదు. సత్యప్రియుఁడైన ధర్మాత్మునకుఁ దగినట్లు లేదు. కాని కృత్రిమ వేషమును ధరించిన

యాతఁడు సహజముగ నిట్టిప్రత్యుత్తరమునే చెప్పెను. కృత్రిమవేసము ద్వితీయకోశమును రచించినకవి సృష్టియే యైనయెడల, నీవాక్యములు కూడ నాతఁడు రచించినవే యైయుండవలయును. కృష్ణుని జతురచూడామణిగఁ బ్రదర్శింపఁ దలఁచుకొనిన యతఁడు, ఆతనిచే నిట్టి ప్రత్యుత్తరముం బలికించుట సహజముగనే యున్నది. కాని, కృష్ణుఁడు తాను బ్రాహ్మణునివలె సంచరింప నుద్దేశము లేనట్లుగా నిందుఁ గనఁబడుచున్నది. తాము క్షత్రియుల మనియే యాతఁడు స్పష్టముగఁ జెప్పినాఁడు. అంతియేగాక తాము శత్రుభావమున యుద్ధార్థము వచ్చినట్లుకూడఁ జెప్పియున్నాఁడు.

"విధాత శ్రోత్రియులకు బాహులయందే బలమునిచ్చి యున్నాఁడు. ఓరాజా! నీకు మాబాహుబలమును జూడ నిష్టముండినయెడల నేఁడే చూడవచ్చును. సందేహము లేదు. ఓబృహద్రథనందనా! ధీరులు శత్రుగృహమున నప్రకాశ్యభావముతోడను, సుహృద్గృహమునఁ బ్రకాశ్యభావముతోడను బ్రవేశింతురు. ఓరాజా! మేము స్వకార్యసాధనార్థము శత్రుగృహమునకు వచ్చి యాతఁ డొనర్చినపూజన గైకొనము. ఇది మా నిత్యవ్రతము."

ఇది గందరగోళ మనుట స్పష్టము. ఈయధ్యాయముతోడఁ గృత్రిమవేసంబంధమైన గందరగోళముకూడఁ దగ్గును. కృత్రిమవేష సంబంధమైనకథలోఁ దరువాతియధ్యాయమునఁ జెప్పబడిన కృష్ణసంబంధమైనసంభాషణము సంపూర్ణముగ దీనికి భిన్నప్రకారముగ నున్నది; ఇంతవఱకును గనఁబఱిచిన యాతని యున్నతచరిత్రమునకు యోగ్యమైనట్లుగ నున్నది. పూర్వాధ్యాయమునందును, పరాధ్యాయమునందును వర్ణింపఁబడిన కృష్ణచరిత్రలో నింతవిశేషభేద ముండుట చూడ నిది యిద్దఱుకవులు రచించియున్నారని చెప్పవలసియున్నది.

జరాసంధునిగృహమును కృష్ణుఁడు తమశత్రుగృహ మని నిర్దేశించుట విని, జరాసంధుఁ డాతనిం జూచి "నే నెప్పుడైనను నీతో శత్రుత్వము పెట్టుకొనినట్లు కాని, నీ కపకారములు చేసినట్లు గాని,

నాకు జ్ఞప్తి లేదు. ఏకారణమున నిరపరాధినైన నన్ను శత్రునిగఁ బరిగణించుచున్నావు?'' అని యడిగెను.

దీనికిఁ బ్రత్యుత్తరముగ జరాసంధునితోఁ గృష్ణున కెట్టిశత్రుత్వము కలదో దానినే చెప్పెను. జరాసంధునకును, దనకును గల వివాదమునుగూర్చి యేమియును బ్రస్తావించి యుండలేదు. తనతోడివివాదముకొఱ కెవ్వరును శత్రువులు కాఁజాలరు. ఏల యనిన, అతఁడు సర్వత్ర సమదర్శి. శత్రు మిత్రులను సమముగఁ జూచును. అతఁడు పాండవులకు మిత్రుఁడనియుఁ, గౌరవులకు శత్రుఁడనియు లోకులు విశ్వసించుచున్నారు. కాని, మౌలికమహాభారతమునుగూర్చి విమర్శచేయుసందర్భమున నేను వాస్తవమును దెలుపుదును. అతఁడు ధర్మపక్షావలంబి. అధర్మమునకుఁ బ్రతికక్షి; ఇంతకంటె నాతనికిఁ బక్షాపక్షము లేవియును లేవు. ఆవిషయమునుగూర్చి ముందు నాలోచింతుము. కృష్ణుఁ డుపయాచకుఁడై జరాసంధున కాత్మపరిచయమును గలుగఁజేసెను. తనతోడివివాదమువలన నాతని శత్రునిగ నుద్దేశించి యుండలేదు. మనుష్యజాతికి శత్రువైన యాతఁడు కృష్ణునకు శత్రుఁడు. ఏలయనిన, ఆదర్శపురుషుఁడు సర్వభూతముల యందుఁ దనస్వరూపమునే చూచును. ఇంతకంటె నాతనికి వేఱువిధమైన యాత్మజ్ఞానము లేదు. అందువలననే జరాసంధునిప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరముగఁ దనకుఁ జేసిన యపకారము నుగ్గడింపక లోకమునకుఁ జేసిన యనిష్టమునే పేర్కొనియెను. "నీవు రాజులను మహాదేవునకు బలి యిచ్చుటకుఁ గారాబద్ధులను జేసియున్నావు. అందువలననే యుధిష్ఠిరుని యాజ్ఞానుసారముగ నిన్నెదుర్కొన వచ్చితిమి." అని చెప్పి తనశత్రుత్వమును బ్రకటింపఁక కృష్ణుఁడు "ఓబృహద్రథనందనా! నీవు చేసిన పాపమువలన మేముకూడఁ బాపాత్ములమగుదుము. ఏల యనిన మేము ధర్మచారులము; ధర్మరక్షణమునకు సమర్థులము." అని చెప్పెను.

ఈవిషయమునఁ బాఠకులు విశేషముగఁ దమ హృదయముల నాలోచింతురని యింతవిపులముగ వ్రాసితిమి. ఇది పురాతన మైనను నీకథ చాల శ్రేష్ఠమైనది. ధర్మరక్షణమునకును, బాపద మనమునకును, సమర్థుఁడై యుండి, యట్లొనర్పనియతఁడు పాపమునకు సహకారి యగును. కావున, నీలోకమున నందఱును దమకు సాధ్యమైనంత వఱకుఁ బాపనివారణమునకుఁ బ్రయత్నింపలేని యది యధర్మమగును. "నేనేమియును బాపమొనర్చుట లేదు. ఇతరులేని చేయుచున్నారో దాని వలన నాకు దోషమేమున్నది.?" అని యోచించుకొని నిశ్చింతగ నుండువాఁడుగూడఁ బాపి యగును. కాని, ధర్మాత్ములు కూడ నట్లే యోచించుకొని నిశ్చింతతో నుందురు. ఇందువలన జగత్తున జన్మించిన నరోత్తము లందఱును నిట్టిధర్మరక్షణమునకును, బాపనివారణమునకును బూనుకొనవలసియుండును. శాక్యసింహుఁడు; ఏసు క్రీస్తు మొదలగువారు దీని కుదాహరణస్వరూపులు. ఈవిషయమే వారి జీవనచరిత్రలకు మూలసూత్రము. శ్రీకృష్ణునకుఁగూడ నిదియే వ్రతము. ఈమహావాక్యముల స్మరణయందుంచుకొనకపోయినఎడల నాతనిజీవనచరిత్రము బోధపడదు. శిశుపాలజరాసంధకంసాదులవధ యును, మహాభారత యుద్ధమునఁ బాండవపక్షమున సహాయము సేయుటయును మొదలు గాఁగల కృష్ణునికార్యము లన్నియును నీ మూలసూత్ర సాహాయ్యముననే బోధపడఁగలవు. వీనికే పురాణకారులు పృథివీభారహరణ మని చెప్పి యున్నారు. క్రీస్తు చేసినను, బుద్ధుఁ డొనర్చినను, కృష్ణుఁడు గావించినను నిట్టిపాపనివారణవ్రతము నకు ధర్మప్రచారమని పేరు. ధర్మప్రచారము రెండువిధములుగ జరుగవచ్చును. ఒకటి వాక్యములచేతను, అనఁగా ధర్మసంబంధ మైన యుపదేశముల చేతను, రెండవది—కార్యములచేత, అనఁగా, కార్యముల నన్నిటిని ధర్మాదర్శములుగఁ బరిగణింపఁ జేయుటచేతను, క్రీస్తు

శాక్యసింహుఁడు, శ్రీకృష్ణుఁడు, వీరీరెండువిధములనుగూడ నొనర్చి యున్నారు. క్రీస్తును, శాక్యసింహుఁడును, నొనర్చిన ధర్మప్రచార ముపదేశప్రధానముగ నున్నది. కృష్ణకృతధర్మ ప్రచారము కార్య ప్రధానముగ నున్నది. ఇందులోఁ గృష్ణునిదే ప్రధానమైనది. ఏల యనిన, వాక్యములు సులభములు; కాని, కార్యములు కఠినములు. అధికతరఫలప్రదాయకములు; కేవలము మానవునిమూలకముగ నిట్టివి సుసాధ్యము లగునో కావో, యావిషయమును గూర్చి మే మిప్పుడు యోచింపఁ దలఁచుకొనలేదు.

ఇందు మఱియొక విషయము యోచింపవలసి యున్నది. కృష్ణుఁడు కంసశిశుపాలాదులను వధించుటనుగూర్చి చెప్పియున్నాము. మఱియును జరాసంధుని వధియింప వచ్చియున్నాఁడని చెప్పితిమి. కాని, పాపులనువధించుట యాదర్శమనుష్యపనియా? సర్వభూతసమ దర్శియైన యాతఁడు పాపాత్ములను గూడ నాత్మసములుగ భావించి వారలకుఁగూడ హితకాంక్షియేల కాఁగూడదు? పాపులను జగత్తునం దుంచుటవలన జగత్తునకు శుభము కాదనుట సత్యమే. కాని, వారి వధసాధనమాత్రమే జగదుద్ధారణమున కేకమాత్రోపాయమా? పాపులను పాపములనుండి త్రిప్పి ధర్మప్రవృత్తులుగఁ జేసినయెడల జగ త్తునకును, పాపులకును గూడ నేకకాలముననే శుభసిద్ధిచేయుట. ఇది యైయుపాయముకంటె నుత్కృష్టమైనదికాదా? ఆదర్శపురుషుఁ డిట్టి మార్గము నవలంబింపవలదా? ఏసుక్రీస్తు, శాక్యసింహుఁడు, చైత న్యుడు మొదలుగాఁగలవార లీవిధముగనే పాపుల నుద్ధరింపఁ బ్రయ త్నించుచుండిరి.

దీనికి రెండు ప్రత్యుత్తరములు. మొదటిది—కృష్ణచరిత్రయం దుఁగూడ నిట్టిధర్మమున కభావము లేదు. క్షేత్రభేదమువలన ఫలభేద ముకూడ ఘటిల్లినది. దుర్యోధనకర్ణాదులే మార్గమవలంబించినయెడల

వారలు ధర్మపథావలంబులై జీవనములను, రాజ్యములను దక్కించు కొందురో అందులకై యాతఁడు యథావిధిగఁ బ్రయత్నించెను. మఱి యు నాకార్యసంబంధమున "పురుషకారమువలన నెంతవఱకు సాధ్య మగునో, అంతవఱకును జేసి చూచితిని. కాని, దైవము నాయధీనమై యుండలేదు." అని యాతఁడు చెప్పెను. కృష్ణుఁడు మానుషశక్తి తోడఁ గార్యసాధన మొనర్పఁజూచెను. అందువలన స్వభావముగ నసాధ్యములైన పనులు ప్రయత్నములు చేసినను, నొక్కొకప్పుడు నిష్ఫలములయ్యెను, శిశుపాలుని శతాపరాధముల మన్నించెను. ఆ విషయ మలౌకికమైన గాథలతోడ నిండియున్నది. యథాస్థానమున దాని తాత్పర్యమును దెలుపఁ బ్రయత్నింతును. కంసవధను గూర్చి యిదివఱకుఁ దెల్పియుంటిమి.

పయిలేటును క్రైస్తవమతావలంబకుని జేయుట క్రీస్తున కెంత సంభవముగ నుండెనో, కంసుని ధర్మమార్గమునకుఁ ద్రిప్పుట కృష్ణున కంతియే సంభవముగ నుండెను. జరాసంధసంబంధమునఁ గూడ నట్లే చెప్పవలసి యున్నది. అట్లయినను జరాసంధసంబంధమునఁ గూడ గృష్ణుఁ డొక సంభాషణమును జేసెను. జరాసంధుఁడు కృష్ణునికడ ధర్మోపదేశమును గ్రహించుటయటుంచి కృష్ణున కీధర్మవిషయికమైన యొక యుపన్యాసము నిచ్చెను. చూడుము! ధర్మమునకుఁ గాని, యర్థ మునకుఁ గాని, హాని కలిగినయెడల మనోవేదన కలుగును. కాని, క్షత్రియకులమున జన్మించి ధర్మజ్ఞుఁడై యుండి నిరపరాధముగ లోకుల ధర్మార్థమునకు హాని కలుగఁజేసినయెడల నట్టివాని కిహమున నశుభ మును, బరమున నరకమును సంభవించును; సందేహము లేదు.

ఇట్టిచో ధర్మోపదేశమువలన నేమియును బ్రయోజనములేదు. జరాసంధుని సన్మార్గమునకుఁ ద్రిప్పుట కుపాయాంతర మున్నదో, లేదో, మాబుద్ధికిఁ దోచుటలేదు. అతిమానుషకీర్తి ప్రచారమువలన

నొకగ్రంథము గాఁగలదు. అట్లే యితరధర్మప్రచారకులలో ననేకులు కనఁబడుచున్నారు. కాని, కృష్ణచరిత్ర మతిమానుషశక్తికి విరోధి; శ్రీకృష్ణుఁడు భూతములను బోఁగొట్టెయు, రోగముల నివర్తి చేసియు, ధర్మప్రచార మొనర్చుటఁగాని, తన దేవత్వస్థాపన మొనర్చుటఁగాని చేసియుండలేదు.

జరాసంధునికథ కృష్ణోద్దేశము కాదని దీనివలనఁ దెలియుచున్నది. ధర్మరక్షణమే—అనఁగా నిర్దోషముగఁ బీడింపఁబడిన రాజుల నుద్ధరించుటయే యాతనియుద్దేశము. అతఁడు జరాసంధుని బాగుగఁ దెలిసికొని "నేను వసుదేవనందనుఁ డగుకృష్ణుఁడను; వీరిరువురును వీరపురుషులైన పాండుతనయులు మేము నిన్ను యుద్ధమునకుఁ బిలుచుచున్నారము. ఈక్షణముననే సమస్తభూపాలురను విడిచివేయుము, లేనియెడల యుద్ధ మొనర్చి యమాలయమునకుఁ బొమ్ము." అని చెప్పెను. కావున జరాసంధుఁడు రాజులను విడిచినయెడల కృష్ణుఁడాతనికి నిష్కృతి చేసియుండును. జరాసంధుఁ డందులకు సమ్మతింపక యుద్ధము చేయఁగోరెను; కావున యుద్ధమే యయ్యెను. జరాసంధుఁడు యుద్ధమునఁగాక యేయోచనవలనను యాథార్థ్యమును స్వీకరించుటకుఁ దగిన పాత్రము కాఁడు.

ఏసుక్రీస్తు గాని, బుద్ధుఁడు గాని జీవనీత్యుపదేశమువలనఁ బతితోద్ధారణ మొనర్చుటవలెఁ గృష్ణునిజీవితమున నట్టిది జరుగలేదని నే నొప్పుకొనుచున్నాను. ఏసును, శాక్యసింహుఁడును, ధర్మప్రచారమునకుఁ బాటుపడియున్నారు. కృష్ణుఁడు ధర్మప్రచార మొనర్చియుండుట సత్యమే, కాని, ధర్మప్రచార మతని వ్యవసాయము కాదు. అది యాదర్శపురుషుని యాదర్శమైన జీవననిర్వాహకమున కానుషంగికమైన ఫలముమాత్రము. ఏసుక్రీస్తుయొక్కగాని, శాక్యసింహుని యొక్కగాని, ధర్మప్రచార వ్యవసాయమును గూర్చి యెంతమాత్రి

మును లాఘవపఱచుటకై తెలియఁజేయుచుంటినని యెవ్వరుగాని యెవరును గాలమునను దలంపరాదు. ఏసును, శాక్యసింహుఁడును, సుభటులును మనుష్య శ్రేష్ఠులని నేను భక్తి చూపుచున్నాఁడను. వారిచరిత్రము యోచించి దానివలన జ్ఞానలాభమును బొంద హెచ్చరించుచున్నాఁడను. ధర్మ ప్రచారకులవ్యవసాయము (వ్యవసాయ మనఁగా కర్మానుష్ఠానమున సర్వదా ప్రవృత్తుఁడై యుండుట) సకలవ్యవసాయములకంటె శ్రేష్ఠ మైన దని నాకుఁ దెలియును. కాని, యాదర్శ మనుష్యున కా వ్యవ సాయము మాత్రమే కాఁజాలదు. ఏల యనిన-ఆతఁ డాదర్శమను ష్యుఁడు; మానవున కనుష్ఠింపవలసిన కార్యము లెన్నియున్నవో, అన్నియు నాతని కనుష్ఠేయములే. ఏపని గాని యాతని వ్యవసాయము కాఁజాలదు. అనఁగా నితరకర్మలకంటెఁ బ్రధానత్వమును బొంది యుండఁజాలదు. ఏసుగాని, శాక్యసింహుఁడుగాని యాదర్శపురుషులు కారు. కాని, మనుష్యశ్రేష్ఠులు, మనుష్యులకు శ్రేష్ఠములైన వ్యవసాయముల నవలంబించుటయే వారికి విధాయకమై యున్నది. వాని నవలంబించి వారు లోకహితసాధనమును జేయుదురు. ఈవిష యమున సకలశిక్షితపాఠకులును నిట్లూహింతు రని నేననుకొనను. అట్లనుకొనుటకుఁ బ్రతిబంధక మొకటి యున్నది. ఆదర్శపురుషులమాట చెప్పుచున్నాను. అనేకశిక్షితపాఠకు లాదర్శశబ్దమునకు అని యర్థము చెప్పుచున్నారు. ఈయనువాదమును దూష్యము కాదు. "Christian ideal,, అని యున్నది. క్రైస్తవుల యాదర్శపురుషుఁడు ఏసు; నేను బాల్య కాలమునుండియు క్రిస్టియన్ జాతి సాహిత్యము నధ్యయనము చేసి యాయాదర్శమును హృదయంగమము చేసికొంటిని. ఆదర్శపురుషుని కథ యైనట్లు, ఆయాదర్శవిషయమును యోచించుచున్నాను. ఏ యాదర్శ మాయాదర్శముతో నేకీభవింపదో దాని నాదర్శ మని గ్రహింపఁజాలను. క్రీస్తు పతితోద్ధారి. ఏదురాత్ముని గాని యాతఁడు

ప్రాణహరణ మొనర్చి యుండలేదు. అట్లొనర్చుటకు క్షమ కలిగి యుండలేదు. శాక్యసింహునియందును, చైతన్యునియందును, సట్టి లక్షణములు చూచుచున్నారము. అందువలన, వీర లాదర్శపురుషు లని చెప్ప సంసిద్ధుల మగు చున్నాము. కాని, కృష్ణుఁడు పతితపావనుఁ డనునామమును ధరించియును ప్రధానముగఁ బతినిపాతతి యనియే యితిహాసమునఁ బరిచితుఁడై యున్నాఁడు. ఆకస్మికముగా నాతఁడు మన కాదర్శ పురుషుఁడుగా నగపడఁడు. కాని మన మొకవిషయము మాత్ర మాలోచింపవలయును. ఈ "Christian Iqeal" మానవ జాతికి సత్యాదర్శమేనా ? సకలజాతుల జాతీయాదర్శమును నిట్లే యుండవలయునా ? అని——

ఈ ప్రశ్నయందు హిందువులకు జాతీయాదర్శ మొకటి యున్నదా లేదా యనుప్రశ్న మొకటి కలుగుచున్నది. "Hindu Ideal" ఉన్నదా లేదా? ఉన్నచో నెట్లున్నది? ఈప్రశ్న విద్వాంసుల నడిగినచో వారు బుఱ్ఱ గోకికొనుటకంటె నేమియుఁ జెప్పఁజాలరని తోఁచుచున్నది. జటాధారులును, బలితశ్మశ్రుభూషితులు నగువ్యాసవశిష్ఠాది మహర్షులనామముల నెత్తి కొందఱు తర్కవితర్కములను జేయుదురు. కొందఱు "ఏదైన నుండవచ్చును. బూడిదయంతయును భస్మము కానేరదు" అని చల్లగఁ జెప్పి యూరకుందురు. ఆమాట నిజమే. అట్లైయైనచో నింతదుర్దశ యేల? కాని ప్రపంచమునం దంతటను హిందూజాతియే ప్రధానమై యున్నదినము లొకప్పు డున్నవి. ఆజాతి కాదర్శపురుషుఁ డెవ్వఁడు? దీనికిఁ బ్రత్యుత్తరమును నేను గ్రహించిన రీతి నిదివఱకే చెప్పియుంటిని. రామచంద్రాదిక్షత్రియపురుషు లాయాదర్శ ప్రతిమకు సమీపవర్తులుమాత్రమే——కాని హైందవజాతికి యథార్థముగ నాదర్శపురుషుఁడు శ్రీకృష్ణుఁడే యై యుండెను. మానవ జాతికంతకు నాతఁడే యాదర్శస్వరూపుఁడు. క్రీస్తుమొదలగువారియం దట్టి యాదర్శస్వరూపము సంపూర్ణముగఁ దోఁచుటలేదు.

క్రీస్తు ధర్మతత్త్వమునందే మనుష్యత్వమును బోధించుటకు ప్రయత్నించెను. సకలవృత్తుల సంపూర్ణస్ఫూర్తియును, సామంజస్య మును మనుష్యత్వ మగుచున్నది. అట్టియుత్కృష్టస్ఫూర్తి సామంజస్య ములఁ గన్నయాతఁడే యాదర్శనూనవుఁడు. క్రీస్తునం దట్టిపూర్ణత్వము లేదు. శ్రీకృష్ణునియం దున్నది. రోమకచక్రవర్తి క్రీస్తును యూదు లకు శాసనకర్తగా నియోగించినచో నాతఁడు సమర్థుఁడై శాసింపఁ గలఁడా ? శాసింపఁజాలఁడు. రాజకార్యనిర్వహణమునకు సకలవృత్తు లును ప్రయోజనీయములై యుండును. క్రీస్తున కట్టియనుభవము లేదు. అట్టి ధర్మాత్ముఁడే శాసనకర్తకూడ నైనచో సమాజమున కెంతయో క్షేమముగను యుండును. శ్రీకృష్ణుఁడు నీతిజ్ఞులలో సర్వశ్రేష్ఠుఁ డను సంగతి ప్రసిద్ధమే. ఈవిషయమున మహాభారతమునందు లెక్కలే నన్ని యుదాహరణము లున్నవి. ఉగ్రసేనుఁడును యుధిష్ఠిరుఁడును గూడ నాతని యాలోచన లేకుండ నెట్టిరాజకార్యమును గావించుట లేదు. ఈవిధముగాఁ గృష్ణుఁడు రాజు గాకుండియుఁ బ్రజల కనంత శుభసంపాది యగుచుండెను. ఈజరాసంధునిచే బంధితులగువారిని విడిపించుటకూడ నిందుల కొకయుదాహరణము—మఱియొకమాట. ఒకవేళ యూదులే రోమకపీడితులై స్వాతంత్ర్యమును గోరి క్రీస్తును దమకు సేనాపతిగాఁ జేసికొన్నచో నప్పుడు క్రీస్తేమి చేయును ? యుద్ధమునం దాతనికి శక్తియును లేదు; ప్రవృత్తియును లేదు— కృష్ణుఁడుకూడ యుద్ధమునఁ బ్రవృత్తిశూన్యుఁడే; కాని యాతనికి ధర్మార్థమున యుద్ధము చేయుటకూడఁ గలదు. అట్టియుద్ధమునం దాతఁ డజేయుఁడే; క్రీస్తు విద్వాంసుఁడు కాఁడు కృష్ణుఁడు సకల శాస్త్రపారంగతుఁడు. ఇతరగుణములయం దిట్టియంతర మున్నను నిరువురునుగూడ శ్రేష్ఠధార్మికులును ధర్మదీక్షితులు నై యుండిరి. కావునఁ గృష్ణుఁడే సత్యముగ నాదర్శపురుషుడు— Chritian Ideal కంటె Hindu Idieal శ్రేష్ఠమైనది.

ఇట్టి సర్వగుణసంపన్నుఁడగు నాదర్శపురుషుఁడు కేవలమొక్క కార్యవిశేషమునకు జీవనము నర్పింపఁజాలఁడు. అట్లయినచో నితర కార్యము లననుష్ఠితములును, విపరీతానుష్ఠితములు నగుచుండును. మానవుఁడు చరిత్రావస్థాశిక్షాభేదములను బట్టి భిన్నభిన్నకర్మములకును, భిన్నభిన్నసాధనములకు నధికారి యగుచున్నాఁడు. కాని యాదర్శపురుషుఁడు సకలవిషయములయందును నాదర్శస్వరూపుఁడు కావలయును. ఇందుచేతనే శ్రీకృష్ణునకు బుద్ధచైతన్యక్రీస్తులవలె సన్న్యాసగ్రహణమును, వ్యవసాయరూపావలంబనమును నసంభవమయ్యెను. కృష్ణుఁడు సంసారియు, గృహస్థుఁడును, రాజనీతిజ్ఞుఁడును, యోధుఁడును, దండప్రణేతయుఁ, దపస్వియు, ధర్మప్రచారకుఁడును గూడ నైయుండెను. మఱియు నట్టివారి కాదర్శస్వరూపుఁడై యుండెను. జరాసంధాదులవధ యాదర్శరాజపురుషునకును నాదర్శదండప్రణేతకును నవశ్యానుష్ఠేయమైనది—ఇట్టి హైందవాదర్శముతో నసంపూర్ణంబులగు బౌద్ధక్రైస్తవాదర్శములను బోల్చినప్పుడు మనము వానిని సత్యాదర్శములుగా నంగీకరింపఁజాలము.

కాని తెలిసికొనవలసిన విశేషమొకటియున్నది. అది విస్మయకరమైనదియే. క్రైస్తవమతము నవలంబించిన యూరపునందును హైందవమతము నవలంబించిన భారతమునందును నాదర్శసంబంధమున విపరీతఫలము ఫలించుచున్నది. క్రైస్తవాదర్శపురుషుఁడు వినీతుఁడు; నిరీహుఁడు; నిర్విరోధి; సన్న్యాసి—కాని యిప్పటి క్రైస్తవులందఱు నిజముగాఁ దద్వ్యతిరిక్తులై యున్నారు. ఐరోపాఖండ మిప్పు డైహికసుఖలంపటులును, సశస్త్రులు నగు యోధవర్గమునకు విశాలశిబిరమాత్రమైయున్నది. హైందవాదర్శపురుషుఁడు సకలక్రియాదక్షుఁడు—కాని యిప్పటి హిందువులు సకలకర్మములయందు సమర్థులై యున్నారు. ఇట్టి ఫలవైపరీత్యమునకుఁ గారణమేమి? ప్రత్యుత్తరము

సులభమే—ఉభయ దేశములందును లోకులచిత్తములయం దాప్రాచీ నాదర్శము విలుప్తమైపోయినది. ఒకప్పు డీయాదర్శములు రెండు దేశములయందును ప్రబలములైయుండెను. ప్రాచీన క్రైస్తవులధర్మపరాయణతయు సహిష్ణుతయుఁ బ్రాచీన హిందూరాజుల సర్వసమర్థతయు నిందులకుఁ బ్రమాణము. హైందవహృదయమునుండి యట్టి యాదర్శము దూరమైనప్పటినుండియు, మనము శ్రీకృష్ణచరిత్రమును జల్పన చేసినప్పటినుండియు మన సంఘమున కవనతి యారంభ మయ్యెను. అందఱును జయదేవునికృష్ణునే యనుకరింపఁ దొడంగిరి. మహాభారత కృష్ణు నెవ్వరును స్మరించుటయే లేదు.

కాని యిప్పుడు జాతీయహృదయమునం దట్టియాదర్శముజాగరిత మగుచున్నది. అందుల శ్రీకృష్ణచరిత్ర వ్యాఖ్యానము కొంచె మను కూలపడునని యనుకొనుచున్నాను. జరాసంధ వధాధ్యాయమున నీ సంగతు లన్నియును జెప్పవలసిన ప్రయోజన మంతగా లేదు. ప్రసంగవశమునఁ దత్త్వము నిర్ధరింపఁబడియెను. కాని యీసంగతియెచ్చట నైన నెప్పుడైనను మేము చెప్పవలసియేయున్నది. ముందుగనే చెప్పుటవలన లేఖకపాఠకులకు మార్గము సుగమము కాఁగలదు.

---

## అష్టమపరిచ్ఛేదము

### భీమజరాసంధ యుద్ధము

శ్రీకృష్ణచరిత్ర సమాలోచనమున మేమింతవఱకు మహాభారత కృష్ణుని విష్ణునిగాఁ బరిచితునిఁ జేసియుండలేదు. ఎవ్వరు నాతని విష్ణునిగా సంబోధించి సంభాషించి యుండలేదు. ఆతఁ డింతవఱకు మనుష్యాతీతమగుశక్తితో నెట్టి కార్యమును జేసినట్లు చూచియుండలే

దు. అతడు విష్ణునియవతారము కావచ్చును. కాకపోవచ్చును! కృష్ణ చరిత్రమునకు స్థూలమర్మము మానవత్వమే కాని దేవత్వము కాదని మరల మరలఁ జెప్పుచున్నాము.

కాని యీతడు వ్యాస మహాభాగవతమునం దనేకస్థలములలోఁ గృష్ణుఁడు విష్ణుఁడుగాఁ బరిచితుఁ డయ్యె ననునది కూడ నంగీకరింపవలయును. అనేకు లాతని విష్ణువిగా నుపాసించుటయుఁ గలదు. ఆతఁడొకప్పుడు లోకాతీతమగు విష్ణుశక్తిచేఁ గార్యములఁ గావించుటయు గలదు. ఇంతవఱకు నాతని దైవభావము పరిచితము కాలేదు. కాని యిప్పుడే ప్రదర్శిత మయ్యెను. ఈభావద్వయమునకును బరస్పరవిరోధము లేదా!—అట్టివిరోధ మేదియు లేదనియు, దైవశక్తిని బ్రకటింపవలసిన యావశ్యకము లేనప్పుడు కావ్యేతిహాసములయందు మానవశక్తియే ప్రకటింపఁబడు ననియు, నావశ్యకమైనప్పుడు దైవశక్తికూడఁ బ్రదర్శిత మగు ననియుఁ గొందఱు చెప్పవచ్చును. కాని మేమీప్రత్యుత్తరమసత్యము కాదని చెప్పెదము. ఇందు శ్రీకృష్ణుని దేవభావము నిష్ప్రయోజనముగ ననేకస్థలములయం దగపడుచున్నది ఈజరాసంధవధయందే యందుల కొకటి రెండుదాహరణములఁ జూపెదము.

జరాసంధవధానంతరమునఁ గృష్ణుఁడు భీమార్జునులతో జరాసంధరథారూఢుఁడై బయలుదేఱెను. దేవనిర్మిత మగునారథమునం దెట్టియభావమును లేదు. అప్పుడు కృష్ణుఁడు గరుడుని దలంచుకొనియెను. స్మరణమాత్రముననే గరుడుడువచ్చి రథశిఖరము నధిరోహించెను అతఁడు వచ్చి యేపనియును జేయలేదు. వచ్చుటకుఁ బ్రయోజనమును లేదు. కథకును సంబంధము లేదు. కేవలమును, కృష్ణుని దేవత్వమే దీనివలన సూచిత మగుచున్నది. జరాసంధవధార్థ మెట్టి

దైవశక్తియుఁ బ్రయోజనము లేకపోయెను; గాని రథమెక్కిపోవు నప్పుడు మాత్రము కావలసివచ్చెను!

మఱియును యుద్ధమునకుఁ బూర్వ మొకవిశేష మగపడు చున్నది. యుద్ధసన్నద్ధుఁ డగుజరాసంధునిం గాంచి కృష్ణుఁ డిట్లు చెప్పెను "ఓరాజా! మామువ్వురిలో నీవెవ్వరితో యుద్ధము చేయఁగోరెదవో చెప్పుము. యుద్ధమున కెవ్వరు సంసిద్ధులు కావలయును?" అనియెను. జరాసంధుఁడు భీమునితో యుద్ధము సేయఁగోరెను. జరాసంధుఁడు యాదవుల కవధ్యుఁడని బ్రహ్మ చెప్పుటచే కృష్ణుఁ డాతని వధించుటకు యత్నింపలేదని యింతకుముందు వ్రాయబడియుండెను.

ఈ బ్రహ్మవచనముంగూర్చి మహాభారతమం దెచ్చటను వ్రాయఁబడలేదు. తరువాతిగ్రంథమునం దున్నది. మూలభారతమునం దితరకవుల వ్రాఁతలు చేరియున్న ట్లిప్పుడైనను పాఠకులు విశ్వసింతురా? ఇంకను కృష్ణునివిష్ణుత్వము లోలోన నుంచుటయే దీని యుద్దేశమా? మూలమునందుఁ గృష్ణునకు విష్ణుత్వసంబంధ మెచ్చటను వ్రాయఁబడలేదు. ఎందుచేత ననిన నీకృష్ణచరిత్రము మానవచరిత్రము కాని దేవనిర్మితము కాదు. కృష్ణునియందు దేవభావము చూపకుండుట పొరపాటనియెంచి తరువాతికవు లాయభావమును బూరించిరి.

బంధముక్తు లగురాజులు ధర్మరక్షకుఁ డగుకృష్ణునింగూర్చి ధన్యవాదములఁ గావించుపట్టునఁగూడ నెచ్చటను నట్టిభావము లేదు. ఒకచోటమాత్రము వారు కృష్ణుని "విష్ణూయని" సంబోధించియుండిరి. విష్ణునామముచేఁ గాని, తదర్థక మగునన్యనామముచేఁగాని కృష్ణుడుసంబోధింపఁబడినట్లిదివఱ కెచ్చటను నగపడుట ఒకవేళ నప్పుడప్పుడాతఁ డట్లు సంబోధింపఁబడుటయే యున్నను నది యస్వభావముగాని యసంగతముగాని కానేరదు, లోకుల కాతనియం దట్టి విశ్వాస ముం

డవచ్చును. కృష్ణుఁడిప్పుడు మానవశక్త్యతీతంబగు కార్యమును సాధించి యున్నచో నాతనింగూర్చిన విష్ణుసంబోధనము సముచితముగనే యుండును. కాని కృష్ణుఁ డట్టి కార్యమును గావించి యుండలేదు. అతఁడు జరాసంధుని వధింపనైన లేదు. అందఱి యెదుటను భీముఁడే జరాసంధుని సంహరించెను ఆ కార్యమునకుఁ గారకుఁడు శ్రీకృష్ణుఁడే. కాని కారాబద్ధులగు రాజుల కాసంగతి యేమియును దెలియదు. కావున నట్టిరాజులచే నాకస్మికముగఁ గృష్ణుఁడు విష్ణుఁడుగా సంబోధింపఁబడుట యితిహాసమునకును, మూలమునకును గూడ విరుద్ధముగా నున్నది. కాని యిది గరుడస్మరణమునకును, బ్రహ్మోదేశస్మరణమునకు మాత్రమే సంబంధించియున్నది. జరాసంధవధ కథాంశమునకును మాత్రము వీనితో సంబంధమే లేదు. ఈ మూడు విషయములు నొక్కచేతినుండియే వెలువడినవి. ఈమూఁడును మూలాతిరిక్తములే యని పాఠకులు సులభముగా గ్రహింపవచ్చును.

అట్లు విశ్వసింపనివారెవ్వరైననున్నచో నట్టివారి కీకృష్ణచరిత్ర సమాలోచనమువలన నణుమాత్రమైనను లాభముగపడదు. ఏమనిన—ఈసర్వవిషయములకు నింతకంటె నధికప్రమాణములను జూపుటకు మా కవకాశము లేదు. జరాసంధవధసందర్భమునఁ గృష్ణుని విష్ణుత్వసూచనము ప్రక్షిప్తమని విశ్వసించువారిలో నెవ్వరైనఁ గృష్ణుని మాయవేషమును, గపటనటనమునుగూడ నేల ప్రక్షిప్తము కాఁగూడదనియు, నీరెండును నొక్క ప్రమాణముమీఁదనే యాధారపడియున్నవిగాదా యనియుఁ బ్రశ్నింపవచ్చును.

నిజముగా నీరెండు విషయముల నొక్కచోఁ జేర్చిచూచినచో నీజరాసంధవధ పర్వాధ్యాయమునఁ దరువాతి కవుల విలక్షణసృష్టి యున్నదనియు, నందుచేతనే యిట్టియసందర్భములు కలుగుచున్నవనియుఁ దోఁపకమానదు. ఇందితర కవిసృష్టి కలదనుట కింకొక నిదర్శన

కృష్ణుఁడు యుధిష్ఠిరునితో జరాసంధుని పూర్వవృత్తాంతమును సవిస్తరముగఁ దెల్పియున్న ట్లిదివఱకే చెప్పియుంటిమి. అప్పుడు కృష్ణుఁడు కంసవధకారణంబునఁ దనకును జరాసంధునకును గల్గినవైరముంగూర్చి తెలిపియుండెను. అటుపైని నే మహాభారతకారుఁడు—

"వైశంపాయనుఁ డిట్లనియె. రాజగు బృహద్రథుఁడు పత్నీద్వయముతోఁ దపోవనమునకుండి చిరకాలము తపంబు చేసి స్వర్గమునకుఁ బోయెను—వారు జరాసంధచండకౌశికుల వరములందించి నిష్కంటకముగ రాజ్యపాలనముం గావించుచుండిరి. ఈసమయమున భగవానుఁడగు వాసుదేవుఁడు కంసుని సంహరించెను. కంససంహారకారణమునఁ గృష్ణునకు జరాసంధునితో మహావైరము కలిగెను."

అని చెప్పియుండెను. ఇది యంతయును గృష్ణుఁడే చెప్పియుండెను. మఱియు సవిస్తరముగఁ జెప్పెను. మరల నిట్లు చెప్పుట యెందులకు? ప్రయోజనము లేకపోలేదు. మూలమహాభారతకారుఁ డద్భుతరసరసికుఁడు కాఁడు—కృష్ణుని యలౌకికఘటనములంగూర్చి యాతఁ డేమియును జెప్పలేదు. ఈయభావ మిప్పుడు పూరింపఁబడుటకే యీపని జరిగినది. వైశంపాయనుఁ డిట్లు చెప్పెను.

"మహాబలపరాక్రాంతుఁడగు జరాసంధుఁడు గిరివ్రజమధ్యమునం దుండి కృష్ణసంహారమునకై తనగదాదండమును తొంబదితొమ్మిది సారులు త్రిప్పి ప్రయోగించెను. అది మధురలోనున్న యద్భుతచరిత్రుఁడగు శ్రీకృష్ణునిసమీపముననే కోసశతయోజనాంతరమునఁ బతితమయ్యెను. ఆగదావృత్తాంతమును పౌరులు కృష్ణునకెఱింగించిరి. అదిమొదలుగా మధురయందా ప్రదేశమునకు గదావసాన మను పేరు కలిగెను."

ఈజరాసంధవధ పర్వాధ్యాయమునందలి యీవిషయములన్నియు మూలమహాభారతాంతర్గతములే యనియు, నేకకవికృతములే యనియు, కృష్ణాదులు వేషధారులుగనే గిరివ్రజమునకు వచ్చిరనియు పాఠకులకింకను నమ్మకమేయున్నయెడల హిందువు లిఁకఁ బురాణేతిహాసములలో నైతిహాసికతత్త్వానుసంధానమునకై ప్రయత్నము వదలుకొని యితరవస్త్వాపలోకనమునఁ బ్రవృత్తులగుట యుచిత మని

మనవి చేయుచున్నాము. వా రిట్టిపనికిఁ బూనుకొన కుండుటయే మంచిది.

ఇఁక నీయధ్యాయమునందలి యవశిష్టవిషయములను దెలిపి ముగించెదము. అవి యన్నియును సరళము లైనవియే—జరాసంధుఁడు భీమునితో యుద్ధము చేయఁ దలంచి "యశస్వులగు బ్రాహ్మణులచేఁ గృతస్వస్త్యయనుండై క్షాత్రధర్మానుసారంబుగఁ గవచకిరీటముల నుజ్జగించి" యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. అప్పుడు పౌరులగు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రవనితావృద్ధ జను లందఱు నాసంగ్రామమును జూడవచ్చిరి. రణరంగ మంతయు జనాకీర్ణమై పోయెను. పదునాలుగు దినములు యుద్ధ మయ్యెను. (ఇది సత్యమే యైనచో నవకాశమునుబట్టి యప్పుడప్పుడు యుద్ధము జరగియుండవచ్చును.) పదునాల్గవనాఁడు "వాసుదేవుఁడు" జరాసంధుఁ డలసియుండుటం గాంచి భీమకర్ముఁడగు భీమసేనుని సంబోధించి "కౌంతేయా! క్లాంతుఁ డగు శత్రుని బీడించుట యుచితము కాదు. అతిపీడనంబున నీతఁడు మరణించును, కావున నీతఁడు పీడనీయుఁడు కాఁడు భరతర్షభా! ఈతనితో బాహుయుద్ధముం గావింపుము. (అనఁగా—శత్రువును ధర్మానుసారముగ వధింపవలయును. గాని పీడింపరాదు.)—" భీముఁడు జరాసంధుని బీడించియే వధించెను. భీమునకుఁ గృష్ణునితోఁ దుల్య మగు ధర్మజ్ఞానము లేదు.

తరువాతఁ గృష్ణార్జునులును, భీముఁడును గారాబద్ధులగు రాజులను విడిపించిరి. అదియే జరాసంధసంహారమున కేకమాత్రోద్దేశము, కావుననే రాజగణమును విడిపించినతరువాత నిఁక నేమియుం జేయ లేదు, దేశమునకు వెడలిపోయిరి. వారు (Annevationist) కేలవము నక్రమాక్రమణాశాపరులు గారు—తండ్రితప్పునకై పుత్రుని రాజ్యము నపహరించువారు కారు. వారు జరాసంధుని జంపి యాతనిపుత్రుఁ

డగు సహదేవునకు రాజ్యాభిషేకముం గావించిరి; సహదేవుఁ డొసంగిన కానుకలనుగూడ గ్రహించిరి. అప్పుడు కారాముక్తు లగు రాజులు కృష్ణునిం గాంచి "ఈభృత్యు లేమి చేయవలయునో యాజ్ఞాపింపుము" అని వేఁడుకొనిరి. కృష్ణుఁడు వారిం గాంచి "మహారాజగు యుధిష్ఠిరుఁడు. రాజసూయాధ్వరముంగావింప నభిలషించుచున్నాఁడు. మీరాసామ్రాజ్య వాంఛితుఁడగు ధార్మికునకు సాహాయ్యముం గావింపవలయునని ప్రార్థించెను" అనియెను.

యుధిష్ఠిరుని కేంద్రప్రస్థితునిం గావించి ధర్మరాజ్య స్థాపనముం గావించుటయే కృష్ణునిజీవితోద్దేశమై యుండెను. అందుచేతనే మాటిమాటికి నాతఁ డాప్రయత్నమునే చేయుచుండెను. ఈజరాసంధసంహారముచేఁ గృష్ణచరిత్రమునకు విశేషమహిమ ప్రకాశిత మయ్యెను. కాని తరువాతికవులప్రాంతలవలన నీసంగతి గందరగోళముగానున్నది. ఈ పైని శిశుపాలవధ విషయమునఁగూడ మఱియొక గందరగోళమున్నది.

## నవమ పరిచ్ఛేదము.

### అగ్ర్యాభిహరణము.

యుధిష్ఠిరుని రాజసూయ మారంభ మయ్యెను. నానాదేశాగతులగురాజులును, ఋషులును, నితరజనంబులును రాజధానియంతటను నిండి యుండిరి. ఈఘనకార్యనిర్వహణంబునకై పాండవులు తమ యాత్మీయులను వివిధకార్యనియోజితులం గావించి యుండిరి. భోజ్యద్రవ్యసంపాదనమున దుశ్శాసనుఁడును, పరిచర్యయందు సంజయుఁడును, రత్నకతుణదక్షిణాదానంబులయందుఁ గృపాచార్యుఁడును, సుపాయన

ప్రతిగ్రహణంబున దుర్యోధనుఁడును నీవిధముగా నందఱు సన్నిపను లయందు నియుక్తులై యుండిరి. శ్రీకృష్ణుఁ డేపనియందు నియుక్తుఁ డయ్యెను? దుశ్శాసనాదులనియోజనముతోఁగూడఁ గృష్ణుని నియోజనమును లిఖింపఁబడియే యుండెను. అతఁడు బ్రాహ్మణులపాదముల ను గడుగుపనియందు నియుక్తుఁ డయ్యెను.

ఇది కేవల మనుచితముగా నున్నది. భృత్యుఁడు చేయఁదగిన యీపని శ్రీకృష్ణుడేల చేయవలసివచ్చెను? ఇతనికి యోగ్యమగు వే ఱొకపనియే లేదా? కాక బ్రాహ్మణపాదప్రక్షాళనమే మహత్తరకా ర్యమా? అట్టిశ్రీకృష్ణు నాదర్శపురుషునిగాఁ జేసికొని పాఠకులందఱు ను బ్రాహ్మణోత్తముల పాదములను గడుగుటకై యల్లాడవలయునా యేమి? ఇదియే నిజమైనచోఁ గృష్ణుఁ డాదర్శపురుషుఁడు కాడని మే ము ఘంటాపథముగాఁ జెప్పెదము. ఈవిషయముంగూర్చి యనేకవిధ ముల వ్యాఖ్యానము చేయవచ్చును. బ్రాహ్మణులచే బ్రచాలితంబును బ్రస్తుతప్రచారితంబును నగువ్యాఖ్యానమున 'శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణ గౌరవమును వర్ధిల్లజేయుటకే సర్వకార్యములను విడిచి యీపనియం దు నియుక్తుఁ డయ్యెను' అని తేలును. ఈవ్యాఖ్యానము కేవలమగ్రా హ్యమని మాకుఁ దోఁచుచున్నది. శ్రీకృష్ణుఁ డితరక్షత్రియులవలెనే బ్రాహ్మణులనుగూడ గౌరవించుచుండె ననుమాట సత్యమే. కాని యాతఁ డెప్పుడును బ్రాహ్మణగౌరవ ప్రచారమునందే విశేషాసక్తుఁడై యున్నట్లగపడదు. ఇంతియకాక యనేకస్థలములయందుఁ దద్వ్యతిరిక్త మార్గమునుగూడ నవలంబించెను. వనపర్వమునందలి దుర్వాసాతిథ్య వృత్తాంతము మూలభారతాంతర్గతమే యని విశ్వసించినచో నాతఁడు పాండవాశ్రమమునందు బ్రాహ్మణపరాభవముం గావించినట్లు బోధ యగుచున్నది. కృష్ణుఁడు కేవలమును సర్వసమత్వముం గూర్చిన తీవ్ర వాది. గీతాధర్మమే కృష్ణధర్మమైనచో:—

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః
గీ. ౧౮

అనునదియే యాతనిమతము. ఆతనిమతమున బ్రాహ్మణులు, గోవులు గజములు, శునకములు, చండాలురు నందఱును సమానులే. అట్టిచో నాతడు బ్రాహ్మణపాదప్రక్షాళనమునకు నియోగింపఁబడె ననుట యసంభవము.

శ్రీకృష్ణుఁ డాదర్శపురుషుఁడు. కావున వినయాదర్శమును బ్రకటించుటకై యీభృత్యకార్యభారమును వహించె నని కొందఱు చెప్ప వచ్చును. అట్లయినచో బ్రాహ్మణపదప్రక్షాళనమునందే నియుక్తుఁడు కానేల? వయోవృద్ధు లగుక్షత్రియుల యడుగులఁ గడుగుటకుఁగూడ నియోగింపఁబడరాదా? మఱియు నిట్టివినయము విషయమున కాదర్శ మనికూడ మేము విశ్వసింపఁజాలము. ఇది దంభవినయ మని చెప్పెదము.

శ్రీకృష్ణచరిత్రము సమయోపయోగమైనదని మఱికొందఱు చెప్పవచ్చును. ఆసమయమున బ్రాహ్మణభక్తి యతిప్రబలమై యుండె ననియు, ధూర్తుఁ డగుకృష్ణుఁడు దానిని బ్రకటించుటకై యట్లుచేసెద ననియు వారియుద్దేశము—కాని, యీశ్లోకము ప్రక్షిప్త మని మేముచెప్పెదము. ఎందుచేతననిన:—శిశుపాలవధ పర్వాధ్యాయమునకుఁ దరువాతి యధ్యాయమున శ్రీకృష్ణుడు బ్రాహ్మణపదప్రక్షాళనమునకు నియోగింపఁబడినట్లు కాక యాతఁడు క్షత్రియోచితంబును వీరోచితంబును నగుకార్యాంతరమున నియుక్తుఁ డైనట్లు చెప్పఁబడియెను, అందు 'మహాబాహుఁడగు వాసుదేవుడు శంఖచక్రగదాధరుఁడై సమాపనపర్యంతమును యజ్ఞరక్షణముం గావించుచుండెను'' అని చెప్పబడియెను.— ఇవి రెండును బ్రక్షిప్తములే కావచ్చును. ఈపరిచ్ఛేదమున నీవిషయ

ముంగూర్చి విశేషాందోళనము కలిగించుట యంత యావశ్యకముగా మాకుఁ దోచుట లేదు. ఇది యంతముఖ్యవిషయమును గాదు. కృష్ణ చరిత్రవిషయంబున నిట్లే మహాభారతమున ననేకస్థలములఁ బరస్పర విరుద్ధభావము లున్నవని తెలుపుటకే యింతవఱకుఁ జెప్పితిమి. చాల చేతులు పడుటచేతనే యిట్టియసందర్భములు కలిగినవి.

ఈరాజసూయమహాయజ్ఞమునఁ బ్రబలపరాక్రముఁడగు శిశుపాలమహారాజు కృష్ణునిచే నిహతుఁ డయ్యెను. పాండవులకు మిత్రమాత్రుఁడై యుండి శ్రీకృష్ణు డస్త్రధారణముం గావించుట యిదియొక్క పర్యాయమే యని చెప్పవచ్చును. ఖాండవదహనసమయ యుద్ధము కేవలము మౌలికము కాదను సంగతి పాఠకులకు జ్ఞప్తి యందుండవచ్చును.

ఈశిశుపాలవధపర్వాధ్యాయమునందు గురుతర మగు నొక యైతిహాసికతత్త్వము నిహితమై యున్నది. ఇట్టి యితిహాసతత్త్వము మహాభారతమునం దిఁక నెచ్చటను లేదనియే చెప్పవచ్చును. జరాసంధవధకుఁ బూర్వ మెప్పుడును శ్రీకృష్ణుఁ డీశ్వరావతారముగా మౌలమహాభారతమున వ్రాయఁబడి యుండలేదు. జరాసంధవధ యందే యావిషయ మస్పష్టముగా నున్నది. ఈశిశుపాలవధయందే కృష్ణునింగూర్చి యాతనిసమకాలికులు జగదీశ్వరుఁడని చెప్పి యంగీకరించి యుండిరి. ఇందుఁ గురువంశమునకుఁ దాత్కాలికప్రభువగు భీష్ముఁడే యీమతమును బ్రచారము చేసెను.

ఇప్పట్టున నైతిహాసికంబగు నొకసందేహము కలుగుచున్నది. కృష్ణుఁడు తనజీవితప్రథమభాగమున నీశ్వరవతారముగాఁ బ్రదర్శింపఁ బడలేదు. ఆతఁడు మొట్టమొదట నెప్పు డీశ్వరుఁడుగా స్వీకృతుఁ డయ్యెను? తనజీవితకాలమునందే యాతఁ డీశ్వరుఁడుగా నంగీకరింపఁ బడియెనా?——ఈశిశుపాలవధ సందర్భమునందును దరువాత మహా

భారతమునందలి యితరసందర్భములయందును నాతఁ డీశ్వరుఁడుగాఁ బ్రతిపాదింపబడియెను. కాని శిశుపాలవధ యందలి యాయాభాగ ములు ప్రక్షిప్తములై యుండవచ్చును. ఈప్రత్యుత్తరమునం దేపక్షు మవలంబ నీయమైనది?

దీనినిగూర్చి మే మిప్పు డేమియును జెప్పఁబోము. దీనికిఁ బ్రత్యు త్తరము క్రమముగా దనయంతనే పరిస్ఫుట మగు నని భావించుచు న్నాము. కాని శిశుపాలవధ పర్వాధ్యాయ మంతయు మూలమహా భారతభాగమే యైనచోఁ గృష్ణునియం దప్పటినుండియే యీశ్వర త్వము సుప్రతిష్ఠిమైయుండు నని చెప్పుచున్నాము. ఈవిషయమున నాతనికి స్వపక్షులును, విపక్షులునుగూడ నున్నారు. ఆతని స్వపక్షు లలోఁ బ్రధానులు భీష్ముడును బాండవులు నైయుండిరి. ఇఁక విపక్షు లలో నొకమహారాజగు శిశుపాలుఁ డున్నాఁడు. శిశుపాలవధ వృత్తాం తమున స్థూలమర్త్మ మేమనిన:—భీష్మాదులు సభామధ్యమున శ్రీకృ ష్ణునిప్రధానత్వమును స్థాపింపఁ బ్రయత్నించుటయు, శిశుపాలుఁ డాతనికి విరోధి యగుటయు నైయున్నది. అందువలన నతితుముల వివాద ముదయించి పెంపొందెను. అప్పుడు శిశుపాలుని గృష్ణుఁడు వధించెను. దానితో నల్లరియంతయు నడఁగిపోయెను. ఎట్టివిఘ్న మును లేకుండ యజ్ఞము నిర్వహింపబడియెను.

ఈసకలవృత్తాంతమునందును జరిత్రాంశ మేమైన నున్నదా లేదా యని యాలోచించుటకుఁ బూర్వమే యీశిశుపాలవధాధ్యాయ ము మౌలిక మగునా కాదా యని విమర్శింపవలసి యున్నది. దీనికి బ్రత్యుత్తరము సులభమైనది కాదు. మహాభారతమునంతలి స్థూలసం ఘటనములలో నీశిశుపాలవధకు విశేషసంబంధ మున్నదని చెప్పుట కవకాశము లేదు. కాని, యంతమాత్రమున దీనిని బ్రక్షిప్త మని యును జెప్పుటకు వలను గాదు. ఇంతకుఁబూర్వముకూడ ననేకస్థలముల

యందుఁ బ్రబలపరాక్రముడగు శిశుపాలునినామము మహాభారతము నం దగపడుచున్నది. తరువాత నాతఁ డెచ్చటను నగపడలేదు. ఈ నడుమనే యాతఁడు మృతుడై యుండవలయును. పాండవసభయం దాతఁడు కృష్ణునిచేఁ జంపఁబడె ననుటకు విరోధముగ నెట్టికథయును లేదు. అనుక్రమణికాధ్యాయమునను బర్వసంగ్రహాధ్యాయమునను గూడ శిశుపాలవధకథ యున్నది. రచనాప్రణాళికనుబట్టి చూడఁగా శిశుపాలవధ పర్వాధ్యాయము మౌలికమహాభారతాంశమే యని బోధ యగుచున్నది. మూలమహాభారతమునందలి కొన్ని భాగముల వలెనే యీశిశుపాల వధచరిత్రము నాటకముగా రచియింపఁబడి విశేషోత్కర్షం గాంచియున్నది. కావున దీని నమౌలిక మని యొక్క సారిగాఁ బరిత్యజింపఁజాలము.

అయినను జరాసంధవధపర్వాధ్యాయమునందువలెనే యీ యధ్యాయమునందును రెండుచేతులవ్రాఁత లగపడుచున్నవని చెప్పుచు న్నాము. మొత్తముమీఁద నాయధ్యాయముకంటె దీనియందే యట్టి వైచిత్ర్యము విశేషముగా నగపడుచున్నది. కావున శిశుపాలవధస్థా లముగా మౌలికమే యనియు, దీనియందు ద్వితీయపక్షకవులయొక్క గాని, తరువాతిలేఖకులయొక్కగాని చేతులు కలసియున్నవనియు సిద్ధాంతము చేయుటకు మేము బాధ్యుల మగుచున్నాము. ఇఁక నిప్పుడు శిశుపాలవధవృత్తాంతము సవిస్తరముగాఁ దెలుపుచున్నాము.

ఇప్పటికిఁగూడ మనదేశమునం దొకవాడుక యున్నది. ఒకగొ ప్పవాని యింట సభ జరగినప్పుడు సభయందలి ప్రధానవ్యక్తికి ముం దుగఁ బుష్పచందనముల నర్పించుట సుప్రసిద్ధమై యున్నది. దీనిని 'మాలాచందన' మని యందురు. ఇది యిప్పుడు పాత్రగుణముల ననుసరించి యొసంగఁబడుటలేదు. వంశమర్యాదలనుబట్టి యర్పింపఁబడు చుండెను. కులీనుల మందిరములయందుఁ గోష్ఠిపతికే మాలాచందన

మర్పింపఁ బడుచుండెను. ఏమనిన —కులీనులలో గోష్ఠీపతివంశ మేవిశే షమానసీయమైనది. కృష్ణునికాలమున నీపద్ధతి మఱియొకవిధముగా నుండెను. అప్పుడు సభయందలి సర్వప్రధానునకే యర్ఘ్యప్రదానము గావింపఁబడుచుండెను. వంశమర్యాదలనుబట్టి యొసంగబడుటలేదు. పాత్రునిగుణములనుబట్టియే యర్పింపఁబడుచుండెను.

యుధిష్ఠిరునిసభయం దర్ఘ్య మర్పింపవలసి యుండెను. దీనికిఁ దగినవాఁడు భారతవర్షమునందలి మహారాజు లందఱును సభకు విచ్చేసి యుండిరి. ఇందు సర్వశ్రేష్ఠుఁ డెవ్వరనుసంగతి విచారింప వలసియుండెను. శ్రీకృష్ణుఁడే సర్వశ్రేష్ఠుఁ డనియు, నాతనికే యర్ఘ్య మునర్పింపవలయు ననియుఁ గురువృద్ధుఁడగు భీష్ముఁడు చెప్పి యుం డెను, ఆతఁడు ప్రప్రథమమున శ్రీకృష్ణునియందు దేవభావమును సూచించినట్లగపడదు. తేజోబలపరాక్రమములయందు శ్రీకృష్ణుఁడే శ్రేష్ఠుఁ డనియు, నాతనికే యర్ఘ్య మీయవలయు ననియు భీష్ముఁడు చెప్పెను. తాత్రముచేఁ గృష్ణుఁడు క్షత్రియులోకమునకెల్ల శ్రేష్ఠుడని కూడఁ జెప్పియుండెను. దీనినిబట్టి చూడఁగా భీష్ముడు కృష్ణుని మానవ చరిత్రమునే ప్రదర్శించి యుండెనని బోధ యగుచున్నది.

ఈతనియాలోచననుబట్టియే కృష్ణున కర్ఘ్య మొసంగఁ బడె ను. కృష్ణుఁడుగూడ దానిని బరిగ్రహించెను. ఇది శిశుపాలునకు సహింపరాని దయ్యెను. అప్పుడు శిశుపాలుఁడు సమకాలికులగు భీష్మ కృష్ణపాండవాదులను దిరస్కరించి పలికిన పలుకులు విదేశ పార్ల మెంటు మహాసభయందు వచింపఁబడినచో నుచితగౌరవము నంది యుండును. ఆతని యుపన్యాసమునందలి ప్రథమభాగమున వాగ్మిత్వ మును విశుద్ధతయుఁ దీవ్రతయుఁ బొడకట్టెను. "కృష్ణుఁడు రాజు కాఁడు. అట్టివో నిందఱు రాజు లుండఁగా నాతఁ డర్ఘ్యము నేల గ్రహించెను? వృద్ధుఁడను కారణమున నాతని బూజింపఁదలఁచినచో

నాతనితండ్రియైన వసుదేవు నేల పూజింపరాదు? ఆతఁడు మీకాత్మీయుఁడును బ్రియంకరుఁడు నని యెంచి పూజించితిరా? అట్లయినచో మామ యగు ద్రుపదుఁ డుండఁగా నీతని నేల పూజింపవలయును? కృష్ణుని * గురునిగాఁ దలఁచితిరా? ద్రోణాచార్యుఁ డుండగా గృష్ణు నర్చించు టేల? ♦ ఋత్విజుఁ డని యాతని కర్ఘ్య మిచ్చితిరా? వేదవ్యాసుఁ డుండఁగాఁ గృష్ణుఁ డేల?" అని యీవిధముగా మహారాజగు శిశుపాలుఁ డుపన్యసించుచు నితరవక్తలవలెనే యూరకుఁడును గోపోద్రిక్తుఁ డయ్యెను. అప్పుడాతఁడు తర్కమును వదలి బలవంతమున కారంభించెను. ఆలోచనను విడిచి తిట్టుట కారంభించెను. పాండవులను వదలి కృష్ణునెదుర్కొనియెను. అలంకారశాస్త్రమును విలక్షణముగాఁ బ్రయోగింప నారంభించి మొట్టమొదట "ప్రియచికీర్షువు, అప్రాప్తలక్షణుఁడు" అనువాక్యము లాదిగాఁ దుదకు "ధర్మభ్రష్టుఁడు, దురాత్ముఁడు," అను నీమొదలగు దూషణములకు దిగియెను. తుట్టతుదకుఁ గృష్ణుఁడు వెన్నదొంగ, దారపరిగ్రహుఁ డగు * నపుంసకుఁడు నని తిట్టఁ దొడంగెను.

ఆమాటలన్నియును విని శాంతగుణాధారుండును బరమయోగియు నాదర్శపురుషుండు నగుకృష్ణుఁ డెట్టిప్రత్యుత్తరము నియలేదు. తత్క్షణమే శిశుపాలుని దండింపఁగలశక్తి శ్రీకృష్ణున కున్నది. పాఠకులకు ముందుముందు దానిగతి తెలియఁగలదు. ఇంతవఱకుఁ గృష్ణుఁ డెట్టి పరుషవచనములచే నెన్నఁడును దిరస్కరింపబడి యున్నట్లగపడదు. అయిన నాతఁ డీతిరస్కారవచనములకు భ్రూవిక్షేపమైనను గావించి యుండలేదు. ఆతఁ డాంగ్లేయ మతానుసారముగ "శిశు

* కృష్ణుఁడు అభిమన్యుసాత్యకి ప్రభృతిమహారథులకును నొకప్పుడు స్వయముగ నర్జునకునుగూడ యుద్ధవిద్యయందు గురుఁడై యుండెను.

♦ కృష్ణుఁడు సుప్రసిద్ధవేదజ్ఞుఁడని విఖ్యాతి యున్నది.

* కృష్ణుఁ డనపత్యుఁడు కాఁడు—కాని యింద్రియపరాయణు లగువారు జితేంద్రియుల నిట్లే దూషింతురు.

పాలా! శాంతమే పరమధర్మము. నేను నిన్ను క్షమించితిని" అని చెప్పక నిశ్శబ్దముగనే శత్రువును క్షమించెను.

యజమాని యగుయుధిష్ఠిరుఁడు సమాహూతుఁ డగుశిశుపాలు నిక్రోధముం గాంచి యాతని శాంతింపఁ జేయఁ బ్రయత్నించెను; కృష్ణుని నిందించుచున్న యాతనినిమధురవాక్యములచే మందలింపఁ జూచెను. వృద్ధుఁ డగుభీష్ముఁడు సుస్థిరుఁడై యుండెను—ఆతని కది యంత యును బాగుగ నగపడలేదు. "కృష్ణు నర్చించుట కిష్టములేని యాతని నింతగా ననునయించుటయు, బ్రతిమాలుటయు ననుచితము" అని యాతఁడు స్పష్టముగాఁ జెప్పివైచెను—కురువృద్ధుఁడగు భీష్ముఁ డప్పుడు సార్థకంబులగు వాక్యపరంపరలతో శ్రీకృష్ణు నర్చించుటకుఁ గారణము లను సవిస్తరముగ స్పష్టముగఁ దెలియఁజేసెను. ఆవాక్యములయందలి సారాంశమును మేమిందుఁ జూపుచున్నాము, కాని యం దొకవిధమగు గూఢభావ మున్నది. దానిని ముందుగనే తెల్పుచున్నాము. అందుఁ గొన్ని వాక్యములలో "సకలమానవులకంటెను నధికగుణంబులు గల క్షత్రియవీరులలో శ్రీకృష్ణుఁడు సర్వశ్రేష్ఠుఁడు గావున నీతని కర్ఘ్య మీయవలయును" అనుభావ మున్నది. మఱికొన్ని వాక్యములలో "శ్రీకృష్ణుఁడు సాక్షాజ్జగదీశ్వరుఁడు కావున నెల్లరు నాతని నర్చింపవల యును" అనుభావ మున్నది. మే మీరెండువిషయములను వేఱువేఱు గఁ జూపెదము. వాని తాత్పర్యమును గ్రహించుటకుఁ బాఠకులే ప్రయత్నింతురుగాక! భీష్ముఁ డిట్లు చెప్పెను.

'ఈమహాసభయందలి మహారాజమండలమునఁ దేజోబలంబుచే శ్రీకృష్ణుని మించినవాఁ డొక్కఁడును లేఁడు'

ఇదిమనుష్యత్వవాదము తరువాత నే దేవత్వవాదము.

'ఈయచ్యుతుఁడు కేవలమును మన కర్చనీయుఁడు. ఇట్టివాఁడు లేఁడు. ఈమ హాత్ముఁడు త్రిలోకపూజ్యుఁడు. ఈతఁడు రణరంగమున ననంతక్షత్రియవీరగణం బులను బరాజితులం గావించెను. మఱియు నీయఖండబ్రహ్మాండమీతనియందే ప్రతి ష్ఠితమై యున్నది'

మరల మనుష్యత్వవాదము :—

'శ్రీకృష్ణుఁడు పుట్టినది మొదలు గావించిన పనులు నన్నిటిని ప్రజలవలననే నెన్నియో సారులు వినియుంటిని. ఈతఁడు కేవలము బాలుఁడై యున్నను మనమీతని బరీక్షించి యుంటిమి. కృష్ణుని శౌర్యవీర్యకీర్తివిజయములు సమస్తమును సుప్రసిద్ధములై యున్నవి'

పిమ్మట నప్పుడే దేవత్వవాదము:—

'అట్టిభూతసుఖావహుడును జగదర్చితుఁడును నగు నచ్యుతుని బూజింపవలయునని చెప్పితిని'

మరల మనుష్యత్వారోపము:—

'కృష్ణుని బూజించుటకు రెండు కారణము లున్నవి. అతఁడు నిఖిలవేదవేదాంగపారదర్శి; సమధికబలశాలి; మానవలోకమునం దంతటిబలవంతుఁడును వేదవేదాంగసంపన్నుఁడును మఱియొకఁ డగపడుట లేదు. దానము, సామర్థ్యము, శ్రుతము, శౌర్యము, కీర్తి, బుద్ధి, వినయము విపులశ్రీసమృద్ధి ధైర్యము సంతోషము మొదలగు సద్గుణము లన్నియు శ్రీకృష్ణునియందు నియతములై విరాజిల్లుచున్నవి. కావున నట్టిసర్వగుణసంపన్నుండును నాచార్యపితృగురుస్వరూపుండును, బూజార్హుండును నగు కృష్ణుని యెడల వినయప్రదర్శనము గావించుట మీ కెల్ల విధములఁ గర్తవ్యమై యున్నది. అతఁడు ఋత్విజుడు; గురుడు; సంబంధి; స్నాతకుఁడు; రాజు; మఱియు ప్రియపాత్రుడు కూడనై యుండెను. ఇక్కారణము చేతనే యచ్యుతుఁ డర్చింపఁబడియెను.

మరల దేవత్వవాదము:—

'కృష్ణుఁడే యీచరాచరప్రపంచమునకు సృష్టిస్థితిలయకారణుఁడు! అతఁడవ్యక్తప్రకృతి; సనాతనుఁడు; కర్త; సర్వభూతేశ్వరుఁడు; కేవలము బూజనీయుఁడు. ఇందుల కింకను సందేహమా? బుద్ధి, మనసు మహత్తు, పృథివ్యాది పంచభూతములును శ్రీకృష్ణునియందే యేకమాత్రప్రతిష్ఠితములై యున్నవి. చంద్రసూర్యగ్రహనక్షత్రదిగ్విదిక్సమూహమంతయుఁ గేవలమీతనియందె యున్నది. ఇట్లే'

కృష్ణు నర్చించుటకు భీష్ముఁడు రెండు కారణములను జెప్పెను. అందు మొదటిది బలవంతులలో సర్వశ్రేష్ఠుఁ డగుట—రెండవది యాతనితోఁ దుల్యు లగు వేదవేదాంగపారగులు లేకుండుట—ఆతఁ డద్వితీయపరాక్రముఁ డనుట కనేకప్రమాణములు చూపఁబడినవి. కృష్ణు

డద్వితీయ వేదజ్ఞుఁ డనుటకుఁ బ్రమాణము భగవద్గీత. మనము పారము సేయుచుండు భగవద్గీత కృష్ణప్రణీతము కాదు. అది వ్యాసప్రణీతమనియే ప్రసిద్ధి, 'వైయాసికసంహిత' యని దానిపేరు. దీనిని రచియించినవాఁడు వ్యాసుఁడైనను మఱియొకఁడైనను నాతఁడు శ్రీకృష్ణునినోటినుండి వెలువడిన మాటలనే సేకరించుకొని యీగ్రంథసంకలనముగావించియుండలేదు. ఇది మూలమహాభారతమునందలి యొక భాగముగా మాకుఁ దోఁచుట లేదు, కాని గీత శ్రీకృష్ణునిమతోద్దేశముల సంకలనమాత్రమే యని మానమ్మకము. కృష్ణమతావలంబి యగునెవ్వఁడో యొకవిద్వాంసుఁడు దీని నీరూపమున సంకలితముం గావించె ననియు నిది మహాభారతమునఁ బ్రక్షిప్తమై ప్రచారమునకు వచ్చియుండు ననియుఁ దోఁచుచున్నది. ఇప్పుడు చెప్పవలసిన దేమనిన:—ఈగీతోక్తధర్మమును రచియించినవాఁ డద్వితీయ వేదవిదుఁడగు పండితుఁడై యుండవలయును. ధర్మసంబంధమున నాతఁడు వేదమును సర్వోన్నతస్థానమునం దుంచలేదు—అప్పుడప్పుడు వేదమునుగూడ నించుక నిందించియే యుండెను. అట్లయినను నద్వితీయ వేదజ్ఞుఁడు కాక మఱియొకనికీగీతోక్తధర్మమును రచించుట సాధ్యము కాదు. ఈసంగతి గీతను వేదమునుగూడ నధ్యయనము గావించినచో సులభముగా బోధపడఁగలదు.

ఈవిధముగాఁ బరాక్రమము, పాండిత్యము వీర్యము, శిక్ష, కర్మము, జ్ఞానము, నీతి, ధర్మము, దయ, క్షమ మొదలగువానియందు సమానముగ సర్వశ్రేష్ఠుఁడగు నాతఁ డొక్కఁడే యాదర్శపురుషుఁడు కాఁగలఁడు.

---

## దశమ పరిచ్ఛేదము

### శిశుపాలవధ

భీష్ముఁడు తనయుపన్యాసమును ముగించి శిశుపాలు నతితీవ్రముగఁ బరాభవించి "శ్రీకృష్ణునిఁ బూజించుట శిశుపాలున కసహ్యముగాఁ దోఁచెనేని అతఁడు తన యిచ్ఛవచ్చినట్లు చేసికొనవచ్చును" అనియెను. అనఁగా నిష్టము లేకున్నచో లేచిపోవచ్చునని భావము.

"కృష్ణుఁ డటు పూజింపఁబడుటం గాంచి యప్పుడు మహాపరాక్రముఁడగు సునీథుఁ డను నొకవీరపురుషుఁడు క్రోధకంపితాంగుఁడై యారక్తనేత్రుఁడై సకలరాజలోకమును సంబోధించి "నేనిదిగొ సేనాధిపతి నైయుంటిని యాదవపాండవకులంబుల నన్మూలించుటకై యిప్పుడే సమరసాగరమున నవగాహనము సేయవలయును" అనియెను. చేదిపతి యగు శిశుపాలుఁడు మహీపతులయుత్సాహసందర్శనమున నుత్సాహియై యజ్ఞమున కంతరాయముం గూర్చుట కాలోచింపఁ దొడంగెను; యుధిష్ఠిరాభిషేకమును, కృష్ణపూజయుఁ గాకుండుటకై మన మెల్లవిధములఁ బ్రయత్నింపవలయు నని రాజమండలికి బోధించుచుండెను. రాజు లందఱును నిర్వేదయుక్తులై క్రోధపరవశులై యాలోచించుచుండుటం గాంచి వారు యుద్ధప్రయత్నము చేయుచున్నట్లు శ్రీకృష్ణుడు స్పష్టముగా గ్రహించెను.

మహారాజగు యుధిష్ఠిరుఁడు సాగరసదృశం బగు రాజమండలము రోషప్రచలితం బగుటంగాంచి ప్రాజ్ఞతముండును బితామహుండు నగు భీష్ము నుద్దేశించి "పితామహా! ఈ మహారాజసముద్రము సంక్షుభితం బగుచున్నది. ఇప్పు డవశ్యకర్తవ్య మేమియో నిర్దేశింపవలయును" అనియెను. శిశుపాలవధకు యథార్థకారణ మిదియే. అతని నిప్పుడు వధింపకున్నచో నాతఁ డా రాజులతోఁ గలసి యజ్ఞమునకు విఘ్నము కావింపక మానఁడు.

శిశుపాలుఁడు మరల భీష్ముని, కృష్ణుని ననేకవిధముల దూషింపఁ దొడంగెను. అతఁడు వారిని మిగుల నొవ్వనాడెను; దుర్భా

త్నుఁడు, గోపాలుఁడు దాసుఁడు నని యతిహీనముగఁ దిరస్కరించెను. పరమయోగి యగు శ్రీకృష్ణుఁ డీసారికూడ శాంతముతో నిశ్శబ్దముగా నుండెను. కృష్ణుఁడు బలములోన నెట్టియాదర్శమూర్తియో శాంతము నకుఁ గూడ నట్టియాదర్శమూర్తియే. భీష్ముఁడు మొదట నేమియునన లేదు. కాని భీముఁ డత్యంతక్రోధపరవశుఁడై శిశుపాలు నాక్రమింప నుద్యోగించెను. అప్పుడు భీష్ముఁ డాతని వారించి శిశుపాలునిపూర్వ వృత్తాంతము నాతనికిఁ దెలియఁ జేసెను. ఈవృత్తాంతము కేవల మసంభవమును, నస్వాభావమును, నవిశ్వసనీయము నైయున్నది. ఆకథ యీ క్రిందివిధముగా నున్నది.

శిశుపాలుఁడు పుట్టినప్పు డాతనికి మూఁడు కన్నులును, నాలుగుచేతులు నుండుటే కాక యాతఁడు గాడిదవలె రోదనము చేయఁ దొడంగెను. ఇట్టి దుర్లక్షణములుగల పుత్రుని బరిత్యజించుటే శ్రేయం బని యాతని తల్లిదండ్రులు తలంచిరి. ఆసమయమున నాకాశవాణి వారిని వారించెను. పుక్కిటిపురాణములు చెప్పువారి కాకాశవాణి లేకుండ నేకథయును నడవదు. "ఈబిడ్డ మంచివాఁడే. ఈతని త్యజింపవలదు. బాగుగఁ బ్రతిపాలింపుఁడు; యముఁడైన నీతని నేమియును జేయఁజాలఁడు; కాని యీతని వధించువాఁడిదివఱకేపుట్టియున్నాఁడు" అని దైవవాణి చెప్పెను. అతనిపేరు చెప్పవలయునని తలిదండ్రులు ప్రశ్నించిరి. అప్పు డాకాశవాణి కృష్ణునిపేరు చెప్పివైచినచోఁ గథ ముగిసియే యుండును. కాని యట్లు చెప్పినచోఁ గథాసంవిధానమున మనోజ్ఞత యేమున్నది? అందుచే నప్పుడాకాశవాణి "ఈబిడ్డ నెవ్వని యొడిలో నుంచినప్పు డీతని యెక్కువ కన్నును, మిక్కిలి చేతులును మాయమగునో యాతఁడే యీతనికి మారకుఁడు" అని చెప్పెను.

శిశుపాలునితండ్రి యగపడినవారి కెల్లఁ దనబిడ్డ నందించుచుండెను. ఎవ్వరి యొడిలోనను బిల్లవాని వికృతాకారము మారలేదు,

కృష్ణశిశుపాలురు సమవయస్కులని తోచుచున్నది. ఏమనిన నిరువురు నొక్కసమయముననే రుక్మిణిని బెండ్లియాడుటకు బ్రయత్నించిరి. ఆకాశవాణియును "పుట్టియున్నాడు" అని చెప్పెను. దీనినిబట్టి కూడ నట్లే బోధయగుచున్నది. కాని యట్టిస్థితిలో గూడ శ్రీకృష్ణుడు ద్వారకనుండి చేదిదేశమునకు బోయి శిశుపాలు నెత్తుకొనియెను. తోడనే శిశుపాలునియాకృతి మారిపోయెను.

శిశుపాలునితల్లి కృష్ణునకు మేనత్త. ఆమె శ్రీకృష్ణుని బలవంతముగ నిరోధించి "అబ్బాయీ! నీవు నాయీబిడ్డను జంపవలదు" అనికోరెను. ఆమాటకు గృష్ణు డంగీకరించి శిశుపాలుని శతాపరాధములను క్షమించెదనని బాసచేసెను.

అనైసర్గికవిషయమును మేము విశ్వసింపజాలము. పాఠకులు కూడ నట్లే యుందురని నే ననుకొందును. ఏ యితిహాసమునందైన నస్వాభావిక మగపడినప్పుడు దానిని లేఖకులో తరువాతి కవులో చేర్చియుందురని యందఱకును దోచక మానదు. క్షమాగుణమాహాత్మ్యమును శ్రీకృష్ణ మహిమయు బాగుగ నెఱుంగని కవి యెవ్వడో కృష్ణునియద్భుత క్షమాశీలము నెఱుగక శిశుపాలునియెడ నాతడు చూపిన క్షమాప్రభావమును తరువాతివారికి స్పష్టముగ బ్రదర్శించుటకై యిట్టి యద్భుతకల్పనమును జేసియుండును. అసురవధార్థమై యవతరించిన శ్రీకృష్ణు డట్టి యసురుల యపరాధములనే క్షమించెననుట సుసంగతముగా లేదు. కృష్ణు డసురవధార్థమే యవతరించెనని తలచినచో నీక్షమాగుణమునకు విశేషములేదు. కాని యాతం డాదర్శపురుషుండని భావించినచో, మనుష్యత్వాదర్శనమును వికసింపజేయుటకే యవతరించెనని తలంచినచో నాతని సకలకార్యములును విస్పష్టముగ గ్రహణీయము లగుచున్నవి. శ్రీకృష్ణచరిత్ర మను రత్నభాండారమును దెఱచుటకు దాళ మాదర్శపురుషతత్త్వమే—

శిశుపాలుని కటూక్తులను శ్రీకృష్ణుఁడు చాలవఱకును సహించుటచేతనే యాతనిక్షమాగుణ మతితరముగఁ బ్రశంసనీయ మగుచుండుటలేదు. శిశుపాలుఁ డిదివఱకు శ్రీకృష్ణున కనేకాపకారములను గావించియుండెను. కృష్ణుఁడు ప్రాగ్జ్యోతిషపురమునకుఁ బోయియున్నప్పుడు శిశుపాలుఁడు ద్వారకానగరము దగ్ధముగఁ జేసి పాఱిపోయెను. ఒకప్పుడు కృష్ణుఁడు రైవతకోద్యానవిహారమునకుఁ బోయియున్నప్పుడు వచ్చి యాదవులను జాలమందిని జంపి కొందఱిని బంధించెను. మఱియును వసుదేవుని యశ్వమేధతురంగము నపహరించెను. ఇవి యన్నియును నప్పటిక్షత్రియులలో మహాపరాధములుగాఁ బరిగణితములైన పనులు! ఇట్టి శిశుపాలుని దుష్కార్యముల నన్నిటినిఁ గూడ శ్రీకృష్ణుఁడు క్షమించెను. అతఁడు కేవలమును శిశుపాలుని దురాచరణమును మాత్రమే క్షమించియుండలేదు. జరాసంధుఁడుకూడ నాతని ననేకవిధములఁ బీడించియుండెను. సశక్తిచేఁ గాని పరమశక్తిచేఁ గాని శ్రీకృష్ణుఁడు జరాసంధుని మద మడఁచుటకు సమర్థుఁడే. అయినను జరాసంధుఁడు రాజమండలమును బంధించి పశుపతికిఁ బలికాదానముం గావించుటకు సంసిద్ధుఁడు గానంతవఱకు శ్రీకృష్ణుఁ డాతనియెడల నట్టి వైరాచరణమును గావించియుండలేదు. అంతియ కాక యుద్ధము చేయుటచేఁ బ్రజాక్షయ మగునని శంకించి తానే యించుక తప్పించుకొని రైవతకాద్రియం దొక దుర్గమును నిర్మించుకొని యందుండెను. ఇట్లే శ్రీకృష్ణుఁడు తన యందే శాత్రవము చూపుచున్నంతవఱకు శిశుపాలున కెట్టియనిష్టమును గలిగింపలేదు. ఆతఁ డిప్పుడు పాండవయజ్ఞమునకు విఘ్నముచేసి ధర్మరాజ్యస్థాపనమున కభ్యంతరముం గూర్చు[illegible]చేఁ గృష్ణుఁ డాతని వధించెను. ఆదర్శపురుషునిక్షమ క్షమాపరత్వ[illegible] కాదర్శము—కావున నాతని కెవ్వ రనిష్టముం గూర్చినను [illegible]ది పాండవుల నట్టి వైరసాధనమును గావింపఁడు. కాని యాదర్శ

పురుషుఁడు దండప్రణేత[illegible] సామర్థ్యముఁ [illegible]గుటచే సమాజమున కనిష్టముం గూర్చువారి నాతఁడు దండించుచుండును.

కృష్ణుని క్షమాగుణమునుగూర్చి ప్రశంసింపవలసినప్పు డాతఁడు కర్ణదుర్యోధనాదుల కౌశలముఁ జూపిన క్షమాభావమునుగూర్చి చెప్పక వీలులేదు. ఆయుద్యోగపర్వకథ యిప్పుడు చెప్పదగినది కాదు—కర్ణదుర్యోధను లప్పు డాతని నేయవస్థలో బంధింపఁ బ్రయత్నించిరో, యాయవస్థలో నెవ్వారి నెవ్వారు బంధింపఁ జూచినను యేసుక్రీస్తుతప్ప మఱియెవ్వఁడును శత్రువుల క్షమింపఁజాలఁడు. కృష్ణుఁడు వారిని క్షమించెను. మఱియు బంధుభావమునఁ గర్ణునితోఁ గథోపకథనముం గావించెను; మహాభారతయుద్ధమున వారికి విరుద్ధముగ నెన్నఁడును శస్త్రధారణముం గావింపలేదు.

అప్పుడు భీష్మశిశుపాలుర కొకింతవాదము జరిగినది. శ్రీకృష్ణుఁడిప్పుడు నీ తేజమును హరించునని భీష్ముఁడు శిశుపాలుని ధిక్కరించెను. శిశుపాలుఁడు క్రోధముచే మండిపడుచు భీష్ము ననేకవిధముల దూషించుచుఁ దుద్దతుదకు "నీజీవిత మీభూపాలమండలాధీనమై యున్నది. వీరు తలంచినచో నిమిషములో నిన్ను సంహరింపగలరు!' అనియెను. భీష్ముఁడప్పటి క్షత్రియవీరులలో నెల్ల శ్రేష్ఠయోధుఁడు. అప్పుడు భీష్ముఁడు కోపముతో "నేను వీరిని తృణసమానులుగఁగూడ బరిగణించుటలేదు" అనియెను. ఆమాట విని యచ్చటి మహారాజులందఱును గర్జించుచు [illegible] "ఈభీష్ము[illegible] పశువుంబోలి వధింపవలయును; [illegible] ప్రజ్వలితా[illegible] [illegible]గావింపవలయును" అని విజృంభింపఁ దొడంగిరి. అప్పుడు భీష్ముఁడు "ఏమి చేసెదరో చేయుఁడు. నే [illegible] [illegible] [illegible] గా[illegible]చెదను." అని యుత్తరమిచ్చెను. పరాక్రమమునఁగాని [illegible] వృద్ధుఁడగు భీష్ముఁడు సామాన్యుఁడు కాఁడు. అప్పు డాతఁడు రాజు లంద

ఱిం గాంచి వారి సంశయము సులభముగఁ దీఱుటకై యొకయుపాయముం జూపించెను. ఆతఁడు వారినుద్దేశించి "మంచిది. కృష్ణుని బూజించితి మని మీరు గోలపెట్టుచున్నారు. ఆతని శ్రేష్ఠత్వమును మీరు విశ్వసించుటలేదు. ఈయల్లరివలన నేమిలాభము? ఆతఁడు మీయెదుటనే యున్నాఁడు. ఒకసారి పరీక్షింపఁగూడదా? చావవలయునని తొందర కలవా రొక్కసారి కృష్ణుని యుద్ధమున కాహ్వానించి చూడఁగూడదా!" అని యుద్బోధించెను.

ఆమాట విని శిశుపాలుఁ డూరకుండఁగలఁడా? తోడనే యాతఁడు కృష్ణునింగాంచి "రమ్ము! యుద్ధమునకు రమ్ము!" అని పిలిచెను.

శ్రీకృష్ణుఁ డిప్పటికి మాటలాడెను. శిశుపాలునితోఁ గాదు. క్షత్రియుఁడైన కృష్ణుఁ డిప్పుడు యుద్ధమున కాహూతుఁ డయ్యెను. ఇక యుద్ధవిముఖుఁడగుట కవకాశము లేదు. మఱియు ధర్మానుసారముగా యుద్ధమునకుఁ బ్రయోజనము కూడ నున్నది. అప్పుడు శ్రీకృష్ణుఁడు సభాసదులగు రాజుల నందఱను సంబోధించి శిశుపాలుఁడు తనకుఁ గావించిన యపకారములనన్నిటిని నొక్కొక్కటిగా వెల్లడించి "ఇంత కాలమువఱకు నే నీతని క్షమించితిని. ఇఁక క్షమింపఁజాలను" అని చెప్పెను.

ఈకృష్ణుని యిప్పటి సంభాషణములో నాతఁడు తన మేనత్త ప్రార్థనము ననుసరించియే శిశుపాలుని సర్వాపరాధములును క్షమించి నట్లు చెప్పియున్నాఁడు. ఇదివఱకుఁ జెప్పినట్లుగా నీసంగతి కూడ నేల ప్రక్షిప్తము కాఁగూడదు?" అని పాఠకులు ప్రశ్నింపవచ్చును. దీని కుత్తర మేమనిన— ఇదియును బ్రక్షిప్తమైనను గావచ్చును. కాని ప్రక్షిప్తమని యోచించుటవలన నెట్టి ప్రయోజనము నగపడుటలేదు. ఇం దస్వభావవిషయ మేదియును లేదు. ఇంతేకాక యిది కేవలమును స్వభావసిద్ధముగానున్నది. తనకుమారుఁడు దుర్మార్గుఁడు; కృష్ణద్వేషి;

కృష్ణుఁడో మిగుల బలవంతుఁడు. తలఁచుకొన్నచో శిశుపాలు నవలీలగఁ జంపివైవఁగలఁడు. ఇట్టి స్థితిలో మేనత్త తన సోదరసూనుఁడగు శ్రీకృష్ణునింగూర్చి యీవిధముగా వేఁడుకొనె ననుటలో నస్వభావమేమియును లేదు. క్షమాశీలుఁడగు శ్రీకృష్ణుఁడు స్వయముగనే శిశుపాలుని క్షమించినను, మేనత్త ప్రార్థనము కూడ మనసునం దుంచుకొని యుండును. ఇదియును స్వభావమే—మఱియు మేనత్త కుమారుని వధించుట కేవలమును నిందనీయమగు కార్యము. కృష్ణుఁడు తన మేనత్త మొగమునైనను జూచినాఁడు కాఁడని లోకు లనుకొందురు. వారి కాతఁడు ప్రత్యుత్తర మీయవలసియుండెను. కావుననే కృష్ణుఁ డప్పుడిట్లు చెప్పుట యెంతయు సుసంగతమై యున్నది.

దీనితరువాతనే మరల నొక యస్వభావసంఘటన మగపడుచున్నది. శ్రీకృష్ణుఁడు శిశుపాల సంహారమునకై తన చక్రాయుధమును స్మరించెను. స్మరించినంతనే చక్ర మాతని హస్తము నలంకరించెను. అప్పుడు శ్రీకృష్ణుఁ డాచక్రప్రయోగమున శిశుపాలుని శిరంబును ఖండించివైచెను.

ఈ యస్వాభావిక వ్యాపారము చరిత్రాంశమే యని యేపాఠకుఁడును నంగీకరింపఁజాలఁడని మే మనుకొనియెదము. ఈశ్వరావతారుఁడగు శ్రీకృష్ణుఁ డేమి చేసినను సంభవమే యని యెవ్వరైన భావింతురుగాక. చక్రమే శిశుపాలుని వధింపఁగలిగియున్నప్పుడు శ్రీకృష్ణుని మానవశరీరధారణముతోఁ బ్రయోజన మేమున్నది? చైతన్యవిశిష్టమగు జీవముం బోలి శ్రీకృష్ణుని యాజ్ఞానుసారముగాఁ జక్రము వచ్చుచుఁ బోవుచున్నట్లు కానఁబడుచున్నది. అట్లయినచో వైకుంఠమునం దేయుండి విష్ణుఁడు దానిని శిశుపాలవధార్థమై యేల పంపఁగూడదు? ఇట్టి కార్యములను నిర్వహించుటకై యాతఁడు మానవావతారము నెత్తుటవలన నేమిప్రయోజనమున్నది? ఈశ్వరుఁడు తన నైసర్గిక

నియమముచే గాని కేవలేచ్ఛామాత్రముచే గాని యొక మానవుని జంపఁజాలకయేనా యిట్లు మానవుఁడై యవతరించుట? అట్లవతరించియు నాతఁడు తపస్వియోగశక్తిచే నొక మానవుని నిర్జింపఁ జాలనంతటి హీనబలుఁ డగుటయేల? ఈశ్వరశక్తిమూలమైన దైవశాస్త్రములను స్మరించి యేల తీసికొని రావలయును? ఈశ్వరుఁడే యింతటి యల్పశక్తుఁడైనచో మానవునకు నాతనికి భేదమేమున్నది?—శ్రీకృష్ణుని యీశ్వరత్వమునందు మాకును సందేహము లేదు. కాని మేమును నందాతని మానవశక్తినిగూర్చియే గాని, యీశ్వరశక్తిని గూర్చిన యాలోచన లేదు. ఆతఁడు మానవోచితశక్తిబలముననే సర్వకార్యనిర్వహణము గావించెనని మా యభిప్రాయము. ఈ యస్వాభావికమగు చక్రస్మరణవృత్తాంతము కేవలము ప్రక్షిప్తము. శ్రీకృష్ణుఁడు మానవోచితయుద్ధమునందే శిశుపాలుని వధించినట్లు మహాభారతమునం దింకొక చోట నగపడుచున్నది. ఉద్యోగపర్వమునందు ధృతరాష్ట్రుఁడు శిశుపాలవధేతిహాసము నిట్లు చెప్పెను—

"పూర్వము రాజసూయయాగసమయమునఁ జేదికరూశాది దేశాధీశ్వరులగు మహారాజులు సముదితులరేగినవారై యసంఖ్య వీరపురుషులతోఁ గలసి యొక్క చోఁ గూడియుండిరి. వారిలోఁ జేదిరాజతనయుం డగు శిశుపాలుఁడు సూర్యునివలెఁ బ్రతాపశాలియు ధనుర్ధరశ్రేష్ఠుఁడును సంగ్రామమునం దజేయుఁడునై యుండెను. భగవానుఁ డగు కృష్ణుఁడు నిమిషములో నాతని బరాజితునిం గావించి క్షత్రియవీరు లందఱికి నుత్సాహభంగమును గావించెను. మఱియు శిశుపాలుని సన్మానించుచు నాతనిపక్షమును వహించియున్న కరూశనాథుఁడు మొదలగు రాజులందఱును సింహపరాక్రముండగు శ్రీకృష్ణుని రథారూఢునిం గాంచి, చేదిపతిని బరిత్యజించి క్షుద్రమృగములవలెఁ బలాయితులై పోయిరి. అప్పుడు కృష్ణుఁ డవలీలగా శిశుపాలసంహారంబుచేసి పాండవయశోగౌరవములను వర్ధిల్లఁజేసెను."

ఇం దెచ్చుటను జక్రప్రశంసయే యగపడుట లేదు. శ్రీకృష్ణుఁడు రథారూఢుఁడై మానుషికంబగు సంగ్రామమున యుద్ధోచితముగఁ బ్రవర్తించి శిశుపాలుని జంపి యాతనియనుచరులఁ బరాభూతులం గావించిన ట్లగపడుచున్నది. ఒకగ్రంథమునందొక్క విషయమే రెండు విధముల వర్ణింపఁబడియున్నది. అందొకటి స్వభావముగను, మఱియొకటి అస్వభావముగను గానవచ్చుచున్నప్పు డస్వభావమును ద్యజించి స్వాభావికవిషయమునే యైతిహాసికముగా గ్రహించుట న్యాయమైయున్నది. పురాణేతిహాసములయందలి సత్యాన్వేషణముం గావింపఁ గోరువారీసంగతిని జ్ఞప్తియం దుంచుకొనవలయును. అట్లు కాకున్నచోఁ బరిశ్రమ యంతయును విఫలమైపోవును.

శిశుపాలవధసందర్భమునను విమర్శింపబడిన నందలిసంఘటనములలో రాజసూయమహాసభయందు సకలక్షత్రియలోకంబు నెదుట శ్రీకృష్ణుసర్వశ్రేష్ఠత్వము స్వీకరింపఁబడెనను విషయమే స్థూలముగా నైతిహాసికతత్త్వమని మన మూహింపవలసి యున్నది. ఇందు శిశుపాలాదులగు కొందఱు క్షత్రియవీరులు క్రోధావిష్టులై యజ్ఞధ్వంసముం గావింప నుద్యోగించుటచే యుద్ధము తటస్థించెను. శ్రీకృష్ణుఁడు వారితో యుద్ధముచేసి వారినందఱను బరాజితుల గావించి శిశుపాలుని నిహతునిం గావించెను. తరువాత యజ్ఞము నిర్విఘ్నముగఁ బరిసమాప్తం బయ్యెను.

శ్రీకృష్ణుఁడు కేవలమును యుద్ధము నంగీకరించు స్వభావము కలవాఁడు కాఁడు. అట్టిచో రణక్రియాదక్షులగు నర్జునాదిపాండవవీరు లుండఁగా యజ్ఞవిఘ్నకారులతోఁ దాను యుద్ధము చేయుట కేల పూనుకొనియెను? అతఁడు రాజసూయమునం దెట్టికార్యభారమును వహించి యుండెనో పాఠకులించుక జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నయెడల దీనికి సదుత్తరము బోధ కాఁగలదు. యజ్ఞరక్షణభారము కృష్ణునియం దుండె

నని యిదివఱకుఁ జెప్పియుంటిమి. అది యాతని కనుష్ఠేయకర్మమై యుండెను. అట్టివిధాయకకృత్యమును సాధించుటకే యాతఁడు యుద్ధమునకుఁ బూనుకొని శిశుపాలసంహారము గావించి యుండెను.

## ఏకాదశ పరిచ్ఛేదము

### పాండవ వనవాసము

రాజసూయము ముగిసినతోడనే కృష్ణుఁడు ద్వారకానగరమునకు వెడలిపోయెను. సభాపర్వమునం దిక నాతఁ డగపడుటలేదు. కాని యొక్కచోటమాత్ర మాతనిపేరు ప్రశంసితమై యుండెను.

ద్యూతక్రీడయందు యుధిష్ఠిరుఁడు ద్రౌపది నోడిపోయెను. తరువాత ద్రౌపదీకేశాకర్షణమును సభామధ్యమున వస్త్రాపహరణమును జరిగెను. మహాభారతమునం దీభాగముంబోలిన కావ్యోత్కృష్టరచన ప్రపంచమునందలి యేసాహిత్యమునందును దుర్లభమై యున్నది. కాని మన మిప్పు డాలోచింపఁదగినది కావ్యవిషయము కాదు—ఇం దైతిహాసికవిశేష మేమయిననున్నదా లేదా యనుసంగతియే పరీక్షింపవలసి యున్నది. దుశ్శాసనుఁడు మహాజనభామధ్యమున ద్రౌపదీవస్త్రాపహరణమును గావింపఁ బ్రయత్నించునప్పుడు నిరుపాయయగుద్రౌపది తనమనంబున శ్రీకృష్ణునింగూర్చి ప్రార్థింపఁదొడఁగెను. ఆ భాగము నిచ్చటఁ జూపెదము:—

"గోవిందద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ"

ఈవిషయమునఁ జెప్పవలసిన దంతయు నిదివఱకే చెప్పియుంటిమి

తరువాత వనపర్వము. ఆ వనపర్వమున మూఁడుసారులుమాత్రము కృష్ణసాక్షాద్దర్శనము గానఁబడుచున్నది. పాండవులు వనం

బునకుఁ బోయి రని విని వృష్ణిభోజాదు లందఱును వారిని జూడవచ్చిరి. వారితోఁ గృష్ణుఁడుకూడ వచ్చియుండెను. వనపర్వమునందీరాకయే మొదటిసారి. కృష్ణుఁ డప్పు వచ్చియే యుండవచ్చును. కాని యీభాగమునందు వర్ణితమగువృత్తాంతముమాత్రము మహాభారతమున మొదటితరగతి రచనం బోలి యుండలేదు. రెండవతరగతి రచనవంటిదియును గాదు. చారిత్రకవిశేషముకూడ నింక దేమియును లేదు. కృష్ణుఁ డెచ్చటను క్రోధావిష్టుఁడైనట్లగపడుట లేదు. కాని యిప్పు డాతఁడు యుధిష్ఠిరుని యొద్దకు వచ్చి క్రోధోజ్జ్వలుఁడయిపోయెను. ఎట్టి కారణమునులేదు. అచ్చటికి కెట్టి శత్రువును వచ్చియుండలేదు. ఎవ్వరు నేమియు నష్టమైన నుండలేదు. కేవలము దుర్యోధనాదులను నాశనము చేయువలయుననియే యింతకోపము! కృష్ణుని యాకోపము యుధిష్ఠిరుఁ డెన్నియో విధములఁ బ్రస్తుతించినఁగాని తగ్గలేదు. మహాభారత యుద్ధమునం దస్త్రధారణము చేయనని కృష్ణుఁడు ప్రతిజ్ఞ చేసినట్లు వ్రాసినకవి యిట్లు వ్రాసియుండఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. తరువాతఁ గృష్ణుఁడు "నేనున్నచో నింతపని జరగునా ? నేనప్పు డింటియొద్ద లేను" అని చెప్పెను. అప్పుడు యుధిష్ఠిరుఁడు కృష్ణుఁ డెచ్చటికిఁ బోయెనో తెలిసికొనఁ గోరెను. దానిపై సాళ్వవధవృత్తాంతము వెలువడియెను. కృష్ణుఁడు సాళ్వునితో యుద్ధమునకుఁ బోవలసి వచ్చినట్లు చెప్పెను. ఇది యొక యద్భుతకధ—సౌభ యనునది సాళ్వుని రాజధాని—అది యాకాశమున కెగసి తిరుగుచుండును. సాళ్వుఁడు దానియందుండియే యుద్ధము చేయును. అట్టియవస్థయందే కృష్ణునితో యుద్ధము జరిగెను. ఆయుద్ధ సమయమునఁ గృష్ణునకుఁ జాలకష్టములు తటస్థించెను. సాళ్వుఁడు మాయావసుదేవుని గల్పించి కృష్ణుని యెట్టయెదుట వధించెను. అది చూచి శోకావేగముచేఁ గృష్ణుఁడు మూర్ఛితుఁ డయ్యెను. ఇది జగదీశ్వరప్రకృ

తియును గాదు; మఱియెట్టిమహత్ప్రకృతియును గాదు. అనుక్రమణికాధ్యాయమునందుఁగాని పర్వసంగ్రహాధ్యాయమునందుఁగాని యీ వృత్తాంతముంగూర్చిన యెట్టిప్రసంగమును లేదు. ఇట్టికథనుగురించి యేపాఠకుఁడును సమాలోచనము గావింపఁగోరఁడని మేము విశ్వసించుచున్నాము.

తరువాత రెండవసారి సశిష్యుఁడగు దుర్వాసునకు విందు చేయు సందర్భమునఁ గృష్ణదర్శనమైనది. అది కేవలము నస్వాభావముగ నున్నది. అనుక్రమణికాధ్యాయమునం దాకథ యున్నను దాని కెట్టి యైతిహాసికవిశేషమును లేదు. కావున నదియును మాకు విమర్శనీయము కాదు.

పిమ్మట మూఁడవసారి వనపర్వాంత్యభాగమున మార్కండేయసమస్యాపర్వాధ్యాయమున మరలఁ గృష్ణుఁడగపడుచున్నాఁడు. పాండవులు కామ్యకవనమునకు వచ్చియుండిరని విని కృష్ణుఁడు వారిని మరలఁ జూడవచ్చెను. ఈసారి యొక్కఁడును రాలేదు, తనచిన్నరాణి యగు సత్యభామతోఁగూడ వచ్చెను. ఈయధ్యాయమొక పెద్దగ్రంథ మని చెప్పినను జెప్పవచ్చును. కాని మహాభారతముతో సంబంధించిన కథ దానియం దేమియును లేదు. అది యంతయును బ్రక్షిప్తమనియే తోఁచుచున్నది. పర్వసంగ్రహాధ్యాయమునందు మార్కండేయసమస్యాపర్వాధ్యాయప్రశంస యున్నమాట నిజమే కాని యది యనుక్రమణికాధ్యాయమున లేదు. మహాభారతమునందలి యొకటిరెండు తరగతులరచనములలో దీని కెట్టిసాదృశ్యమును లేదు. కాని యిది మౌలికమహాభారతభాగ మగునో కాదో విమర్శింపుటకుఁ గూడ మాకెట్టిప్రయోజనము నగపడుటలేదు. ఏమనిన—కృష్ణుఁ డిందు చేసిన పని యేదియును లేదు. అతఁడు వచ్చి యుధిష్ఠిరుఁడు ద్రౌపది మొదలగువారికిఁ గొన్ని మంచిమాటలనుమాత్రము చెప్పెను. మఱియు

వారివలనఁ గొన్ని ప్రియవచనములను వినియెను. తరువాత వారును వీరునుఁ గలసి మార్కండేయుని కల్యాణకథల నన్నిటిని బాగుగ నాలకించిరి. ఆకథలు పూర్తియైన తరువాత సత్యాద్రౌపదుల కించుక సంభాషణము జరిగెను. పర్వసంగ్రహాధ్యాయమున ద్రౌపదీసత్యభామా సంవాదము పేర్కొనఁబడినది. కాని యీ క్రమణికాధ్యాయమునం దీప్రసంగమే లేదు. ఇది యెట్లు ప్రక్షిప్తమో యింతకు ముందే చెప్పియున్నాము.

తరువాత విరాటపర్వము వింటుపర్వమునఁ గృష్ణుఁ డగపడలేడు. అంత్యభాగమునమాత్ర ముత్తరావివాహసమయమున నాతఁడు వచ్చియుండెను. అప్పుఁ డాతఁడు చెప్పినకీనయము లన్నియు నుద్యోగపర్వమునం దున్నవి. ఉద్యోగపర్వమునందుఁ గృష్ణునిగూర్చి యనేకవిషయము లున్నవి. వానిని క్రమముగా నాలోచనముం గావించెదము.



శ్రీరామచంద్ర

# భాగవతకథాసారము

## ద్వితీయభాగము

## పంచమఖండము

సర్వభూతాత్మభూతాయ, భూతాదినిధనాయ చ
అక్రోధద్రోహమోహాయ తస్మై శాంతాత్మనే నమః

శాంతిపర్వము ౪౭ అధ్యాయము.

## ప్రథమపరిచ్ఛేదము

### మహాభారత యుద్ధోద్యోగము

ఇప్పు డుద్యోగపర్వవృత్తాంతముం గూర్చి యాలోచింపవలసి యున్నది.

సమాజమునం దపరాధు లుందురు. మానవు లెల్లప్పుడును బరస్పరము నపరాధములం గావించుచుందురు. అట్టియపరాధముల నడంచుటయే సమాజమునకుఁ బ్రధానకార్యము. రాజనీతి, రాజదండము, వ్యవస్థాశాస్త్రము, ధర్మశాస్త్రము, చట్టము, న్యాయస్థానము మొదలగువాని ముఖ్యోద్దేశ మంతయు నిదియే.

అపరాధివిషయమున నెట్లు వ్యవహరింపవలయునో యాసంగతిం గూర్చి నీతిశాస్త్రమున రెండుమతము లున్నవి. దండమూలమున ననఁగా శిక్షచేసి దోషము నడగించుట యొకమతము. అపరాధమును క్షమించుట రెండవమతము. శిక్ష, క్షమ యనునీరెంటికిని బరస్పర

విరోధ మున్నది. అందుచే నీరెండుమతములును సత్యములు కానే రవు. మఱియు నీరెంటిలో నేదియొక్కమతమునైనను గేవలమును బరిహరించుట కవకాశము లేదు. సకలాపరాధములనుగూడ క్షమించినచో సమాజ మొక్కసారిగా ధ్వంసమై పోవును. మఱియు సకలాపరాధులను శిక్షితులైనచో మానవులకుఁ బశుత్వము సంప్రాప్తించును. కావున శిక్షాక్షమల సామంజస్యమే నీతిశాస్త్రమునందలి యొకవిధమగు నతికఠినతత్త్వమని తోఁచుచున్నది. ఆధునికనుసభ్యులగు నైరోపియను లింతవఱకు నీసామంజస్యమును వెలువరింపఁజాలకయే యుండిరి. ఐరోపియనుల క్రీస్తుమతము సకలాపరాధములను క్షమింపవలయు నని బోధించుచున్నది. వారి రాజనీతి సకలాపరాధులను శిక్షింపవలయునని విధించుచున్నది. వారికి మతముకంటె రాజనీతియే ప్రధానమైనది. అందుచే యూరపుఖండమున క్షమాగుణము లుప్తప్రాయమైపోయినది; బలప్రయోగమే ప్రచండత్వముం గాంచినది.

బలక్షమాగుణంబుల యథార్థసామంజస్యమే యీయుద్యోగపర్వమునందలి ప్రధానతత్త్వము. శ్రీకృష్ణుఁడే యాతత్త్వమునకు మీమాంసకుఁడు—ఈయుద్యోగపర్వమునకుఁ బ్రధాననాయకుఁడుకూడ శ్రీకృష్ణుఁడే. బలక్షమాప్రయోగసంబంధముగ నాతఁడెట్టి యాదర్శకార్యములను గావించి యుండెనో మన మిదివఱకే చూచి యున్నాము. ఆతఁడు తనకుమాత్రమే యనిష్టముం గూర్చువారిని క్షమించెను; లోకమున కనిష్టముం గూర్చువారినిమాత్రము బలప్రయోగపూర్వకముగ దండించెను. కాని యీవిధానమునకు వ్యతిరేకముగఁ గూడఁ గొన్ని కార్యములు జరిగి ట్లనేకస్థలములయందుఁ గానవచ్చుచున్నది. కొన్నికార్యములయందు బలము నుపయోగింపవలయునో, క్షమ నుపయోగింపవలయునో తెలిసికొనుట దుస్సాధ్యముగా నున్నది-ఎవ్వరైన మనయాస్తి నపహరించి కొనిపోయి రని భావింతము

తనసంపత్తిని గాపాడుకొనుట సామాజికధర్మము. అందులనుగూడం దమతమ సంపద్రక్షణవిషయంబున విముఖులై యున్నచో నచిరకాలములోనే సమాజము విధ్వస్తమై పోవును. కావున నపహృతసంపత్తి నుద్ధరించుట విధాయకకృత్యముగాం దోంచుచున్నది. కాని యిట్టిదుస్థితి సంభవించి న్యాయస్థానసాహాయ్య మేమియు లభింపనప్పుడు బల ప్రయోగము గావించుట ధర్మసంగత మగునా? బలక్షమాసామంజస్య సంబంధమునం దిట్టితర్కవితర్కములు కలుగుచునే యుండును కార్య క్రమమునందుం దఱచుగా బలవంతుండు బలప్రయోగమునే గావించు చుండుటయు, దుర్బలుడు క్షమాభిముఖుండై మెలంగుటయుం గానం బడుచున్నది. కాని బలవంతుండును, క్షమావంతుండునుగూడ నగు వానికర్తవ్యమేమి ? ఈమీమాంస యుద్యోగపర్వారంభమునందే కృష్ణవాక్యములవలన మనము తెలిసికొనంగలము.

పాండవులు శకునితో జూదమాడి యోడిపోయి తమరాజ్య మును దుర్యోధనున కొసంగి తాము పండ్రెండేండ్లు వనవాసమును నొకయేం డజ్ఞాతవాసమును జేయుటకు బాధ్యులైనను గతి పాతకులకుం దెలిసియే యుండవచ్చును. ఒకవేళ నజ్ఞాతవాససమయభంగమైనచో వారికి మరల రాజ్యగ్రహణాధికారము లేకుండం బోవును; మరలం బండ్రెండువత్సరములు వనవాసము చేయవలసివచ్చును. అట్టిభంగము వాటిల్లకున్నచో దుర్యోధనుకడనుండి మరల వారికి రాజ్యము లభిం చును. ఇప్పుడు వారు ద్వాదశవర్షవనవాసమును బూర్తిగావించి విరా టనగరమధ్యమునం దొకయేం డజ్ఞాతవాసమును గూడం గావించిరి. ఆవత్సరమధ్యమునం దెవ్వరును వారిని గ్రహింపలేదు. అందుచే వారు దుర్యోధనునియొద్దనుండి తమరాజ్యమును గైకొనుటకు న్యాయము గను, ధర్మముగను నధికారులై యుండిరి. కాని దుర్యోధనుండు రాజ్య మును మరల వారి కొప్పగించునా ? ఒప్పగింపం డనియే యూహింప

వలయును. అట్టిస్థితిలో నేమి చేయవలయును? యుద్ధము చేసి వారిని వధించి రాజ్యమును బునరుద్ధరించుట కర్తవ్యము గాదా?

అజ్ఞాతవాసవత్సర మతీత మైనతోడనే పాండవులు విరాటునకుఁ దమపరిచయము నెఱింగించిరి విరాటుండును పాండవులం దెలిసికొని పరమానందభరితుండై తనతనయ యుత్తర నర్జునపుత్రుండగు నభిమన్యున కొసంగి వివాహము కావించెను. ఆవివాహమున కభిమన్యుని మేనమామ లగుకృష్ణబలరాములును, నితర యాదవులునుగూడ వచ్చియుండిరి మఱియుఁ బాండవుల మామయగు ద్రుపదుండును నితర బాంధవులునుగూడ వచ్చిరి. వారందఱును విరాటుని సభామందిరమున నాసీనులై యున్నప్పుడు పాండవరాజ్యపునరుద్ధరణమునుగూర్చి ప్రసంగమయ్యెను. అప్పుడు రాజులందఱును శ్రీకృష్ణుని వంక దృష్టిపాతముం గావించుచు మౌనము నవలంబించి యుండిరి. ఆసమయమున శ్రీకృష్ణుఁడు రాజులను సంబోధించి పూర్వావస్థలను, బూర్వసంఘటనములనుగూర్చి యథాక్రమమున నుగ్గడించి యనంతరమున "ఇప్పుడు కౌరవులకును, బాండవులకునుగూడ హితకరంబును, ధర్మ్యంబును, యశస్కరంబును, నుపయుక్తంబును నగుపద్ధతిని మీరందఱు నాలోచించి నిశ్చయింపవలయును" అని చెప్పెను.

రాజ్యపునరుద్ధరణమున కేమి చేయవలయునో యేప్రయత్నముం గావింపవలయునని శ్రీకృష్ణుఁ డప్పుడు చెప్పియుండలేదు. ఏమనిన—హితమునకును, ధర్మమునకును, యశంబునకును విరుద్ధమగు రాజ్యము నెవ్వరును వాంఛింపఁ దగదని యాతనియుద్దేశము. అందుచేతనే శ్రీకృష్ణుఁడు మరల నొకసారి "ధర్మరాజగు యుధిష్ఠిరుఁ డధర్మాగతం బగు సురసామ్రాజ్యమునైనను వాంఛింపఁబోఁడు; కాని ధర్మార్థసంగతంబగు నేకగ్రామాధిపత్యమైనను నధికతరంబుగ నభిలషించుచుండును." అని యుగ్గడించి యుండెను. ఆదర్శపురుషుఁడు

సన్యాసియై యుండుటవలన లాభము లేదనియు, నాతఁడు సంసారియై ప్రభువై యుండవలయు ననియు మే మింతకు ముందే చెప్పి యుంటిమి. అందు కితఁడే యాదర్శస్వరూపుఁడు. అధర్మాగతంబగు సురసామ్రాజ్య మైనను నేను కామింపఁబోను; కాని ధర్మానుసారముగ నేను దేని కధికారినో దానియందలి సూక్ష్మతమాంశము నైనను వంచకులకు విడువఁజాలను; అట్లు విడిచినచో విచారము నాకే కాదు; నా కందువలన విచారమే లేకుండ వచ్చును; కాని సమాజవిధ్వంసపథావలంబనరూపం బగుపాపము మాత్ర మందువలన నన్ను స్పృశింపక మానదు.

తరువాతఁ గృష్ణుఁడు కౌరవులలోభత్వమును, శఠత్వమును గూర్చియు, యుధిష్ఠిరునిధార్మికత్వముంగూర్చియునుగ్గడించి యీయిరువురికి ననుకూల సంబంధ మేర్పడుటకై బాగుగ నాలోచించి యొక మార్గమును నిశ్చయింపవలయు నని రాజమండలిని బ్రార్థించెను. దుర్యోధనుడు యుధిష్ఠిరున కర్ధరాజ్యమును న్యాయముగా నొసంగు నట్లు సంధి సేయంగల ధార్మికశ్రేష్ఠుఁడగు నొకదూత నాతనియొద్దకుఁ బంపుట యుచిత మనికూడ శ్రీకృష్ణుఁడు తనయభిప్రాయము నొక్కించుక వ్యక్తపఱిచెను. కృష్ణుని నిశ్చితాభిప్రాయము సంధియే కాని యుద్ధము కాదు, అర్ధరాజ్యప్రాప్తిమాత్రముననే సంతుష్టినంది సంధి చేసికొనవలయు నని యాతఁడు సూచించెను. ఏవిధముచేనైనను యుద్ధము తప్పనియెడలఁ దా నట్టియుద్ధమున నరశోణితమును బ్రవహించుటకై యెట్టియస్త్రము నుపయోగింపనని యాతఁడు శపథము కూడఁ జేసి యుండెను. దీనినిబట్టి చూడఁగా శ్రీకృష్ణుఁడు యుద్ధమునన నెంతవఱకు విముఖుఁడై యుండెనో బోధ యగుచున్నది.

కృష్ణుఁ డిట్లు చెప్పినతరువాత బలదేవుఁడుకూడ నాతనివాక్యముల నామోదించి జూద మాడినందుకు యుధిష్ఠిరు నించుక నిందించెను. మఱియు నాతఁడు తుట్టతుదకు "సంధిరూపమున సంపాదిత

మగునర్థమే సార్థకము. కాని సంగ్రామమూలమున నుపార్జితమగునర్థ మమాత్రము కేవలము నిరర్థక మైనది" అని తనయభిప్రాయమును దెలియఁజేసెను. బలదేవుఁడు సుగాపాయియైనను నాతని యీ వాక్యములు సువర్ణాక్షరములుగా లిఖించుకొని యూరిపుఖండమునఁ బ్రతి గృహమునందును నుంచుకొనఁ దగినవిగా నున్నవి. అట్లు గావించిన చో మానవజాతి కించుక శ్రేయోదాయకముగా నుండును.

బలదేవునియుపన్యాసము ముగిసినంతనే సాత్యకి లేచెను. (ఆకాలమునందుఁ గూడఁ "Parliamentary procedure" పార్లమెంటరీ ప్రొసీజ రున్నదని పాఠకులు తెలిసికొనవలయు.) అప్పుడు సాత్యకి ప్రతివాదమును గావించెను. ఆతఁడు స్వయముగా మహాబలవంతుఁ డగువీరపురుషుడు. శ్రీకృష్ణునకు శిష్యుఁడు; మఱియు మహాభారతరణంబునఁ బాండవపక్షవీరులలో నర్జునాభిమన్యులతరువాత నాతఁడే ప్రశంసింపఁదగినవాఁడు. కృష్ణుఁడు సంధిప్రస్తావముం గావించుటచే సాత్యకి యేమనుటకును సాహసింపజాలకపోయెను. కానియాతఁడు బలదేవుని వాక్యములను విని క్రుద్ధుఁడై యాతని ననేకవిధముల నిందించెను. బలదేవుఁడు యుధిష్ఠిరుని ద్యూతవిషయమున నిందించి నందుకు సాత్యకి యాక్షేపించుచుఁ 'బాండవులకు వారిపైతృకం బగురాజ్యభాగమును బ్రత్యర్పణంబు గావింపకున్నచోఁ గౌరవకులంబును సమూలముగ నిర్మూలము గావింపవలసినదే' అని తనదృఢాభిప్రాయమును బ్రకటించెను.

తరువాత వృద్ధుఁడగు ద్రుపదుం డుపన్యసించెను. ఆతఁడు సాత్యకిమతమునే యవలంబించెను. ద్రుపదుఁ డప్పుడు యుద్ధమునకుఁ బ్రయత్నింపవలయు ననియు, సైన్యమును జేర్పవలయుననియు, మిత్రరాజమండలికడకు దూతను బంపవలయు ననియుఁ బాండవులకు బోధించెను. అట్లే దుర్యోధనుని చెంతకును దూతను బంపవలయునని కూడ నాతఁడు తెలియఁజేసెను.

పర్యవసానమునఁ గృష్ణుఁడు పలుకుల నుపన్యసించెను. ద్రుపద మహారాజు వృద్ధుఁడును, విశేషించి పాండవులకుఁ బరమబంధుఁడు నగుటవలనఁ గృష్ణుఁ డాతనిమాటలకు వ్యతిరేకముగ నేమియును జెప్ప లేదు. కాని యుద్ధమే జరగినచో దేను నిర్లిప్తభావముతో నుండెద నని తనయుద్దేశమును వెల్లడించెను. కృష్ణుఁడు ద్రుపదుం గాంచిమఱి యును 'కురుపాండవు లిరుదెగలయందును మాకు దుల్యసంబంధ మున్నది. మే మెన్నఁడును మామర్యాదను లంఘించు యశిష్టవ్యవ హారముం గావి పంజాలము. మే మందఱము నీవివాహమునకు నిమం త్రితులమై వచ్చితిమి. నీవును నట్లే వచ్చితివి. ఇప్పుడు వివాహకా ర్యము శుభసంపన్న మైనది. పరమాహ్లాదముతో నీకు మన మంద ఱము నెవరియిండ్లకువారము పోవచ్చును.' అనియెను పెద్దవాఁడగు నాతనింగూర్చి యిట్లు తప్ప నింకేమనవలయును? తరువాత శ్రీకృ ష్ణుఁడు 'ఒకవేళ దుర్యోధనుఁడు సంధి కంగీకరింపనిచో ముందుగా నం దఱియొద్దకును దూతను బంపినతరువాతఁ గట్టకడపట మాకును నాహ్వా నముం బంపవచ్చును (అనఁగా నీయుద్ధమునందుఁ బ్రవేశించుట నాకెం తమాత్రము నిష్టము లేదు)' అని చెప్పి ద్వారకకు వెడలిపోయెను.

దీనినిబట్టి శ్రీకృష్ణుఁడు యుద్ధమునకుఁ గేవలమును వ్యతిరేకప క్షమువాఁడై యున్నట్లు కానవచ్చుచున్నది. మఱియు నాతఁడు కురు పాండవులయెడఁ బక్షపాతశూన్యుఁడై యుండెను. ఆయుభయపక్షము లయందును దనకుఁ దుల్యసంబంధమున్నట్లు స్వయముగాఁ జెప్పి యుం డెను. తరువాతిసంఘటనమునుబట్టి యీవాక్యములకుఁ బ్రబలప్రమా ణము కానవచ్చుచున్నది.

ఇరుదెగలయందును యుద్ధప్రయత్నములు జరుగుచుండెను. సేనలు సంగ్రహింపఁబడుచుండెను. రాజులకడకు దూతలు పంపఁబ డుచుండిరి. ఆయుద్ధమునందుఁ గృష్ణసాహాయ్యము నర్థించుటకై యర్జు

నుఁడు స్వయముగా ద్వారకానగరమునకుఁ బోయెను. దుర్యోధనుఁడుకూడ నట్లే చేసెను. ఆయిరువురు నొక్కదినముననే యొక్కసమయమునందే శ్రీకృష్ణునియొద్దకువచ్చిరి. అప్పుడుజరిగినవృత్తాంత మంతయును మహాభారతమునుండి యథారూపమున నిక్రిందఁ బొందుపఱచుచున్నాను:

'వాసుదేవుఁ డప్పుడు శయ్యపై నిదురించుచుండెను. మొట్టమొదట దుర్యోధనుఁ డాశయనమందిరమునఁ బ్రవేశించి కృష్ణుని తలవైపుననున్న యొకయుచ్చాసనముపైఁ గూర్చుండియుండెను. తరువాత నింద్రనందనుఁ డగునర్జునుఁడు వచ్చి వినయముతోఁ గృతాంజలియై యాదవేశ్వరునిపాదసమీపమున నాసీనుఁడై యుండెను. పిమ్మట శ్రీకృష్ణుఁడు మేల్కాంచి ముందుగా నర్జునుని దరువాత దుర్యోధనుని గాంచి కుశలప్రశ్నంబు చేసి సగౌరవంబుగ వారి యాగమనకారణంబు నడిగెను. అప్పుడు దుర్యోధనుఁడు హాసవికసితవదనముతో 'ఓ యాదవా! ఇప్పుడు జరుగనున్న యుద్ధమున నాకు నీసాహాయ్యము కావలయును. మే మిరువురము నీకు సమానబంధువులమును, మిత్రులము నైయున్నను నేనే ముందుగ వచ్చి నిన్ను దర్శించితిని. సాధుజనులు మొదట నాశ్రయించినవాని పక్షమునే యవలంబింతురు. నీవు సాధుశ్రేష్ఠుఁడవు; మాననీయుఁడవు కావున నీసదాచారమును బాలింపవలయును'' అనియెను అప్పుడు శ్రీకృష్ణుఁడు ''ఓకురువీరా! నీవు ముందుగనే నాయొద్దకు వచ్చితి వనుటకు నా కెట్టిసంశయమునులేదు. కాని నేనుమాత్రము మీకుంతీతనయునే మొట్టమొదట దిలకించితిని. అందుచే నేనిప్పుడు మీయిరువురికిని సాహాయ్యము చేయవలయును, కాని మొట్టమొదటఁ జిన్నవానికోరిక చెల్లింపవలయునను సుప్రసిద్ధాచార మున్నది. కావున నిప్పుడు కుంతీకుమారుఁడే ముందుగఁ గోరికొనుట యుచితము'' అని చెప్పి భగవాను

డగు యదునందనుఁడు ధనంజయునిం గాంచి "ఓ కౌంతేయా! ముందుగ నీవే కోరుకొనుము. నాతో సమానులగు నర్బుదసంఖ్యగల నారాయణగోపాలు రొకపక్షము—సమరవిముఖుఁడను, నిరస్త్రుఁడను నగు నే నొకపక్షము. వారు యుద్ధము చేయుదురు; నేను చేయను. ఇందు నీకెవ్వరు కావలయునో వారిని గోరుకొనుము" అని చెప్పెను. అప్పుడు ధనంజయుఁ డరాతిమర్దనుఁ డగు జనార్దనుఁడు యుద్ధమున సహాయము చేయఁడని విని యుండియు నాతనినే కోరుకొనియెను. దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని సమరవిముఖునిగా భావించి యానారాయణగోపాలంబును సంతోషపూర్వకంబుగఁ బడసి యానందించెను."

ఉద్యోగపర్వమునందలి యీ భాగమును విమర్శింపఁగా మనకీ క్రిందిసంగతులు తెలియవచ్చుచున్నవి.

మొదటిది:—ఎవ్వరికైనను ధర్మార్థసంగతంబగు తమ యధికారమును బరిత్యజించుట కర్తవ్యము కాకపోయినను, బలప్రయోగముకంటె క్షమావలంబనమే సర్వోత్కృష్ట కార్య మనియును, నట్టిచో బలము నుపయోగించుటకంటె నయ్యధికారమునం దర్ధభాగమును ద్యజించుటయే యుక్తమనియును శ్రీకృష్ణునియభిప్రాయము.

రెండవది:—కృష్ణుడు సర్వసముదర్శి, అతఁడు పాండవపక్షపాతి యనియుఁ గౌరవవిపక్షుఁడనియు సామాన్యాభిప్రాయ మున్నది. కాని పైసంగతినిబట్టి చూడఁగా నాతఁ డీరెండు పక్షములయెడలను సంపూర్ణముగాఁ బక్షపాతశూన్యుఁడని కానబడుచున్నది.

మూడవది:—అతఁడు స్వయముగ నద్వితీయవీరపురుషుఁ డయ్యును యుద్ధవిషయమున విశేషవిరక్తుఁడై యుండెను. మొట్ట మొదట నాతఁడు యుద్ధము తటస్థింపకుండు పద్ధతినే బోధించెను! తరువాత యుద్ధము తటస్థించి దానిని దప్పించుట యసంభవమైన [illegible] నెవ్వరిపక్షమునం దైనను నిరాయుధుఁడుగనే యుండవల

యునని శ్రీకృష్ణుఁడు శపథము చేసికొనియెను. ఇట్టి మహాత్వము మఱి యేక్షత్రియవీరుని యందైనను గానవచ్చుట లేదు. జితేంద్రియుఁ డగుభీష్మునియందుఁ గూడ నిట్టి గొప్పతనము లేదు.

తరువాతఁగూడ శ్రీకృష్ణుఁ డీయుద్ధము నెట్లయిన లేకుండఁజేయవలయు నని యెన్నియో ప్రయత్నములను జేసినట్లగపడుచున్నది. ఇందాశ్చర్యవిషయ మేమనిన:—సకల క్షత్రియవీరులందును శ్రీకృష్ణుఁ డొక్కఁడే సమరవిముఖుఁడై యుండెను. ఆతఁ డొక్కఁడేసర్వత్ర సమదర్శనుఁడై యుండెను. ఇట్టిస్థితిలో నాతఁడే యుద్ధమునకుఁ బ్రధానకారణుఁ డనియు ననుష్ఠాత యనియుఁ బాండవపక్షమునఁ బ్రధాన తాంత్రికుఁ డనియును లోకులు భావించుచున్నారు. అందుచేతనే యింతవిస్తరముగా శ్రీకృష్ణ చరిత్రమును విమర్శింపవలసివచ్చినది. తరువాత నర్జునుఁ డు నిరాయుధుఁడగు శ్రీకృష్ణునియుద్ధమునం దేకార్యమున నియోగింపవలయు నని యాలోచించి యాతని దనకు రథసారథిగా నుండవలయు నని ప్రార్థించెను. క్షత్రియవీరులగువారికి సారథ్యముచేయుట యనునది యతినీచకార్యము. కర్ణునకు సారథిగా నుండవలయునని శల్యుని బ్రార్థించి నప్పు డాతఁడు విశేషముగఁ గోపించి యున్నాఁడు' కాని యాదర్శపురుషుఁ డగువాఁ డెప్పుడు నహంకారశూన్యుఁడై యుండును. కావుననే శ్రీకృష్ణుఁ డర్జునునకు సారథిగా నుండుట కప్పుడే యంగీకరించెను. ఆతఁడు సర్వదోషశూన్యుఁడు ! సర్వగుణాన్వితుఁడు !

## ద్వితీయపరిచ్ఛేదము

### సంజయయానము.

ఉభయపక్షములవారును యుద్ధోద్యోగముం గావించుచుంటిరి. ఇట ద్రుపదాలోచనము ననుసరించి యుధిష్ఠిరుఁడు సంధిప్రస్తావము

గావించుటకై ద్రుపదపురోహితుని ధృతరాష్ట్రసభకుఁ బంపించెను. కాని యాపురోహితుఁడుమాత్రము కృతప్రయత్నుఁడు కాఁజాలక పోయెను. ఏమని...వాఁడిసూదిమొన మోపినంతటి నేలనైనను పాండవులకు మరల నిచ్చుటకు సుయోధనుఁడంగీకరింపలేదు. ఒకవంక భీమార్జునులును * శ్రీకృష్ణుఁడు ననిన ధృతరాష్ట్రుఁడు చాలభయపడు చుండెను. అందుచేతనే పాండవులు యుద్ధమునఁ బ్రవేశింపకుండు పద్ధతి నుపదేశించుటకై ధృతరాష్ట్రుఁడు తనయమాత్యుఁడగు సంజయుని పాండవులచెంతకుఁ బంపించెను. "మీరాజ్యమును మే మధర్మముగా నపహరించి కైకొంటిమి. కాని మీరుమాత్రము దానికొఱకు యుద్ధమునకుఁ గడంగవలదు. యుద్ధ మనునది కేవలము ననుచిత మగుకార్యము" అని యీవిధముగా నసంగతవాక్యముల నెంతటిసిగ్గులేనివాఁడైనను జెప్పుటకు సాహసింపఁగలఁడా? కాని దూతగాఁ బోయినవానికి సిగ్గేమున్నది? కావుననే సంజయుఁడు పాండవసభాస్థానమునకుఁ బోయి దీర్ఘోపన్యాసముం గావించెను. ఆయుపన్యాసమునందలిస్థూల

---

* ఈవిషయమున విపక్షులుకూడ శ్రీకృష్ణునిసర్వప్రధానత్వము నంగీకరించినట్లుగా నుద్యోగపర్వమునం దనేకప్రమాణము లున్నవి. ధృతరాష్ట్రుఁడు పాండవసహాయులం గూర్చి వేర్వేఱు గగ్గడించుచుఁ దుట్టతుదకు "వృష్ణిసింహుఁ డగు కృష్ణుఁ డెవ్వరిపక్షమున సహాయుఁడై యుండునో వారిప్రతాపమును సహించుట యెవ్వరికి సాధ్యమగును? అట్టికృష్ణుఁ డిప్పుడు పాండవులకు రక్షకుఁడై యుండెను ఎంతటివిజయాభిలాషి యగుశత్రువైనను యుద్ధమున సమానముగ నాతని నెదిరించి నిలువఁగలఁడా? (౨౧ అధ్యాయము) సంజయా! కృష్ణుఁడు పాండవులకొఱకుఁ బ్రకటించిన పరాక్రమముంగూర్చి వినియుంటిని. అతనిచర్యలను నిరంతరము స్మరించుకొనుటచే నా హృదయమునకు శాంతిలేదు. కృష్ణుఁ డర్జునునకు సారథిగా నుండుట కంగీకరించె ననివిని నా హృదయము కంపించిపోవుచున్నది." అని మఱియు నింకొకచోట నాతఁడే "కాని కేశవుఁ డధృష్యుఁడు; లోక[illegible]శ్వరుఁడు; మహాత్ముఁడు; కేవలము నాతఁడు సర్వలోకవరేణ్యుఁడు. ఏమా[illegible] నిలువఁబడఁగలఁడు" అని యీవిధముగా నెన్నియో

మర్మ మేమనిన:—"యుద్ధము చాల గురుతర మగు నధర్మకార్యము. మీరట్టి యధర్మకార్యమునఁ బ్రవృత్తులై యుండిరి. అందువలన మీర ధార్మికు లగుచున్నారు" యుధిష్ఠిరుఁడు దానికిఁ బ్రత్యుత్తరముగా ననేక వచనములను జెప్పి యుండెను. వానిలో మనకుఁ బ్రయోజనీయము లగుకొన్నిటి నీక్రిందఁ జూపుచున్నాము—

"ఓసంజయా! ఈపృథివియందు దేవతలకుఁ గూడ వాంఛనీయంబు లగుసమస్తసంపదలు నున్నవి. వానినిగాని, ప్రాజాపత్యమునుగాని, స్వర్గసుఖమును గాని, బ్రహ్మలోకమును గాని, మఱి దేనిని గాని యధర్మానుసారముగాఁ బడయుటకు నేను వాంఛించుట లేదు. ఎట్లయినను శ్రీకృష్ణుఁడు ధర్మప్రదాతయు, నీతిసంపన్నుఁడును, బ్రాహ్మణగణంబుల కుపాసకుఁడుఁ గూడ నైయున్నాఁడు. ఆతఁడు కౌరవపాండవకులంబులు రెంటికిని హితాకాంక్షియును, మహాబలపరాక్రాంతు లగు నసంఖ్యభూపతిగణంబులకు శాసనకర్తయు నైయుండెను. నేను సంధిపథమును బరిత్యజించినచో నిందనీయుండ నగుదునో, కాక యుద్ధమునుండి నివృత్తుఁడ నైనచో స్వధర్మభ్రష్టుఁడ నగుదునో యీవిషయముం గూర్చి యాకృష్ణుఁడే నిర్ణయింపవలయును. మహాప్రభావు లగు యదువృష్ణిభోజాంధకులును, కుకురసంజయవంశీయులునుగూడ వాసుదేవునిబుద్ధిప్రభావముచేతనే శత్రుదమనముం గావించి సుహృద్గణము నానందింపఁ జేయుచుందురు. మహేంద్రకల్పులగు నుగ్రసేనాది వీరు లందఱును, మహాబలపరాక్రములును, బుద్ధిమంతులును, సత్యపరాయణులు నగు యాదవు లందఱు నెప్పుడును గృష్ణోపదేశమునను సరించియే మెలంగుచుందురు. కృష్ణుఁడే రక్షకుండును గర్తయు నని నమ్మియుండుటచేతనే కాశిరాజగు బభ్రువుత్తమసంపత్తి లభించెను. గ్రీష్మావసానమున జంద్రమాలికలు ప్రజాపతికి జలప్రదానముం గావించినట్లే వాసుదేవుఁడు కాశీశ్వరునకు సర్వాభీష్టసిద్ధియును ధనప్రదాన

మును గావించెను. కర్మనిశ్చయజ్ఞుఁ డగు కేశవుఁ డిట్టిసద్గుణసంపన్నుఁడు. ఈసాధుసత్తముఁడు నాకెల్లవిధములఁ బ్రియుఁడు. మేమెన్నఁడు నీతనినుపదేశమునకు విరుద్ధముగఁ జరింపఁజాలము.'

అప్పుడు వాసుదేవుఁడు కూడ నిట్లనియెను 'సంజయా! నేను నిరంతరమును పాండవుల యవినాశనమును, సమృద్ధిని, మఱియు సపుత్రకుఁడగు ధృతరాష్ట్రుని యభ్యుదయమును వాంఛించుచుందును. కౌరవపాండవులు పరస్పరమును సంధిచేసికొని సుఖింపవలయుననియే నాకోరిక. నేను వీరి కింతకంటె బోధింపవలసిన దేదియును లేదు. ఇతరపాండవులును, మహారాజగు యుధిష్ఠిరుండును గూడ సంధినే కోరుచుండుటను నేను చాలసారులు వినియుంటిని. కాని మహారాజగుధృతరాష్ట్రుఁడును నాతనిపుత్రులునుగూడ నత్యంతము నర్థలుబ్ధులైయున్నారు. ఇట్టిస్థితిలో వారికిఁ బాండవులతో సంధి కుదుర్చుట కేవలము దుష్కరమైయున్నది. ఇందువలనఁ గ్రమక్రమముగా వివాదమే వర్ధిల్లు ననుటలో నాశ్చర్యమేమున్నది? సంజయా! ధర్మరాజగు యుధిష్ఠిరుఁడును, నేనును గూడ నెన్నిటికిని ధర్మమార్గమునుండి విచలితులము కాఁజాలము. ఈసంగతి నెఱింగియుండియు వినియుండియు నీవిప్పుడు స్వకర్మసాధనోద్యుక్తుఁడును నుత్సాహసంపన్నుఁడును, స్వజనపరిపాలకుఁడు నగుయుధిష్ఠిరు నధార్మికుండని యెట్లు నిర్దేశించెదవు?'

శ్రీకృష్ణుఁ డింతవఱకు నుపన్యసించి ధర్మమునకు వ్యాఖ్యానముం గావించుట కారంభించెను. ఈవాక్యములు కృష్ణచరిత్రమునందు మిగులఁ బ్రయోజనీయములు. ధర్మరాజ్యసంస్థాపనమును, ధర్మప్రచారమును శ్రీకృష్ణజీవితమునకు ముఖ్యకారణము లని మేము చెప్పియుంటిమి. ఆతని ధర్మరాజ్యసంస్థాపనముంగూర్చి మహాభారతమున సవిస్తరముగ వర్ణితమైయుండెను. కాని యాతఁడు ప్రచారము గావించినధర్మము భీష్మపర్వాంతర్గత మగు గీతాపర్వాధ్యాయమునం దేయున్నది. గీత

యందుఁ జెప్పఁబడినధర్మము గీతాకారమునఁ గృష్ణునిముఖమునుండియే వెలువడినట్లున్నది. కాని యీధర్మము కృష్ణప్రచారితమో కృష్ణప్రణీతమో నిశ్చయించుట కివకాశమేమున్నది? అదృష్టవశమున గీతాపర్యాధ్యాయమునందేగాక భారతమునందలి యితరభాగములయందుఁ గూడ శ్రీకృష్ణుని ధర్మోపదేశములు కానవచ్చుచున్నవి. బాగుగ విమర్శించినచో గీతయందలి యభినవధర్మమునకు మహాభారతమునందితరస్థలములయందు శ్రీకృష్ణుఁడు బోధించిన ధర్మమునకును సామ్యము కానఁబడుచున్నది. కావున నీధర్మము కృష్ణప్రణీతమును, ప్రచారితమునుగూడ నైయుండెనని మనము చెప్పవచ్చును. మహాభారతము నితిహాసముగా నంగీకరించినచో, మహాభారతకారుఁడందుఁ గావించిన ధర్మవ్యాఖ్యానము శ్రీకృష్ణునిపై నారోపించి యున్నట్లు తెలిసికొనఁ గలిగినచో, నది యెల్లయెడలను నేకప్రకృతిధర్మముగనే దోఁచుచున్నది. మఱియు నది ప్రచలితధర్మమునకు భిన్నప్రకృతిధర్మముగా నగపడుచున్నది. కావున నీధర్మము కృష్ణప్రచారితమే యని చెప్పవచ్చును. మఱియు గీతయందు సవిస్తరముగను, సంపూర్ణముగను బోధించిన ధర్మమునకు గృష్ణప్రచారితధర్మమునకును నైక్యము కానవచ్చుటవలన నీగీతోక్తధర్మము శ్రీకృష్ణప్రణీత మానికూడ నిశ్చితమగుచున్నది.

శ్రీకృష్ణుఁ డిప్పుడు సంజయునం గూర్చి చెప్పినమాటలను బరిశీలింపవలసి యున్నది —

"శుచియును గుటుంబపరిపాలకుఁడునై వేదాధ్యయనముం గావించుచు జీవితమును గడపవలయు నని శాస్త్రనిర్దిష్టవిధి యున్నను బ్రాహ్మణగణంబులలో ననేకవిధంబులగుమతంబు లుత్పన్నంబులై యున్నవి. కర్మవశంబుననే, మోక్షము లభించు నని కొందఱును, కర్మపరిత్యాగంబు గావించి కేవలమును వేదాధ్యయనంబు గావించుట

చేతనే మోక్షము కలుగు నని మఱికొందఱు నీవిధముగా భిన్నాభి ప్రాయములను గలిగి యుండిరి. కాని భోజనము చేయకుండఁ దృప్తి కలుగనట్లే కర్మానుష్టానము గావింపకుండఁ గేవలము వేదజ్ఞులై యున్నంత మాత్రమున బ్రాహ్మణులకు ముక్తిలాభము కలుగదు. ఏవిద్యమూలమునఁ గర్మసంసాధన మగునో యావిద్యయే ఫలదాయక మైనది. ఎట్టి కర్మానుష్ఠానవిధానమును లేనివిద్య కేవలమును నిష్ఫల మైనదియే—పిపాసార్థ యగువ్యక్తికి జలపానంబు గావించినంతనే పిపాసాశాంతి యగుచున్నది. అట్లే యుహాకాలంబున సకలకర్మంబుల కును ఫలము ప్రత్యక్షసిద్ధమై యున్నది. కావున నట్టికర్మానుష్ఠానముం గావించుట యవశ్యకర్తవ్యము. ఓసంజయా! కర్మమూలముననే యిట్టి విధి విహితమైయున్నది. కేవలమిాను గర్మమే సర్వప్రధాన మైనది. కర్మముకంటె నితరం బగు నేవిషయము నైనను నుత్కృష్టంబుగ భావించువాని సకలకర్మంబులును నిష్ఫలములై పోవును.

దేవతలు కర్మబలంబుననే ప్రభావసంపన్నులైరి. సమీరణుఁడు కర్మబలంబుననే సదాగతి యగుచున్నాఁడు. దివాకరుఁడు కర్మబలంబు ననే జాడ్యశూన్యుఁడై యహోరాత్రము లేకవిధముగఁ బరిభ్రమణంబు గావించుచున్నాఁడు. చంద్రుఁడు కర్మబలంబుననే నక్షత్ర మండల పరి వృతుఁడై యర్ధమాసపర్యంతము నభ్యుదితుం డగుచున్నాఁడు. హుతా శనుఁడుకర్మబలంబుననే ప్రజాగణంబులకుఁ గర్మసాధనంబు గావించుచు నవిచ్ఛిన్నముగ వేఁడిమిని గల్పించుచున్నాఁడు. పృథ్వి కర్మబలంబు ననే యతిదుర్భరభారమున నాయాసముగా వహించుచున్నది. స్రోత స్వినులన్నియును గర్మబలంబుననే ప్రాణులకుఁ దృప్తిం గల్పించుచు నుదకధారణముం గావించుచున్నవి. మహాబలశాలియగు దేవేంద్రుఁడు దేవతలలోఁ బ్రధానత్వముం గావించుటకై బ్రహ్మచర్యానుష్ఠానముం గావించెను. అతఁడు కర్మబలంబుననే దశదిశలును, నభోమండలమును

ప్రతిధ్వనించునట్లు వారివర్ణనముం గావించుచుండును. మఱియు నాతం డప్రమత్తచిత్తముతో భోగాభిలాషను విసర్జించి ప్రియవస్తు సముదాయమును బరిత్యజించి శ్రేష్ఠత్వలాభమును. సత్యధర్మదమ క్షమాదిగుణంబులఁ బ్రతిపాలించి దేవరాజ్యాధికారమును బడసి యుండెను. భగవానుఁ డగు బృహస్పతి సమాహితచిత్తుఁడై యింద్రుని ప్రార్థనముచే బ్రహ్మచర్యవ్రతానుష్ఠానంబు చేసి తత్కారణంబున నఖిలదేవతలకు నాచార్యుం డయ్యెను రుద్రులు, ఆదిత్యులు, యముఁడు, కుబేరుఁడు, గంధర్వులు, యక్షులు, అప్సరలు, విశ్వావసులు మొదలగువారందఱును గర్మప్రభావముననే విరాజితులై యుండిరి. మహర్షులును బ్రహ్మచర్యాది సత్క్రియాకలాపంబు లనుష్ఠించుటచేతనే సర్వశ్రేష్ఠులై యుండిరి.''—

కర్మవాదము శ్రీకృష్ణునకుఁ బూర్వమునందే వ్యవహారమునందున్నది. కాని యాకర్మ ప్రచలితధర్మానుసారం బగు వేదోక్తక్రియాకలాపమాత్రమే—ఆకర్మశబ్దము మతమునందుఁ బాశ్చాత్యులచే "Duty" యని చెప్పఁబడు నవశ్యానుష్ఠేయములగు సకలకర్మములకును వర్తించుట లేదు. కర్మశబ్దమునకుఁ బూర్వప్రచలితార్థము పరివర్తితమై కర్తవ్యమును (duty) ''డ్యూటీ'' నవశ్యానుష్ఠేయము నగునదియే కర్మమని నిర్దేశింపబడినట్లు గీతలయందే కనఁబడుచున్నది. మఱియు నీస్థానమున భాషాగతంబగు విశేషప్రభేద మున్నను మర్మార్థము మాత్ర మొక్కటియే. ఈయర్థమును, గీలలయందలియర్థమును గూడ నిర్వచించినవాఁ డొక్కఁడే యని నిశ్చయింపవలసి యున్నది.

అనుష్ఠేయకర్మముల యథావిహితనిర్వాహమే నామాంతరముచే స్వధర్మపాలన మగుచున్నది. గీతాప్రథమభాగమునందే శ్రీ

కృష్ణుఁ డర్జునునకు స్వధర్మపాలనముంగూర్చి యుపదేశించి యుం డెను. ఇప్పుడుగూడ కృష్ణుఁడు స్వధర్మపాలనమునే యుపదేశించెను.

"ఓసంజయా! నీవు బ్రహ్మక్షత్రియవైశ్యాదులధర్మమును సవిస్తరముగ నెఱిఁగియుండియుఁ గౌరవహితసాధనమునే మనసునం దుంచుకొని పాండవులను నిగ్రహించుట కేల ప్రయత్నించెదవు? ధర్మరాజగుయుధిష్ఠిరుఁడు వేదజ్ఞుఁడును, రాజసూయాశ్వమేధాదియజ్ఞాతయునై యున్నాఁడు. మఱియు నీతఁడు యుద్ధవిద్యయందుఁ బారదర్శి; కరితురగరథచాలనమున నిపుణుఁడు. ఇప్పుడు పాండవులు కౌరవులను హింసింపకుండ భీమసేనుని శాంతపఱుచుచు రాజ్యసంపాదనమున కితరోపాయమును దేనినైన నవలంబించినచో నది స్వధర్మరక్షణముం గావించు సత్కర్మమే యైయుండును. అట్లుగాక వీరుక్షత్రియధర్మపాలనముం గావించి స్వధర్మసాధనఁబుకొఱకు దురదృష్టవశంబున మృత్యుముఖపతితులైనను మంచిదియే. నీవు సంధియే సర్వశ్రేయధన మని యూహించినట్లు తోఁచుచున్నది. కాని క్షత్రియులకుస్వధర్మరక్షణము యుద్ధము చేయుటవలన నగునో, యుద్ధము చేయకుండుటవలన నగునో యాలోచించి నీవే చెప్పుము! ఇందేమార్గముత్తమమైనదిగా నిశ్చయింపఁబడునో యామార్గమునే నేననుసరించెదను".

తరువాత శ్రీకృష్ణుఁడు చతుర్వర్ణములవారిధర్మములనుగూర్చియు నుపన్యసించెను. గీతయందలి యష్టాదశాధ్యాయమునందుఁ జెప్పఁబడిన బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రధర్మములకును వీనికిని నెట్టి భేదమును లేదు. గీతోక్తధర్మమునకును మహాభారతమునం దచ్చటచ్చట శ్రీకృష్ణునిచేఁ జెప్పఁబడినధర్మమునకు భిన్నత్వము లేనట్లుగా ననేకోదాహరణములను జూపవచ్చును. గీతోక్తధర్మము కృష్ణధర్మ

మే యగుటచే నది కేవలమును గృష్ణనామముచేఁ బరిచిత మగుచుండె ననుటయే కాదు—అది నిజముగాఁ గృష్ణప్రణీతధర్మ మనియే యొక విధముగా నిశ్చిత మగుచున్నది. కృష్ణుఁడు సంజయున కింకను ననేక విషయములను బోధించెను. అం దొకటిరెండు విషయములనుమాత్రమే యుదాహరించితిమి.

ఐరోపీయులయాలోచనమునందుఁబరరాజ్యాపహరణముకంటె గౌరవకార్యము వేఱొదియును లేదు. దానిపేరు విజయమనియుఁ, గీర్తి యనియు, సామ్రాజ్యవర్ధన మనియు నాదేశభాషలయందుఁ గీర్తింపఁ బడుచుండును. కేవలము నొక "కీర్తి" శబ్దమునందలి మోహముచే ముగ్ధుఁడై ప్రష్యాప్రభుఁడగు ద్వితీయఫ్రెడిక్ మూఁడుసారు లైరోపా ఖండమును సమరానలముచేఁ బ్రజ్వలింపఁజేసి లక్షలకొలఁది జనులప్రాణనాశనమునకుఁ గారకుఁడయ్యెను. ఇట్టిరుధిరపిపాసు వగురాక్షసునకుఁ దక్క మఱియెవ్వరికైనను నీ "కీర్తి" యనునది తస్కరత్వముకంటె భిన్నమైనది కాదని సులభముగా బోధపడక మానదు. కేవలపరరాజ్యాపహారకుఁడు చోరశిఖామణి—తదితరుఁడు సామాన్యచోరుఁడు * కాని యార్యక్షత్రియవీరులుకూడ దిగ్విజయవాంఛచే ముగ్ధులై యనేకసమయములందు ధర్మాధర్మములను మఱచి ప్రవర్తించిరని చెప్పవలసి యున్నది. ఐరోపాయందలి యొకవీరుఁ డలెగ్జాండరునుగూర్చి "నీ వొక గొప్పదస్యుసమానుఁడవుమాత్రమే" అని చెప్పియుండెను. భారతవర్షమునందును శ్రీకృష్ణుఁడు పరరాజలోలుపు లగు రాజులంగూర్చి యట్లే చెప్పియుండెను. చిన్నచిన్నదొంగలు దాఁగియుండి దొంగ

* అయినను కేవలపరోపకారమునకై పరరాజ్యమును హస్తగతము చేసి కొన్నప్పు డాతనియెడల వర్తింపకపోవచ్చునేమో! అట్టికార్యమునందలి మంచి చెడ్డలను విమర్శించుటకు మాకు శక్తి చాలదు. ఏమనిన—మేమంతటి రాజనీతిజ్ఞులము కాము.

తనము చేయుదు రనియుఁ, బెద్దదొంగలు బహిరంగముగనే దొంగి లించెద రనియు నాతఁడు చెప్పియుండెను. అతఁ డేమిచెప్పెననఁగా—

"అగపడియో, యగపడకుండఁగనో యాకస్మికముగ సర్వ స్వము నపహరించువారు దొంగలు. ఈ రెండుతరగతులువారును నింద్యులే. కేవలము నప్పటిదుర్యోధనుని కార్యమునందట్టితస్కరస్వ భావము కానవచ్చుచున్నది"

ఇట్టితస్కరులహస్తములనుండిస్వసంపత్తిని రక్షించుకొనుటయే పరమధర్మ మని శ్రీకృష్ణుఁడు నిర్ణయించి యుండెను. ఆధునిక నీతి జ్ఞులమతముకూడ నట్టిదియే. చిన్నదొంగలచేతులనుండి తమధనమును రక్షించుకొనుట కింగ్లీషుభాషయందు జస్టిస్ అనియుఁ బెద్దదొంగల చేతులనుండి రక్షించుకొనుటకు పేట్రియాటిజమ్ అనియును నామము లు. ఈ రెంటికినిగూడ దేశీయనామము స్వధర్మపాలనము. కృష్ణుఁ డిట్లు చెప్పెను!—

"ఈరాజ్యముకొఱకుఁ బ్రాణములనుగూడఁ బరిత్యజింపవలసి యుండును. అయినను మంచిదే. కాని పైతృకం బగురాజ్యము నుద్ధ రించుకొనువిషయము విముఖులై యుండుట యెంతమాత్రము నుచి తము కాదు"

కృష్ణుఁ డప్పుడు సంజయుని శుష్కధర్మోపన్యాసమును విని సముచితముగ నాతని దిరస్కరించి "నీవిప్పుడు రాజగు యుధిష్ఠిరునకు ధర్మోపదేశమును గావింపఁ గుతూహలపడుచుంటివి. కాని యాసమ యమున (సభామధ్యమున దుశ్శాసనుఁడు ద్రౌపదియెడల ననరాని వినరాని యత్యాచారముం గావించినప్పుడు) దుశ్శాసనునకు నీవెట్టి యుపదేశముఁ గావించితివి?" అనియెను. కృష్ణుఁడు స్వభావముచేఁ బ్రియవాదియే—కాని యథార్థముగ దోషనిర్ణయముం గావించు,

నప్పుడు మాత్రము కేవలమును స్పష్టవాదియై యుండును. సత్యమే సర్వకాలములయందు నాతనికిఁ బ్రియమైనది.

కృష్ణుఁ డిట్లుసంజయుని దిరస్కరించి 'ఈయుభయపక్షములహిత సాధనముంగూర్చియుఁ బ్రయత్నించుటకు స్వయముగ నేనే హస్తినా పురమునకు వచ్చెదను. పాండవుల కర్థహాని కాకుండునట్లును, కౌర వులు సంధికి సమ్మతించునట్లును విశేషప్రయత్నము చేయవలయును. అది జరగినచో నొకపుణ్యకార్యము సాధించినట్లగును. అందువలనఁ గౌరవులు మృత్యుపాశమునుండి విడివడఁగలుగుదురు" అని చెప్పెను.

లోకహితార్థమును, నసంఖ్యమానవజీవనరక్షార్థమును, విశే షించి కౌరవరక్షార్థమును శ్రీకృష్ణుఁ డీదుష్కరకార్యమును సాధించు టకై స్వయముగ నుపయాచకుఁడై ప్రవృత్తుఁడయ్యెను. ఇది మను ష్యశక్తికి దుష్కరకార్యము. ఏమనిన:—పాండవులు శ్రీకృష్ణునిం గోరుకొని తమపక్షమునకుఁ జేర్చుకొని యుండిరి. అందుచే నాతఁ డిప్పుడు కౌరవులకు శత్రుపక్షమువాఁడై యుండెను. అయినను శ్రీ కృష్ణుఁడు లోకహితార్థమై నిరాయుధుఁడుగనే శత్రునగరమధ్యమున బ్రవేశించుట శ్రేయమని నిశ్చయించుకొనియెను.

---

## తృతీయపరిచ్ఛేదము

### యానసంధి

ఇప్పుడు సంజయయానపర్వాధ్యాయము సమాప్తమయ్యెను. ఈయధ్యాయమునకుఁ గడపటిభాగమునఁ గృష్ణుఁడు హస్తినాగరము నకుఁ బోవుటకుఁ గోరబడిన ట్లగపడుచున్నది. నిజముగా నాతఁ డాతరువాతనే హస్తినాపురమునకుఁ బోయెను. కాని సంజయయాన

పర్వాధ్యాయమునకును, భగవద్ధ్యాన పర్వాధ్యాయమునకునునడుమ ప్రజాగరము, సనత్సుజాతము, యానసంధి యనుమూడుపర్వాధ్యాయములున్నవి. ఇందు మొదటిరెండును ప్రక్షిప్తము లనుట కెట్టిసందియమును లేదు. వానిలో మహాభారతకథ యించుకంతయును లేదు. అత్యుత్కృష్టధర్మములును, నీతికథలునుమాత్ర మందున్నవి. కృష్ణుని యేవృత్తాంతమునందు లేదు. మన కీరెండుపర్వములతో నెట్టిప్రయోజనమును లేదు.

ఈయానసంధిపర్వాధ్యాయమున సంజయుఁడు హస్తినాపురమునకు వచ్చి ధృతరాష్ట్రునితోఁ జెప్పినమాటలును, నావాక్యములను విని ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుఁడు మొదలగు కౌరవు లందఱును గావించిన వాదప్రతివాదములును గానఁబడుచున్నవి. ఆయుపన్యాసము లన్నియు నతి దీర్ఘములును, బునరుక్తులచే నత్యంత సంకలితంబులును జాలచోట్ల నిష్ప్రయోజనములు నై యుండెను. ఇందు రెండుచోట్లను మాత్రమే కృష్ణప్రసంగ మున్నది.

మొదటిసారి యాతనిప్రస్తావ మష్టపంచాశత్తమాధ్యాయమున వచ్చినది. ధృతరాష్ట్రుఁడు సవిస్తరముగ నర్జునుని వాక్యములను సంజయునివలన విని యాకస్మికముగా "సంజయా! వాసుదేవుండును, ధనంజయుండును బలికిన పలుకలను వినవలయునని కుతూహలముగా నున్నది. కావున వానింగూర్చి తెలుపవలయును" అని ప్రశ్నించెను.

దానికిఁ బ్రత్యుత్తరముగ సంజయుం డాసభాస్థలంబున జరిగిన సంగతుల నెంతమాత్రమును దెలుపకుండఁగనే లోకాభిరామాయణమును జెప్ప నారంభించెను. అభిమన్యుప్రభృతి కుమారులకుఁ గూడ నగమ్యంబగు పాండవాంతఃపురంబునకుఁ బోయి కృష్ణార్జునులను దర్శించినట్లును, నప్పుడు కృష్ణార్జునులు మిగుల నాసవపానంబుఁ గావించి సత్యాద్రౌపదులపాదంబులపైఁ బాదములనుంచి కూర్చుండి యున్న

ట్లును నప్పుడు కృష్ణుఁడు దంభముగా "నేను సహాయుడనైయుండగా నీయర్జునుఁడు సకలశాత్రవసమూహంబును నిర్మూలంబు చేయఁగ లఁడు" అని చెప్పినట్లును సంజయుఁడు చెప్పి యుండెను.

తరువాత నర్జునుఁ డేమనెనో యామాటలను సంజయుఁడు చెప్పనే లేదు. కాని ధృతరాష్ట్రున కాతని మాటలను వినవలయునని యుండెను.—తరువాత నష్టపంచాశత్తమాధ్యాయమునఁ దుదిభాగము మహావీరుఁ డగునర్జునుఁడు శ్రీకృష్ణునివాక్యముల నన్నిటిని విని పరమానందపులకితుఁడై యేమేమో చెప్పినట్లుండెను. ఆవాక్యములన్నియు నూనషష్టితమాధ్యాయమునం దర్జునుఁడు చెప్పినమాటలే—ఆ యధ్యాయ మంతయు నామాటలతోనే లేదు. అందు ధృతరాష్ట్రుఁడు సంధిస్థాపనవిషయంబున దుర్యోధనునకుఁ ప్రబోధించినమాటలుకూడ నున్నవి. అనంతరము షష్టితమాధ్యాయమున దుర్యోధనుఁడు తన తండ్రికిఁ దనదృఢోద్దేశమును స్పష్టముగా వెల్లడించినట్లున్నది. ఏకషష్టితమాధ్యాయమున మధ్యగాఁ గర్ణుఁడు వచ్చి యేమేమో మాటలాడినట్లును, భీష్ముఁ డాతనిని మందలించినట్లు నున్నది. అప్పుడు కర్ణభీష్ములకుఁ దర్కవితర్కములు జరిగెను. ద్విషష్టితమాధ్యాయమున భీష్మ దుర్యోధనులకు వివాద మయ్యెను. త్రిషష్టితమాధ్యాయమున భీష్ముని యుపదేశము లుండెను. చతుష్షష్టితమాధ్యాయమున మరల ధృతరాష్ట్రుని సభాసమావేశ మయ్యెను. అప్పు డింతకాలమునకుఁ దరువాత ధృతరాష్ట్రుఁడు 'అర్జునుఁ డప్పు డేమనియెను?' అని ప్రశ్నించెను. అప్పుడు సంజయుఁ డష్టపంచాశత్తమాధ్యాయమునఁ జెప్పిన సంగతులకుఁ దరువాతికథ నందుకొని యర్జునునిమాటలంగూర్చి చెప్పఁదొడఁగెను. ఇట్టిస్థితిలో నీ 59, 60, 61, 62, 63, 64 అధ్యాయములు ప్రక్షిప్తము లని చెప్పుటకు మాపాఠకులలో నెవ్వరును సందేహింప రని తలంచెదము. ఈ యాఅధ్యాయములలోను భారతకథ

యొక్క యుద్ధ మైనను ముందటికి జరుగలేదు. కావున నివి నిశ్చయ ముగాఁ బ్రక్షిప్తము లనియే చెప్ప వచ్చును.

ఏ కారణములచేత నీయూఅధ్యాయములును బ్రక్షిప్తములని నిర్ణయించితిమో యాకారణములచేతనే యష్టపంచాశత్తమాధ్యాయముకూడఁ బ్రక్షిప్తమని చెప్పవచ్చును—తరువాతివారీయధ్యాయములను వరుసవరుసగాఁ బ్రక్షేపించి యుండిరి. అష్టపంచాశత్తమాధ్యాయముంగూర్చి యింకను జెప్పవలసి యున్నది. ఇది కేవల మప్రాసంగికమును, నసంబద్ధము నగుటయే కాక పూర్వోక్తంబు లగు శ్రీకృష్ణ వాక్యంబులకు విరుద్ధంబుగఁగూడ నున్నది. ఇందలి వృత్తాంతములంగూర్చి యనుక్రమణికాధ్యాయంబునఁగాని పర్వసంగ్రహాధ్యాయంబునఁగాని చెప్పియుండలేదు. ఎవ్వఁడో రసికుఁడగు లేఖకుఁడను రనిపాతి యగుశౌరిని, సురనిపాతిని యగుసురను సేవించు భక్తాగ్రేసరుం డగుటచేఁ దన యుపాస్యదైవతములను రెంటి నొక్కచోఁ బ్రదర్శించు నుద్దేశముతో నీయష్టపంచాశమాధ్యాయమును బ్రక్షేపించి యుండు నని తోఁచుచున్నది.

యానసంధిపర్వాధ్యాయమునందు శ్రీకృష్ణునింగూర్చిన ప్రథమ ప్రసంగ మింతే—ద్వితీయప్రసంగము సప్తషష్టితమాధ్యాయము మొదలుసప్తతితమాధ్యాయమువఱకునాలుగధ్యాయములలోనున్నది. అందు సంజయుఁడు ధృతరాష్ట్రునిప్రశ్నానుసారముగా శ్రీకృష్ణమహిమను వర్ణించి యుండెను. ఇదివఱకు మద్యపానోన్మత్తుఁడని వర్ణితుఁడైన శ్రీకృష్ణుఁ డిప్పుడు జగదీశ్వరుఁడుగా వర్ణింపఁబడియెను. అందుచే నిదియును బ్రక్షిప్తముగనే తోఁచుచున్నది. ఇది ప్రక్షిప్తమైనను గాక పోయినను సరియే—గాని దీనితో మాకెట్టి ప్రయోజనమును లేదు. ఇతరప్రధానకారణములచేతనే కృష్ణునియీశ్వరత్వము మనకు విశ్వసనీయ మైనప్పుడిఁక సంజయుని వాక్యములతో విశేషప్రయోజన

మేమున్నది? శ్రీకృష్ణుఁ డీశ్వరుఁ డనువిశ్వాసమే మనకు లేనప్పుడు సంజయుఁ డీవిధముగా నెన్ని వాక్యములు చెప్పినను నాతనిబలవంత ముచే విశ్వాసము కలుగదు. కావున నీసంజయునివాక్యములను విమ ర్శించుటవలన నెట్టిలాభమును లేదు. ఆతనియామాటలలో శ్రీకృష్ణుని మానవజీవితముంగూర్చిన యెట్టివృత్తాంతమును మనకుఁ గానవచ్చుట లేదు. మనకుఁగావలసినది శ్రీకృష్ణచరిత్రమేగాని సంజయోపన్యాసము కాదు.

ఇప్పటికి యానసంధిపర్వాధ్యాయము సమాప్తమైనది.

---

## చతుర్థ పరిచ్ఛేదము.

### శ్రీకృష్ణుని హస్తినాపురయాత్ర

శ్రీకృష్ణుఁడు పూర్వకృతం బగునంగీకారము ననుసరించి సంధి స్థాపనంబు గావించుటకై కౌరవులయొద్దకుఁ బోవలయు నని సంసిద్ధుఁ డయ్యెను. ప్రయాణసమయమునఁ బాండవులును, ద్రౌపదియు నాత నికిఁ గొన్నికొన్ని మాటలను జెప్పిరి. శ్రీకృష్ణుఁడు వాని కుచితములగు నుత్తరముల నొసంగెను. ఈవాక్యోపవాక్యము లన్నియు నైతిహాసిక ములే యని గ్రహించుట కవకాశము లేదు. కాని యితిహాసవేత్త యగుకవి కృష్ణునిచేఁ బలికించిన పలుకునుబట్టి యాతఁడు కృష్ణు నే విధముగా గ్రహించినదియు బోధ యగుచున్నది. ఆ వాక్యముల యందుఁ గొన్ని భాగముల నుదాహరించెదను.

ఒకచోటఁ గృష్ణుఁడు యుధిష్ఠిరునిమాటలకుఁ బ్రత్యుత్తర మిచ్చుచు "ఓ మహారాజా! బ్రహ్మచర్యాదివ్రతములు క్షత్రియునకు విధేయములు కావు. సకలాశ్రమస్థులును క్షత్రియునకు భిక్షాచరణ

మును నిషేధించి యున్నారు. సంగ్రామ విజయలాభంబును, రణంబున ప్రాణపరిత్యాగంబును క్షత్రియునకు నిత్యధర్మంబు లని విధాత నిర్దేశించి యుండెను. కావున దీనత్వము క్షత్రియున కత్యంతమును నిందనీయమైనది. అరిసూదనుండ వగునోయుధిష్ఠిరా! నీవు దీనత్వము నవలంబించినచో నీరాజ్యభాగమును బడయఁజాలవు. కావున విక్రమమును బ్రదర్శించి శత్రుగణవినాశనముం గావింపుము'' అని చెప్పెను.

ఈ విధముగనే శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ గూడ బోధించినట్లు గీతయం దగపడుచున్నది. దీనివలన నెట్టిసిద్ధాంతము తేలినదో యాసంగతి యిదివఱకే చెప్పియుంటిమి. తరువాతఁ గృష్ణుడు భీమునిమాటలకుఁ బ్రత్యుత్తరముగా ''మానవుఁడు పురుషకారమును బరిత్యజించి కేవలదైవమును గాని, దైవమును త్యజించి కేవలపురుషకారమును గాని యవలంబించి జీవితమును గడపఁజాలఁడు. ఈ యర్థంబును గ్రహించి కృతనిశ్చయుఁడై కర్మంబులఁ గావించునాతఁడు కర్మఫలసిద్ధికి సంతోషము గాని వైఫల్యమునకు దుఃఖమును గాని బొందఁడు'' అని బోధించెను.

శ్రీకృష్ణుఁ డర్జునుని మాటల కుత్తరముగా నిట్లే చెప్పినట్లు గీతయందున్నది.

''సస్యక్షేత్రమునందు నియమానుసారముగా నాఁగేటితో దున్ని విత్తనములు చల్లినను వర్షము లేకున్నచో ఫలోత్పత్తి కానేరదు. పురుషుఁడు పురుషకారసహకారంబున నందు జనసేచనంబు గావించినను దైవప్రాతికూల్యముచే నదియంతయు శుష్కించిపోవును. కావుననే ప్రాచీను లగుమహాత్ము లందఱును దైవపురుషకారముల సామంజస్యముచేఁ గార్యములు సిద్ధించుచుండు నని సిద్ధాంతముచేసి యుండిరి. నేను యథాసాధ్యముగఁ బురుషకారము నుపయోగింపఁ గలను. కాని దైవకర్మానుష్ఠానముం గావించుటకు నాకెంతమాత్ర సామర్థ్యము లేదు''

మే మీసంగతి నిదివఱకే వ్రాసి యుంటిమి. కృష్ణుం డెచ్చట తన దేవత్వము నెంతమాత్రమును బ్రకటించి యుండలేదు. ఏమనిన- ఆతఁడు సకలకర్మములను మానవశక్తిచేతనే సాధించుటకుఁ బ్రవృత్తుఁ డయ్యెను. ఈశ్వరశక్తిచేతనే కర్మసాధనముం గావించుట యాశ్వ రోద్దేశమైనచో నిఁక నవతారము వలనం బ్రయోజన మేమున్నది ?

చెప్పవలసినవా రందఱును జెప్పినతరువాత ద్రౌపది కృష్ణు నకుఁ గొన్నిమాటలను జెప్పెను. అప్పటియామెమాటలలో నొక మాట యున్నది. స్త్రీముఖమునుండి యట్టిమాట వెలువడుట మహా శ్చర్యకరమగు విషయము. ఆమె కృష్ణునిం గాంచి 'అవధ్యులగువా రిని వధించుట యెంతపాపమో, వధ్యులగువారిని వధింపకుండుటయు నంతపాపమే' అనియెను.

సాధారణస్త్రీ యిట్లు చెప్పుట విస్మయకరమే గాని ద్రౌపది వంటి రాజ్ఞీమణి యీవిధముగా సంభాషించుట వింతగాదు. మేము చిరకాలముక్రిందటనే వంగదర్శిని యనుపత్రికలో ద్రౌపదీచరిత్ర మును విస్పష్టముగ వ్రాసి యామెస్వభావగుణగణంబులను బ్రకటించి యున్నాము. ఈవాక్యములు స్త్రీ చెప్పఁదగిన వైనను గాకపోయినను నీపద్ధతియే ప్రకృతధర్మ మనియును నిదియే కృష్ణమతమనియును మేము జరాసంధవధసమాలోచనసమయంబునను, మఱియు నన్య సమయంబులందునునిరూపించి యున్నారము.

ద్రౌపది యీవిధముగాఁ జెప్పుట ముగించినతరువాత నచ్చట నే యొకవిధమగు నపూర్వకవితాకౌశల మగపడుచున్నది. దాని నీక్రిందఁ జూపుచున్నాము.

'అసితాపాంగవిలాసిని యగుద్రౌపది యాసంధిప్రస్తావము నాలకించి కుటిలాగ్రంబును, బరమరమణీయంబును, వివిధగంధసువా సితంబును, సర్వలక్షణసంపన్నంబును, మహాభుజంగసదృశంబును నగు

తన కుంతలకలాపమును జేతఁ బూని యశ్రుపూర్ణనయనము లతో దీనవదనముతో శ్రీకృష్ణునిం గాంచి మరల నిట్లు చెప్పందొడంగెను. 'ఓజనార్దనా! దురాత్ముఁ డగు దుశ్శాసనుఁడు నాయీచికురదామము నాకర్షించి యున్నాఁడు. శత్రువులతో సంధిప్రస్తావముం గావించు సమయమున నీవీ కేశకలాపమును జ్ఞప్తియం దుంచుకొనుము. భీష్మాద్యులు దీనులవలె సంధి చేసికొనుటకుఁ గృతసంకల్పులై యుండిరి. అంతమాత్రమున నాకెట్టి లోపమును లేదు. వృద్ధుఁ డగునాజనకుఁడు మహారథులగు తనపుత్రులం గూడుకొని వచ్చి శత్రువులతో సంగ్రామంబు గావింపఁగలఁడు. మహాబలపరాక్రాంతు లగునాయేవురు పుత్రులును నభిమన్యుపురస్సరులై పోయి రణరంగమున శత్రునిర్మూలనంబు సేయఁగలరు. దురాత్ముఁడగు దుశ్శాసనుని శ్యామలబాహువు తుత్తునియలై సంగ్రామరంగమున ధూళిలోఁ బొరలుచుండగాఁ జూచినప్పుడు గాని నాకు శాంతి యెట్లు లభించును! జ్వాలాభీలంబగు ననలంబుం బోలి నాహృదయంబునఁ బ్రదీప్తం బగుచున్న క్రోధము నెట్లో యడంచుకొని నేనతికష్టముతోఁ బదుమూఁడు వత్సరములు ప్రతీక్షించి యుంటిని. ఇప్పటికిఁ బదుమూఁడవయేఁడుగూడఁ గడచి పోయినది. అయినను నాక్రోధజ్వాల యుపశమించుట కెట్టియుపాయము నగపడుట లేదు. ఇప్పుడు మరల ధర్మపథావలంబి యగువృకోదరుని వాక్యము లను వాఁడిబాణములచే నాహృదయము విదీర్ణమై పోవుచున్నది'

నిబిడనితంబినియు, నాయతలోచనయు నగుకృష్ణాదేవి యిట్లు చెప్పి ప్రకంపితసర్వావయవయై బాష్పగద్గదస్వరంబున నేడువఁ దొడం[illegible] అగ్నిజ్వాల యీవిధముగ ద్రవీభూతం బయ్యెనా యనునట్లుగా [illegible]ంబు లగుబాష్పధారలచే నారమణీమణిసమున్నతవక్షోభాగ[illegible]క్తం బగుచుండెను. అప్పుడు మహాబాహుఁ డగువాసుదేవుఁ

డామె ననునయించుచు 'ఓ ద్రౌపదీ! నీవు కొలఁది దినములలోనే కౌరవకాంతలదుఃఖములను గన్నారఁజూడఁగలవు నీవు గాంచినట్లుగనే కురుకులకామినులు తమబంధువినాశనంబునకై పరిపరివిధంబుల దుఃఖింపఁగలరు. నేను యుధిష్ఠిరునియాజ్ఞానుసారంబుగ భీమార్జుననకులసహదేవులతోఁ గలసి కౌరవగణవధసాధనంబునకుఁ బ్రవృత్తుండ నయ్యెదను. ధృతరాష్ట్రనందనులు కాలచోదితులై నావాక్యముల ననాదరింతురేని నిశ్చయముగ వా రచిరకాలముననే నిహతులై శృగాలకుక్కురంబులకు భక్ష్యంబులు కాఁగలరు. హిమశైలము చలించినను మేదిని యుత్క్షిప్తంబైనను, నాకాశమండలము నక్షత్రగణంబులతోఁ గూడ నిపతితంబైనను నావాక్య మెన్నటికి ననత్యంబు కాజాలదు. తల్లీ! నీవు బాష్పసంవరణంబు గావింపుము. నామాట నమ్ముము. శత్రుసంహారంబు చేసి రాజ్యలాభంబుఁ గాంచిన నీభర్తలను నీ వచిరకాలమునందే చూడఁగలవు—'

ఈమాటలు శోణితపిపాసు వగువాని హింసాప్రవృత్తి కనుగుణ్యంబులై నవనిగాని, క్రోధశీలుఁడగువాని క్రోధాభివ్యక్తి కుచితంబులై నవనిగాని చెప్పుటకు వలనుపడదు. ఇవి సర్వత్రప్రసరించునట్టియు సర్వకాలమును వ్యాపించునట్టియు బుద్ధిప్రభావముచే భవిష్యమును స్పష్టముగఁ దెలిసికొని చెప్పినమాటలుమాత్రమే—దుర్యోధనుఁడు సంధి చేసికొని రాజ్యభాగము నెన్నటికిని బ్రత్యర్పణము గావింపఁడని శ్రీకృష్ణుఁడు నిశ్చయముగ గ్రహించి యుండెను. ఇట్లెటింగియుండియు నాతఁడు సంధికొఱకు కౌరవసభంగూర్చి పోవ నుద్యోగించెను. కారణ మేమనిన ననుష్ఠేయంబగు కార్యము పర్యవసానమున సఫలమైనను, విఫలమైనను నవశ్యము చేసియే చూడవలయును. అట్టిచో ఫలాఫలములను తుల్యములుగనే భావింపవలయును. ఇదియే శ్రీకృష్ణముఖవినిర్గతం బగునమృతమయగీతాధర్మము. ఆతఁడు స్వయముగా నర్జునున కిట్లుపదేశించెను.

'సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే' ఆదర్శపురుషుఁ డగునాతఁ డట్టిస్థితి ననుసరించియే భవిష్యత్తు నెఱింగి యుండియును సంధిస్థాపనార్థమై ప్రయత్నించుటకుఁ గౌరవసభకుఁ బోయెను.

---

## పంచమపరిచ్ఛేదము

### యాత్ర

శ్రీకృష్ణుఁడు తనప్రయాణసమయంబునఁ గాంపించినకార్యము లన్నియును మానవానురూపంబులును, గాలోచితంబులు నై యుండెను. ఆతఁడు కార్తికమాసంబున రోహిణీనక్షత్రయుక్తం బగుశుభదివంబున మిత్రముహూర్తంబునఁ గౌరవసభకు బయలుదేఱు నుద్దేశించి విశ్వస్తు లగుబ్రాహ్మణుల పుణ్యావాక్యశ్రవణంబును, ప్రాతఃకృత్యసమాపనంబును, స్నానంబును, వసనభూషణాలంకరణంబును, వహ్నిసూర్యోపాసనంబును గావించెను. మఱియు వృషలాంగూలదర్శనంబును, బ్రాహ్మణాభివాదనంబును, నగ్నిప్రదక్షిణంబును, గల్యాణవస్తుసందర్శనంబును గావించి ప్రయాణ మయ్యెను.

శ్రీకృష్ణుఁడు గీతామూలంబునఁ గావించిన ధర్మప్రచారమునందుఁ గామ్యకర్మపరాయణంబగునప్పటి వైదికధర్మము నిరసింప బడియుండెను. కాని యంతమాత్రమున నాతఁ డెన్నఁడును వేదపరాయణులగు బ్రాహ్మణుల నవమానించి యుండలేదు. ఆతఁ డాదర్శపురుషుఁడు; కావున నే యాకాలమునందు బ్రాహ్మణులవిషయంబున నెట్లు వ్యవహరించుట యుచితమో యట్లే కావించెను. ఆకాలమునందలి బ్రాహ్మణులు విద్వాంసులును, జ్ఞానవంతులును, ధర్మాత్ములును, నస్వార్థపరు

లునై సమాజ్ఞవిషయంబున శుభసాధననిరతులై యుండిరి. అందుచే వార లితరవర్ణములవారిచేఁ బూజింపఁబడుటకు యోగ్యులై యుండిరి. శ్రీకృష్ణుఁడును నా కారణముచేతనే నుచితరీతిని బూజించెను. దీని కుదాహరణముగా శ్రీకృష్ణునిమార్గమధ్యమునందలి ఋషిసమాగమముం గూర్చినవర్ణన మిందుఁ బొందుపఱుచున్నాము—

"మహాబాహుఁ డగు కేశవుఁ డీవిధముగాఁ గొంతదూరమరిగి త్రోవ కిరువంకలను బ్రహ్మతేజోవిరాజితు లగుకొందఱు మహర్షులను సందర్శించెను. ఆతఁడు వారిం గాంచినతోడనే యతిసంభ్రమంబున రథావతరణంబు సేసి యభివాదనపూర్వకంబుగ నిట్లు ప్రశ్నించెను. "ఓ మహర్షిశేఖరులారా! మీ కందఱకును కుశలమేకదా! మీసకలధర్మంబులు నుత్తమరూపంబున ననుష్ఠితంబు లగుచుండెను గదా! క్షత్రియాది వర్ణత్రయంబును బ్రహ్మణశాసనానుసారంబుగ మెలంగుచుండెనా? మీ యాశ్రమంబు లెక్కడ? మీ రెక్కడికిఁ బోవుచున్నారు? మీ యానమునకుఁ బ్రయోజనం బేమి? మీకు నేఁ జేయదగినకార్యం బేమైన నుండెనా?—"

అప్పుడు మహాభాగుం డగుపరశురాముఁడు శ్రీకృష్ణునిం గౌఁగిలించుకొని "ఓమధుసూదనా! మాలోఁ గొందఱు దేవర్షులును, గొందఱు బహుశ్రుతు లగు బ్రాహ్మణులును, గొందఱు రాజర్షులును, గొందఱుతపస్వులునుగూడ నున్నారు. మే మనేకపర్యాయములు దేవాసురసమాగమముం గాంచి యున్నారము. ఇప్పుడు సకలక్షత్రియులను, సభాసదులను, భూపాలుఁడగు ధృతరాష్ట్రుని నిన్నునుజూడ వలయుననుకోరికతో మేము బయలుదేఱి వచ్చుచున్నాము. మేము కౌరవ సభామధ్యంబున నీ వుపన్యసించు ధర్మార్థసంగతంబు లగువచనంబులను వినవలయు నని యభిలషించుచున్నాము. ఓయదుశేఖరా! భీష్మ ద్రోణవిదురాది మహాత్ములతో నీవు భాషించు హిత

కరంబులగు సత్యవాక్యముల నాకర్ణింపఁ గుతూహలపడుచున్నాము:-
ఇప్పుడు నీవు కురురాజ్యమునకు సత్వరముగ బయలుదేఱిపొమ్ము!
అచ్చట సభామధ్యంబున దివ్యాసనాసీనుండవును తేజోమయుండవు
నగు నిన్ను మేము మరలఁ గనుంగొని నీతో సంభాషించెదము'' అని
చెప్పెను.

ఇచ్చట నింక నొకసంగతి చెప్పవలసియున్నది. ఈజామదగ్న్యు
డగు పరశురాముఁడు కృష్ణుని సమకాలికుఁడుగా నిందు వర్ణింపబడి
యెను. రామాయణమునం దీతఁడు రామునితో సమకాలికు డైనట్లు
న్నది. మఱియు పురాణములయందుఁ బరశురాముడు రామకృష్ణుల
కుఁ బూర్వుఁడుగను, విష్ణుని యవతారాంతరుఁడుగను జెప్పఁబడి యుం
డెను—పురాణములయందలి దశావతారవాద మెంతవఱకు సంగత
మో యాసంగతింగూర్చి మేము గ్రంథాంతరమున విమర్శించి
యున్నాము.

ఈహస్తినానగర యాత్రావర్ణనంబునుబట్టి యాలోచింపఁగా
శ్రీకృష్ణుఁడు సాధారణజనులకుఁ గూడఁ బూజ్యుఁడై యుండె నని
తోఁచుచున్నది. ఆవర్ణనమునం దింకనుగొంతభాగమును జూపెదము.

''దేవకీనందనుఁడు సర్వసస్యపరిపూర్ణంబులును, నతిరమణీ
యంబులును, సుఖాస్పదంబులును బరమపవిత్రంబులును నగుబహు
విధ గ్రామంబులను హృదయానందకరంబుగా సందర్శించుచు, బహుపు
రంబులను, రాజ్యంబులను నతిక్రమించి పోవుచుండెను. అప్పుడు కురు
కులసంరక్షితులునునిత్యప్రహృష్టులును, ననుద్విగ్నులును, వ్యసనర
హితులునగుపౌరులు మార్గమధ్యంబున శ్రీకృష్ణునిరాకకుఁ బ్రతీక్షించు
చుండిరి. కొంతసేపటికి మహాత్ముఁ డగువాసుదేవుఁ డచ్చటికి వచ్చిన
[illegible] సేవాభాతని విధ్యుక్తముగఁ బూజించిరి :—

''అంత భగవంతుం డగు నంతుమంతుఁడు తనకిరణ జాల[illegible]
[illegible] లోకాంత కాంతి[illegible]తుం డగుటయు నరిసూదనుం డగు

మధుసూదనుండు రథావతరణంబు చేసి రథ్యంబులఁ విడువం బనిచి యొకవృక్షమూలంబున నుపస్థితుండై సంధ్యోపాసనంబుఁ గావించు చుండెను. దారుకుఁడుకృష్ణునియాజ్ఞానుసారంబుగ గుఱ్ఱంబులపగ్గంబులు వదలించి వానికి యథోచితంబులగు పరిచర్యలను గావించుచుండెను. మహాత్ముండగు మధుసూదనుఁడు సంధ్యోపాసనంబు ముగించి తనపరి వారజనులం గాంచి "యుధిష్ఠిరుని యాజ్ఞానుసారంబుగ నీరాత్రి యిచ్చటఁ గడపవలయును" అనియెను. తోడనే పరిచారకు లాతని యుద్దేశమును గ్రహించి నిమిషములో నట నొకపటకుటీరమును నిర్మించి వివిధంబులును సుమృష్టంబులు నగునన్నపానములను సిద్ధము లుగాఁ జేసిరి. అనంతర మాగ్రామమునందలి స్వధర్మనిరతులగు బ్రాహ్మణులు మహాత్ముం డగుహృషీకేశునిపాలికి వచ్చి యరాతి కులాంతకుం డగు నాతనిని విధిపూర్వకముగ సన్మానించి యాశీర్వదించి మాయిండ్లకు దయచేయవలయు నని ప్రార్థించిరి భగవంతుం డగుకృష్ణుఁ డును వారిమాటలకు సమ్మతించి వారినందఱ నర్చించి వారియిండ్లకుఁ బోయి మరల వారితోఁగలసి తన పటకుటీరమునకువచ్చెను. తరువాత శ్రీకృష్ణుఁ డాబ్రాహ్మణులతోఁగూడి యిష్టమృష్టాన్నంబుల భుజించి పరమానందముతో నారాత్రిని గడపివైచెను."

ఇది కేవలమును మనుష్యచరిత్రము కాదా? కాని యాదర్శ పురుషునిచరిత్రము! ఆతని నెవ్వరును దేవునిగాఁ దలంచి పూజించిన ట్లిచ్చటను గానవచ్చుటలేదు. కాని, మనుష్యశ్రేష్ఠుఁ డెట్టిసన్మాన ముం గాంచునో శ్రీకృష్ణుఁ డప్పు డట్టిసన్మానమునే గాంచుచుండెను. మఱియు నాతఁ డాదర్శపురుషునివలెనే లోకులతో వ్యవహరించెను.

## షష్ఠపరిచ్ఛేదము

### కరిపురంబునఁ బ్రథమదినము

శ్రీకృష్ణుఁడు వచ్చుచుండె నని విని వృద్ధుఁడగు ధృతరాష్ట్రుఁ డాతని నభ్యర్చించుటకై మిగుల నాడంబరముగాఁ బ్రయత్నములను గావించుచుండెను; సభామండపమును నానారత్న సమాకీర్ణంబుగఁ జేయించెను. మఱియు నాతనికిఁ గానుక యొసఁగుటకై యనేకరథ గజతురంగములను, దాసులను, "అజాపత్యంబగు దాసీశతంబును" నమూల్యరత్నంబులను సంగ్రహించి యుంచెను.

ఈప్రయత్నముల నన్నింటిం గాంచి విదురుఁడు "మేలుమేలు నీ వెట్టిధార్మికుఁడవో యట్టిబుద్ధిమంతుఁడవు. కాని యిట్టిరత్నోపహారం బులవలన శ్రీకృష్ణుని వశపఱుచుకొనఁజాలవు. ఆతఁ డెందుకొఱకు వచ్చుచుండెనో, యాకార్యమును సంపన్నంబు గావించినచో నాతఁడు సంతుష్టుం డగును. అర్థలుబ్ధుఁడై యాతఁడు నీకు వశ్యుఁడు కాఁజా లఁడు" అని చెప్పెను.

ధృతరాష్ట్రుఁడు ధూర్తుఁడు; విదురుఁడు సరళహృదయుఁడు. దుర్యో ధనున కీ రెండుశక్తులు నున్నవి! అప్పుడు దుర్యోధనుఁడు "కృష్ణుఁడు పూజనీయుఁ డనుమాట నిజమే. కాని యాతనిం బూజించుటయుచి తము కాదు. యుద్ధము తప్పని దైనప్పుడు మన మాతని సన్మానించు టెందుకు? మనము భయపడి యాతనిఁ బూజించుచుంటి మని లోకు లనుకొందురు. ఈయన్నింటికంటెను నేనొక మంచియాలోచనమును నిశ్చయించుకొంటిని. మన మాతని బంధింపవలయును. పాండవులకు బల మాతను బుద్ధియైనను గృష్ణుఁడే—ఆతఁడు బంధితుఁ డైనచో నతిసులభ ముగఁ బాండవులు మనకు వశీభూతులై పోవుదురు." అనియెను.

ధృతరాష్ట్రుఁ డామాటల నాలకించి కుమారుని దిరస్కరించుటకు బాధ్యుఁ డయ్యెను. ఏమనిన—కృష్ణుఁడు దూతగా వచ్చుచుండెను. అప్పుడు కృష్ణభక్తుఁడగు భీష్ముఁ డనేకవిధంబులగు కటూక్తులచే దుర్యోధనుని నిందించి యాసభనుండి వెడలిపోయెను.

నాగరికులును, కౌరవులును మిగుల సన్మానముతో శ్రీకృష్ణుని సభామందిరమునకుఁ దోడ్కొనివచ్చిరి. కృష్ణుఁ డప్పుడు తనకొఱకెంతయో ప్రయత్నముతో నలంకరింపఁబడిన యాసభాలంకారములఁ దన కడకంటనైనఁ దిలకింపలేదు. అతఁడు తిన్నఁగా ధృతరాష్ట్రభవనంబునకుం బోయి కౌరవసభయందు గొంతసేపుండి యోగ్యులగు సభాసదులతో నుచితముగ సంభాషించెను; అనంతరము రాజప్రాసాదమును బరిత్యజించి దీనబంధుఁ డగునాతఁ డావిదురుని యింటికిం బోయెను.

విదురుఁడు ధృతరాష్ట్రున కొకవిధమైన సోదరుఁడు. ఆయిరువురును వ్యాసదేవుని యౌరసపుత్రులు కాని ధృతరాష్ట్రుఁడు మహారాజగు విచిత్రవీర్యునకు క్షేత్రజపుత్రుఁడు; విదురుఁ డట్టివాఁడు కాఁడు. అతఁడు విచిత్రవీర్యునిదాసి యగునొక వైశ్యస్త్రీగర్భమున జన్మించెను. అతనిం గూడ విచిత్రవీర్యుని క్షేత్రజునిగా గ్రహించినను నాతనికి జాతి నిర్ణీతము కాలేదు. ఏమనిన—బ్రాహ్మణున కౌరసుఁడై క్షత్రియ క్షేత్రంబగు వైశ్యస్త్రీ గర్భమునం దాతఁడు జన్మించెను. అతఁడు సామాన్యవ్యక్తియై యున్నను బరమధార్మికుఁడై యుండెను.

మహాభారతమునందలి నాయకుల కందఱకును జాతిసంబంధమున నిట్టికళంకమే యుండెను. పాండవులవిషయమునఁగూడ నిట్టి గోలయే యున్నది. పాండవులకుఁ బ్రపితామహి యగుసత్యవతి దాశకన్య. భీష్ముని తల్లి యేజాతియో? దానిని దాచుటకు విశేషప్రయోమున్నదని తోఁచుచున్నది అందుచే నాతఁడు గంగానందనుఁడయ్యెను. ధృతరాష్ట్రుఁడును బాండురాజును క్షత్రియస్త్రీ గర్భమున జనించినను బ్రాహ్మణున కౌరసులై యుండిరి. వ్యాసభగవానుఁడు స్వయ

ముగాఁ గన్యయగు పల్లెదానికిఁ బుత్రుఁ డయ్యెను. అందువలన ధృత రాష్ట్రుఁడును, పాండురాజునుగూడ నీదినములలో నేజాతివారితో నైనను బంక్తిభోజనమున కర్హత లేనివారిగా నగపడుచున్నారు. పాండుపుత్రులు కుంతీగర్భజు లన్నమాట సత్యమే—కాని వారు తండ్రికిఁ బుట్టినబిడ్డలు కారు. పాండురాజు స్వయముగాఁ బుత్రోత్పాదనము కావించుట కసమర్థుఁడై యుండెను. కావునఁ బాండవు లింద్రాదుల కౌరసపుత్రులుగా నగపడుచున్నారు. మఱియుం బరిశీలింతము—ద్రోణునితండ్రి భరద్వాజ మహర్షియే కాని యాతనితల్లిమాత్ర మొకకలశము. కలశము గర్భముం దాల్చుటనుగూర్చి విశ్వసింపని వారికి ద్రోణాచార్యుని మాతృకులముంగూర్చి సందేహము కలుగక మానదు. పాండవులకుఁ బితృవిషయంబున నెంతగోల యున్నదో, కర్ణునికిఁగూడ నంతగోల యున్నది. విశేషించి యాతఁడు కానీనుఁడు కూడను— ద్రౌపదికిని, ధృష్టద్యుమ్నునికిని దల్లిదండ్రు లెవ్వరో యెవ్వరికిని దెలియుటయే లేదు. వారు యజ్ఞసంభూతు లనిమాత్రము చెప్పఁబడి యుండెను.

ఈ సమయమున వివాహ సంబంధములలో మాత్ర మెట్టి గొడవయును లేదు. అను లోమ ప్రతిలోమ వివాహములను గూర్చి చెప్పుచుండుట లేదు. అనేక మహర్షులధర్మపత్నులు క్షత్రియ కాంతలై యుండిరి. అగస్త్యునకు లోపాముద్ర, ఋష్యశృంగునకు శాంతయును, ఋచీకునిభార్యయును, జమదగ్నిభార్య యగు రేణుకయును క్షత్రియ స్త్రీలే—పరశురాముఁడు పృథ్వినంతను క్షత్రియశూన్యంబుగఁ జేయుటచేఁ దరువాతక్షత్రియు లందఱును బ్రాహ్మణుల కౌరసులుగనే జన్మించియుండిరని యిప్పటికిని జెప్పుచుండుట కలదు. పక్షాంతరమున బ్రాహ్మణకన్యయగు దేవయాని క్షత్రియుఁ డగుయయాతికి ధర్మపత్ని యయ్యెను. ఆకాలమున నాహారవిషయంబున నెట్టి యడ్డంకులును లేవు.

బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులునుగూడ నొకరియన్నము నొకరు నిరాతంకముగ భుజించుచుండిరి.

శ్రీకృష్ణుఁడు రాజప్రాసాదమును వదలి విదురునియింటికిఁ బోయి యట నాతనియాతిథ్యము నంగీకరించెను. పాండవులకు జననియుఁ గృష్ణునకు మేనత్తయు నగుకుంతీదేవి యాయింటనే యుండెను. పాండవులు తమవనగమన కాలమునందామెను విదురునింట విడిచి పోయిరి. కృష్ణుఁడు కుంతికిఁ బ్రణామము గావింపఁ బోయెను. అప్పు డామె తన కొడుకులయుఁ గోడండ్రయు దుఃఖములను స్మరించుకొని కృష్ణునిసన్నిధి ననేకవిధముల దుఃఖింప నారంభించెను. ఆమెదుఃఖాలాపములకుఁ బ్రత్యుత్తరముగా నప్పుడు శ్రీకృష్ణుఁడు చెప్పినమాట లత్యంతము నమూల్యములైనవి. మనుష్యచరిత్రమునందలి సర్వవిషయములను సంపూర్ణముగ గ్రహించినవానికిఁ దక్క నితరుని కెవ్వనికి నట్టియమూల్యతత్త్వము బోధపడనేరదు. మూర్ఖుల కీసంగతియే తెలియదు.

అప్పుడు శ్రీకృష్ణుఁడు. "పాండవులు నిద్ర, తంద్ర, క్రోధము, క్షుధ, పిపాస, శీతము, ఆతపము మొదలగువానిని లక్ష్యముసేయక వీరోచితసుఖనిరతులై యున్నారు. వారింద్రియ సుఖంబులను గణింపక వీరోచితసుఖసంతుష్టులై యున్నారు, మహాబలపరాక్రాంతులును, మహోత్సాహసంపన్నులు నగునావీరశేఖరు లల్పవిషయంబులకు సంతుష్టు లగువారు కారు. వీరపురుషులగువా రతితరక్లేశము లేకుండగనే యత్యుత్కృష్టంబు లగుసుఖంబుల ననుభవించుచుందురు. మఱియును వారింద్రియసుఖాసక్తులమధ్యమునం దుండియు సంతుష్టులై యున్నారు. దుఃఖాకరం బగురాజ్యలాభమైనను, వనవాసమైనను వారికి సుఖనిదానమే" అని చెప్పెను.

"రాజ్యలాభమైనను, వనవాసమైనను" * అను వాక్యమును

*క్షుద్రహృదయ యగుసైతాను "స్వర్గమునందలి దాసత్వముకంటె నరకమునందలి రాజత్వమే శ్రేష్ఠమైనది" అని చెప్పినట్లు మిల్టనుకవి వ్రాసియున్నాఁడు

మాత్ర మాధునికహిందువులు గ్రహింపఁజాలరు. గ్రహించినచో నింతదుఃఖమే యుండనేరదు.

శ్రీకృష్ణుఁడు కుంతీదేవిం గాంచి పలికినాఁడు "శత్రువినాశనముం గావించి సకలలోకాధిపత్యముం గాంచి యపరిమితైశ్వర్యము ననుభవించుచున్న నీపుత్రులను నీ వచిరకాలమునకే చూడఁగలవు" అని చెప్పియుండెను.

కావున శ్రీకృష్ణుఁడు సంధి కుదురదనియును, యుద్ధమే జరుగుననియు దూరదృష్టిచే ముందుగనే గ్రహించి నిశ్చయించిన ట్లగపడుచున్నది. అయినను నాతఁడు సంధికొఱకు హస్తినాపురమునకు వచ్చియుండెను. తుదకు ఫలించినను ఫలింపకున్నను గర్తవ్యమును జేసియే తీరవలయును. ఫలాఫలములయం దనాసక్తుఁడై కర్తవ్యసాధనముం గావింపవలయును. ఇదియే కర్మయోగము. శ్రీకృష్ణుఁడు గీతయందు బోధించి యుండెను. మానవులకు యుద్ధముకంటె సంధియే హితకరమైనది. అందుచేతనే సంధిప్రయత్నముచ్చేయ నయ్యెను. కాని యథాసాధ్యంబగు ప్రయత్నము చేసినను సంధి కుదురనప్పుడు శ్రీకృష్ణుఁడే యుద్ధవిముఖుఁడగు నర్జునునకు రణోత్సాహముం గల్పించుటయందుఁ బ్రధానసహాయుఁ డయ్యెను. ఏమనిన—సంధి కుదురనప్పుడు యుద్ధమే కర్తవ్యమై యుండెను. కావుననే యాతఁడు గీతయందుఁ గర్మయోగము నుపదేశించియుండెను. ఆతఁడే స్వయముగ నావిషయమునఁ బ్రధానయోగియై యుండెను. ఆయాదర్శపురుషుని యుత్తమచరిత్ర

---

ఈవాక్యములకును బైనివ్రాసిన మహావాక్యములకు నెట్టిభేదములేదని చెప్పుపాఠకు లనేకు లుందురని యెఱుంగుదును; వారికి సంపూర్ణముగ మానవత్వ మున్నదనుటకు నాకెంతమాత్రమును లేదు. లఘుహృదయుఁడు ష్ఠురల యధికారమును సహింపఁజాలఁడు; మహాత్ముఁడు కర్తవ్యానురోధముచే దానిని సహించును. మహాకాంక్షితం [illegible] చిత్తవృత్తులకు మహాదుఃఖమో, మహాసుఖమో విస్ఫూర్తిం గల్పింపకలయును [illegible] తత్త్వ...నవేమిదియుం గూర్పఁజాలదని మహాత్ముల కొక్కనికిమాత్రమే తెలియును.

మును పాండవులకు సగము రాజ్యము నిప్పించినచో మనుష్యత్వము ననేమోయనసంక్షోభము నది చెప్పుటకే మేమింతవఱకుఁ బ్రయాసపడ వలసివచ్చినది.

కృష్ణుఁడు సాత్రియొద్ద సెలవుం గైకొని మరలఁ గౌరవసభకుఁ బోయెను. అప్పుడు దుర్యోధనుఁ డాతని భోజనమునకుఁ బిలిచెను. కాని యంతయు శ్రీకృష్ణుఁ డంగీకరింపలేదు. రాయబారులు దుర్యోధనునకు లోకనీతిని స్మృతిఁ జెప్పుచు 'మాటలవలనఁగాదు తమ కార్యసిద్ధి యైనతరువాతఁ గాని భోజనమును, పూజాగ్రహణమును గావింపరాదు. కావున నేను కృతప్రయత్నుఁడ నగునంతవఱకు మీసపర్యల నంగీకరింపఁజాలను.' అని చెప్పెను. అయినను దుర్యోధనుఁ డాపట్టు విడువక కృష్ణుని బలవంతపెట్టఁ దొడంగెను.

అప్పుడు కృష్ణుఁడు 'లోకము రెండ్వారైనను ప్రీతిచేఁగాని, విపన్నతచేఁగాని పరాన్నభోజనముం గావింతురు. నీవు నాయందలిప్రీతిచే నన్ను భుజింపుమని కోరుటలేదు; నేను విపన్నస్థితియందున్నవాఁడనై యుండుటయును లేదు. ఇట్టిచో నీయన్నమును నేనేల భుజింపవలయును?' అనియెను.

భోజనవిషయమున నిమంత్రణాగ్రహణము మనునది యొకసామాన్యకార్యము. కాని మనదైనికజీవన మంతయు నిట్టిసామాన్యకార్యముల సముదాయము మాత్రమే. సామాన్యకార్యములను గావించుట కొకనీతియున్నది—ఉండుటయుచితము. ఘనకార్యములనీతి కేది మూలమో యల్పకార్యములకుఁ గూడ నదియే—దానినే మతమని చెప్పవచ్చును. అయినను సచ్చరిత్రులగు మానవులకును నల్పజ్ఞానులగువారికిని భేదమున్నది అల్పబుద్ధులు మతవిముఖులు కాక యున్నను, సామాన్యకార్యములయందలి నీతితత్త్వము ననుసరించుట కసమర్థులై యుందురు. వారందలి నీతిమూలమును గ్రహింపఁజాలరు? ఆదర్శపురుషుఁ డెట్టియల్పకార్యములయందైనను నీతితత్త్వమును బరిశీలించి మెలంగుచుండును—

ఆనిమంత్రణగ్రహణము శ్రీకృష్ణునకు సరళత్వమునకునుసత్య మునకును విరుద్ధముగాఁ దోఁచెను. కావున నాతఁడు దుర్యోధనునకు సరళంబును, సత్యంబు నగునుత్తర మొసంగెను. పరుషమైనను స్పష్ట భాషణముం గావించుట కాతఁడు సంకోచపడలేదు. ధర్మానుమతంబ గునకపటవ్యవహారము పరుషముగాఁ దోఁచినప్పుడు మనము సంకో చించెదము. ఈధర్మవిరుద్ధం బగుసంకోచమే చాలవిషయములయందు మనలను మెల్లమెల్లగా నధర్మవిపన్నులం గావించుచున్నది.

తరువాతఁ గృష్ణుఁడు కౌరవసభనుండి విదురునియింటికిఁ బో యెను. ఆరాత్రి యాతఁడు విదురునితో ననేకవిషయములంగూర్చి సంభాషించెను. దుర్యోధనుఁడు సంధి కంగీకరింపఁడనియు, నీ విచ్చ టికి వచ్చుట యనుచిత మనియును విదురుఁ డాతని కెఱింగించెను. దానికిఁ గృష్ణుని ప్రత్యుత్తర మిది:—

‘రథగజతురగపదాతివర్గంబులచే విపర్యస్తం బగుసేనాసము దాయముగల భూమండలమును మృత్యుపాశమునుండి తప్పించుట కెవ్వఁడు సమర్థుఁ డగునో యాతనికే సర్వోత్కృష్టంబగుధర్మలాభంబు సిద్ధించును.’

ఐరోపాయండలి ప్రతిరాజప్రాసాదమునందును నీవాక్యములను స్వర్ణాక్షములతో లిఖించుకొనుట యుచితమై యుండును. కృష్ణుఁడు మఱియు నిట్లు చెప్పెను.—

“ఎవ్వఁడు వ్యసనగ్రస్తుండై బంధుకష్టవిమోచనంబునకై యథాసాధ్యముగఁ బ్రయత్నింపకుండునో యాతఁడు నృశంసుఁ డని పండి తులు చెప్పియున్నారు. ప్రాజ్ఞుఁ డగువాఁడు మిత్రుని సర్వలక్షణముల ను గనుపెట్టుచు నాతని నకార్యములనుండి మరలించుటకుఁ బ్రయ త్నింపవలయును. దుర్యోధనుఁడు హితకరంబు లగునావాక్యములను వినియును నావిషయమున సంశయించినచో నందువలవ ఘ్టనాకెట్టి

నష్టమును లేదు. మీఁదుమిక్కిలి బంధూపదేశంబనునాకర్తవ్యకార్యము మఱియు నమూల్యం బగుచున్నది. జ్ఞాతికలహము పుట్టినప్పుడు సమ పదేశంబు గావింపనివాఁ డాత్మీయుఁడు కాఁజాలఁడు"

శ్రీకృష్ణుఁడు కేవలమును బరస్త్రీలోలుఁడును బాపాత్ముఁడు నగుగోపాలుఁ డని యూరపియనుల నమ్మకము. ఈదేశమునందుఁ గూడఁ గొందఱి కట్టినమ్మక మున్నది. ఆతఁడు ప్రజానాశనంబునకై యవతరించెనని కొందఱియుద్దేశము. కృష్ణుఁడు కూటతంత్రనిపుణుఁ డని కొందఱి యభిప్రాయము—కాని శ్రీకృష్ణుఁడు వీరిలో నెవ్వఁ డును గాఁడు ఆతఁడు లోకహితాకాంక్షులలో నగ్రగణ్యుఁడు; జ్ఞాను లలో శ్రేష్ఠుఁడు శ్రీకృష్ణుడు ధర్మోపదేశకులలో నుత్తముఁడు; ఆదర్శపురుషుడు—ఈసంగతి తెలియుటకే యింతవఱకుఁ జెప్పవలసి వచ్చెను.

## సప్తమపరిచ్ఛేదము

### కరిపురమున ద్వితీయదివసము

మఱునాఁటి ప్రాతఃకాలమున స్వయముగా దుర్యోధనుఁడు శకునియును వచ్చి శ్రీకృష్ణుని విదురభవనమునుండి కౌరవసభకుఁదో డ్కొనిపోయిరి. అప్పుడు గొప్పసభ జరిగెను. నారదుఁడు మొదలగు దేవర్షులును జమదగ్ని మొదలగు బ్రహ్మర్షులును నచ్చటికి వచ్చియుం డిరి. అప్పుడు కృష్ణుఁడు ధృతరాష్ట్రు నుద్దేశించి ప్రౌఢభాషణంబు లతో సంధి విషయంబున దీర్ఘోపన్యాసంబు గావించెను. ఋషులు కూడ నట్లే చేసి యుండిరి. కాని యెందువలనను నెట్టిలాభమును లేకపోయెను. అప్పుడు ధృతరాష్ట్రుడు "నేనేమి చేయఁగలను! దుర్యోధనునకు బోధింపవలయును" అని చెప్పెను. తరువాతఁ గృష్ణభీష్మ

ద్రోణాదులు దుర్యోధనున కనేకవిధముల బోధించిరి. అందువలన సంధి కుదురకుండుటయే కాక తుదకు దుర్యోధనుఁడు కృష్ణునింగూర్చి పరుషముగా మాటలాడెను. కృష్ణుడు వానికిఁ దగిన యుత్తరమునే చెప్పెను. మఱియు నాతని దుశ్చరిత్రమును, పాపవర్తనమును ననేక రీతుల నిందించెను. దుర్యోధనుఁ డుగ్రుఁడై లేచిపోయెను.

ఆసమయమునఁ గృష్ణుఁడు సమస్త రాజనీతికి నేది మూలసూత్రమో దానిననుసరించి పనిచేయవలయు నని ధృతరాష్ట్రున కెఱింగించెను, ప్రజారక్షణంబునకై దుష్క్రియానిరతుని దండించుటయే రాజ్యశాసనమునకు మూలసూత్రము. అనఁగా బహుజనహితంబునకై యొకదుర్జనుని దండించుట కర్తవ్యము. సమాజరక్షణంబునకై హంతకుని వధింపవలయును. ఎవ్వని వధింపకున్నచో నాతని పాపాచరణముచే బహుసహస్రప్రాణి నాశనమగునో యట్టిదుష్టుని వధింపవలయు ననియే జ్ఞానులయుపదేశము. ఐరోపాయందలి సమస్త ప్రభువులును, మంత్రులును జేరి యీవిషయము నాలోచించి క్రీస్తుశకము 1815 వ సంవత్సరమున నెపోలియనును యావజ్జీవమును బంధించిరి-అందువలననే నీతిజ్ఞ శేఖరుఁడగు శ్రీకృష్ణుఁడు దుర్యోధనుని బంధించి పాండవులతో సంధి చేసికొను మని ధృతరాష్ట్రున కుపదేశించెను. శ్రీకృష్ణుఁడు స్వయముగా యదువంశరక్షణమునకై మేనమామయైనను గంసుని వధించుటకు బాధ్యుఁ డయ్యెను. శ్రీకృష్ణుఁడప్పుడు ధృతరాష్ట్రున కావిషయమునే యుదాహరణముగాఁ జూపించెను. ఈబోధ యంతయు నిరర్థకమయ్యె నని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

ఇట దుర్యోధనుఁడు క్రోధావిష్టుఁడై కృష్ణుని బంధింపవలయు నని కర్ణునితో నాలోచించుచుండెను. కృష్ణునకు జ్ఞాతివర్గములోనివారగు సాత్యకి కృతవర్మాదు లాసభయందే యుండిరి. సాత్యకి కృష్ణున కిత్యాంతము ననుగతుండును, ప్రియుండు నై యుండెను. మఱియు

నాతఁడస్త్రవిద్యయం దర్జునశిష్యుఁడు—ఎల్లవిధముల నర్జునునితో సమానుఁడు. ఇంగితజ్ఞుఁడును, మహాబుద్ధిమంతుఁడు నగుసాత్యకి వారి దుర్మంత్రమునుగ్రహించి, యితరయాదవవీరులను, కృతవర్మను ససైన్యముగఁ బురద్వారంబున నిలువ నియోగించి దుర్యోధనుని దురాలోచనముం గూర్చి కృష్ణునకును సభామధ్యమునందున్న ధృతరాష్ట్రాదులకును విస్పష్టముగ నెఱింగించెను.

ఆసంగతి విని విదురుఁడు ధృతరాష్ట్రునిగూర్చి "పావకజ్వాలలం బడి పతంగములు భస్మములై పోవును. వీనికిఁగూడ నట్టిగతి కలుగవలయునా యేమి? జనార్దనుఁడు తలంచినచో సమరరంగమున సకలదుశ్చరితులను శమనసదనంబున కనుపఁగలఁడు—" అని చెప్పెను.

తరువాతఁ గృష్ణుఁ డాదగ్నపురుషుఁడై సంకులుఁ దగినట్లుగా సంభాషించెను. ఆతఁడు బలశాలి యయ్యును క్రోధశూన్యుండును, క్షమాశీలుఁడు నైయుండెను. అప్పు డాతఁడు ధృతరాష్ట్రునితో నిట్లనియెను !—

'దుర్యోధనాదులు కోపముతో నన్ను బలవంతముగ బంధింపఁ దలంచుచున్నట్లు వినియుంటిని. కాని వీరు నన్నాక్రమించెదరో, నేనే వీరినందఱ నాక్రమించెదనో నీవు చూచుచుండుము. ఏకాకి నయ్యు నీయందఱను నే నాక్రమింపగలను. నాకట్టి సామర్థ్య మున్నది. కాని నిందితంబును, పాపజనకంబును నగు కార్యమును నే నెన్నటికిని జేయఁబోను. నీపుత్రులే పాండవుల యర్థంబున కాసించి స్వార్థభ్రష్టుల య్యెదరు. వాస్తవముగా వీరు నన్ను బంధింపఁ దలంచుట యుధిష్ఠిరునిం గృతార్థుని గావించుటయే. నేనీక్షణమునందే వీరిని వీరియనుచరులను గూడ నిర్జించి పాండవులకు రాజ్యప్రదానంబుఁ గావింపగలను. అందువలన నాకెట్టి పాపమునుగూడఁ గలుగఁబోదు. కాని క్రోధపాపజనితంబులును, గర్హ్యంబులు నగునిట్టికార్యములు నీవంటివానియెదుటజరగ

గూడదు. నే ననుమతించి సిద్ధముగా నున్నాను. దుర్నీతిపరాయణుం డగు దుర్యోధనుఁ డిప్పు డేమి చేయఁదలంచెనో చేయునుగాక!'

ఇట్లు చెప్పినతరువాత ధృతరాష్ట్రుడు దుర్యోధనుని దన చెంతకుఁ బిల్పించి యతికఠినభాషణంబులచే నాతనిమందలించుచు నిట్లనియెను:-

'నీవు కేవలమును నృశంసుఁడవును, పాపాత్ముడవును, నీచాశయుండవు నగుటం జేసి యసాధ్యుండవును, భయంకరుండవును, సాధుగర్హితుండవును, పాపాచరణసముత్సుకుండవు నై యుంటివి. కులదూషకా! మూఢునివలె దురాత్ములతోఁ గలసి యత్యంతమును దుర్ధర్షుడగు జనార్దనుని నిగ్రహింపఁ దలంచుచున్నాడవు. బాలకుఁడు చంద్రునిం బట్టుకొనుటకుఁ గుతూహలపడినట్లే యింద్రాది దేవగణంబులకుగూడ దురాక్రమ్యుఁ డగు కేశవుని నీవు నిగ్రహింప నపేక్షించుచున్నావు. దేవమానవగంధర్వులును, నసురులు, నురగులునుగూడ సంగ్రామమునం దెవ్వని పరాక్రమమును సహింప నసమర్థు లగుచుందురో యట్టి కేశవుని సామాన్యునిగా నీవు భావించుచుంటివా? వత్సా! వాయువును జేతులతో గ్రహించుట కెన్నడైన సాధ్యమగునా? అగ్నిజ్వాలను హస్తములతో నంటుట సాధ్య మగునా? మహీమండలమును దుస్తకముల ధరించుసామర్థ్య మెవ్వని కున్నది? తండ్రీ! బలముచేఁ గేశవుని నిగ్రహించుట యెన్నటికిని సాధ్యము కాదు''

పిమ్మట విదురుండును దుర్యోధను ననేకవిధంబుల మందలించెను. విదురుఁ డట్లు బోధించినపిమ్మట వాసుదేవుఁ డుచ్చహాస్యంబు చేయుచు సాత్యకికృతవర్మల కరగ్రహణంబు గావించి కౌరవసభ నుండి వెడలిపోయెను.

ఇంతవఱకును మహాభారతమునందుఁ జెప్పఁబడిన భగవద్ధ్యాన వృత్తాంత మంతయును సుసంగతముగను, స్వాభావికముగను నున్నది. అం దెట్టిగొడవయును లేదు; అస్వభావ విషయ మొక్కటియును లేదు

అవిశ్వాసమునకుఁ గారణ మేమియు లేదు. కాని ప్రక్షిప్తకారులుమాత్ర మీవిశేషమున కెంతమాత్రమును సహింపఁజాలకపోయిరి. ఇంతటి మహాద్వాపారమునం దొకవిధమగు నస్వాభావాద్భుతవృత్తాంతమును జేర్పకయే యున్నచో నిక శ్రీకృష్ణునియాశ్వరత్వమును సంరక్షించు వారెవ్వ రున్నారు? ఈసంగతిని బాగుగా నాలోచించియే వారు శ్రీకృష్ణునిహాస్యాపకునకును, నిస్సాంతికిని నమను నొకవిశ్వరూపప్రకాశము ను బ్రక్షిప్తంబు గావించిరి. ఇట్లే మహాభారతమున భీష్మపర్వమున, భగవద్గీతాపర్వాధ్యాయమందుఁగూడ (అదియును బ్రక్షిప్తము కావచ్చును; కాకపోవచ్చును) మఱియొకసారి విశ్వరూపప్రదర్శనము వర్ణింపఁబడి యున్నది. ఆవిశ్వరూపవర్ణమునకును, నీవర్ణమునకును నెంతయో భేదమున్నది. గీతయందలి యేకాదశాధ్యాయమునం గల విశ్వరూపవర్ణము ప్రథమశ్రేణియందలికవిచేవర్ణితమైనది. సాహిత్యప్రపంచమునం దెంత వెదకినను నిట్టివర్ణనము మఱియొకచో లభింపదు. ఈ భగవద్ధ్యానపర్వాధ్యాయమున నీవిశ్వరూపవర్ణనముం గావించిన పక్షమునఁ గావ్యరచన యనునది కేవలమును విడంబనామాత్రమై యున్నది- భగవద్గీతయందలి యేకాదశాధ్యాయమున శ్రీకృష్ణుఁ డర్జునునిం గాంచి "ఇంతకుముం దీవిశ్వరూపమును నీకంటె నితరు లెవ్వరును జూచియుండలేదు" అని చెప్పినట్లున్నది. కాని యారూపము నర్జునునికంటె ముందుగా దుర్యోధనాదులు కౌరవసభయందే కాంచిన ట్లింనువలనఁ దెలియుచున్నది- మఱియు శ్రీకృష్ణుఁడు భగవద్గీతయందు "వేదాధ్యయనము, యజ్ఞానుష్ఠానము, దానము, సత్క్రియాకలాపము, కఠోరతపస్సు మొదలగు సత్కర్మలు గావించినవారుగాక మానవులలో నితరు లెవ్వరును నీవలె నాయీవిశ్వరూపమును దర్శించుటకు సమర్థులు" కాఁజాలరు అని చెప్పినట్లున్నది. కాని యావిశ్వరూపమిచ్చటఁ గుకవిహస్తమునం బడి జనసామాన్యమున కంతకును

నతిసులభముగఁ బ్రత్యక్ష మయ్యెను. మఱియు భగవద్గీతయందు "అనన్యసాధారణం బగుభక్తిని బ్రదర్శింపఁ గలిగినచో నన్నీరూపముగా గ్రహింపవచ్చును. అట్టివాఁడు నన్ను దర్శించి దాయందు విలీనుండగుటకు సమర్థుఁ డగును" అని చెప్పఁబడియెను. కాని యిచ్చట దుష్క్రియాపరులును, పాపాత్ములును, భక్తిశూన్యులునగు శత్రువులకుఁ గూడ నట్టిదివ్యరూప సందర్శనమే లభించినది.

మూర్ఖుఁడుకూడ నిష్ప్రయోజనముగా నేపనియును జేయఁడని నప్పు డిక విశ్వమూర్తియగు శ్రీకృష్ణునిమాట చెప్పవలయునా? ఇచ్చట విశ్వరూపప్రదర్శనమున కెంతమాత్రమును బ్రయోజనము లేదు. దుర్యోధనాదులు వట్టియాలోచనయేగాని యిచ్చట నెట్టిబలప్రయోగమును గావించి యుండలేదు. ఒకవేళ వారు బలప్రయోగము గావించినను నిరర్థకమని కృష్ణునకుఁ దెలియును. ఆతఁడు స్వయముగా నెంతటివారికైనను లొంగని బలశాలి. ఈసంగతి ధృతరాష్ట్రుఁడును విదురుఁడును గూడఁ జెప్పియుండిరి. స్వయముగాఁ గృష్ణుఁడును జెప్పెను. తనయాత్మరక్షణమునకుఁ దనబలము చాలకపోయినను గృష్ణున కెంతమాత్రము నాభయము లేదు. సాత్యకికృతవర్మాదులును, మహాబలపరాక్రాంతులగు వృష్ణివీరులును నాతనికి సహాయులై యుండిరి వారి సైన్యములు రాజద్వారమున సంసిద్ధములై యుండెను. దుర్యోధనుఁడు సేనలతో సన్నద్ధుఁడైనట్లెంతమాత్రము నగపడుట లేదు. దుర్యోధనుని దుష్ప్రయత్నము ఫలించునేమో యని కృష్ణునకు సంశయమును లేదు. అంతమాత్రమున భయపడుటకుఁ గృష్ణుఁ డంతటిపిఱికివాఁడు కాఁడు. ఈకారణముల నన్నిటినిబట్టియుఁ జూడఁగా నిచ్చట విశ్వరూప ప్రదర్శనమున కెట్టిప్రయోజనమును లేదు. ఇట్టియవస్థలోఁ గ్రుద్ధుఁడును దాంభికుండునుదక్క మఱియెవ్వఁడును శత్రువునకు భయప్రదర్శనముం గావించుటకై ప్రయత్నింపఁడు ఎవ్వఁడు విశ్వరూపుఁడో యాతఁడు దంభక్రోధశూన్యుఁడుగనే యుండును.

కావున నిచ్చటి విశ్వరూపవృత్తాంతము కుకవిప్రణీతంబగు నలీకోపన్యాస మనిచెప్పి పరిత్యజించుటయే కర్తవ్యము. కృష్ణుఁడు మానవశక్తినిమాత్రమే యవలంబించి కార్యములం గావించు చుండెనుగాని యీశ్వరశక్తి నవలంబించుట లేదని మేము మరల మరలఁ జెప్పుచున్నాము.

కౌరవసభనుండికృష్ణుఁడుకుంతీదేవియొద్దకుం బోయి యామెతో సంభాషించెను. తరువాత నామెకడ సెలవుగైకొని పాండవులు నివసించియున్న యుపప్లావ్యనగరమునకుం బోవఁ బ్రయాణ మయ్యెను. ప్రయాణసమయమునం దాతఁడు కర్ణుని దనరథముపై గూర్చుండఁజేసికొని బయలుదేరెను.

శ్రీకృష్ణుని నిర్బంధింపవలయు నని యాలోచించిన వారిలోఁ గర్ణుఁడుకూడ నున్నాఁడు. ఇట్టిచోఁ గృష్ణుఁ డాతనిం దనరథముపై నెక్కించుకొని తీసికొనిపోవుటకుఁ గారణ మేమో తరువాతిప్రకరణమునం దెలిపెదము. ఆకథయందుఁ గృష్ణచరిత్రము పరిస్ఫుటము కాఁగలదు. సామదండోపాయములందుఁ గృష్ణునినీతిజ్ఞత నిదివఱకుఁ జూచియుంటిమి. ఇఁక భేదనీతియం దాతనిపారదర్శిత్వమును గాంచవలయును దానితోఁగూడ శ్రీకృష్ణునిదయయు. జీవహితకాంక్షయు, బుద్ధిప్రభావముఁగూడ లోకాతీతంబులనియును, నాతఁడు నిశ్చయముగా నాదర్శపురుషుఁడే యనియును బోధపడఁ గలదు.

---

## అష్టమ పరిచ్ఛేదము

### కృష్ణ కర్ణ సంవాదము

కృష్ణుఁడు సర్వభూతదయామయుఁడు. ఈమహారణంబున నెంత ప్రజాక్షయంబగునని యేక్షత్రియుడును విచారింపలేదు ; కేవలమును

గృష్ణుఁ డొక్కఁడే దుఃఖించెను. మొట్టమొదట విరాటనగరమున యుద్ధప్రస్తావము కలిగినప్పుడు కృష్ణుఁడు తనయసమ్మతమును దెలిపి యున్నాఁడు. అర్జునుఁ డాతనిం దనకు యుద్ధసహాయుఁడవు కమ్మని కోరఁబోయినప్పుడు కృష్ణుఁడు నేను నిరాయుధుఁడనై యుండెదననియు స్వయముగా యుద్ధము చేయువాఁడ గాననియును బ్రతిజ్ఞ చేసెను. కాని యందువలనఁ గూడ యుద్ధము తప్పినదికాదు. అందుచే నుపాయాంతరము లేక ధైర్యశూన్యుఁడై యుండియు నాతఁడు సంధిస్థాపనంబునకై ధృతరాష్ట్రునిసభకుఁ బోయెను. దానివలనఁగూడ నేమియు లాభము లేకపోయెను; జీవహింసానివారణము కాకపోయెను. అప్పుడు రాజనీతిజ్ఞుఁడగు కృష్ణుఁడు జనసమాజసంరక్షణార్థ ముపాయాంతరము నాలోచించెను.

కర్ణుఁడు మహావీరపురుషుఁడు. అతఁడర్జునునకుఁ బ్రతికక్షియగు రథికుఁడై యుండెను. అతని బాహుబలమునుబట్టియే దుర్యోధనుఁడు తాను బలవంతుఁడ ననుకొనుచుండెను. ఆతని బాహుబలమునే యాధారముగఁ జూచుకొని దుర్యోధనుఁడు పాండవులతో యుద్ధముచేయుటకుఁ బూనుకొనియెను. కర్ణసాహాయ్యమే లేకున్నచో నాతఁడు యుద్ధమునఁ బ్రవేశింపఁజాలఁడు, కర్ణుఁడు శత్రుపక్షమునకు సాహాయ్యము గావించునని తెలిసినచో నాతఁ డవశ్యముగ యుద్ధమునుండి నివృత్తుఁడగును. అది యెట్లు సాధ్యమగునో యాకార్యముం గావింపవలయుననియే కృష్ణుఁడు కర్ణునిం దనరథముపై నెక్కించుకొని తీసికొనిపోయెను. ఆతనికిఁ గర్ణునితో సంభాషించుట యావశ్యకమై యుండెను.

కృష్ణుని యీయభిప్రాయసిద్ధి కుపయుక్తంబగు నితరుల కెఱుకపడని సహజోపాయము కూడ నున్నది.

కర్ణుఁ డతిరథుఁ డనుసూతునకుఁ బుత్రుఁడుగాఁ బరిచితుఁడై యుండెను. వాస్తవముగా నాతఁ డతిరథుని పుత్రుఁడు కాఁడు; పాలిత

పుత్రుఁడుమాత్రమే. ఆసంగతి కర్ణునకుఁ దెలియదు. అతనికిఁ దనజన్మ వృత్తాంతము తెలియదు. అతఁడు సూతపత్నియగు రాధగర్భమున జనించినవాఁడు కాక కుంతీగర్భసంజనితుఁడును, సూర్యున కౌరసుఁడు నై యుండెను. కాని కుంతికన్యగా నున్నసమయమునం దాతఁడు జన్మించుటచే నామె యప్పుడే యాతని బరిత్యజించెను. వాస్తవముగా నాతఁడు యుధిష్ఠిరాదిపాండవులకు సహోదరుఁడును, జ్యేష్ఠభ్రాత యునైయుండెను. ఈవృత్తాంతము కుంతికంటె నితరు లెవ్వరు నెఱుఁగరు. ఇఁకఁ గృష్ణుఁడొక్కఁ డెఱుఁగును. అతని యలౌకికబుద్ధికి సకల వృత్తాంతములును సహజముగా నెఱుకపడుచుండును. కుంతి యాతనికి మేనత్త. ఆమె భోజరాజుగృహమం దుండఁగా నిట్లు జరగుట తటస్థించెను. కావునఁ గృష్ణుఁడు మానవోచితబుద్ధితోడనే యీసంగతిని గ్రహించుట యసంభవము.

కృష్ణుఁడిప్పు డీవృత్తాంతమును రథారూఢుండగు కర్ణున కెఱింగించెను. అతఁడు కర్ణునింగాంచి "ఒక కన్యను బెండ్లియాడినవాఁ డా కన్యకన్యాత్వమునం గన్నపుత్రునకును దండ్రియగునని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఓకర్ణా! నీవును నీతల్లియగు కుంతీదేవికిఁ గన్యావస్థ యందుఁ బుత్రుఁడవైతివి. ఆకారణముచే నీవు ధర్మశాస్త్రానుసారముగాఁ బుత్రుఁడవు. కావున నాతో రమ్ము. ధర్మశాస్త్రమునకు విరుద్ధంబైనను * నీవు రాజ్యేశ్వరుండ వయ్యెదవు" అని చెప్పెను. మఱియు నాతఁడు కర్ణునితో నీవు జ్యేష్ఠుఁడవనియు నందుచే నీవే రాజవయ్యెదవనియుఁ బంచపాండవులును నీయాజ్ఞానువర్తులై నీపరిచర్యలం గావించుచుండెద రనియు నెఱింగించెను.

---

* "విరుద్ధంబైనను" అను నీమాట కాళీప్రసన్నసింహుని యనువాద మందున్నది. కాని, యిది యిచ్చట నసంగతముగాఁ దోఁచుచున్నది. మేము మాయొద్ద నున్న మూలమహాభారతమును జూచితిమి. అందు "నిగ్రహార్థ మశాస్త్రాణామ్" అని యున్నది. "నిగ్రహార్థాయ శాస్త్రాణామ్" అని యుండునని తోఁచుచున్నది, అట్లయినచో నర్థము నసంగత మగును.

కృష్ణుని యీయుపదేశము సర్వజనులకును ధర్మవృద్ధికరంబును హితకరమునై యున్నది. ముందుగాఁ గర్ణునిపక్షమున హితకరమైనది. ఆతఁడు రాజ్యేశ్వరుఁ డగును. అదియే యాతనికి ధర్మము కూడను- ఏమనిన-భ్రాతృగణంబునెడల శత్రుభావమును బరిత్యజించి మిత్రభావము నవలంబించిన ట్లగును. ఇది దుర్యోధనుని పక్షమునకుఁ గూడ హితమే. ఏమనిన యుద్ధము జరిగినచో వారు రాజ్యభ్రష్టు లగుటయే గాక సమూలముగ నశించిపోవుదురు. యుద్ధము లేకున్నచో వారందఱును బ్రదుకుదురు; వారి రాజ్యము నిలుచును; కేవలమును బాండవుల భాగము మాత్రమే వారీయవలసియుందురు. మఱియు నిది పాండవులకుఁగూడ హితమును ధర్మమునై యున్నది. యుద్ధరూపమున నృశంసవ్యాపారమునఁ బ్రవేశింపకుండఁగనే బంధుమిత్రజ్ఞాతివధంబు గావింపకుండగనే వారికి గర్ణునితోఁగూడ స్వారాజ్యము ననుభవించుట తటస్థించును. ఇంతేకాక ధర్మాత్ముండగు శ్రీకృష్ణుని యీ యాలోచనమునకు ముఖ్యహితోద్దేశమేమనిన-దీనివలన నసంఖ్యప్రజాగణంబులకుఁ బ్రాణరక్షణంబు కాఁగలదు.

కర్ణుండును శ్రీకృష్ణునివాక్యంబుల యుపయోగము సంగీకరించెను. ఈయుద్ధమున దుర్యోధనాదుల కెంతమాత్రమును రక్షణము లేదని యాతఁడును గ్రహించెను. కాని కృష్ణుని మాటలకు సమ్మతించినచోఁ దా నే వేవియో మహాపరాధములను గావించినవాఁడ నగుదునని కర్ణుఁడు భావించుకొనియెను. అధిరథుఁడును రాధయు నాతనిం బెంచియుండిరి: ఆతఁడు వారియాశ్రయమునందే యుండి సూతవంశమునందొక కన్యను బెండ్లియాడి పుత్రపౌత్రాదులం గాంచి యుండెను వారి నాతఁ డేవిధముచేతను బరిత్యజింపఁ జాలఁడు. మఱియు నాతఁడు పదుమూఁడవయేటినుండియు దుర్యోధను నాశ్రయించి రాజ్యభోగముం గాంచియుండెను. దుర్యోధనుఁ డాతనిమీఁదనే యాధారపడి

యుండెను. ఇట్టిస్థితిలో దుర్యోధనుని బరిత్యజించి పాండవపక్షమునం జేరినచో లోకులాతనిని గృతఘ్నుఁడనియుఁ బాండవైశ్వర్యలుబ్ధుఁడనియు నిందింపక మానరు; పాండవులకు భయపడిన పిఱికివాఁడని కూడ భావింతురు. ఈకారణములచేఁ గర్ణుఁడు కృష్ణునివాక్యముల నెంతమాత్రమును నంగీకరింపఁజాలకపోయెను.

అప్పుడు కృష్ణుఁడు "నామాటలకు నీవు సమ్మతింపకుండుటం బట్టి చూడఁగా నివ్వసుంధరకు సంహారదశ సంభవించినదని నిశ్చయముగాఁ దోఁచుచున్నది" అనియెను.

కర్ణుండును నాతనిమాటల కుచితంబులగు ప్రత్యుత్తరముల నొసంగి శ్రీకృష్ణుని గాఢాలింగనంబు గావించుకొని విషణ్ణహృదయముతో సెలవు గైకొనియెను.

కృష్ణచరిత్రముం దెలిసికొనుటకై కర్ణచరిత్రమును విస్తారముగ విమర్శించుటవలనఁ బ్రయోజనము లేదు. అందుచే మేమీవిషయమున నేమియును జెప్పలేదు. కర్ణచరిత్రముకూడ నతిమహత్తరమును నతి మనోహరము నైనదిరా.



## నవమపరిచ్ఛేదము

### ఉపసంహారము

కృష్ణుఁ డుపప్లావ్యనగరమునకుఁ దిరిగివచ్చినతోడనే యుధిష్ఠిరాదులు "నీవు హస్తినాపురమునకు బోయి యేమి చేసికొనివచ్చితివి?" అని యాతని నడిగిరి.

అప్పుడు కృష్ణుఁడు కౌరవసభలోఁ దాను జెప్పినమాటలను మఱియు నితరులు చెప్పినమాటలను వారి కెఱింగించెను. కానిపూర్వాధ్యాయమున వర్ణింపఁబడిన యామాటలకును నీయధ్యాయమునందలి

మాడలకును సంబంధము సరిగాలేదు. ఒకదానితో నొకటి కలయుట లేదు. కలసినను దీర్ఘసమాసపునసుక్తులతో నిండియుండెను. ఎవ్వఁడో యొకమహానుభావునిచేయి యిందుఁ బ్రవేశించి యుండు నని తోఁచుచున్నది.

ఇంతటితో భగవద్ధ్యానపర్వాధ్యాయము సమాప్తమైనది. దీని తరువాత సైన్యనిర్ణయ పర్వాధ్యాయము. ఇందు విశేష విషయము లేవియును లేవు. ఇందుఁ గొన్ని మాలికవృత్తాంతములున్నవి. కాని మఱికొన్ని యమాలికములుకూడ నున్నవి. కృష్ణునకు సంబంధించిన వృత్తాంతము లిందు స్వల్పముగా నున్నవి. కృష్ణార్జునుల యాలోచనానుసారముగాఁ బాండవులు ధృష్టద్యుమ్నుని సేనానాయకుల గావించిరి. బలరాముఁడు మదిరాపానవివశుఁడై వచ్చి శ్రీకృష్ణుని సమధురముగ మందలించెను. ఏమనిన బలదేవుఁడు కురుపాండవులయెడల సముఁడై యుండలేదు—మఱియుఁ గురుసభయందు జరిగినవృత్తాంతముకూడ నిందుఁ గొంతయున్నది. ఇంతకంటె నీయధ్యాయమున మఱి యేమియును లేదు.

తరువాత, ఉలూకదూత పర్వాధ్యాయము. ఇది కేవలము ననుపయుక్తమైనది. కేవల ముభయపక్షములవారి హడావడితప్ప నిం దేమియును లేదు. దుర్యోధనుఁడు శకునిప్రభృతుల యుపదేశానుసారముగా నులూకుని బాండవులయొద్దకు దూతగాఁ బంపించెను. అట్లు పంపుట కుద్దేశ మేమియును లేదు కేవలమును బాండవులను గృష్ణుని నిందించుటయే యుద్దేశము ఉలూకుఁడు వచ్చి యాయాద్వారను నిందించెను. వానికిఁ బ్రత్యుత్తరముగాఁ బాండవులును నిందోక్తులం బలికిరి. కృష్ణుఁడు విశేషముగ నేమియు మాటలాడలేదు. రోషామర్షశూన్యుఁడగు శాంతనివంటివాఁడు పరుషసంభాషణముం గావించునా? వృథా [illegible] [illegible]గనుండుటకై శ్రీకృష్ణుఁడు పాండవు లుత్తర మిచ్చుటకు

ముందుగనే యులూకుని గాంచి "పాండవులు నీమాటల నాలకించి వానియర్థమును గ్రహించి యున్నారు? ఇప్పటి మీ యభిప్రాయము సరిగనే యున్నది. మఱియు మీతిరస్కారవచనములకు విశేషముగాఁ కృష్ణార్జునులే బాధ్యులై యున్నారు" అని చెప్పెను.

కాని యులూకుఁ డింకను గననుర్బుద్ధిని విడువలేదు. అతఁడు మరల నిందించుట కారంభించెను. నిందింపకేమి? అతఁడు దుర్యోధనుని సోదరుఁడుకదా! అప్పుడు పాండునందనులొక్కొక్కరుగఁ బ్రత్యుత్తరమిచ్చి వడ్డితోఁగూడ నాతనియప్పును దీర్చివైచిరి. కృష్ణుఁ డొకమాట చెప్పెను "నే నర్జునునకు సారథినై యుండుటకు మాత్రమే యంగీకరించుటచే యుద్ధము చేయనుగదా యని నిశ్చయించుకొని మొగసి పడవలదు. హుతాశనుఁడు తృణసమూహమును భస్మంబు గావించి నట్లే నేనును దుట్టతుదకుఁ గ్రోధావేశముచే సకలపార్థివమండలమును సంహారంబు గావించెదను; సందేహము లేదు"

ఉలూక దూతగమనపర్వాధ్యాయము మహాభారతకావ్యపథంబున నించుకంతయును బ్రయోజనము లేదు. ఇందలికవిత్వమున రచనానైపుణ్యమును లేదు; మఱియు నచ్చటచ్చటఁ గొన్ని భారతాంశములకు వైరుధ్యముకూడఁ గానంబడుచున్నది. అనుక్రమణికాధ్యాయమున సంజయకృష్ణుల దౌత్యవృత్తాంతముమాత్రమే యున్నది; కాని యులూకదౌత్యవృత్తాంతము లేదు. ఈకారణములనుబట్టి యిది ప్రథమశ్రేణియందలి కవిరచన కాదని తోఁచుచున్నది.

దీని తరువాత రథాతిరథసంఖ్యానపర్వాధ్యాయము, పిమ్మట, అంబోపాఖ్యానపర్వాధ్యాయము. వీనిలో గృష్ణవృత్తాంత మేమియును లేదు. ఇంతటితో నుద్యోగపపర్వము సంపూర్ణ మయ్యెను.

---

# భాగవతకథాసారము

## ద్వితీయభాగము

## షష్ఠఖండము

యో విష్ణో ర్భవేద్రాత్రౌ దివా భవతి విష్ఠితః
ఇష్టానిష్టస్య చ ద్రష్టా తస్మై ద్రష్టాత్మనే నమః
శాంతిపర్వము ౪౭ అధ్యాయము

### ప్రథమపరిచ్ఛేదము

#### భీష్ముని యుద్ధము.

ఇప్పుడు కురుక్షేత్రమున మహాయుద్ధారంభ మయ్యెను. మహాభారతమునందలి నాలుగుపర్వములలో నీమహారణము వర్ణింపఁబడియుండెను. దుర్యోధనుని సేనానాయకులనామముల ననుసరించి యీ నాలుగు పర్వములును భీష్మ ద్రోణ కర్ణ శల్య పర్వములుగాఁ జేర్పఁబడియెను.

ఈయుద్ధపర్వములను మహాభారతమునందలి నికృష్టభాగములలోనివానిగాఁ బరిగణింపవచ్చును. వీనియందుఁ బునరుక్తియు, నకారణ నీరసపర్ణనాగాఢబాహుళ్యంబును, నసైసర్గికతయు, నత్యుక్తియు, నసంగతియు నను దోషములు విశేషములుగా నున్నవి. ఇందాదికవిరచన స్వల్పభాగముగనే యున్నట్లు బోధ యగుచున్నది. కాని యేభాగము మౌలికమో, యేది యమౌలికమో స్థిరపఱుచుట కష్టము. కంటక వనమునఁ బుష్పాపచయంబు గావించుట దుస్సాధ్యకార్యము. అయినను మాకిందుఁ గృష్ణచరిత్ర కనుకూలించు విషయములు కానవచ్చి

నచోటుల నెల్ల యథాసాధ్యముగా విశదీకరించుటకుఁ బ్రయత్నించె దము. భీష్మపర్వమునకు మొదట జంబూఖండవినిర్మాణపర్వాధ్యాయము కలదు. దానితో యుద్ధమున కెట్టిసంబంధమునులేదు— మహాభారతకథకును సంబంధము స్వల్పముగా నున్నది. అందుఁ గృష్ణచరిత్ర మేమియును లేదు. తరువాత భగవద్గీతాపర్వాధ్యాయము. ఇం దిరువది నాలుగధ్యాయములకుఁ బిమ్మట గీత యారంభమైనది. ఈయిరువది నాలుగధ్యాయములలోనను గృష్ణ సంబంధ మించుకంతయును లేదు. యుద్ధమునకుఁ బూర్వము దుర్గాస్తవముం గావింపుమని శ్రీకృష్ణుఁ డుపదేశించుటయు నర్జునుఁడు యుద్ధారంభసమయమున దుర్గాస్తోత్రముం గావించెను. గొప్పగొప్ప కార్యముల నారంభించుపట్టునఁ దమమత విశ్వాసముల ననుసరించి దేవతారాధనముం గావించుట యవశ్యకర్తవ్యమై యున్నది. అట్లయినచో నీశ్వరారాధనము గావించి నట్లగును. ఎవ్వ రెట్లు ప్రార్థించినను నీశ్వరుఁ డొక్కఁడే కదా!

తరువాత గీత. ఇదియే శ్రీకృష్ణచరిత్రమునకుఁ బ్రధానాంశము. గీతోక్తం బగుననుపమపవిత్రధర్మప్రచారమే కృష్ణుని యాదర్శమానవత్వమునకైనను, దేవత్వమునకైనను బ్రధాననిదర్శనమై యున్నది.

కాని మే మిచ్చట గీతాసంబంధమున నెట్టిమాటయును జెప్పము. ఏమన—ఈగీతోక్తధర్మముంగూర్చి వేఱొకగ్రంథమున నించుక వెల్లడించియుంటిమి. * ఇఁకముందుఁగూడ T నొకగ్రంథమును వ్రాయుట కుద్యుక్తులమై యున్నాము. గీతాసంబంధమున మాకుఁ గల యభిప్రాయ మీరెండుగ్రంథములవలనను దెలియఁ గలదు. ఇఁక నిచ్చటఁ బునరుక్తివలనఁ బ్రయోజనము లేదు.

భగవద్గీతాపర్వాధ్యాయమునకుఁ దరువాత భీష్మవధపర్వాధ్యాయము. ఇచ్చటనే యుద్ధారంభము. యుద్ధమునందుఁ గృష్ణుఁ

* ఆగ్రంథముపేరు ధర్మతత్త్వము

T. శ్రీమద్భగవద్గీతకు బంగాళా వ్యాఖ్యానము.

దర్జునునకు సారథిమాత్రమే. సారథులు చాలదురదృష్టవంతులు. మహాభారతయుద్ధమునఁ దఱచుగా ద్వైరథయుద్ధములే వర్ణితములై యుండెను. రథికులు యుద్ధము సేయునప్పు, డొండొరులు తురగసారథులను వధించుటకై ప్రయత్నించుచుందురు. కారణ మేమనిన— గుఱ్ఱములో సారథియో నశించినచో నిఁక రథము చలింపఁజాలదు. రథము కదలకుండినచో రథికుఁడు విపన్నుఁ డగును. సారథు లెన్నఁడును యుద్ధము సేయువారు కారు. వారు నిర్దోషులు; నిహతులగుచుందురు. కృష్ణుఁడుకూడ నట్టిసుఖమునకే భాగహారి యయ్యెను. ఆతఁడు మరణింపలేదు; కాని యుద్ధము జరుగుచున్న పదునెనిమిదిదినములును బ్రతిదినమునందును నాతఁ డసంఖ్యాకశరాహతులచే విక్షతసర్వావయవుఁ డగుచుండెను. ఇతరసారథు లాత్మరక్షణవిషయంబున నసమర్థులైయుండిరి. వారందఱును వైశ్యులు; క్షత్రియులుగారు. కృష్ణుఁ డాత్మరక్షణంబునకు మిగుల సమర్థుఁ డయ్యును గర్తవ్యానురోధంబున శరాఘాతంబులకు సైరించుచుండెను.

మహాభారతయుద్ధమునందుఁ గృష్ణుఁ డస్త్రధారణము చేయలేదు; అట్లు చేయనని ప్రతిజ్ఞకూడ గావించియుండెను. కానిరొక్కదినమునందుమాత్ర మాతఁ డస్త్రధారణముం గావించెను. అస్త్రమును ధరించుటమాత్రమే కాని దానిని బ్రయోగింపలేదు. ఆసంఘటన మిట్లున్నది:—

భీష్ముఁడు దుర్యోధనునకు సేనానాయకుఁడై యుద్ధముచేసెను. ఆతఁడు మహారణమునం దతినిపుణుడు. పాండవసేనలో నొక్కయర్జును నికంటె నాతనితో సమానులగువా రెవ్వరును లేరు. కాని యర్జునుఁడు తన సామర్థ్యమునంతను జూపి విశేషముగా నాతనితో యుద్ధము చేయలేదు. దానికిఁ గారణ మేమనిన—భీష్ముఁ డర్జునునకుఁ

బితామహుఁడు; పితృవిహీనులగు పాండవులను జిన్నతనమునుండి యును దండ్రింబోలి ప్రతిపాలించెను. ఇప్పుడు భీష్ముఁడు దుర్యోధనుని ప్రార్థనచే నిరపరాధులగు పాండుకుమారులకు శత్రుఁడై వారి కనిష్ట ముం గూర్చుటకై యుద్ధము చేయుచుండెను. ఆకారణముచే నాతఁ డర్జునునకు వధ్యుఁడైనను బూర్వవృత్తాంతమును స్మరించుకొనుచు నర్జునుఁడు భీష్ముని వధించుట కెంతమాత్రమును సమ్మతి లేనివాఁడై యుండెను. అందుచే నాతఁడు భీష్ము నెదుర్కొనవలసివచ్చినప్పుడెల్ల మృదుయుద్ధమునుమాత్రమే కావించుచుండెను. ఏమిచేసినఁ దనమూలమున భీష్ముఁడు మరణించునో యని యాతఁడు సంకోచించుచుండెను. అందువలన భీష్ముఁ డప్రతిహతపరాక్రముఁడై యసంఖ్యం బగుపాండవ సైన్యమును వినష్టంబు గావించుచుండెను. ఇది యంతయుం గాంచి యొకనాడు కృష్ణుడు భీష్ముని వధింపవలయు ననునుద్దేశముతోఁ జక్ర హస్తుఁడై రథావతరణంబు సేసి పాదచారియై భీష్మునిమీఁదికి లంఘించెను.

అది యంతయుంగాంచి కృష్ణభక్తుఁ డగుభీష్ముఁడు పరమాహ్లాద ముతో నిట్లనియెను.

ఏహ్యేహి దేవేశ జగన్నివాస
నమోస్తు తే శార్ఙ్గగదాసిపాణే
ప్రసహ్య మాం పాతయ లోకనాథ
రథోత్తమాం భూతశరణ్య సంఖ్యే"

"ఓజగన్నివాసా! దేవేశా! రమ్ము! రమ్ము! ఓశార్ఙ్గగదాఖడ్గధారీ! నీకు నమస్కారము. ఓలోకనాథా! భూతశరణ్యా! ఆలస్యము చేయకుండ నన్నీయుద్ధమున రథపతితునిగాఁ జేయుము."

అప్పుడర్జునుఁడును గృష్ణుని వెన్నంటిపోయి యాతని ననున యించి సాధ్యానుసారముగా నేనే యుద్ధము చేసెదనని ప్రతిజ్ఞచేసి మరల వెనుకకుఁ దీసికొనివచ్చెను.

ఇట్టిసంఘటనము రెండునాడులు వర్ణితమై యుండెను. భీష్ముని మూఁడవనాటి యుద్ధమునం దొకసారియు నొమ్మిదవనాఁటి యుద్ధమునందు మఱియొకసారియు నిట్లు జరిగియుండెను. శ్లోకములు కూడ రెండుచోట్లను నొకవిధముగ నేయున్నవి; ఇది లేఖకునిప్రమాదమైననుగావచ్చును. ఒక్కటే సంఘటనము వేఱువేఱుసమయములయందుఁ దటస్థించినప్పుడు కవులుకూడ నిట్లు వ్రాయుట కలదు. సంస్కృత గ్రంథములయందుఁ జాలవఱకిట్టిసాంప్రదాయ మగపడుచున్నది.

రచననుబట్టి చూడఁగా నిది మహాభారతమునందలి ప్రథమశ్రేణికి సంబంధించిన కవిరచనవలెనే యగపడుచున్నది. కవిత్వము ప్రథమశ్రేణిదియే, భావమును భాషయు నుదారమై జటిలతాశూన్యమైయుండెను. ప్రథమశ్రేణికవిత్వము మౌలికమని యెంతవఱ కంగీకరింతుమో యీసంఘటనముకూడ మౌలికమని యంతవఱ కంగీకరింపవలసియున్నది.

ఈసంఘటనమును గైకొని కృష్ణభక్తులు కృష్ణప్రతిజ్ఞం గూర్చి యొక తర్కముం గావించియున్నారు. కాశీదాసుఁడును, గథకులును గూడ నీప్రతిజ్ఞాభంగము నాధారముగఁ జేసికొని కృష్ణమాహాత్మ్యములు గీర్తించియున్నారు. యుద్ధారంభసమయమున భీష్ముఁడు కృష్ణునియెదుట నిలిచి "నీ వీయుద్ధమున నస్త్రముం దాల్పనని ప్రతిజ్ఞ చేసియున్నావు. నేను నీచే నస్త్రమును బట్టించెదను" అని ప్రతిజ్ఞ చేసినట్లు వారు తర్కించియున్నారు. కావుననే యిప్పుడు భక్తవత్సలుఁడగు కృష్ణుఁడు తనప్రతిజ్ఞను గూడ లంఘించి భక్తునిప్రతిజ్ఞను రక్షించెనని వారిసిద్ధాంతము.

ఇట్టి కల్పనమువలన నెట్టిప్రయోజనమును లేదు. భీష్ముఁడీవిధముగాఁ బ్రతిజ్ఞ చేసినట్లు మూలమహాభారతమునం దెచ్చటను నగపడుటలేదు. కృష్ణుఁడైనను దనప్రతిజ్ఞ నెంతమాత్రము లంఘింపలేదు.

ఆతనిప్రతిజ్ఞయందలి యుద్దేశము యుద్ధము చేయకుండుటయే. దుర్యోధనుఁడును, నర్జునుఁడును నేకకాలమునందే యాతని సాహాయ్యము నర్థించివచ్చినప్పుడు కృష్ణుఁడాయిరువురకును సమసాహాయ్యముంగావించుటకై "నాతో సమానమగు నారాయణిసేన నొక్కరు గైకొనుఁడు" అని చెప్పియుండెను "అయుధ్యమాన స్సంగ్రామే న్యస్తశస్త్రో హమేకతః" అని మాత్రమే ప్రతిజ్ఞ. ఆప్రతిజ్ఞ పాలింపఁబడియేయుండెను. కృష్ణుఁడు యుద్ధముచేయలేదు. భీష్మునివిషయంబున నిట్లు గావించుట కాతని యుద్దేశము, శక్తిగోలుదిని యుద్ధముచేయకుండిన యర్జునకు యుద్ధమునం దుత్తేజనముం గూర్చవలయునని మాత్రమే. ఇది సారథులు చేయవలసినపనియే. ఇప్పు డాతనియుద్దేశము సఫలమైనది.

యుద్ధసమయమునఁ దొమ్మిదవనాఁటి రాత్రి శ్రీకృష్ణుఁ డీయభిప్రాయముచే సూచించియున్నాఁడు. భీష్ముఁడెంతకు నజేయుండై యుండుటంగాంచి యుధిష్ఠిరుఁడు తొమ్మిదవనాఁటిరాత్రి బంధుమిత్రగణంబులతోఁ గలసి భీష్మవధవిషయంబునుగూర్చి యాలోచించెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు "నీవనుమతించినచో నేనుపోయి భీష్ముని వధించెదను. ఇది నీకిష్టము కాకున్నచో నీభారమంతయు నర్జునునిమీఁదనే యుంచుము. ఈపని కర్జునుఁడును సమర్థుఁడే అనియెను.

యుధిష్ఠిరుఁడట్లు చేయుట కంగీకరింపలేదు. కృష్ణుఁడు తలఁచుకొన్నచో భీష్ముని వధింపఁగలఁడని యాతఁ డెఱుఁగును; కాని యుధిష్ఠిరుఁడప్పుడు "కృష్ణా! స్వార్థపరుఁడనై యాత్మగౌరవము కొఱకు నేను నిన్నసత్యవాదిని గాఁ జేయఁ దలంచుకొనలేదు. నీవు యుద్ధము చేయకుండఁగనే మాకు సహాయ్యము చేయుము" అనియెను. అప్పుడు యుధిష్ఠిరుఁ డర్జునునివిషయమై యేమియును జెప్పలేదు. తరువాతఁ గృష్ణునియనుజ్ఞం గైకొని పాండవులు కృష్ణునితోఁగలసి భీష్మునిచెంత కాతనివధోపాయముం దెలిసికొనుటకై పోయిరి.

భీష్ముఁడు తనమరణోపాయమును జెప్పివైచెను. ఆవిధముగనే యాకార్యము జరగినట్లు పైకగపడుచున్నదిగాని నిజముగా నట్లు జరుగ లేదు. శ్రీకృష్ణుఁ డెట్లు చెప్పెనో యట్లే జరిగెను. అర్జునుఁడే భీష్ముని రథపతితునిం గావించి శరశయ్యయందు శయనింపఁ జేసెను. మూల మహాభారతమునందు ద్వితీయశ్రేణికి సంబంధించిన కవిలేఖినినుండి యసంగతంబును, నిష్ప్రయోజనంబును నైనను నాపాతమనోహరం బగు శిఖండివృత్తాంతము వెలువడియెను. కృష్ణచరిత్రముతో దాని కెట్టి సంపర్కమును లేదు. కావున మేమావిషయమై విమర్శింపఁ దలంచుకొనలేదు.

---

## ద్వితీయ పరిచ్ఛేదము

### జయద్రథవధ

భీష్మునితరువాత ద్రోణాచార్యుఁడు సేనానాయకుఁ డయ్యెను. ద్రోణపర్వప్రథమభాగమునఁ గృష్ణుఁడు గావించిన విశేషకార్య మేమి యు నగపడుట లేదు. ఆతఁ డతినిపుణుఁడగు సారథివలెఁ గేవలమును సారథ్యమునే గావించెను. కురుక్షేత్రయుద్ధమునకుఁ గర్తయు నేతయు నాతఁడే యనుమాట యిచ్చట సత్యముగ లేదు. నడుమనడుమ ధర్మార్జునులకు సదుపదేశములం గావించుటకంటె నాతఁ డేమియును జేసినది లేదు. ద్రోణాభిషేకపర్వాధ్యాయమునందలి యేకాదశా ధ్యాయమున సంజయుఁడు కృష్ణునిబలపరాక్రమంబులను మహిమను గీర్తించుటకై యొకమహోపన్యాసముం గావించినట్లు కానఁబడుచు న్నది. దానివలన నెట్టి ప్రయోజనమును లేదు. మహాభారతమునం దింకను ననేకస్థలములయందుఁ గృష్ణసంకీర్తనమున కభావము లేదు; కాఁబట్టి యీయధ్యాయము ప్రక్షిప్తమనియే తోఁచుచున్నది. మన

నూతనిమానవచరిత్రముంగూర్చి యాలోచించుటకుఁ గుతూహల పడుచుంటిమి. మానవచరిత్రము కార్యములయందే ప్రకాశిత మగు చుండును. కావున మనము కృష్ణచరిత్ర మాతని కార్యములను బట్టియే గ్రహింపవలయును.

ద్రోణపర్వమున ముందుగా భగదత్తవధయందు శ్రీకృష్ణుని కార్య మొకటి యగపడుచున్నది. భగదత్తుఁడు మహావీరుఁడు. పాండవ పక్షమునం దితరు లెవ్వరు నాతనితో యుద్ధము సేయఁజాలరైరి. తుద కర్జునుఁడే వచ్చి యాతనితో యుద్ధమునకుఁ దలపడియెను. భగదత్తుఁ డర్జునునితోయుద్ధముచేయుట కశక్తుఁడ నని గ్రహించి యాతనిపై వైష్ణవాస్త్రమును బ్రయోగించెను. అర్జునుఁడుగాని, మఱియెవ్వరు గాని యాయస్త్రమును మరలించుటకు సమర్థులు కారు. కావుననే కృష్ణుఁ డప్పు డర్జునున కడ్డముగ నిలిచి యాయస్త్రమునకుఁ దన వక్షము నొడ్డెను. ఆయస్త్రము శ్రీకృష్ణునిపక్షమున వైజయంతీ మాలికయై వ్రేలాడెను.

ఈయస్త్రప్రయోగ మనునది కేవలము నసంగతమును, నబో ధ్యమును నైయున్నది. అస్వాభావవిషయములను విశ్వసింపవలయునని మేము మాపాఠకులకుఁ జెప్పుట లేదు. మఱియు ననైసర్గికసంఘటన ములయందు మేమెట్టిసత్యస్థాపనమును గావించుట లేదు. కావున మేమీయాలక్ష్యనమును బరిత్యజింతుము.

ద్రోణపర్వమున నభిమన్యువధానంతరమున మరల శ్రీకృష్ణుఁడు కర్మక్షేత్రమునం దగపడుచున్నాఁడు. సప్తరథికులును గలసి యన్యా యముగా నభిమన్యుని వధించిన దినమునఁ గృష్ణార్జును లారణరంగ మున నిలిచియుండలేదు. అప్పుడు వారు నారాయణబలంబులతో యుద్ధమునకుఁ బోయియుండిరి. ఈసేన శ్రీకృష్ణుఁడు దుర్యోధనున కిచ్చినదియే. ఒకపక్షమునకు దనసేనను, మఱియొకపక్షమునకుఁ దన్ను

న నర్పించుకొని యాతఁడు రెండుపక్షములయెడలను సమత్వమును నిలుపుకొని యుండెను.

యుద్ధానంతరమున సాయంకాలమునకుఁ గృష్ణార్జునులు శిబిరమునకుఁ దిరిగివచ్చి యచ్చట నభిమన్యువధనుగూర్చి విని యుండిరి. అప్పు డర్జునుఁ డతితరశోకసంతప్తుఁ డయ్యెను. యోగీశ్వరుఁ డగు శ్రీకృష్ణుఁడు శోకమోహముల కతీతుఁడు. అర్జును నూఱడించుటయే యాతనికిఁ బ్రథమకర్తవ్యమై యుండెను. అప్పుడు కృష్ణుఁ డర్జునుని వంటివానికి బోధింపఁదగినమాటలనే బోధించి యుండెను. ఆతఁడు గీతల యం దేధర్మమును నిర్దేశించెనో, యాధర్మము ననుసరించిన మహావాక్యములచేతనే యర్జునునిదుఃఖనివారణముం గావించెను. ఋషు లంతఱును యుధిష్ఠిరు నూఱడించుచు "అందఱికిని మరణమున్నది; అందఱును మరణింతురు" అని బోధించి యుంశిరి. కాని కృష్ణుఁ డట్లు చెప్పలేదు. ఆతఁడు "యుద్ధోపజీవు లగుక్షత్రియవీరుల కిదియే శ్రోవ-రణమరణమే క్షత్రియగణంబులకు సనాతనధర్మము" అని చెప్పియుండెను.

కృష్ణుఁ డభిమన్యునిజనని యగుసుభద్రకుఁగూడ నట్లే బోధించి యుండెను—

"సత్కులప్రసూతుఁడును, ధైర్యశాలియు నగుక్షత్రియుఁ డెట్లు ప్రాణపరిత్యాగముం గావించుట యుచితమో యట్లే నీకుమారుఁడు ప్రాణపరిత్యాగముం గావించినాఁడు. కావున నందుకొఱకు దుఃఖింపవలసిన యావశ్యక మేమియును లేదు. మహారథుండును, ధీరుండును, పితృతుల్యపరాక్రమశాలియు నగునభిమన్యుఁడు భాగ్యవశంబున వీరగణాభిలషితం బగుసద్గతిం గాంచి యున్నాఁడు. మహావీరుఁ డగునభిమన్యుఁడు భూరిశత్రుసంహారంబు సేసి, పుణ్యార్జనితంబును, సర్వకామప్రదంబును, నక్షయంబును నగులోకమునకుఁ బోయియున్నాఁడు. తపస్సు, బ్రహ్మచర్యము, శాస్త్రము, ప్రజ్ఞ మొదలగువానిసాహాయ్య

మున సాధువు లెట్టిగతిం గాంచుట కభిలషింతురో నీకుమారుని కట్టిగతి లాభము కలిగినది. కావున సుభద్రా! నీవు నీతనయునికై శోకించుట యుచితము కాదు''

ఇటుఁ బుత్రశోకార్తుం డగునర్జునుఁడు రోషపరవశుండై యొక దారుణంబగు ప్రతిజ్ఞ చేఁ దన్నుఁ దాను బంధించుకొనియెను. ఆతఁడు వినినసంగతులనుబట్టి యభిమన్యువధకు జయద్రథుఁడే ప్రధానకారణుఁడని నిశ్చయించుకొని ''రేపటిసూర్యాస్తమయ సమయమునకుఁ బూర్వమే జయద్రథుని వధించెదను అట్లు చేయనైనినేని, స్వయముగా నగ్నిప్రవేశంబు చేసి ప్రాణంబులఁ ద్యజించెదను'' అని యతి కఠినం బగుప్రతిజ్ఞంగావించెను.

ఈప్రతిజ్ఞావచనము లుభయశిబిరములయందును ప్రతిధ్వనితము లగుచుండెను. పాండవసైనికు లతితరంబుగఁ గోలాహలంబు నేయుచు భేరీధ్వనులఁ గావించుచుండిరి. కౌరవు లందఱును భయభ్రాంతులై యీప్రతిజ్ఞంగూర్చి సత్యమును దెలిసికొని జయద్రథరక్షణంబునకై యాలోచనలం గావించుచుండిరి.

అతికఠినవ్యాపారము తటస్థించుటఁ [illegible]ష్ణుఁడు తెలిసికొనియెను. అర్జునుఁ డెట్టియాలోచనయు లేకుండఁ గఠినప్రతిజ్ఞం గావించెను. దానిని సమర్థించుట యసాధ్యముగా నుండెను. జయద్రథుఁడు స్వయముగా మహారథుఁడు; సింధుసౌవీరదేశములకధీశ్వరుఁడు; బహుసేనానాయకుఁడు; విశేషించి దుర్యోధనునకు భగినీపతి. అజేయులగు కౌరవయోధులందఱును దమశక్తికొలంది నాతనిరక్షించుటకుఁ బూనుకొనియుందురు. ఇచ్చటఁ బాండవపక్షమునందలి ప్రధానయోధులందఱు నభిమన్యుశోకంబున విహ్వలులై యెట్టి యాలోచనయును లేకయుండిరి. కావున నిప్పట్టున శ్రీకృష్ణుఁడే కర్తయై కార్యమును దీర్పవలసివచ్చెను. ఆతఁడు కౌరవశిబిరమున కొక చారుని బంపించెన్ను

అతఁడు పోయివచ్చి యచ్చటి సంగతుల నన్నిటిని దెలియఁజేసెను— ఈప్రతిజ్ఞంగూర్చి కౌరవులందఱును దెలిసికొని యుండిరి. ద్రోణాచార్యుఁడు వ్యూహరచనంగావించును. కర్ణాదిసమస్తకౌరవవీరులునొక్కటిగఁ జేరి జయద్రథుని రక్షింతురు. ఆదుర్భేద్య వ్యూహమును భేదించుకొని మహావీరుఁడగు జయద్రథుని వధించుట యర్జునునకైనను సాధ్యమైయుండును. అసాధ్యమైనచో నర్జునుఁ డాత్మహత్య చేసికొనవలసియే యుండును.

కావునఁ గృష్ణుఁడు కర్తవ్యము నాలోచించి నిశ్చయించుకొనెను. అతఁడు తన సారథియగు దారుకునిం బిలిచి "నారథంబున కుత్తమాశ్వములం బూన్చి దాని నస్త్రశస్త్రపరిపూర్ణంబు గావించి ప్రభాతసమయంబునకు సన్నద్ధంబు చేసియుంచుము" అని యాజ్ఞాపించెను. ఒకవేళ నర్జునుఁడు వ్యూహభేదనముం గావించి శత్రుయోధుల బరాజితులం గావింపఁజాలకున్నచో స్వయముగఁ దానే యుద్ధంబు చేసిసమస్తకౌరవసంహారంబునుజయద్రథవధపరిష్కారంబునుగావింపవలయునని యే శ్రీకృష్ణుని యుద్దేశముఅర్జునుడుస్వకీయంబగుబాహుబలంబుచే యుద్ధంబునఁ గార్యసిద్ధిం గాంచఁగలిగినచో నిఁకఁ గృష్ణునకు యుద్ధము చేయవలసిన యావశ్యకమే యుండదు. ఒకవేళఁ గృష్ణుఁడు చేయవలసివచ్చినను, ఆయుద్ధము "అయుధ్యమాన స్సంగ్రామే న్యస్తశస్త్రో హ మేకతః" అను ప్రతిజ్ఞకెట్టి భంగమును గల్గింపదు. అతఁడిట్టి ప్రతిజ్ఞ యేయుద్ధముకొఱకుఁ గావించియుండెనో యాయుద్ధమిది కాదు. నేఁటియుద్ధ మర్జునుని ప్రతిజ్ఞాజనితంబగు యుద్ధము. ఈయుద్ధమునకు భిన్నోద్దేశ మున్నది. ఇది యొకవంక జయద్రథుని ప్రాణములకును, మఱియొకవంక నర్జునుని ప్రాణములకును సంబంధించిన యుద్ధము. అర్జునునకుఁ బరాభవమైనచో నాతఁ డగ్ని ప్రవేశమూలంబున నాత్మత్యాగము గావించుకొనవలసియున్నది. ఈ యుద్ధ మిదివఱ కేర్పడిన పద్ధతిలోనిది కాదు. శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ యీ

యుద్ధమునకు ప్రవర్తింపదు. అర్జునుఁ డాతనికి సఖుండును, శిష్యుండును బావయు నైయుండెను. ఆతని యాత్మహత్యానివారణము కృష్ణున కవశ్యకర్తవ్యము—

తరువాతఁ బాండవయోధు లందఱును, కృష్ణుండును నిద్రించిరి. ఇచ్చట స్వప్నసంబంధ మగు కల్పనాకథ యగపడుచున్నది. స్వప్నమునందు మరలఁ గృష్ణుఁ డర్జునునొద్దకు వచ్చెను. ఇరువురును గలసి యారాత్రియే హిమాలయమునకుఁ బోయి యట నీశ్వరు నుపాసించిరి. పాశుపతాస్త్ర మర్జునున కిదివఱకే వనవాసకాలమున లభించియుండెను. కాని మరల సంపాదింపవలయునని కోరిక కలిగెను. ఈవిషయమునుగూర్చియే యాకథ—ఇట్టివిషయములను విమర్శించుటవలన లాభము లేదు.

మఱునాఁటిసాయంకాలమునకుఁ బూర్వమే యర్జునుఁడు జయద్రథుని సంహరించెను. ఆయుద్ధమునఁ గృష్ణుఁ డెట్టిసాయమును జేయవలసిన యావశ్యకము లేకపోయెను. అయినను గృష్ణుఁ డాయుపరాష్ట్రమున యోగమాయామూలంబునసూర్యునిఁగప్పెననియు,జయద్రథవధానంతరమున మరల సూర్యునిఁ బ్రకాశింపఁజేసెననియుఁ జెప్పబడియుండెను. ఎందుకొఱకు? సూర్యాస్తమయ మయ్యెనని యెంచి జయద్రథుఁ డర్జునునొద్దకు వచ్చునట్లు భ్రాంతిని గల్పించుటకా? ఇట్లు భ్రాంతిపడి జయద్రథుఁడును, నాతనిరక్షకులగు కౌరవవీరులను నసావధానులై యుందు రనియేనా దీనియభిప్రాయము? ఇచ్చటనిర్గ్రంథ్య మునందు వేఱువేఱు తరగతులకవులచేతులు చేరియున్నట్లగపడుచున్నది. ఒకవిషయమున నాలోచించినవో నిట్టిభ్రాంతిని గల్పించుటవలన నెట్టిప్రయోజనమును లేదు. యోగమాయాప్రదర్శనమునకుఁ బూర్వమునందే యర్జునుఁడు జయద్రథునిఁ జేరుకొనఁ గలిగెను. ఇంతేకాక వారిరువురికిని సమ్ముఖయుద్ధముకూడ జరగుచుండెను. సూర్యుని

గప్పినయిరువురుఁగూడ నట్లే జరుగుచుండెను. అదివఱ కర్జునుఁ డెల్లు యుద్ధము చేయుచుండెను; యిప్పుడుఁగూడ నట్లే చేయుచుండెను. సకలకౌరవవీరులను బాహాభూతులం జేయకుండ నర్జునుఁడు జయద్రథుని వధింపఁ జాలకుండెను. మఱియొకవిషయము నాలోచించినచో నార్యావరణ కారిణియగు యోగమాయావికాస మిదివఱకుఁ జెప్పిన వాని కన్నిటికిని విరుద్ధముగా నున్నది. ఈభ్రాంతికల్పనముంగూర్చి పరపరిచ్ఛేదమునఁ దెలిపెదము.

## తృతీయ పరిచ్ఛేదము

### ద్వితీయశ్రేణియందలిపని

మన మింతవఱకును సుగమపథంబున ననుకూలగమనముం గావించి యుంటిమి. కాని యిక్కడినుండి చాలగందరగోళముగానుండును. మహాభారతము మహాసముద్రమువంటిది. కాని యింతవఱకును మన మందలి నిశ్చలజలమధ్యంబున మృదుమధురగంభీరశబ్దంబులనాలకించుచు సుఖముగా నౌకాయాత్రను గావించితిమి. కాని యిచ్చటినుండి యాకస్మికముగా నతిఘోరం బగుతుపానునం దగులుకొని ప్రబలతరంగాభిఘాతంబులచే మాటిమాటికి నుత్క్షిప్తనిక్షిప్తులము కావలసి యున్నది. మన మీమహాభారతమునం దిప్పు డెల్లవిధములను రెండవతరగతికవిచేతిలోఁ బడి యుంటిమి. ఆతనిచేతిలోఁ గృష్ణచరిత్రము సంపూర్ణముగాఁ బరివర్తిత మైపోయినది. ఉదారంబగు చరిత్రమంతయును, క్షుద్రంబును, సంకీర్ణంబు, నైపోయినది; సత్యమగునది యిప్పుడసత్యంబును వంచనాకరము నైపోయినది; న్యాయంబును, ధర్మానుమోదితంబునగునది, యన్యాయంబును, నధర్మకలుషితంబు నైపోయినది. ఇక్కడివిచేతులలోఁ గృష్ణచరిత్ర మట్టివికారాకారముం గాంచినది.

కాని యెందుచే నిట్లు జరిగినది? ఈ రెండవతరగతికవి కేవలమును మూఢుఁడు కాఁడు అతని సృష్టికౌశలము జాజ్వల్యమానమైనదియే. అతఁడు ధర్మాధర్మజ్ఞానశూన్యుఁడు కాఁడు, అయినను వాతఁడు కృష్ణున కిట్టిదశను సంఘటింపఁ జేయుటకుఁ గారణమేమి? అతినిగూఢం బగునాతని తాత్పర్య మేమో తెలిసికొనవలయును.

మొదటి తరగతికవిచేఁ గృష్ణుఁ డీశ్వరావతారముగా బ్రదర్శింపఁ బడలేదని మనము మాటిమాటికిని జూచుచునే యున్నాము. అతఁడామాట యెత్తుకొనక. డగనే యెల్లయెడలను గృష్ణుని మానవప్రకృతిని బ్రదర్శించి యుండెను; మానవశక్తినే యవలంబించి కార్యములం గావించినట్లు వ్రాసియుండెను. కవులందఱును వలెనుగా శ్రీకృష్ణునిం గూర్చి యిట్లే వర్ణించి యున్నారు. మొదటితరగతికవి వ్రాసినప్పుడెల్ల గృష్ణుఁ డీశ్వరావతారుఁడుగా నందఱిచేత సంగీకరింపఁబడలేదనియే సూచించియున్నాఁడు. అతని హృదయమునందుఁ గూడ నట్టిభావ మెల్లవేళలను గలుగుటలేదు. మహాభారతమున మొదటితరగతికవిప్రాంతయంతయును జాలవఱకుఁ బ్రాచీనవృత్తాంతసంగ్రహము మాత్రమే. దానినే యుచితాలంకారములతో రంజితము గావించెను. ఆరచనయంతయు నేకకథామాత్రముచేఁ గ్రథితమై యుండెను. కాని మహాభారతమున రెండవతరగతికవిచేయి పడినప్పుడు శ్రీకృష్ణుని యీశ్వరత్వము సర్వాంగీకృతమైన ట్లగపడుచున్నది. కావున నాతఁడు కృష్ణు నీశ్వరావతారునిగనే ప్రదర్శించెను. అతనిరచనయందుఁ గృష్ణుఁడుకూడ ననేకపర్యాయములు తనయీశ్వరత్వమును బ్రకటించి యుండుటయే కాక యీశ్వరశక్తిమూలమునఁ గార్యములనుగూడఁ గావించియుండెను. కాని యీశ్వరుఁడు పుణ్యమయుఁడు, కవికిఁగూడ నాసంగతి తెలియకపోలేదు. అయినను నొక తత్త్వమును బ్రరిస్ఫుటముగఁ బ్రదర్శించుటకే యాతఁడు ప్రయత్నించిన ట్లగపడుచున్నది.

ఐరోపీయులుకూడ నీతత్త్వమును గూర్చియే విశేషముగ నాలోచించుచుందురు. భగవంతుఁడు దయామయుఁడనియుఁ గరుణామూలముననే జీవులను సృష్టించె ననియు, సర్వజీవమంగళమే యాతనియభీష్టమనియును వారు చెప్పుదురు. అట్లయినచో నీపృథ్వియందు దుఃఖమేల? ఈశ్వరుఁడు పుణ్యమయుఁడై యాతనిచేఁ బుణ్యమే ప్రసాదింపఁబడుచున్నప్పుడు మన యీ ప్రపంచమునకుఁ బాప మెక్కడినుండి వచ్చినది? ఈతత్త్వమును నిర్ణయించుటకై స్తవులకుఁ జాలఁగష్టము. కాని హిందువులకుమాత్ర మతిసులభమైనది. హిందూమతమునం దీశ్వరుడే జగత్తు. ఈశ్వరుఁడుస్వయముగా బాపపుణ్యములకును సుఖదుఃఖములకు నతీతుఁడు. మనము సుఖదుఃఖములుగా భావించునవి యాతనికి సుఖదుఃఖములు కావు. మనపాపపుణ్యము లాతనియెదుటఁ బాపపుణ్యములు కావు. ఆతఁడు విలాసముకొఱకీజగంబును సృజించెను. ఈ జగం బాతనికంటె భిన్నమైనది కాదు. ఆతనియంశమే ఆతఁడు తన శక్తి విద్యావృతంబుగఁ గావించుటచే నదియే సుఖదుఃఖంబులకును బాపపుణ్యంబులకును నాధార మగుచున్నది. కావున నీసుఖదుఃఖాదులన్నియు నాతని మాయవలననే గలుగుచుండును. సుఖదుఃఖములు వానినుండియే కలుగును? దుఃఖ మనుభవించుట యాతని మాయవలననే. పాపముం జేయుట యాతనిమాయవలననే. విష్ణుపురాణకవి కృష్ణపీడితుఁ డగు కాళీయుని నోటినుండి యీమాటలనే వెలువరించెను.

"యథాహం భవతా సృష్టో జాత్యా రూపేణ చేశ్వర
స్వభావేన చ సంయుక్త స్తథేదం చేష్టితం మమ.

"నీవు నన్ను సర్పజాతిగా సృజించితి. అందుచేతనే నేను హింస చేయుచున్నాను." అని దీనియర్థము. ప్రహ్లాదుఁడు విష్ణుస్తవంబు గావించినప్పుడు,

"విద్యావిద్యే భవాన్ సత్యమసత్యం త్వం విషామృతం"

"విద్యయు నవిద్యయు నీవే; సత్యము నసత్యమును నీవే; విషము నమృతమును నీవే" అని స్తుతించి యుండెను—ఆతనికంటె భిన్నంబగు జగంబు లేదు. ధర్మాధర్మములును జ్ఞానాజ్ఞానములును సత్యాసత్యములును, న్యాయాన్యాయములును, బుద్ధ్యబుద్ధులును సర్వము నాతనినుండియే కలుగుచున్నవి. ఆతండు గీతయందు స్వయముగా నిట్లు చెప్పియుండెను—

"యే చైవ సాత్వికాభావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తాన్ విద్ధి న త్వహం తేషు తే మయి"—

"సాత్వికరాజసతామసభావము లన్నియును నావలననే యగుచున్నవని యెఱుంగుము. నేను వానికి వశుండను గాను; కాని యవి యన్నియు నాయధీనములై యుండును" అనియర్థము. శాంతిపర్వమునందు భీష్ముఁడు కృష్ణునింగూర్చి "సత్యాత్మనే నమః; ధర్మాత్మనే నమః" అని స్తుతించినచోటనే "కామాత్మనే నమః; ఘోరాత్మనే నమః; క్రౌర్యాత్మనే నమః; తృష్ణ్యాత్మనే నమః" అని యీవిధముగా నమస్కారములం గావించి యున్నాఁడు. మఱియుఁ దుట్టతుదను "సర్వాత్మనే నమః అని నమస్కరించెను. ప్రాచీనహిందూశాస్త్రముల నుండి యిట్టి వాక్యముల నెత్తి చూపవలసివచ్చినచో నెన్నివందల పుటలైనను నింపవచ్చును.

ఆమాట నిజమే యైనను మానవున కొక గురుతరవిషయమును బోధింపవలసి యున్నది. దుఃఖము జగదీశ్వరప్రేరితము; ఆతనికంటె దీని కన్యకారణ మేదియును లేదు. పాపాత్ముఁ డిందుకొఱకు నిందుఁడును దండనీయుఁడు నగుచున్నాఁడు. ఆవిషయమున లోకమునకు బోధింపవలసియున్నది. ఆతని పాపబుద్ధి జగదీశ్వరప్రేరితము; కావున నాతని విచారించుటకు జగదీశ్వరుఁడే కర్త. మీరెవ్వరు?

ఈతత్త్వము నవతరింపఁజేయుటకే రెండవతరగతికవులు భారతమధ్యమునఁ బ్రవేశించిరి. శ్రేష్ఠులగు ప్రాచీనకవు లెవ్వరును బ్రస్తుతకవులంబోలి భూమికలను వ్రాసి యందు సమస్తవిషయములను స్పష్టపఱిచి కావ్యములను వ్రాసి యుండలేదు. అట్టివారి కావ్యములయందలి తాత్పర్యములను బ్రయత్నపూర్వకముగ గ్రహింపవలసినదే. షేక్స్పియరు రచించిన యొక్క నాటకమునందలి మర్మార్థమును గ్రహించుటకై యెన్ని వేలమంది ప్రతిభావంతు లగువిద్వాంసు లెన్ని విధముల భావించి యుండలేదు? ఎన్నెన్ని వ్యాఖ్యానములను వ్రాయలేదు? మనము వానిని బోధపఱచుకొనుటకై తలఁ గొట్టుకొని యెంతయో శ్రమ పడుచున్నాము కాని మనయీయపూర్వమహాభారతగ్రంథమునందలి యొకయధ్యాయమునైనను జదివి దానిగూఢార్థమును గ్రహించుటకై యెన్నఁడు నొకగంటయైనను బ్రయత్నించియుండలేదు. హరిసంకీర్తనకాలంబున మృదంగముపై దెబ్బపడినంతనే కన్నుల నీరు పెట్టుకొని క్రిందఁబడి పొరలు మూఢభక్తులగు వైష్ణవులొక వంక వారిం గాంచినంతనే యిది యంతయుఁ బిచ్చి యనియు, నల్లరి యనియు నిందించుచుఁ బ్రాచీనగ్రంథములపేరు విన్నంతనే యెగసి క్రిందఁబడు నవనాగరికు లొకవంకను మాత్రమున్నారు మఱియు సమస్తమును మిథ్య, ఉపధర్మము, అశ్రావ్యము, పరిహార్యము, పరిహాసాస్పదము నని రాద్ధాంతము చేయువారుకూడ నున్నారు; కాని సత్యమును గ్రహింపఁ బ్రయత్నించువారు లేరు. శబ్దార్థములు బోధపడినంతనే యంతయుం దెలిసినట్లే భావించుచుందురు. విచారింపవలసిన విషయ మేమనిన:— ఎవ్వరైనఁ బోధింపఁ దలఁచినను వినువారు లేరు.

సమస్తము నీశ్వరుడే—ఈశ్వరునుండియే సమస్తమునగుచున్నది. [illegible]నుండియే జ్ఞానమును, జ్ఞానాభావమును, భ్రాంతియు, బుద్ధియు, [illegible]ద్ధియు, సత్యము, నసత్యమును, న్యాయము. నన్యాయమును,

గలుగుచున్నవి. భ్రాంతులును, దుర్బుద్ధులును, నసత్యభాషణములును, నన్యాయపథులును నీశ్వరప్రేరితములే. కాని జ్ఞానము, బుద్ధి, సత్యము, న్యాయము మొదలగునవి యాతనివలన నగుచున్నవని తెలుపవలసిన ప్రయోజనము లేదు. హిందువుల కందఱకు నది సహజముగాఁ దెలిసిన విషయమే. అయినను భ్రాంతి, దుర్బుద్ధి మొదలగునవి కూడ నాతని వలననే కలుగుచుండెనని మానవుల హృదయములకుఁ బట్టించుట యావశ్యక మయ్యెను. మహాభారతమునందలి రెండవతరగతికవి యీసంగతినే యాలోచించెను. మనము చంద్రమండలమునందలి యొక వైపుమాత్రమే చూచుచుంటి మనియు, రెండవవైపు మన కెన్నఁడు నగపడుటయే లేదనియు నాధునికజ్యోతిర్విదులు చెప్పుచున్నారు. ఈకవి యట్టియదృష్టపూర్వం బగు జగద్రహస్యమునందలి యవ్వలి భాగమును మనకుఁ జూపింపఁ దలఁచెను. భ్రాంతి యీశ్వరప్రేరితంబని యాతఁడు జయద్రథవధయందును, దుర్బుద్ధి యీశ్వరప్రేరితంబని ఘటోత్కచవధ యందును, అసత్య మీశ్వరప్రేరితంబని ద్రోణ వధయందును, అన్యాయమీశ్వరప్రేరితంబని దుర్యోధనవధయందును జూపించి యున్నాడు. జ్ఞానబల, బుద్ధిబల, సత్యబల న్యాయబలములు, బాహుబలము చెంతనిలువఁజాలవని యొక్కనిదర్శనమునుమాత్రమాతఁడు చూపవలసి యుండెను. విశేషించి రాజనీతియందు బాహుబలమే ప్రధానమైనది. మహాభారతమంతయును రాజనీతివిశిష్టంబగుకావ్యము. చరిత్రమును దెలుపు కావ్యము. కావున నీగ్రంథము బాహుబలప్రధానంబని యూహించి రెండవతరగతికవి బుద్ధ్యాదులయెడల నొక విశేషము జూపుటకుఁ బ్రయత్నించెను; కేవలజ్ఞానభ్రాంతులును, బుద్ధ్యబుద్ధులును, సత్యాసత్యములును, న్యాయాన్యాయములును నీశ్వరనియోగాధీనములే యని చెప్పినంతమాత్రమున రాజనీతితత్త్వము జ్ఞాలేదనియు, బాహుబలమును, బాహుబలాభావముఁగూడ నాతని

యధీనమే యనియు నీరెండవకవి భావించెను. ఆభావమును స్పష్ట
పఱుచుటకే యాతఁడు మౌసలపర్వమును రచించెను. అందుఁగృష్ణుడు
లేనిసమయమున నర్జునుఁడు బలహీనుఁడై లగుడధారులగు కృషీకు
లచేఁగూడఁ బరాజితుఁడై పోయెను.

ఈశ్వర నియోగమని మనము చెప్పునట్టిగాని, యీశ్వర
ప్రేరణమని యీద్వితీయ స్తరమునందలి కవి చెప్పునట్టిగాని యీవిష
యమునుగూర్చి యూరపియనులులా (Law) యని చెప్పుదురు ఈ
భారతకవులబుద్ధిలో నట్టిభావ మెచ్చటనైన నున్నదో, లేదో మేము
చెప్పఁజాలము. కాని యొక్కసంగతిమాత్రము స్పష్టముగాఁ జెప్పఁ
గలము. వారు "ల" అనునక్షరమున కేయుచ్చును జేర్చినచో "లా"
యగునోమాత్రము బాగుగ నెఱుంగుదురు. సర్వము నీశ్వరేచ్ఛయని
యే వారు తెలిపియుండిరి. ఈకవి శ్రీకృష్ణుని గర్మక్షేత్రమునం దవత
రింపఁజేసి యీశ్వరేచ్ఛను బోధించుటకుఁ బ్రయత్నము చేసెను.

## చతుర్థపరిచ్ఛేదము

### ఘటోత్కచవధ

జయద్రథవధయందుఁ గృష్ణునింగూర్చిన యనైసర్గికవృత్తాంత
మింకొకటి యున్నది. అర్జునుఁడు జయద్రథునిశిరఃఖండనంబు గావిం
చుట కుద్యుక్తుఁ డైయున్నప్పుడు కృష్ణుఁ డాతనిం గాంచి "ఈతని
తండ్రి పుత్రునికొఱకుఁ దపంబుచేసి యొకవరముంగాంచెను. ఈజయ
ద్రథుని శిరము నెవ్వరు భూమిపైఁ బడవేయుదురో వారిశిరం బప్పుడే
విదీర్ణంబై ఖండఖండములు కాఁగలదు. కావున నీ వీతనితలను గ్రిం
దఁబడనీయకుము. బాణసంచాలనముచే నీతనిశిరంబును సంధ్యావంద

నము చేసికొనుచున్న యీయాతని తఃడి క్రోడనునం బహునట్లుగాఁ జేయుము" అని యుపదేశించెను. అర్జునుం డట్లే కావించెను. ఆవృద్ధుఁడు సంధ్యావందనాదులం గావించి లేచుసమయమున ఛిన్నము స్తక మాతనితొడమీఁదినుండి క్రిందఁ బడిపోయెను. తోడనే యాతనితల వ్రక్కలైపోయెను.

అనైసర్గికంబగు నీవృత్తాంతమును మేము పరిత్యజించుచున్నాము. ఇఁక ఘటోత్కచవధయందలి భీభత్సవృత్తాంతమును విమర్శింపవలసి యున్నది.

హిడింబుఁడను నొకరాక్షసుఁడు కలఁడు. హిడింబయనురాక్షసి యాతనిసోదరి. ఒకప్పుడు భీముఁ డారాక్షసుని జంపి యాహిడింబను బెండ్లియాడెను. ఈవధూవరుల పరస్పరానుకూలతం గూర్చి వేఱుగ జెప్పనక్కఱలేదు. ఇంతేగాక యారాక్షసిగర్భమున భీమునకొకకుమారుఁడు కూడఁ గలిగెను. అతనిపేరు ఘటోత్కచుఁడు. వాడును రాక్షసుఁడే; మహాబలవంతుఁడు. అతఁడు తనతండ్రులకు సాహాయ్యము చేయుటకై తనసేనతోఁ గూడఁ గురుక్షేత్ర యుద్ధమునందుఁ జేరుకొనియెను. కాని యాతనియం దొక తెలివితక్కువతన మగపడుచున్నది—ఆతఁడు ప్రతిపక్షులను భక్షించుట మాని మానవునింబోలి వారితో బాణయుద్ధము గావించెను. ఆతని దురదృష్టవశమున దుర్యోధనసైన్యమునందుఁ గూడ నొక రాక్షసుఁడుండెను. ఆయిరువురు రాక్షసులకును మహారణము జరిగినది.

ఇచ్చట నీదినమున నూత్రి యొక భయంకరవ్యాపారము జరిగినది. ఇదివఱకు దినములలోఁ బగటివేళనే యుద్ధము జరుగుచుండెను. నేఁడు దీపములను వెలిగించి రాత్రివేళ యుద్ధముం గావించిరి. నిశాచరులకు రాత్రులయందు బలమధికము. కావుననే ఘటోత్కచుఁడు దుర్నివార్యుఁడయ్యెను. కౌరవవీరు లెవ్వరు నాతని యెదుటఁబడఁజాలక

పోయిరి. కౌరవబలమునందలి రాక్షసుఁడు కూడ మరణించెను. అప్పుడు కేవలమును కర్ణుఁ డొక్కఁడే యాతని నెదిరించి పోరాడుచుండెను. తుదకుఁ గర్ణుఁడు గూడ నలసిపోయెను. ఇంద్రునిచేఁ బ్రసాదింపఁబడిన యేకపురుషఘాతినియగు నొక శక్తిమాత్రము కర్ణునియొద్ద నున్నది. ఈశక్తింగూర్చి యద్భుతముకంటెనత్యద్భుతంబగు నొకకథయున్నది. పాఠకుల కదియంతయుం జెప్పి పీడించుట నా కిష్టములేదు. ఆశక్తి నెవ్వరును వ్యర్థముగాఁ జేయఁజాలరు! అదియొకసారి యెవ్వరిపైనైనఁ బ్రయోగించినచోఁ దిరిగి రానేరదు. అది యేకపురుషఘాతిని మాత్రమే. కర్ణుఁడయ్యమోఘశక్తి నర్జునవధార్థమై దాచుకొనియుండెను. కాని యిప్పుడాతఁడు ఘటోత్కచుని సమరవిజృంభణమును సహింపఁజాలక విపన్నుఁడై యాశక్తి నాతనిపైఁ బ్రయోగించెను. దానితో ఘటోత్కచుఁడు మరణించెను. అతఁడు మరణసమయమున వింధ్యాచలపరిమితంబగు దేహముం దాల్చెను. ఆశరీరముక్రిందఁబడి యొకాక్షౌహిణీసేన మరణించెను.

ఇంతతప్పుచేసినను బ్రాచీనహిందూకవిని క్షమింపవలసినదే. ఏమనిన! ఈకథ బాలకులకును, విద్యావిహీనులకును, స్త్రీలకును జాల మనోహరముగనే యుండును. కానియాతఁడుదీనితరువాత మఱియొక కల్పన గావించియున్నాఁడు. ఆకల్పన యాతనికిమాత్రమే మనోహరమైనదిగా నగపడుచున్నది—ఘటోత్కచుఁడు మరణించుటయుఁ బాండవులందఱును దుఃఖించుచుండిరిగాని కృష్ణుఁడుమాత్రము రథముపైనుండి నృత్యముచేయుట కారంభించెనఁట!—కృష్ణుఁడిప్పుడు గోపబాలకుఁడు గాఁడు, అతఁడు పౌత్రులను గూడఁ గనియుండెను. మఱియు నాతఁడాకస్మికముగా వాతరోగగ్రస్తుఁడయ్యెననికూడ గ్రంథకారుఁడు చెప్పియుండలేదు. కేవలము నాట్యముచేయుటయేగాదు; సింహానాదము చేయుచు బాహుల నప్పళించుచుండెను. అప్పు డర్జునుం డాతనిం

గాంచి "ఇదియేమి! అట్లు నృత్యముచేసెదవేల!" అని ప్రశ్నించెను. అందుపైఁ గృష్ణుఁడు "కర్ణునియొద్ద నొక యమోఘశక్తి యున్నది. దానినాతఁడు నిన్నుఁ జంపుటకై దాఁచియుంచినాఁడుం అది యిప్పుడు ఘటోత్కచునిఁగొఱకుఁ బరిత్యక్తమై పోయినది. ఇఁక నీకు భయము లేదు. నీవిప్పుడు కర్ణునితో యుద్ధముచేయవచ్చును" అని చెప్పెను సైంధవ వధనాఁటి యుద్ధమునందే కర్ణుఁ డర్జునునితోఁ దలపడి యుద్ధముచేసి పరాజితుఁడై పోయెను. అప్పు డీయింద్రశక్తిం గూర్చినవృత్తాంత మెవ్వరిమనసునందును లేదు. కవిహృదయమునందును లేదు. కాని యిప్పుడిద మనసునందే యున్నచో సైంధవవధకాకమే యుండును. కర్ణుఁ డాతని రక్షించియే యుండును. ఏమైన నేమి—ఈశక్తిం గూర్చిన కథ కేవలము నసైసర్గికమై యున్నది. దీనినిగూర్చి యాలోచించుట నిష్ప్రయోజనము. ఏసంగతి చెప్పుటకై మేమీఘటోత్కచసంహార వృత్తాంతము నెత్తియుంటిమో యాసంగతి యిది—అర్జునుఁడు ప్రశ్నించుటయుఁ గృష్ణుఁ డిట్లు చెప్పెను—

"ఎట్లయిన నేమి! నేను నీహితముకొఱకు వివిధోపాయముల నుపయోగించి క్రమక్రమముగా మహాబలపరాక్రాంతులగు జరాసంధుఁడు, శిశుపాలుఁడు, ఏకలవ్యుడు, హిడింబుఁడు, కిమ్మీరుఁడు, ఘటోత్కచుఁడు మొదలగువారిని వధించి యుంటిని"

ఈమాట సత్యము కాదు. కృష్ణుఁడు శిశుపాలుని వధించిన మాట సత్యమే కాని యది యర్జునహితార్థము కాదు. శిశుపాలుఁ డాతనిని సభామధ్యమున నవమానించెను. కృష్ణుఁ డుజ్జరతార్థ మాతని వధించెను. జరాసంధవధకుఁ గృష్ణుఁడు కర్తగాకున్నను ప్రవర్తకుఁడై యుండెను. అదియును నర్జునునిహితమునకుఁ గాదు— కారాబద్ధులగు రాజులను విడిపించుటకు కాని, బకహిడింబకిమ్మీరాది రాక్షసుల సంహారంబునందుఁగాని యేకలవ్యుని యంగుష్ఠచ్ఛేదన విష

యమునందుఁ గాని కృష్ణున కెంతమాత్రమును సంబంధము లేదు. ఆ సంగతు లాతనికిఁ దెలియనే తెలియవు. ఆసమయములయం దాతఁ డచ్చట లేఁడు శ్రీకృష్ణుఁ డేకలవ్యుని వధించినట్లు మహాభారతమునం దొక్కచో నగపడుచున్నది. కాని యీయంగుష్ఠచ్ఛేదనకథకును దానికిని సంబంధము లేదు. ఏలకవ్యుని యంగుష్ఠచ్ఛేదమును, గాత్రుస సంహారంబునుగూడఁ గేవలము నపకృతంబులై యున్నవి.

ఇట్టిచో నీమిథ్యావచనములను కృష్ణునిచే ననిపించుట కుద్దేశ మేమి?

ఈవిషయమున మఱియు నొకమాట చెప్పవలసియున్నది. శ్రీకృష్ణుఁ డిచ్ఛామూలంబున సర్వంబును గావించుచుండె ననియు నాతని యిచ్ఛామూలంబుననే హిడింబాదులవధయు, ఘటోత్కచు నిపైఁగర్ణుని శక్తిప్రయోగమును జరగియుండుననియు భక్తులు చెప్పుదురు. ఈమాట యసంగతమైనది. వివిధోపాయముల నుపయోగించితి నని కృష్ణుఁడే చెప్పి యున్నాఁడు. సర్వకర్త యగునీశ్వరుఁ డిచ్ఛావశంబుననే కార్యసాధనముం గావించినచో మానవశరీరముందాల్చి యవతరించుటకుఁ బ్రయోజన మేమున్నది? ఆతఁ డెట్టికార్యముఁ నిచ్ఛాశక్తిమూలంబునఁ గావించుట లేదనియుఁ, బురుష కారముననే యవలంబించి పని చేసెననియు మేము మరలఁ జెప్పుచున్నాము. ఈ సంగతి నాతఁడు స్వయముగనే చెప్పియుండెను. ఇంతకుముం దావాక్యముల నుదాహరించి యుంటిమి. ఆతఁ డిచ్ఛ కలిగి ప్రయత్నించినను సంధిస్థాపనము చేయఁజాలన ట్లగపడుచున్నది. అట్లే యాతఁడుకర్ణుని యుధిష్ఠిరపక్షమునకుఁ జేర్పఁజాలక పోయెను—ఆతఁ డిచ్ఛావశంబుననే సర్వకార్యసాధనంబు గావించుచున్నచో భస్మసదృశంబును, జడపదార్థంబు నగు నొకయస్త్రముకొఱ కిచ్ఛామయుండగు నాతని కింత యాలోచన మేల?

దీనికిఁ బ్రధానోద్దేశ మేమి యీ పూర్వపరిచ్ఛేదమునం దెలిపి యున్నాము. బుద్ధియు, దుర్బుద్ధియుఁగూడ నీశ్వరప్రేరితములే యని కవి బోధింపఁదలఁచెను. కర్ణుఁ డర్జునునికొఱ కింద్రశక్తిని దాఁచియుండి యును దాని నిప్పుడు ఘటోత్కచునిపైఁ బ్రయోగించుట కాతని దుర్బుద్ధియే కారణము. దీనిని నేనే కల్పించితి నని కృష్ణుఁడు చెప్పి యుండెను. అనఁగా దుర్బుద్ధి యీశ్వరప్రేరితమని—శిశుపాలుఁడు దుర్బుద్ధి వశంబున నే సభాస్థలంబునఁ గృష్ణుని నసహ్యముగా నవమా నించెను. జరాసంధుఁడు సైన్యసహాయుఁడై యుద్ధమే చేసినచో నజే యులగుపాండవులమాట యటుండ నిమ్ము—కృష్ణసహితులగు యాద వులుగూడఁ గలసినను నాతని జయింపఁజాలరు. కాని శారీరకబలం బునుబట్టి భీముఁ డాతనికంటె శక్తిమంతుఁడు. అట్టిచో రాజరాజేశ్వ రుఁడగు జరాసంధుఁ డేకాకియై యొకమల్లునివలె భీమునితో యుద్ధ ముం గావించుటకుఁ గారణ మాతనిదుర్బుద్ధియే. అదియును నేనే కల్పించితి నని కృష్ణుఁడు చెప్పెను. ద్రోణాచార్యుఁ డనార్యుఁ డగు నేకలవ్యునింగూర్చి నాకుగురుదక్షిణగా నీదక్షిణాంగుష్ఠము నీయవలయు నని కోరెను. ఆయంగుష్ఠము నిచ్చినచో నతిప్రయాసలబ్ధం బగునాతని ధనుర్విద్య యంతయును నిష్ఫలమై పోవును. కాని యేకలవ్యుఁ డాగురు దక్షిణ నొసంగెను. ఇది యేకలవ్యుని దారుణదుర్బుద్ధి. కృష్ణచరిత్రము నం దిది యంతయును గృష్ణప్రేరితమే యని సూచింపఁబడి యున్నది. అనఁగా నీశ్వరప్రేరితమని—రాక్షససంహార సంబంధమునఁ గూడ నిట్లే యున్నది. ఇట్టివన్నియును ద్వితీయ స్తరమునకు సంబంధించిన కవికల్పనములే.



## పంచమ పరిచ్ఛేదము

### ద్రోణవధ

ప్రాచీనభారతవర్షమునఁ గేవలమును క్షత్రియులుమాత్రమే యుద్ధము చేసియుండలేదు. బ్రాహ్మణవైశ్యయోధుల వృత్తాంతము కూడ మహాభారతమునం దున్నది. దుర్యోధనుని సేనానాయకులలో మువ్వురు ప్రధానవీరులు బ్రాహ్మణులు; ద్రోణుఁడు నాతని స్యాలకుఁ డగు కృపుఁడు, నాతనిపుత్రుఁడగు నశ్వత్థామయు; ఇతరవిద్యలకు వలెనే యుద్ధవిద్యకుఁగూడ బ్రాహ్మణులాచార్యులై యుండిరి. కృప ద్రోణు లిట్టివారే అందుచేతనే వీరికి ద్రోణాచార్యుఁ డనియుఁ గృపాచార్యుఁడనియు నామములు కలిగెను.

మఱియును బ్రాహ్మణులతో యుద్ధము చేయుట చాల దుష్కర కార్యము యుద్ధమునందైనను బ్రాహ్మణుని వధించినచో బ్రహ్మహత్యాపాతకము సంఘటిల్లును. మొత్తముమీఁద నీమహాభారతకారుఁ డీకారణముచేతనే యీబ్రాహ్మణయోధుల నెత్తుకొనుట వలన మహావిపన్నుఁ డైపోయినట్లు స్పష్టముగా నగపడుచున్నది. ఈ కారణముచేతనే కృపాశ్వత్థామలు యుద్ధమునందు మరణింపలేదు. కౌరవ పక్షయోధు లందఱును మరణించిరి కాని కేవల మాయిరువురు మాత్రమే చావలేదు. వా రమరులని చెప్పి గ్రంథకారుఁ డెట్లో నిష్కృతిం గాంచుయుండెను. కాని ద్రోణాచార్యునిమాత్రము చంపక తప్పినది కాదు. భీష్మునితరువాత నాతఁడే సర్వప్రధానుఁ డగుయోధుఁడు. ఆతఁడు జీవించి యుండగాఁ బాండవులు విజయలాభముం గాంచఁజాలరు. కాని పరమధార్మికు లగుపాండవపక్షయోధులలో నెవ్వరిచేనైన నాతని జంపించి యాబ్రహ్మహత్యాపాతకము వారి కంటఁ గట్టుట గ్రంథకారున కిష్టము లేకపోయెను. విశేషించి సమ

యుద్ధమున నెదిరించి ద్రోణాచార్యుని బరాజితుం జేయఁగలవీరుఁడు పాండవపక్షమునం దర్జునునికంటె నితరు డెవ్వఁడును లేఁడు. కాని, ద్రోణాచార్యుఁ డర్జునునకు గురువు. కావున నర్జునుం డాతని వధింపఁ గూడదు. అందుచే గ్రంథకారుఁ డొకకౌశలము నవలంబించుటకు బాధ్యుఁడు కావలసి వచ్చెను.

పాండవమహిషి యగుద్రౌపదికి జనకుండగు ద్రుపదునితోఁ బూర్వము ద్రోణునకు గొప్పవివాద మైయుండెను. ద్రుపదుఁడు ద్రోణునితో సమానవిక్రముఁడు కాఁజాలకపోయెను. ఇంతేకాక యాతనిచే నవమానితుం డయ్యెను. అందుచే నాతఁడు ద్రోణవధార్థమై యొకయజ్ఞముం గావించెను. ఆయజ్ఞకుండమునుండి ద్రోణవధకారియగు ధృష్టద్యుమ్నుం డనుపుత్రుం డుద్భూతుం డయ్యెను. ఆధృష్టద్యుమ్నుఁడు కురుక్షేత్రయుద్ధమునఁ బాండవసేనానాయకుఁడై యుండెను. ఆతఁడు ద్రోణుని వధించునని పాండవులకును ధైర్యమున్నది. బ్రహ్మవధార్థము దైవకర్మజాతుండగు నాతనికి బ్రహ్మహత్యాపాప ముండదు.

కాని మహాభారతమునం దొక్కచేయికాక యనేకస్థలముల యం దనేకకవుల నానావిధరచనలు యథేచ్ఛముగ జొప్పింపఁబడి యున్నవి. పంద్రెండుదివసములు యుద్ధము జరిగినను ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యు నేమియుఁ జేయజాలకపోయెను. మఱియు నాతనిచేఁ బరాజితుఁడు కూడ నయ్యెను. కావున ద్రోణునిం జంపుటకుపాయమును ధైర్యమును లేకపోయెను. ప్రతిదినమునను బాండవపక్షసైన్యక్షయం బగుచుండెను. అప్పుడు ద్రోణసంహారార్థమైయొక విధమగు ఘోరపాపాచరణముం గావింపవలయునని పాండవపక్షమున స్థిరపడియెను. ఈమహాపాపాలోచనముంగూర్చిన కళంక మంతయును శ్రీకృష్ణుని నెత్తిపైఁ బెట్టఁబడియెను. ఆతఁడే దీనికిఁ బ్రవర్తకుఁడని యందుఁ జెప్పఁబడి యుండెను. కృష్ణుఁ డిట్లు చెప్పెను.

'ఓ పాండవులారా! అన్యులమాట యటుండనిండు! సంగ్రామ రంగమునం దీద్రోణాచార్యునిసాక్షాద్దేవేంద్రుండైనను జయించుటకు సమర్థుండు కాంజాలండు. కాని యాతండస్త్రశస్త్రములను బరిత్యజించినచో నాతని జయించుట మనుష్యులకు సాధ్యంబు కాంగలదు. కావున మీరిప్పుడు ధర్మమును బరిత్యజించి యాతనిం బరాజితునిం గావించుటకై ప్రయత్నంబు సేయుండు'

కవి యింతకుం బూర్వ మింకొకచోట నిట్టిశ్రీకృష్ణునిచేతనే 'ఏస్థానమున బ్రాహ్మణుండు సత్యము, శౌచము, శ్రీ, లజ్జ, క్షమ ధైర్యము ననునవి మూర్తీభవించియుండునో యాస్థానమునందే నేనునిలిచియుందు నని ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. *' అని పలికించి యున్నాండు.

ఎవ్వండు భగవద్గీతాపర్వాధ్యాయమున ధర్మసంరక్షణార్థమై నేను యుగయుగంబుల నవతరించుచుండెద నని చెప్పియుండెనో యెవ్వనిచరిత్ర మింతవఱకు నాదర్శధార్మికచరిత్రముగాం బ్రశంసిత మగుచుండెనో, యెవ్వని ధర్మదార్ఢ్యము శత్రువులచేంగూడ నంగీకృతమై కీర్తింపంబడియెనో †అట్టిమహాత్ముండేనా 'మీరు ధర్మమార్గమును విడువుండు!' అని బోధించినవాండు? అందుచేతనే మహాభారతమున నానావిధహస్తరచనము లున్నవని చెప్పుచున్నాము. ఎవరియిష్టము వచ్చినట్లుగా వా రందుం దమయుద్దేశములను జొప్పించి యున్నారు.

అప్పుడు కృష్ణుం డిట్లు చెప్పం దొడంగెను. 'నానిశ్చితాభిప్రాయమును దెలుపుచున్నాను. అశ్వత్థామ మరణించెనని యాతని కెఱింగింపం గలిగినచో ద్రోణుండిక యుద్ధము చేయంజాలండు. కావున నెవ్వ

---

*ఘటోత్కచపర్వాధ్యాయము ౧౮౩ అధ్యాయము

†ధృతరాష్ట్రవాక్యము చూడనగును.

నెవ్వరైన నాతనిచెంతకుఁ బోయి రణరంగమున నశ్వత్థామ నిహతుఁడయ్యెనని చెప్పవలయును.''

అర్జునుఁ డసత్య మాడుట కంగీకరింపలేదు. యుధిష్ఠిరుఁ డతికష్టముతో నందుకు సమ్మతించెను. భీముఁ డూరక వాక్యవ్యయము చేయక యశ్వత్థామనామకంబగు నొకగజంబును వధించి పోయి ద్రోణాచార్యుఁ గాంచి "అశ్వత్థామ మరణించెను.*" అని చెప్పెను. తన కుమారుఁ డమితబలశాలి యనియు, శత్రుదుర్జయుండనియును ద్రోణాచార్యుఁడెఱుంగును. కావున నాతఁడు భీమునివాక్యములను విశ్వసింపలేదు. ఆతఁడు ధృష్టద్యుమ్నుని వధింపవలయు ననుద్యృఢప్రయత్నముతో యుద్ధము చేయుచుండెను; కాని యశ్వత్థామమరణముం గూర్చి మరల నొకసారి యుధిష్ఠిరు నడిగెను. యుధిష్ఠిరుఁ డెప్పుడును గూడ నధర్మము చేయలేదు; అసత్యము చెప్పలేదు. అందుచేతనే ద్రోణుఁ డాతని నడిగెను. అశ్వత్థామ యనుకుంజరము మరణించెనని యుధిష్ఠిరుఁడు చెప్పెను. కాని కుంజరమనుమాట స్పష్టముగా నుచ్చరింపలేదు.

అందువలన నేమి జరిగినది; ద్రోణుఁ డప్పుడించుక విమనస్కుఁడైనమాట నిజమే! కాని తత్క్షణమునందే మహాఘోరంబగు యుద్ధముం గావింపఁ దొడంగెను. ఆతనికి మృత్యుస్వరూపుఁ డగుధృష్టద్యుమ్నుఁడు తనకు సాధ్యాతీతంబగు యుద్ధంబు చేసి ద్రోణునివలన నిరస్త్రుండును విరథుఁడును విపన్నుండు నయ్యెను. అప్పుడు భీముఁడు పోయి యాతని రక్షించి ద్రోణాచార్యునిరథంబుం బట్టుకొని యెన్నియో మాటలాడెను. ద్రోణుని యుద్ధమునందుఁ బరాజితునిం గావించెననుట కామాటలే చాలును.

---

* "అశ్వత్థామా హత ఇతి గజః" ఈకథ భారతములోనిది కాదు. కథకులు దీనిని గల్పించియుందురని తోఁచుచున్నది. మూల భారతమునం దిది లేదు.

"ఓ బ్రాహ్మణా! స్వధర్మమునం దసంతుష్టులగు బ్రాహ్మణులు శిక్షితాస్త్రులై యుద్ధమునఁ బ్రవేశించినంతమాత్రమున క్షత్రియవీరులకెన్నిటికిని వినాశనంబు కలుగఁబోదు. హింస చేయకుండుటయే ప్రధానధర్మం బని పండితులు నిర్దేశించి యాధర్మమును బ్రాణపణంబుగఁ గాపాడుకొనుచుందురు. అట్టిధర్మమును బ్రతిపాలించుట బ్రాహ్మణుల కవశ్యకర్తవ్యము. నీవు బ్రాహ్మణశ్రేష్ఠుండ వయ్యును, జండాలునిం బోలి యజ్ఞానాంధుండవై పుత్రకళత్రోపకారంబగు నర్థలోభంబున వివిధప్రాణిగణవినాశనంబు గావించుచున్నావు; ఒక్కపుత్రుని యుపకారముకొఱకు స్వధర్మమును బరిత్యజించి స్వార్థపరుండవై యసంఖ్యాజీవనాశంబు చేయుచుంటివి! ఇది నీకు లజ్జాకరంబుగఁ దోఁచుటలేదా?"

ఈమాట లన్నియును సత్యములే. ఇంతకంటెను దిరస్కారమేమున్నది? ఇట్టిమాటలవలన దుర్యోధనునివంటి దురాత్మునిమతము తిరుగక పోవచ్చును. కాని, ధర్మాత్ముండగు ద్రోణాచార్యుని కీపాటి తిరస్కారము చాలును. ఈతరువాత నిఁక నశ్వత్థామమృత్యువుం గూర్చి చెప్పనక్కఱలేదు. కాని యాసంగతికూడ నిచ్చటఁ బునరుక్తంబయ్యెను.

ఈమాటలకుఁ దరువాతనే ద్రోణాచార్యుఁ డస్త్రశస్త్రములను బరిత్యజించెను. అప్పుడు ధృష్టద్యుమ్నుఁ డాతనిశిరంబును ఖండించి తీసికొని వచ్చెను. ఈవర్ణింపఁ బడినసంగతు లన్నియు సత్యములే యైనచో నీవ్యాపారమునందుఁ జేరినవా రందఱును మహాపాపాత్ము లనియె చెప్పవలయును. గ్రంథకారున కీసంగతి తెలియును. ఇంతవఱకును భూమికి నాలుగంగుళములపైనుండి నడచుచున్నధర్మాత్ముఁడగు యుధిష్ఠిరునిరథ మప్పుడు భూమిని స్పృశించి నడచె ననియు, నీయపరాధముచేతనే యాతనికి నరకదర్శన మయ్యెననియు గ్రంథకారుఁడు చెప్పి

యున్నాఁడు. కాని యిట్లు విశ్వాసఘాతుకులై మిథ్యాప్రపంచమున గురుహత్యం గావించినవారికి నరకదర్శనమాత్రమున నుపయుక్తదండనమైనట్లు కాదనియు నట్టివారి కనంతర నరకప్రాప్తియే తగినశిక్ష యనియును. మామతము.

ఈయపరాధమున కంతయు నీ మహాపాపప్రవర్తకుఁడగు కృష్ణుఁడే బాధ్యుఁడై యున్నాఁడు. కాని యాతని తప్పు నీవిధముగా సమర్థించుచున్నారు. "ఎవ్వఁడీశ్వరుఁడో, స్వయముగఁ బాపపుణ్యములకుఁ గర్తయో, విధాతయో, పాపపుణ్యస్రష్టయో యట్టివానికి మరలఁ బాపపుణ్యము లనేమి? పాపపుణ్యము లాతని స్పృశింపఁ జాలవు" అని ఈమాట సత్యమే. కాని యాతఁడు మానవావతారముం దాల్చినప్పుడు కూడ నాతని కీదర్మ మాచరణీయ మగునా? నేను ధర్మసంస్థాపనార్థమై యవతరించితినని యాతఁడు స్వయముగాఁ జెప్పియుండెను. కేవల పాపాచరణముచేతనే ధర్మసంస్థాపన మగుననియా యాతని యుద్దేశము? అతఁడెన్నఁడు నిట్లు చెప్పియుండలేదు. భగవద్గీతయందాతఁడు—

"జనకాదులు కర్మమూలముననే సిద్ధిలాభముం గాంచిరి. మానవునకు స్వధర్మమునందుఁ బ్రవృత్తిం గల్పించుటకు దృష్టాంతముగా నీవు కర్మచేయుము. శ్రేష్ఠులగువారు చేయుకార్యములనే యితరులు నవలంబించి చేయుచుందురు. పెద్దలు మన్నించు మార్గమునే లోకు లనుసరించుచుందురు. ఓపార్థా! ఈమూఁడు లోకములందును నాకుఁ గర్తవ్య మేదియును లేదు. అయినను నేను గర్మమును జేయుదును. నేనెప్పుడైనఁ బ్రమాదవశంబునఁ గర్మానుసరణంబు గావింపకున్నచో లోకులు కేవలమును నన్నే యనుకరించి కర్మభ్రష్టులై పోవుదురు" అని బోధించెను.

శ్రీ మద్భగవద్గీత 3 అధ్యాయము ౨౦, ౨౩.

తాను మానవుఁడయి జన్మించి తనకార్యములే దృష్టాంతములుగాఁ జేసి ధర్మరాజ్యస్థాపనముం గావించుట తన యుద్దేశమని శ్రీకృష్ణుఁడే స్వయముగాఁ జెప్పియుండెను. కావున మహాపాపములకు దృష్టాంతము లగుకార్యములం గావించుట యెన్నటికి నాతని యుద్దేశముకాదు.

అట్లయినచో నీగొడవ యంతయు నేమి? ఈ మీమాంస స్థిర పరచుకొనకుండఁగా మేమీకృష్ణచరిత్రమునఁ బ్రవేశింపఁజాలము. ఏమనిన—"బృందావనమున గోపీజనము" "అశ్వత్థామా హత ఇతి గజః" అను నీరెండే శ్రీకృష్ణునకుఁ బ్రధానాపవాదములై యున్నవి!

"ఈగొడవయేమి!"అను నీప్రశ్నకివన్నియు నలౌకికము లనుటయే ప్రత్యుత్తరము. పాఠకులు నిశ్చలహృదయములతో మాయీ గ్రంథమును బఠించినచో నీ సమస్త మహాభారతమును గూడ నేక కవివిరచితము కాదను సిద్ధాంతమును నిశ్చయముగా నంగీకరింపక మానరు. అందుఁ గొంతభాగమే మౌలిక మహాభారతమై యున్నది. తక్కినభాగము తరువాతి కవులచే మూలగ్రంథమునఁ బ్రక్షిప్తమైనది. అందు మౌలిక మేదియో, యమౌలిక మేదియో నిర్దేశించుట సులభసాధ్యముకాదు. అట్టిభేదమును నిరూపించుటకై మేమిదివఱకుఁ గొన్నిపద్ధతులను జెప్పియుంటిమి. వానిని మరల నిచ్చటఁ బాఠకుల స్మృతికిఁ దేవలసియుండెను.

(1) అందులో నొక పద్ధతి—

శ్రేష్ఠకవిచే రచింపఁబడిన చరిత్రములందలి సర్వాంశములును సుసంగతములై యుండును. అం దెచ్చటనైన వ్యతిక్రమము కానవచ్చినచో నది ప్రక్షిప్తమైయుండు నని సందేహింపవచ్చును"

ఉదాహరణముకొఱకుఁ జూపుచున్నాము. ఎచ్చటనైన భీష్మునిపరదారపరాయణత్వముగాని, భీముని భీరుత్వముగాని కానవచ్చినచో

నది ప్రక్షిప్తమనియే తెలిసికొనవలయును. ఇచ్చటికథ యట్లేయు న్నది. ఒకసారి కాదు; ముమ్మాటికి నట్లేయున్నదని చెప్పవచ్చును. పరమధర్మాత్ముఁ డగుయుధిష్ఠిరుఁ డీవిధముగా నృశంసుడై విశ్వాస ఘాతుకుఁడై మిథ్యాప్రపంచమూలమున గురుహత్యం గావించెననుట కంటె నసంగతవిషయము మఱియొకటి యేదియును లేదు. మఱియు మహాతేజస్వియు, బలగర్వశాలియు, భయశూన్యుండును నగుభీముఁ డిట్లు చేసెననుటగూడ నసంగతమే. భీముఁడు బాహుబలమునుదక్క మఱిదేనిని బరిగణించువాఁడు కాఁడు. ఆతఁడు శత్రువులయెడల బాహుబలమును మాత్రమే యుపయోగించుచుండును. రాజ్యార్థము గాని, ప్రాణసంరక్షణార్థముగాని యాతనికి బాహుబలమే యేకమాత్రసాధనమై యుండెను. అశ్వత్థామ నారాయణాస్త్ర మను పేరుగల యనివార్య మగుదైవతాస్త్రము నొకప్పుడు ప్రయోగించెను. అది జగంబునంతను ధ్వంసముగఁ జేయఁగలదు. దివ్యాస్త్రవేది యగునర్జునునకుఁగూడ దానినివారించుటకు సామర్థ్యము లేదు. పాండవసైన్య మంతయును వినాశనంబగుట కారంభించెను. ఈయస్త్రమునుండి తప్పించుకొనుట కొకటే యుపాయమున్నది. ఈ దేవతాస్త్రము సమర విముఖు లగువారినిమాత్రము స్పృశింపదు. కావున శ్రీకృష్ణుని యుపదేశానుసారముగాఁ బ్రాణరక్షణంబు సేసికొనఁగోరి పాండవసైనికు లందఱును దమతమ వాహనంబులనుండి భూతలంబున కవతీర్ణులై యస్త్రశస్త్రములఁ బరిత్యజించి రణవిముఖులై యుండిరి. కృష్ణాజ్ఞచే నర్జునునకుఁగూడ నట్లే చేయవలసివచ్చెను. కేవలమును భీముఁడొక్కఁడు మాత్రమే యట్లు చేయుట కంగీకరింపక "నేను నాశరనికరంబులచే నశ్వత్థామదివ్యాస్త్రమును బరాజితముగఁ జేసివైచెదను. సువర్ణమయంబగు నాఘనగదాదండముచే నే నీద్రోణపుత్రునినారాయణాస్త్రమును విమర్దితముగఁ జేసి రణస్థలంబున నంతకునిం బోలి

విహరించెదను. ఈభూమండలమున సూర్యుని మించిన జ్యోతిష్పదార్థము లేనియట్లే నన్నుమించిన పరాక్రమశాలియగు మానవుఁడెవ్వఁడును లేఁడు. ఐరావతకుంభసదృశంబును, సుదృఢంబును నగునాయీ భుజదండము హిమాలయపర్వతమునైన నిపాతితముం గావింపఁగలదు. నేనయునాగబలశాలిని. దేవలోకమునఁ బురందరునింబోలి యీభూలోకమున నే నప్రతిద్వంద్విని. నే నిప్పుడు ద్రోణపుత్రునిది వ్యాస్త్రమును నివారించుటకై యుద్యోగించితిని. మీరందఱును నా బాహువీర్యముం గాంచెదరుగాక! ఈయస్త్రము నెదిరించువీరు లెవ్వరును లేకయే యున్నచో నీసమస్తకురుపాండవసేనాసమక్షమునను నేనే దీనికిఁ బ్రతిద్వంద్వినై నిలిచెదను" అనియెను. ఇది కల్పనాకథయే యని యంగీకరింతము—అట్లే కావచ్చును. ఇది సత్యముగా నెవ్వరును విశ్వసింపనక్కఱలేదు. చరిత్రరచనమునం దనుకూలావకాశముంబట్టి కవి యిట్లు వర్ణించుచుండును. నారాయణాస్త్రప్రయోగమే మౌలికము కాకపోవచ్చును. కాని మౌలికమహాభారతమునం దంతటను భీముని ప్రకృతి మాత్ర మిట్టిదిగనే కానవచ్చుచున్నది. ఇట్టి భీమునిచరిత్రమునకును, ద్రోణవధవిషయంబునఁ గావించిన యాజంబుక ప్రపంచనమునకును నేమైన సంబంధ మున్నదా? స్త్రీలు గూడఁ గల్పింపఁదగని యిట్టి శత్రువధోపాయమును భీముని వంటి మహాపరాక్రమశాలి యవలంబించునా? ద్రోణాచార్యుని కంటె నారాయణాస్త్రము సహస్రగుణముల భయంకరమైనది. అట్టి నారాయణాస్త్రము నెదుట సింహమువలె విజృంభించిన భీముఁడు—ప్రళయానలసదృశం బగునారాయణాస్త్రము నెదుటినుండి యెవ్వరిచేనైనను బలవంతముగఁగాని మరలింపఁబడని భీముఁడు—కేవలము నర్జుననకుఁ బ్రతియోధమాత్రుఁ డగుద్రోణాచార్యునకై భయపడి పక్కవలె నిట్టిమోసముం గావించె నని యేకవి వర్ణించి యుం

డెనో, యాకవికి గవిత్వ మెక్కడ నున్నది? అట్టికవికి మహాభారత రచనము సాధ్య మగునా?

ఈచంపఁబడిన యశ్వత్థామయను నేనుఁగుకథ భీమునిచరిత్ర కెంత విరుద్ధమో యుధిష్ఠిరునిచరిత్రకుఁగూడ నంతవిరుద్ధముగనే యగ పడుచున్నది. కాని యీభీమయుధిష్ఠిరుల చరిత్రములతో నీకథ యెంత యసంగతమో, శ్రీకృష్ణునిచరిత్రముతో నిది యంతకంటెను విశేషా సంగతముగా నున్నది. మేము చెప్పినకార్యముల నన్నిటిని బాఠకులు బాగుగ గ్రహింపఁ గలిగినచో నిది యెంతవఱ కసంగతమో వారికి బోధపడఁగలదు; ఆలోకమునకు నంధకారమునకును, కృష్ణత్వమున కును, శ్వేతత్వమునకును, దాపమునకు, శైత్యమునకును, రోగమునకు, స్వాస్థ్యమునకును, మాధుర్యమునకుఁ గర్కశత్వమునకును, భావము నకు నభావమునకు నెంత యసంగతియో యంతయసంగతి యున్నది. మౌలిక చరిత్రముతో, ఒకటికాదు–మౌలికములగు మువ్వురిచరిత్ర ములతో నీకథ యసంగతమగుటవలన నిది ప్రక్షిప్త మనియు, నన్యక విప్రణీత మనియు భావించి మేము దీనిని బరిత్యజించుచున్నాము.

(2) మేము చెప్పవలసిన దింకను ముగియలేదు. ఏది మౌలి కమో, యేది యమౌలికమో గ్రహించుటకై మేము నిర్దేశించిన కొన్నిపద్ధతులలో నొక దానినిబట్టి పరీక్షింపఁగా నీహతగజవృత్తాంత మమౌలిక మని తేటపడినది. మఱియొకపద్ధనిబట్టికూడఁ బరీక్షించి చూతము. "రెండువర్ణనములు పరస్పరవిరుద్ధముగా నగపడినచో నం దొకటి ప్రక్షిప్త మని గ్రహింపవలయును" అని యింకొకసూత్రము–ఇచ్చటనే మహాభారతమునందు హతగజకథతోఁగూడ ద్రోణవధకు మఱియొక కారణ మగపడుచున్నది. ఆవిషయమును భారతమునుండి యెత్తి చూపుచున్నాము. దానినిగూర్చి యాలోచించుటకు ముందు గనే ద్రోణుఁ డధర్మయుద్ధముం గావించె ననుసంగతి పాఠకులకుఁ

దెలుపవలసియున్నది. బ్రహ్మాస్త్ర మనునది మహాభారతమున వర్ణింపఁ బడిన యన్యాన్యదైవాస్త్రములలో నొకటి. కార్యసిద్ధివిషయంబున నెల్లవిధముల నవ్యర్థం బగుసాధనముంగూర్చి లోకు లిప్పటికిని 'బ్రహ్మాస్త్రము' అని వాడుకొనుచుండుట కలదు. ఈబ్రహ్మాస్త్రముభిజ్ఞు లగు వారిపైఁ బ్రయోగించుట నిషిద్ధము, నధర్మము నయ్యుండెను. ఇది మహర్షులమతము. ద్రోణుఁ డట్టి బ్రహ్మాస్త్రమూలమున నస్త్రానభిజ్ఞులగు సైనికుల నెందఱనో వధించెను.

'విశ్వామిత్రుఁడు, జమదగ్ని, భరద్వాజుఁడు, గౌతముఁడు, వశిష్ఠుడు, అత్రి, భృగుఁడు, అంగిరసుఁడు, మొదలుగాఁగల మహర్షులందఱును జగంబంతయు నిఃక్షత్రంబు గావింపఁ జూచుచున్న యాచార్యుం గాంచి యాతనిని బ్రహ్మలోకంబునకుం గొనిపోవలయు ననునుద్దేశముతో నతిశీఘ్రంబుగ నాతనిచెంతకు వచ్చి "ఓద్రోణా ! నీవధర్మయుద్ధంబు సేయుచున్నావు. కావుననే యిప్పుడు నీకు వినాశనమయము తటస్థించినది. నీ వాయుధములను బరిత్యజించి యొకసారి మావంకఁ దిలకింపుము. ఇట్టికార్యానుష్ఠానము నీకుఁ గర్తవ్యము కాదు. నీవు వేదవేదాంగ వేదివి; సత్యధర్మపరాయణుండవు. కావున నిట్టికార్యంబు సేయుట నీ కనుచితము. నీవ విముగ్ధుండవై యాయుధ పరిత్యాగంబు సేసి శాశ్వతపరావస్థానంబు గావింపుము. ఇప్పుడు నీకు మర్త్యలోక నివాసకాలము సంపూర్ణమైనది ఓవిప్రా! బ్రహ్మాస్త్రప్రయోగంబుచే నస్త్రానభిజ్ఞులను వినాశనంబు నందించుచు నసత్కార్యానుష్ఠానముం గావించుచున్నావు. కావున సత్వరము నీవాయుధత్యాగంబు సేయుము. ఇటువంటి క్రూరకార్యానుష్ఠానము నీకుఁ గర్తవ్యము కాదు".

ఇందువలననే ద్రోణాచార్యుఁడు యుద్ధవిరతుఁడయ్యెను. అశ్వత్థామ మరణవృత్తాంతమును యుధిష్ఠిరునివలన వినియును నాతఁడు యుద్ధమును విడువలేదు. ఆవెంటనే యాతఁడు ధృష్టద్యుమ్నుని వధిం

చుటకై విజృంభించెను. అప్పుడు యదువంశీయుఁడగు సాత్యకి వచ్చి యాతని రక్షించెను. సాత్యకితో యుద్ధము చేయుటకు సమర్థులగువా రెవ్వరును లేరు. ద్రోణుఁడును నాతని నెదిరింపఁ జాలకపోయెను. యుధిష్ఠిరుం డప్పుడు స్వపక్షవీరుల నందఱ నుద్దేశించి—"ఓవీరవరులారా! మీరు యత్నపూర్వకముగా ద్రోణాభిముఖులై చనుఁడు. మహావీరుఁడగు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణసంహారంబునకు యథాసాధ్యంబుగఁ బ్రయత్నించుచున్నాఁడు. నేఁడాతని కార్యదీక్షం గాంచిన చో నాతఁడు క్రుద్ధుఁడై యెట్లో ద్రోణుని సమరాంగణమున నిహతునిం గావించుననియే స్పష్టముగాఁ దోఁచుచున్నది. కావున మీరందఱు నొక్కసారిగ ద్రోణునిపైఁబడి యుద్ధంబు సేయుఁడు" అని ప్రబోధించెను.

తోడనే పాండవ పక్షయోధు లందఱును ద్రోణాభిముఖులై విజృంభించిరి—

"మహారథుఁడగు ద్రోణుండును మరణంబునకుఁ గృతనిశ్చయుండై యతిత్వరితంబుగ నావీరగణంబు నెదుర్కొనుచుండెను. సత్యసంధుండును, మహావీరుండు నగు ద్రోణాచార్యుఁ డుద్ధతుండై యమ్మహారథుల నెదిరించునప్పుడు మేదినీమండలమంతయుఁ గంపింపఁ దొడఁగెను; ప్రచండవాయువులు సేనాగణంబును భయప్రకంపితముగఁ జేయుచు నతిప్రబలముగ వీవందొడంగెను. అతిభయంకరముగ రవిమండలమునుండి యుల్కాపాతము లగుచుండెను. ద్రోణాచార్యుని సకలాస్త్రములును బ్రజ్వలితము లగుచుండెను. రథభీషణనిస్వనంబులును, సశ్వగణాశ్రుపాతంబులు నగుచుండెను. అప్పుడు మహారథుఁడగు ద్రోణుఁడు కేవలమును నిస్తేజుఁడై యుండెను. ఆతనివామనయనమును, వామబాహువును నదరుచుండెను. అప్పుడాతఁడెదుటనున్న ధృష్టద్యుమ్ను నవలోకించుచు నత్యంతమును వికలహృదయుఁడై బ్రహ్మవాదులగు ఋషులవాక్యములను స్మరించుకొని ధర్మయుద్ధావ

లంబనపూర్వకముగఁ బ్రాణత్యాగముం గావింపవలయునని నిశ్చయిఁచుకొనియెను.

ఇప్పటి ద్రోణుని ప్రాణత్యాగాభిలాషకుఁ గారణములతో నశ్వత్థామమరణసంవాదము పరిగణింపఁబడలేదని పాఠకులు గ్రహించియే యుండవచ్చును. వివేచకులగువారి కీయొక్క నిదర్శనమే చాలును.

ద్రోణుఁడప్పటికిని యుద్ధము సేయుట మానలేదు. తరువాతఁ గూడ నాతఁడు ముప్పదివేల సైన్యమును విధ్వంసంబుగావించెననియు, మఱియొకసారి ధృష్టద్యుమ్నుని బంధీభూతునిం గావించెననియు,నీసారి భీముఁడు ధృష్టద్యుమ్నుని రక్షించెననియు నాతఁడే యభ్యాసానుసారముగా ద్రోణాచార్యుని రథమును బట్టుకొని మునుపటివలెనే యాతని నధిక్షేపించెననియు, నట్టి తిరస్కారమువలననే ద్రోణుఁ డస్త్రత్యాగముం గావించెననియు మహాభారతమునం దున్నది.

తరువాత ద్రోణుఁడు రథోపరిభాగమున సకలాస్త్ర శస్త్రములను బడవైచి యోగావలంబనపూర్వకముగ సకలజీవాభయప్రదానముం గావించెను. ఆసమయమున మహావీరుఁడగు ధృష్టద్యుమ్నుఁడు తనరథంబున సకలాయుధంబులనుంచి కరవాలంబు గేలంగీలించి క్రిందికి లంఘించి ద్రోణాభిముఖుండై పరుగెత్తెను. ఈవిధముగా ద్రోణాచార్యుఁడు ధృష్టద్యుమ్నునకు వశీభూతుండయ్యెనని సమరాంగణంబున హాహాకారంబు పుట్టెను. ఇట జ్యోతిర్మయుండును, మహాతపుండు నగుద్రోణాచార్యుం డస్త్రపరిత్యాగపూర్వకంబుగా సమభావము నవలంబించి యోగదృష్టితో ననాదిపురుషుం డగువిష్ణుని ధ్యానింపఁ దొడంగెను. మఱియు నాతఁడించుక యున్నతవదనుండై వక్షస్స్థలమును వికసింపజేసి, నిమీలితనయనయుగళుండై, విషయవాంఛలఁ బరిత్యజించి సాత్త్విక భావావలంబనపూర్వకంబుగ నేకాక్షరమంత్రం బగు నోంకారమును బరాత్పరుండగు వాసుదేవుని సంస్మరించుచు సాధుజన దుర్లభం బగుస్వర్గలోకగమనంబు గావించెను.

తరువాత ధృష్టద్యుమ్నుఁడు వచ్చి యామృతదేహమునందలి మస్తకమును ఖండించి తీసికొనిపోయెను—

కావున ద్రోణవధంగూర్చి మహాభారతమును రెండు వేఱు వేఱు సంఘటనము లగపడుచున్నవని చెప్పితిమి. ఆ రెండును సంపూర్ణముగ నొకదాని కొకటి విరుద్ధములుగాఁ గాక యొకసూత్రమునందే కూర్పఁబడియుండెను. కాని సమన్వయము బాగుగఁ గుదురలేదు ఈ రెంటిలోనను ద్రోణమృత్యువున కొక్క కారణమే చాలుననియు, రెండు కారణములతోఁ బ్రయోజనము లేదనియు స్పష్టమగుచునే యున్నది. ఈవిధముగా నిట్టిభిన్నకారణముల నొక్కచో నుపయోగించుట యొక్క కవికార్యమే యని యూహించుట కవకాశము లేదు. ఇవి రెండు నిరువురుకవులరచనలని సులభముగనే బోధ యగుచున్నది. ఇందుఁ బ్రక్షిప్తమేది? ద్రోణునిప్రాణత్యాగమునుగూర్చి మహాభారతమునుండి యుదాహరించిన కారణము లన్నిటితోడను నశ్వత్థామమృత్యుసంవాదము సంబంధించుట లేదు. కావున నావృత్తాంతము ప్రక్షిప్తమగుట యసంభవము ఇదివఱకునిర్ణయింపఁబడిన సూత్రములనుబట్టి యీవిషయమును బరీక్షించినచో నీసత్యము బోధపడఁగలదు.

పరస్పరవిరుద్ధము లగు రెండుభిన్నవిషయములు కానవచ్చినప్పుడం దొకటి ప్రక్షిప్తమైయుండు ననుమాట నిశ్చయమే కాని యందేది ప్రక్షిప్తమో నిర్ణయింపవలసివచ్చినప్పు డిదివఱకు సుప్రసిద్ధములైన యితరలక్షణములనుబట్టి పరీక్షింపవలయును. అట్టిలక్షణములతో నందేదిసరిపడకుండునో యది ప్రక్షిప్తమని తెలిసికొనవలయును. అశ్వత్థామవధసంవాదము కృష్ణభీమయుధిష్ఠిరులచరిత్రములతోఁ గేవలము నసంగతముగా నున్నదని మేమిదివఱకుఁ జూపియే యున్నాము. ఇట్టి యసంగతి కానవచ్చినభాగము ప్రక్షిప్తముగా గ్రహింపవలయు నని సూత్రమునుగూడ నిర్దేశించి యుంటిమి. కావున నీయశ్వత్థామమృత్యుసంవాద వృత్తాంతము ప్రక్షిప్తమే. సందేహము లేదు.

(3) మఱియొకమాటకూడనున్నది. అశ్వత్థామవధసంవాదము వలన ద్రోణుఁ డించుకంతయైనను యుద్ధమునుండి విముఖుఁడైనట్లగపడుట లేదు. అట్టిచోఁ గృష్ణుఁ డీమాట యనిపించుటవలనఁ బ్రయోజన మేమున్నది? ద్రోణుఁ డీమాటవలన యుద్ధవిముఖుఁ డగునని కృష్ణుఁ డాలోచించి యుండునా? అట్లాలోచించుట కవకాశ మెక్కడిది? అశ్వత్థామ చావు లేనివాఁడని ద్రోణునకే తెలియును. ఇది యస్వభావమైనను, గాకపోయినను దీనిమాట యటుంచుడు! సామాన్యమానవులమగు మాకును, మీకును గలయంతటిబుద్ధియైనను శ్రీకృష్ణునకుండు నని యంగీకరించినచో నాతఁ డిట్టియుపాయము నుపయోగించి యుండడని స్పష్టముగా బోధపడఁగలదు. ద్రోణుఁ డైనను మఱియెవ్వడైనను నిట్టి దుర్వార్తవిని యాత్మత్యాగము చేసికొనునప్పుడావార్తనిజమోకాదో తనపక్షమువారి నెవ్వరినైన నడిగి తెలిసికొనుటకుఁ బ్రయత్నింపకుండునా? ద్రోణుఁ డప్పు డశ్వత్థామవార్తం దెలిసికొనుట కెవ్వరినైన బంపకుండునా! అట్లు పంపియే తీరవలయును. అట్లు జరిగినచో మోసమంతయు నప్పుడే తెలిసి యుండును. శ్రీకృష్ణుఁ డింతమాత్రపు దూరాలోచన లేనివాఁడా?

అట్లగుటంజేసి యీకథ ప్రక్షిప్తమనియు నసత్యమనియుఁ దోఁచుచున్నది. ఋషివాక్యములచేతనే ద్రోణుఁ డస్త్రత్యాగముం గావించియుండు నని మేము చెప్పఁజాలము. ఆరణరంగమున కప్పుడు ఋషులువచ్చి రనుటకూడ నస్వభావముగనే యుండుటచే మేమా విషయమును గూడ నప్రకృత మని త్రోసివైచుటకు బాధ్యుల మగుచున్నాము. ఇందు విశ్వాసయోగ్య మగుకారణ మొకటి యున్నది. ద్రోణుఁడు తన యధర్మాచరణముంగూర్చి భీమునితిరస్కార వాక్యములవలన స్పష్టముగా గ్రహించుకొనఁ గలిగెను. యుద్ధముఖుఁ డగుట కాతనికి సాధ్యముకాలేదు. అట్లు చేసినచో ససమర్థత, ఆపత్కాల

మున దుర్యోధనుని బరిత్యజించుట యనునీరెండు దోషములకును గుఱి కావలసివచ్చును. కావున మరణించుటకే స్థిరపఱుచుకొనియెను. ఇంత వఱకు జనప్రవాదమున్నదిగదా—దానినాధారముచేసికొనియే మహాభారతప్రథమశ్రేణి సంబంధించిన కవి వ్రాసెను. అదియును యథార్థ ఘటనము కాకపోవచ్చును. ఏమైనను ద్రుపదపుత్రుఁడు ద్రోణుని వధించెననుమాటమాత్రము సత్యము! తరువాతిసంగతులనుబట్టి యదిరో బోధయగుచున్నది. ప్రబలప్రతాపముగు పాంచాలవంశమును బ్రహ్మహత్యాకళంకమునుండి యుద్ధరించుటకై తరువాత ననేకవిధములగునుపన్యాసములు బయలువెడలినవి.

(4) అనుక్రమణికాధ్యాయమునందును బర్వసంగ్రహాధ్యాయమునందును నీవిషయమై యేమున్నదియో చూడవలయును. అనుక్రమణికాధ్యాయమున ధృతరాష్ట్రవిలాపమునందిట్లున్నది—

యదా శ్రౌషం ద్రోణ మాచార్యమేకం
ధృష్టద్యుమ్నేనాభ్యతిక్రమ్యధర్మం
రథోపస్థే ప్రాయగతంవిశస్త్రం
తదానాశంసే విజయాయ సంజయ"

అర్థము-ఓసంజయా! ప్రాయోపవిష్టావస్థయందు రథస్థుఁడై యున్న యేకాకి యగుద్రోణాచార్యుని ధృష్టద్యుమ్నుఁడధర్మానుసారముగా వధించె నని యెప్పుడు వినియుంటినో యప్పుడే నేనిఁక జయమునుగూర్చి శంకించుట లేదు.

దీనినిబట్టిచూడఁగా ద్రోణవధవిషయమున ధృష్టద్యుమ్నుఁడు తక్క నితరు లెవ్వరు నెట్టియన్యాయమును జేయలేదని తోఁచుచున్నది. ధృష్టద్యుమ్నునికైనను బాప మేమనిన—ప్రాయోపవిష్టుఁడగు వృద్ధుని వధించుటయే. ద్రోణునిప్రాయోపవేశమునకుఁ గారణమిచ్చుట నేమియును జెప్పఁబడియుండలేదు. దానికిఁ గారణము

యుధిష్ఠిరవాక్యమో ఋషులయుపదేశమో, భీమునితిరస్కారమో యేమియును గూచి పబడలేదు. ఆతఁడు మిగుల శ్రాంతుఁడై మర ణించి యుండెను. బ్రాహ్మణుని ప్రాయోపవేశమున కాసన్నమృత్యువే తగినకారణమై యుండును.

(5) పర్వసంగ్రహాధ్యాయమున నీమాటయే లేదు. "ద్రోణే యుధి నిపతితే" అనుటకంటె మఱియేమియును లేదు. హాతగజ వృత్తాంతము సత్యమే యైనయెడల నట్టిప్రసంగమవశ్యముగ వచ్చియే యుండును. అభిమన్యుఁ డధర్మయుద్ధమున మరణించినకథ యున్నది-అట్టిచో ద్రోణునికథకూడ నుండవలసినదే. అప్పటి కింకను నీకథ సిద్ధము కాలేదు. అందుచేతనే లేదు.

(6) తరువాత ద్రోణపర్వమునందలి సప్తమాష్టమాధ్యాయము లలో ద్రోణయుద్ధము సంక్షేపముగ వర్ణితమై యున్నది. అందైనను నీ మోసముగూర్చిన యెట్టిప్రసంగమును లేదు. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని వధించె ననిమాత్రమే యున్నది. ఈయధ్యాయములు రచింపఁ బడినకాలమున నీకల్పకనాథపుట్టి యుండలేదు.

(7) అశ్వమేధపర్వమునం దిట్లున్నది—కృష్ణుఁడు ద్వారకకుఁ బోయినంతనే వసుదేవుఁడు కృష్ణునివలన యుద్ధవృత్తాంతమును విను టకుఁ గుతూహలపడియెను. కృష్ణుఁ డాతనికి యుద్ధచరిత్రము సంక్షేప ముగఁ దెలియఁజేసెను. ఆతఁడు ద్రోణయుద్ధముంగూర్చి తెలుపుచు ద్రోణధృష్టద్యుమ్నులు రైదుదినములు యుద్ధము జరగె ననియు నవం తరము ద్రోణుఁడు సమరశ్రమచే నతిశ్రాంతుఁడై ధృష్టద్యుమ్నునిచే నిహతుఁడయ్యెననియుఁ జెప్పెను—ఇదియే సత్యమని తోఁచుచున్నది యోధవనుఁడగుధృష్టద్యుమ్నునితోఁ గావించిన యుద్ధమువలనం గలుగు నాయాసమే వృద్ధుడగు ద్రోణుని యుద్ధవిరతికి యథార్థకారణమై యుండును. ఇఁకఁ దక్కినవన్నియును గవికల్పనలే. ఉపన్యాసములే.

ఈసంగతి యీ విధముగాఁ గల్పితమని నిరూపించుచు నేఁడు నిదర్శనములను జూపియుంటిమి.

కాని యీకల్పనలలోఁ గృష్ణుఁడే యీమిథ్యాప్రపంచనమునకు బ్రవర్తకుఁడని చెప్పుటకుఁ గారణ మేమి! కారణ మిదివఱకే చెప్పియున్నాము. జ్ఞాన మెట్లీశ్వరదత్తమో, భ్రాంతికూడ నట్టిదియేయని నిరూపించుటకే—జయద్రథవధయందుఁ గూడఁ గవి దానిని బ్రదర్శించి యున్నాఁడు. ఘటోత్కచవధయందు బుద్ధి యెట్లీశ్వరదత్తమో దుర్బుద్ధికూడ నట్టిదియేయని కవి చూపి యున్నాఁడు. అట్లే సత్యయను నసత్యమునుగూడ నీశ్వరప్రేరితములే యని యీద్రోణవధ వృత్తాంతమునందుఁ దెలిపియున్నాఁడు.

దీనితరువాత నారాయణాస్త్రమోక్షపర్వాధ్యాయము. దానిని సంక్షేపముగ విమర్శించెదము. విస్తరించుటవలనఁ బ్రయోజనము లేదు. నారాయణాస్త్రవృత్తాంత మస్వభావమైనది. కావునఁ గేవలమును బరిత్యజనీయము. కాని యీపర్వాధ్యాయమునం దొకనిగూఢ వృత్తాంత మస్వభావమైనది. కావునఁ గేవలమును బరిత్యజనీయము. కాని యీ పర్వాధ్యాయమునం దొకనిగూఢవృత్తాంతమున్నది.

ద్రోణుఁడు నిహతుఁడైనంతనే యర్జునుఁడు గురునికొఱకత్యంతము శోకాతురుఁ డయ్యెను. మిథ్యావాదియై గురుహత్యం గావించినందు కాతఁడు యుధిష్ఠిరుని నిందించెను; మఱియు ధృష్టద్యుమ్నుని గూడ నిందించెను. యుధిష్ఠిరుఁడు మంచివాఁడుకావున దాని కెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. కాని భీముఁడుమాత్రము నిష్ఠురముగ నర్జునుని దూలనాడెను. ధృష్టద్యుమ్నుఁడును విశేషముగ నర్జునుని దిరస్కరించెను. అప్పుడు పార్థశిష్యుఁ డగుసాత్యకి యర్జునునిపక్షము నవలంబించి ధృష్టద్యుమ్ను ననేకవిధముల నిందించెను. ధృష్టద్యుమ్నుఁడును వడ్డితోఁగూడ నాతనియప్పును దీర్చివైచెను. అప్పు డయ్యిరు

వుడును క్రమముగాఁ బరస్పరవధోద్యుక్తులైరి. కృష్ణునియింగితముచే నప్పుడు భీమసహదేవులు వారిని శాంతింపఁజేసిరి. మిథ్యావచనమూలమున ద్రోణునివధించుట కర్తవ్యమా, యకర్తవ్యమా యనువిషయమున నుభయపక్షములను సాధ్యానుసారముగ వాదప్రతివాదములు జరిగెను. కాని యందెవ్వఁడును కృష్ణునితప్పొప్పులనుగూర్చి మాటలాడలేదు. కృష్ణునితప్పొప్పులనుగూర్చి మాటలాడలేదు. కృష్ణుని మూలముననే యీపని జరిగినట్లప్పు డెవ్వఁడును ననియుండలేదు. ఆవాదములోఁ గృష్ణునిపేరైనను రాలేదు. నాలుగైదు చేతులపనియే కాకున్నచో నింతగందరగోళము పుట్టుట కవకాశమే లేదు.

---

## షష్ఠ పరిచ్ఛేదము

### కృష్ణకథితధర్మతత్త్వము

అశ్వత్థామవధసంవాదవృత్తాంతమును రచించినకవి యర్జునుని మాత్రము సర్వోన్నతస్థానమునం దుంచెను. కృష్ణయుధిష్ఠిరభీములకంటె నర్జునునిధార్మికత్వమే యధికమైనదని యాతఁడు మనకుఁ బరిచయముం గూర్చియున్నాఁడు. శ్రీకృష్ణునిచేఁ బ్రస్తావితమైనట్టియు భీమయుధిష్ఠిరులచే సంపాదితమైనట్టియు మిథ్యాప్రపంచనకార్య మధర్మమని యర్జునుఁడు గర్హించుటయే గాక యందుకొఱకు ధర్మరాజును గూడఁ దిరస్కరించి యుండెను. కాని యిప్పుడు మేము చేయుచున్న విమర్శనమునుబట్టి యర్జునుఁడు కేవలమును మూఢుఁడుగను పాషండుఁడుగను గానవచ్చుచున్నాఁడు. అతఁడు కృష్ణునియొద్దనే సదుపదేశముంగాంచి సత్యపథావలంబనముం గాంచియుండెను. ఆవృత్తాంతమిది—

ద్రోణునితరువాతఁ గర్ణుఁడు దుర్యోధనునకు సేనాపతియయ్యెను. అతనియుద్ధముచేఁ బాండవసేన చెల్లాచెదరైపోయెను. దురదృష్టవశ

మున యుధిష్ఠిరుఁడే కర్ణు నెదుర్కొనవలసివచ్చెను. ఆయుద్ధమునం దాతఁడు కర్ణునిచేఁ దాడితుఁడై పాఱిపోయి శిబిరంబున దాఁగి పర్యంకమునఁ బడియుండెను. ఇట నర్జునుఁడు యుద్ధవిజయుఁడై రణక్షేత్రమున యుధిష్ఠిరునిం గానక చింతాకులితహృదయముతో నాతని నన్వేషించుటకై శిబిరమునకుం బోయెను. అప్పటి కింకను గర్ణుఁడు నిహతుండు కాలేదు. అర్జునుఁ డింకను గర్ణుని వధింపలేదని తెలియ వచ్చినంతనే యుధిష్ఠిరుఁడు క్రోధోద్రిక్తుఁడై పోయెను. తా నసమర్థుఁడై యుండియును, దాను జేయఁజాలని కార్యము నితరులు చేయలేక పోయిరని వారిని నిందించుట కాపురుష స్వభావము. యుధిష్ఠిరుఁ డప్పు డతికఠినముగ నర్జునుని దిరస్కరించెను. "నీకు యుద్ధమున భీతి కలిగినచో నిట్లు పలాయితుఁడై వచ్చుట మాని శ్రీకృష్ణునకు నీగాండీవము నీయఁ జాలకపోయితివా!" అని తుట్టతుదకు నిందించెను.

ఆమాట విని యర్జునుఁడు కరవాలంబు చేఁబూని యుధిష్ఠిరుని పైకి లంఘించెను. అప్పుడు కృష్ణుఁడు "ఈఖడ్గముతో నెవ్వరిని వధించెదవు?" అనియెను. దానిపై నర్జునుఁడు "నాగాండీవము నొరుల కిమ్మని యెవ రందురో వారిమస్తకచ్ఛేదనముం గావింతు నని నేను శపథము చేసికొని యుంటిని. ఇప్పుడు నీయెదుటనే మహారాజగు యుధిష్ఠిరుఁ డట్లు పచించి యున్నాఁడు. కావున నే నీధర్మభీరువగు నరపాలుని వధించి ప్రతిజ్ఞాపాలనమును గావించి సత్యవ్రతలాభంబున నిశ్చింతుఁడనై యుండెదను.

ఈమాటలు మూర్ఖుఁ డగుపామండునిమాటలవలె నున్నవి గాని యర్జునునివాక్యములుగా లేవు. గాండీవము నొరుల కిమ్మని చెప్పిన వారిని వధింతునని ప్రతిజ్ఞ చేయుట కేవలమును మూర్ఖుని పనియై యున్నది. ఇది గాక చిత్తోత్తేజముం గూర్చుటకై పూజ్యపాదుఁ డగు జ్యేష్ఠాగ్రజుఁ డిట్లు మాటలాడి యుండఁగా నాతని వధింప

జూచుటకంటెఁ బాషండ కార్యము మఱి యేమైన నున్నదా ? కాని దీనిలో నొకవిశేష మున్నది. అది శ్రీకృష్ణునిచే విమర్శింపఁబడియెను. అందుచే నీమాటలనుగూర్చి వ్రాయుటకు మేము బాధ్యుల మైతిమి.

ఆమాట యిది. సత్యమే పరమధర్మము; అర్జునుఁడు యుధిష్ఠిరుని వధింపకున్నచో సత్యచ్యుతుఁడు కాఁగలఁడు. సత్యరక్షణమునకై యుధిష్ఠిరుని వధించుట కర్తవ్యము కాదా యని యర్జునుఁడు కృష్ణు నడిగెను. ఇప్పుడు చేయఁదగినపని యేమో నిర్ణయింపుమనికూడ నడిగెను.

కృష్ణుఁ డెట్టియుత్తరమిచ్చెనో చెప్పుటకు ముందుగ నేమీ రేమి చెప్పెదరో చెప్పుఁడని మాపాఠకులను ప్రశ్నించుచున్నాము. ఇట్టి సత్యపాలనముకొఱకు అర్జునుఁడు యుధిష్ఠిరుని వధించుట ధర్మము కా దనియే మాపాఠకు లందఱు నేకవాక్యముగాఁ జెప్పెదరని భావించుచున్నాము. కాని పాశ్చాత్యనీతిపండితు లగు నాధునికపాఠకు లేకారణమునుబట్టి యట్టి యుత్తరమును జెప్పుదురో యాకారణమునుబట్టి శ్రీకృష్ణుఁడు దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పలేదు. ఆతఁడు ప్రాచ్యనీతినే యవలంబించి యీయుత్తరము నిచ్చెను. దానికిఁ గారణము చెప్ప నక్కఱలేదు. శ్రీకృష్ణుఁడు భారతవర్షమున నవతరించెను గాని యింగ్లాండునందు గాదుగదా! ఆతఁడు భారతవర్షనీతియందుఁ బండితుఁడు.

కృష్ణుఁడర్జునునకు బోధించుటకై యేసమస్తతత్త్వమునవతరింపఁజేసెనో దానిస్థూలరహస్యము నిప్పుడు చెప్పుచున్నాము. మొత్తముమీఁద నేది వివాదాంశమో దాని నిచ్చట నుదాహరించుచున్నాము.

ఆతని మొదటిమాట "అహింస పరమధర్మము". దీనికి మొట్టమొదటనే యాక్షేపము కలుగవచ్చును. సకలస్థలముల యందును నహింస ధర్మము కాదని— కృష్ణుఁడు స్వయముగా గీతా

పర్వాధ్యాయమున నర్జునున కేధర్మము నుపదేశించి యుద్ధమునకుఁ బ్రవర్తింప గల్పించెనో యాధర్మమున కిది విరుద్ధమని రెండవ యాక్షేపము.

అహింసాతత్త్వమునందలి యథార్థరహస్యము నెఱుంగఁజాలనివాఁడే యిట్టియాక్షేపములం గావించును. "అహింస పరమధర్మము" అనుమాటలో నేయవస్థయందైనను నేవిధముగానైనను హింస చేయుట యధర్మమే యను తాత్పర్యము లేదు. ప్రాణిహింస చేయకుండ మనమొక్క క్షణమైనను జీవింపఁజాలము. ఇది యీశ్వరనియమము. జలపానము గావించువాఁడెల్ల వేలకొలఁది జీవాణువుల నుదరస్థములుగాఁ జేసికొనుచున్నాఁడు. మానవుని ప్రతినిశ్వాసమునందును నసంఖ్యాకములగునట్టి జీవాణువులు నాసాపథంబున లోపలఁ బ్రవేశించుచున్నవి; ప్రతిపదక్షేపమునందును నట్టివి వేలకొలఁది దళితములై పోవుచున్నవి. ఒక్కయాకుకూరతోనొక్క దుంపకూరతో నెన్నియో జీవాణువులు భక్షింపఁబడి పోవుచున్నవి. ఇదియంతయు నజ్ఞానకృతంబగు హింస యనియు దీనివలనఁ బాపము లేదనియుఁ జ్ఞానకృతంబగు ప్రాణిహింసకూడ లేకుండ మనము జీవింపఁజాలమని చెప్పుచున్నాము విషసర్పముగాని, వృశ్చికముగాని మనగృహమందైనను మనశయ్యయందైనను నాశ్రయించియున్నప్పుడు మనము వానిని జంపకున్నచో నవి మనలను జంపివైచును. వ్యాఘ్రము మనలను బట్టుటకై లంఘింపనున్నప్పుడు దానిని మనము చంపకున్నచో నది మనలను జంపివైచును. శత్రువు మనలను జంపుటకుఁ గృతనిశ్చయుఁడై యుద్యతాయుధుఁడై యున్నప్పుడు మనమాతనికి వినాశనముం గూర్పకున్నచో మనలను నాతఁడు నాశము చేయును. దస్యువగువాఁడు ధృతాయుధుఁడై నిశీథమున మనయింటఁ బ్రవేశించి సర్వస్వము నపహరించుచున్నప్పుడు వధించుటకంటె నాతనిని వారించుట కన్యోపాయము లేనప్పు

జాతని నిహతునిం గావించుటయే మన కవశ్యధర్మమై యున్నది. న్యాయస్థానమున న్యాయాధికారియెదుట హంతకుని నేరము ఋజువై రాజశాసనమును బట్టి యాతనికి మరణదండనము విహితమైనప్పుడు మరణశిక్ష విధించుటకు న్యాయాధికారి బాధ్యుఁడగుచున్నాఁడు. వధార్హుని వధించుభారమును వహించిన రాజపురుషుఁడట్టివానిని వధించుటకు బాధ్యుఁడగుచున్నాఁడు. శికందరుషాహి, గజనీమహమ్మదు, తైమూరులంగు నాదరుషా రెండవ ఫ్రెడరిక్కు నెపోలియను మొదలగువారే నిపుణులగు తస్కరులనుదీసికొని పరధనపరరాజ్యాపహరణమునకై పరరాష్ట్రముల నాక్రమించిరో యట్టివారు లక్షలకొలఁదిగ నున్నను ధర్మానుసారముగ వధ్యులే యగుచున్నారు. ఇచ్చట హింసయే ధర్మ మగుచున్నది.

పక్షాంతరముచే నాకాశమం దెగురుచున్న పక్షిని దినుటకై గాని వినోదమునకై గాని వధించుట యధర్మము. నీటిపైఁ దేలియాడుచున్న చేపలను క్రీడాశీలుఁడగు బాలకుఁడు పట్టుకొని నలిపి చంపుట యధర్మము. మనవలెనే జీవయాత్రను గావించుటకై జన్మించిన మృగమును గాని కుక్కుటమునుగాని కుక్షింభరియగువాఁడు వధించి తినుట యధర్మము. వాయుప్రవాహమునందును జలప్రవాహమునందును సంచరించుజీవులను బట్టి చంపి తినుట యధర్మము.

'అహింస పరమధర్మము' అనువాక్యమునకుఁ దాత్పర్యమేమనిన—ధర్మప్రయోజనవ్యతీతం బగుహింసను విడుచుటయే పరమధర్మము. కాని హింసాకరులను నివారించు హింస యధర్మము కాదు. సరిగదా, పరమధర్మముకూడ నగుచున్నది. ఈ యర్థమును స్పష్టీకరించుటకే శ్రీకృష్ణుఁ డర్జునునకు వాలకేతిహాసమును జెప్పియుండెను. దాని స్థూలతాత్పర్యమేమనిన—వాలకుఁడను నొకవ్యాధుడు విశేషప్రాణనాశనహేతువగు నొకశునకమును వధించెను. తోడనే యాతనిపై

నాకసమునుండి పుష్పవృష్టి గురిసెను. అప్సర లతిమనోహరముగ గీత వాద్యములఁ గావించిరి. మఱియు నావ్యాధుని స్వర్గమునకుఁ గొనిపోవుటకై యొకవిమానముగూడ వచ్చెను. హింసాకరుని హింసించుటయే వ్యాధుఁడు చేసిన పుణ్యము!

అహింస పరమధర్మమని యీవిధముగా గ్రహింపవలయును. ధర్మప్రయోజనము వ్యతిరేకముగ హింస చేయరాదు. ఈవిషయముంగూర్చిన వాదోపవాదములు చిరకాలమునుండి జరగుచున్నవి. ధర్మసంబంధమైన ప్రయోజనమన నేమి! ధర్మమన నేమి? ఇన్‌క్విసిషన్ రోమనుకాథలికుచర్చివారి యాజ్ఞచే మనుష్యవధ యందు ధర్మసంబంధముగు ప్రయోజనమున్న దను కారణమునఁ గోటికోటి మనుష్యులు యమాలయమున కంపఁబడిరి. సెయింటుపార్థాల్యుమెన్ హత్యాకాండ ధర్మముకొఱకే జరగినది. ధర్మాచరణోద్దేశముచే తనో క్రూసేడు యోధులవలన భూమండలము నరశోణిత ప్రవాహములచేఁ బంకిలమై పోయెను. ధర్మవిస్తారముకొఱకు ముసల్మానులు లక్షలకొలఁది మానవహత్యలను గావించిరి. ధర్మసంబంధప్రయోజనము భ్రాంతిలోఁబడి మానవు లెంతమంది మానవులను నశింపఁజేసిరో యంతమంది మానవులు మఱియేకారణముచేతను నశింపలేదని తోఁచుచున్నది.

అర్జునునకుఁగూడ నిప్పుడాభ్రాంతియే కలిగినది. సత్యరక్షణమను ధర్మముకొఱకు యుధిష్ఠిరుని వధించుట కర్తవ్య మని యాతఁడూహించుకొనెను. అందుచేతనే కేవలము 'అహింస పరమధర్మము' అని చెప్పినంతమాత్రమున నాతనిభ్రాంతి తీఱినది కాదు. కావున కృష్ణుఁడాతనికి మఱియొకవిధముగా బోధించెను.

ఆతని రెండవవాక్య మేమనిన 'అసత్యమాడినను సరియేకాని యెన్నఁడును ప్రాణిహింస చేయరాదు *' అని—అహింస, సత్యము

ననుసరించిలో నహింసయే శ్రేష్ఠధర్మమని దీనిస్థూలతాత్పర్యము దీని యర్థమిది—దానము, తపము, దైవభక్తి, సత్యము, శౌచము, అహింస మొదలగు వివిధకర్మసముదాయ మంతయు ధర్మమనియే చెప్పవచ్చును. కాని యివి యన్నియును సమానములేయని చెప్పరాదు. విశేషలక్షణములనబట్టి వీనిలోఁ దారతమ్య మగపడుచున్నది శౌచమాహాత్మ్యమును, దానమాహాత్మ్యమును సత్యముతోఁగాని యహింసతోఁగాని తుల్యములగునా? అట్లుగాక తారతమ్యమే యున్న యెడల నందు సర్వశ్రేష్ఠధర్మ మేది? * అహింసయే సర్వశ్రేష్ఠధర్మ మని కృష్ణుడు చెప్పెను. సత్యము దానితరువాతిదే.

మనము పాశ్చాత్యుల శిష్యులము. మా పాఠకులలో ననేకు లీమాటవిని యులికిపడియెదరు. ఎట్టియవస్థయందైనను నసత్యము పలుకఁగూడ దనికదా పాశ్చాత్యులు చెప్పెదరు? అట్లు చెప్పకరయే యున్నచో నిప్పుడీప్రసంగమునకుఁ బ్రయోజనమే లేకయుండును. కాని పాశ్చాత్యమతంబున హంతకునికంటె నసత్యవాది విశేషపాపుఁడనిగాని. హంతకుడు నసత్యవాదియును దుల్యపాపులే యనిగాని యెవ్వరును జెప్పఁజాలరు. వారందఱును నైరోపీయదండనీతిశాస్త్రమే ప్రమాణమనికూడఁ జెప్పజాలరు. అట్లే నైనచో నిప్పుడు

* ఏవచనముపై శ్రీకృష్ణునిధర్మతత్వము సంస్థాపితమై యుండెనో యావచనమును మూలసంస్కృతిరూపమునఁ జూపుచున్నాము.

'ప్రాణినా మవధ స్తాత సర్వజ్యాయాన్ మతో మమ। అనృతం వా వదే ద్వాచం నతుహింస్యాత్ కథంచన'

'అహింస పరమధర్మము' అనునది శ్రీకృష్ణవాక్యమునకు సరియైనయనువాదముకాదని పాఠకులు గ్రహించితిరిగదా! 'ప్రాణిగణంబులను హింసింపకుండుటయే పరమధర్మము' ఇదియే దీనికి సరియగునర్థమని మాయుద్దేశము. ఈరెంటికిని నర్థగతిభేదము విశేషముగ లేకుండుటచే 'అహింస పరమధర్మము' అనుమాటయే యిందు నుపయోగింపబడెను.

కృష్ణునితోఁ బాశ్చాత్యశిష్యులకు మతభేదము లేకయే యుండును. ఇచ్చటఁ గేవలమును శాపతారతమ్యమునుగూర్చియే ప్రశంస యగుచున్నది. ఎన్నఁడు నెట్టి యధర్మమును జేయక, యెట్టినరహత్యను గావింపక, యేవిధమగునసత్యమును బలుకక యుండువాని కసత్యమాడవలసినయవస్థ తటస్థించినప్పుడు, అట్లు చేయకున్నచో నరహత్యచేయక తప్పనప్పుడు హత్యచేయుటకంటె మిథ్యావచనంబు నుపయోగించుటయే మంచిదని శ్రీకృష్ణునియుపదేశమునకుఁ దాత్పర్యము. మిథ్యాభాషణముకంటె నరహత్యచేయుటయే మంచిదని బోధించు ధర్మాత్ముఁడగు నీతిజ్ఞుఁ డెవ్వఁడైన నున్నచో నాతనిధర్మమాతనిచెంతనే యుండుఁగావుత మనియు. నట్టినరకదాయకం బగునిషిద్ధధర్మము భారతవర్షమునం దెన్నఁడును వ్యాపింపజాలదనియు మేము ప్రత్యుత్తరము చెప్పుచున్నాము.

కృష్ణునిమత మిది. అర్జునుఁడు దీనిననుసరించినచో భ్రాతృవధపాపమునుండి యాతని మరలించువిషయము నిదియే చాలును. కాని యప్పు డర్జునుఁడు 'ఇది నీధర్మము. కాని, లోకమునఁ బ్రచారమునందున్నమత మేమి? నీమతము సత్యమే యైయున్నను బ్రచారమునందున్న మతము ననుసరింపకపోయినచో జనసంఘమునందు నాకు సత్యచ్యుతుఁడగు పాపాత్ముఁ డనుకళంకము కలుగును' అని చెప్పెను. అందుచేఁ గృష్ణుఁడు తనమతమును బ్రకటించి ప్రచలితధర్మమునుగూర్చికూడ బోధింపఁదలఁచినవాఁడై 'ఓధనంజయా! కురుపితామహుఁడగుభీష్ముఁడును, ధర్మరాజగుయుధిష్ఠిరుఁడును, విదురుడును, యశస్విని యగుకుంతియు నేధర్మరహస్యమునుపదేశించి యుండిరో యాధర్మమును బ్రశంసించెదను వినుము—సాధుపంక్తి యగువాఁడు సత్యమునే చెప్పుచుండును. సత్యముకంటె శ్రేష్ఠధర్మ మేదియునియును లేదు*

---

* నసత్యాద్విద్యతే పరమ్' కృష్ణుఁ డింతకుఁ బూర్వమున 'ప్రాణినామవధస్తాత సర్వజ్యాయాన్మతో మమ' అని చెప్పియుండెను. ఈరెండును బరస్పరవిరుద్ధములై యున్నవి. దానికిఁ గారణ మొకటి కృష్ణునిమతమును, మఱియొకటి భీష్మాదులచేఁ గథితం బగు ప్రచలితధర్మనీతిమును నైయుండుటయే—

సత్యతత్త్వ మతిదుర్జ్ఞేయమైనది. సత్యవాక్యప్రయోగమే యవశ్యకర్తవ్యమనునది స్థూలనీతి. తరువాత వర్జితతత్త్వము చెప్పఁబడియెను.

"కాని యెచ్చట మిథ్య సత్యస్వరూపముగను, సత్యము మిథ్యాస్వరూపముగను నగుచున్నదో యచ్చట మిథ్యావాక్యప్రయోగము గావించినను దోషాకరము కానేరదు"

కాని యెప్పుడైన నిట్లగునా? అట్టిసమయమున మనమాతత్త్వముంగూర్చి యథార్థ్యముగ విమర్శింపవలసియుండు ననుమాట కూడఁ బుట్టుచున్నది. తరువాతఁ గృష్ణుఁ డిట్లు చెప్పెను.

"వివాహము, రతిక్రీడ, ప్రాణవియోగము, సర్వస్వాపహరణము నగుకాలమునను, బ్రాహ్మణునినిమిత్తమును మిథ్యాప్రయోగముం గావించుటపాతకము కానేరదు"

ఇదియే ఘోరతరం బగువివాదస్థానము, కాని వివాదము మాట యిప్పు డట్లుండనిండు! కాళీప్రసన్నసింహునియనువాదము పైని వ్రాసినట్లే యున్నది: అది యొకశ్లోకమునకుమాత్రమే యనువాదము. కాని మూలమునం దీవిషయమున రెండుశ్లోకము లున్నవి. ఆ రెండింటినిం దుదాహరించెదము—

(1) ప్రాణాత్యయే వివాహేచ వక్తవ్య మనృతం భవేత్
సర్వస్వస్యాపహారే చ వక్తవ్య మనృతం భవేత్.

(2) వివాహకాలే రతిసంప్రయోగే
ప్రాణాత్యయే సర్వధనాపహారే
విప్రస్య చార్థే హ్యనృతంవదేత
పంచానృతాన్యాహురపాతకాని.

ఈ రెండుశ్లోకములకు నర్థ మొక్కటియే. మొదటిశ్లోకమున బ్రాహ్మణప్రశంసమాత్రము లేదు. ఇదియే యీ రెంటికిని భేదము. ఒక్కటేయర్థముగల యీ రెండుశ్లోకములవలనఁ బ్రయోజన మేమని యిప్పుడు పాఠకులకుఁ దమంతనే సంశయము కలుగవచ్చును.

దీనికిఁ బ్రత్యుత్తర మేమనిన—ఈ రెండుశ్లోకములును మఱి యొకచోటినుండి యుద్ధృతములే గాని, కృష్ణునిచే స్వయముగఁ జెప్పఁబడినవి కావు. సంస్కృతగ్రంథములయం దచ్చటచ్చట నిట్లుగ్రహింపఁబడినవచనములు కానవచ్చుచుండును. కాని యట్లు గ్రహింపఁబడిన వచనము లేవియో నిశ్చయించుట దుస్సాధ్యముగనే యుండును. ఈ మహాభారతమునందలి గీతాపర్వాధ్యాయమే దానికుదాహరణమని గ్రంథాంతరమున మేము చూపి యున్నాము.

ఈవచనములు రెండునుగూడ నట్టివే యని మేమనుమానముపై నాధారపడి చెప్పుచున్నాము. ఇందు ద్వితీయశ్లోకమునం గల "వివాహకాలే, రతిసంప్రయోగే" అనువచనములు వశిష్ఠునివి. వాశిష్ఠము ౧౬ అధ్యాయము ౨౬ శ్లోకమునం దీవచనము కానఁబడుచున్నది. ఇదియే మహాభారతమునం దాదిపర్వమున ౩౪౧౭ శ్లోకమున (కృష్ణునితో నెట్టిసంబంధమును లేనిచోట) నించుక పరివర్తితమై యగపడుచున్నది. చూడుఁడు!

"నధర్మయుక్తం వచనంహినస్తి
నస్త్రీషు రాజ న్న వివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే
పంచానృతాహురపాతకాని"

ఇందు నాల్గువిషయములే కాని యైదవది లేదు. అయినను వశిష్ఠోక్తంబగు 'పంచానృతాన్యాహురపాతకాని' యనువచనమున్నది. ప్రచలితవచనమగుటచే పలువురినోళ్ళం బడి యిట్లు వికృత మైయుండును. ప్రథమ శ్లోకమును బూర్వగామి శ్లోకముతోఁ గూడఁ జేర్చి చూపెదము.

(క) భవేత్ సత్య మవక్తవ్యం వక్తవ్య మనృతం భవేత్
(ఖ) యత్రానృతం భవేత్ సత్యం సత్యంచా ప్యనృతం భవేత్

(గ) ప్రాణాత్యయే వివాహేచ వక్తవ్య మనృతం భవేత్
(ఘ) సర్వస్వస్యాపహారేచ వక్తవ్య మనృతం భవేత్.

ఇప్పుడు మహాభారతసభాపర్వమునుండి ౧౩౮౮౮ శ్లోకమును జూపెదము. ఆసందర్భమునఁ గృష్ణునితో నెట్టి సంబంధమును లేదు.

(చ) ప్రాణాంతికే వివాహేచ వక్తవ్య మనృతం భవేత్
(ఛ) అనృతేన భవేత్ సత్యం సత్యేనై వానృతం భవేత్

ఇందు గ, చ లును, ఖ, ఛ లును నొక్కటే యర్థమునం దున్నవి. సామాన్యముగ శబ్దములు కూడ నొక్కటియే. కావుననివి యును ప్రచలిత పురాతనవచనములే.

ఇది కృష్ణమతము కాదు. అతఁడు దానింగూర్చి తా నామో దించిననీతి యని చెప్పియుండలేదు; భీష్మాదులవలన విననదానినే చెప్పియుండెను. తా నంగీకరించినను, నంగీకరింపక పోయినను దీని నర్జునునకు బోధింపవలసి వచ్చుటచే బోధించెను. ఈనీతిం గూర్చిన సత్యాసత్య వివేచనముతోఁ గృష్ణచరిత్రమున కెట్టి ప్రయోజనమును లేదు.

కాని చెప్పవలసిన ముఖ్యవిషయమొక్క యున్నది. అవస్థావిశే షముచే సత్యమే మిథ్యయగుననియు, మిథ్యయే సత్యమగుననియు శ్రీకృష్ణుని మతమునందుఁ గూడ నున్నది. అట్టి సమయములందు మిథ్యనే ప్రయోగింపఁదగునని తరువాత నాతఁడు చెప్పియుండెను.

ఎప్పుడు మిథ్య సత్యమగునో, సత్యము మిథ్యయగునో యా సంగతి ముందుగ నాలోచింప వలయును. ధర్మానుమోదిత మగునది సత్యము; అధర్మానుమోదితమగునది యసత్యము. ధర్మానుమోదిత ము మిథ్యకాదు; అధర్మానుమోదితము సత్యము కాదు. కావున సత్యాసత్యవివేచనము ధర్మాధర్మ వివేచనముపై నాధారపడియుండ వలయును. అందుచేతనే శ్రీకృష్ణుఁడు ముందుగా ధర్మతత్త్వమును

నిర్ణయించెను. ఈమాటలలో గీతోదారనీతుల గంభీరశబ్దములు వినఁ బడుచున్నవి.

“ధర్మాధర్మతత్త్వనిర్ణయమునకు విశేషలక్షణము నిర్దిష్టమై యున్నది. కొన్నికొన్నిస్థలములయందు దుర్బోధమగు ధర్మము నను మానముచేఁగూడ నిర్ణయింపనలసియుండును”

తరువాత మఱియును,

“అనేకులు శ్రుతినే ధర్మమునకుఁ బ్రమాణమని నిర్దేశించి యున్నారు. నేను వారియందు దోషారోపణముం గావించుట లేదు. కాని శ్రుతులచే సమస్తధర్మతత్త్వమును నిర్దిష్టంబు గాలేదు. అందు చేతనే కొన్నియెడల ధర్మము సమానముచేతనే నిర్దేశింపవలసి యుండెను.”

ఈసంగతిం గూర్చి యిప్పటికిని నాగరికప్రపంచమున గంతర గోళ మగుచున్నది. వేదమైనను, బైబిలైనను, కొరానైనను నివి దైవోక్తములే యనియు, వానిలోనున్నదంతయు ధర్మమే యనియు, నందు లేనిధర్మ మేదియును లేదనియు వాదించువా రిప్పటికిని బలవం తులై యున్నారు. దైవోక్తిచే నిర్దిష్టమగునదిమాత్రమే ధర్మముకాని, ధర్మ మెన్నఁడు ననుమానమునకు విషయము కాదని వారిమతము. ఈమాట మానవజాతి యున్నతిమార్గమునకుఁదీఱనికంటకమైయున్నది. మనదేశముమాటకేమి, యిరోపాదేశమందుఁగూడ నిప్పటికినినీమతము మానవునియున్నతిపథమును నిరోధించుచునేయున్నది. మనదేశమున కవనతి కలుగుట కిదియొకప్రధానకారణము. ఇప్పటికిని భారతవర్ష మున ధర్మజ్ఞానము శ్రుతిస్మృత్యాదులచే నిషిద్ధమై యున్నది; అను మానపద్ధతి నిషిద్ధమై యున్నది. అతిదూరదర్శియు, మానవాదర్శ స్వరూపుఁడునగు శ్రీకృష్ణుఁడు లోకోన్నతికివిషమవ్యాఘాతం బగు నీ విషయమును జిరకాలముక్రిందటనే చూపి యున్నాఁడు. ఇప్పటి

హిందూసమాజమునందలి ధర్మజ్ఞానముం గాంచి విషణ్ణహృదయముతో మేమాకృష్ణునే శరణ్యునిగాఁ జేసికొనఁదలఁచితిమి.

కాని యనుమానమున కొకమూల ముండవలయును. అగ్ని లేక ధూమోత్పత్తి యుండదనుమూలము ననుసరించి సమీపమున ధూమవంతమైయున్న పర్వతముం గాంచి యది వహ్నిమంతమైయుండునని గ్రహించునట్లే యాకర్మము ధర్మమని గ్రహింపఁగల లక్షణ మొకటి కావలసి యున్నది. శ్రీకృష్ణుఁ డాలక్షణమును నిర్దేశించి యుండెను.

ధర్మము ప్రాణిగణంబును ధరించి యుండునది కావున దానికి ధర్మనామము నిర్దిష్టం బయ్యెను. కావున "దేనివలనఁ బ్రాణిరక్షణ మగునో యదియే ధర్మము"

కృష్ణునిధర్మలక్షణనిర్దేశ మిదియే. ఈవిషయమున హెర్బర్టు స్పెన్సరు, బెంథామ్‌మిల్లు మొదలగు సంప్రదాయముల శిష్యుల కెట్టి యసమ్మతియు నుండదని తలంచెదము. కాని యిది కేవలమునుహిత వాదమని యనేకులు చెప్పుదురు. అట్లే కావచ్చును. ధర్మతత్త్వమును హితవాదముతో వేఱుచేయఁగూడదని మేము గ్రంథాంతరమున విమర్శించి యున్నాము. జగదీశ్వరుని సార్వభౌమత్వమునుండియును, సర్వమయత్వమునుండియును దీని ననుమతింపవలయును. సంకీర్ణ మగుక్రీస్తుధర్మమునకు హితవాదము విరుద్ధమైనఁ గావచ్చును. కాని యీశ్వరుఁడు సర్వభూతమయుండని ప్రశంసించుహిందూధర్మమున కీహితవాద మొకయంశమై యుండెను. ఈకృష్ణవాక్యమే యథార్థధర్మలక్షణము.

ధర్మానుమోదితం బగునది సత్య మనియు, ధర్మానుమోదితము కానిది యసత్యమనియు నిదివఱకే తెలిపి యుంటిమి. కావుననే సర్వలోకహితకరం బగునది సత్యమును, లోకాహితకరం బగునది

యసత్యము నగుచున్నది. ఈయర్థమునందు లౌకికసత్యము ధర్మాను సారముగా మిథ్యయగుచున్నది. లౌకికమిథ్య ధర్మానుసారముగా సత్యము కావచ్చును. ఇట్టిస్థలమునందు మిథ్యయే సత్యస్వరూపమును సత్యమే మిథ్యాస్వరూపము నగుచున్నది.

శ్రీకృష్ణుఁడు దీని కుదాహరణస్వరూపముగా "ఒకఁ డొకని జంపవలయు ననునుద్దేశముతో వచ్చి యాతనిం గూర్చి మఱియొకని బ్రశ్నించినప్పుడు ప్రశ్నింపఁబడినవాఁడు మౌనము నవలంబించుటయే యుచితము. ఒకవేళఁ బ్రత్యుత్తరము చెప్పక తప్పనప్పుడు మిథ్యా వాక్యమును బ్రయోగించుటయే కర్తవ్యము. ఇచ్చట మిథ్యయేసత్య స్వరూప మగుచున్నది.

ఈప్రస్తావమునకుఁ బూర్వమునందే కృష్ణుఁడర్జునునకుఁ గౌశి కోపాఖ్యానమును జెప్పెను. ఆయుపాఖ్యానమిది—

"బహుశ్రుతుండును, తపస్విశ్రేష్ఠుండు నగు కౌశికుండను నొక బ్రాహ్మణుఁడు గ్రామముల కనతిదూరంబునం గలయొక నదీ సంగమస్థానమున నివసించుచుండెను. ఆతఁడు నిరంతర సత్యవాక్యప్ర యోగరూపం బగువ్రతంబు నవలంబించి యాకాలమునసత్యవాదియను విఖ్యాతిం గాంచి యుండెను. ఒకప్పుడు గొందఱుమార్గస్థులు దస్యుభ యంబుచే నావనమధ్యంబున దాఁగుటయు, దస్యులు క్రోధోద్రేకంబు చే వారల నన్వేషించుచుఁ గ్రమముగా నాసత్యవాది యగుకౌశికుని చెంతకు వచ్చి "ఓమహాత్మా! ఈమార్గమునఁ గొందఱు మనుష్యులు వచ్చియున్నారు; వారెట్లు పోయిరో మీరెఱింగియున్నచో సత్యమును వచింపుఁడు" అని ప్రశ్నించిరి. అప్పు డాకౌశికుడు తనసత్యపరిపాల నంబు గావించుకొనుటకై వారీతరుగుల్మలతావేష్టితం బగువనంబునఁ బ్రవేశించి రని చెప్పెను. అనంతర మాక్రూరకర్ములగుదస్యులు వారిని వెదకి కనుంగొని యాక్రమించి వినాశముం గావించిరి సూక్ష్మధర్మ

నభిజ్ఞుఁడగువాఁ సత్యవాది కౌశికుఁడును సత్యవాక్యజనితంబగు పాపముచే లిప్తుండై ఘోరనరకనిపతితుఁ డయ్యెను.''

ఆసమయమునఁ గౌశికునకు వారు దస్యులనియుఁ బలాయితులగు మార్గస్థులను హింసించుటయే వారియుద్దేశమనియుఁ దెలిసియుండెను. అందుచేతనే యాతనికట్లు చెప్పుట పాపమయ్యెను. అట్లెఱుంగకున్నచో సత్యము చెప్పుటవలన నాతని కెట్టిపాపమును లేకయే యుండును. కౌశికుని సత్యవచన మిప్పట్టునఁ గృష్ణమతానుసారముగా బాపాచరణ మయ్యెను. ఈవిషయంబునఁ బ్రాచ్యులకును, బాశ్చాత్యులకును ఘోరతరం బగుమతభేద మున్నది. సత్యము నిత్యమైనదనియు, నది యెన్నటికిని మిథ్య కానేరదనియు, నెట్టిసమయమునందైనను మిథ్యాప్రయోగ మకర్తవ్యమనియుఁ బాశ్చాత్యపండితుల వలన మనము నేర్చికొని యున్నారము. అట్టిసుశిక్షిత సంప్రదాయము వారిచే శ్రీకృష్ణమతము కేవలమును నిందింపఁబడుచున్నది. ఇట్లుకృష్ణమతము కేవలమును నిందింపబడుచున్నది. ఇట్లు కృష్ణమతమును నిందించువారినిగూర్చి కౌశికుఁ డిట్టిసమయమున నేమిచేసిన నుచితముగ నుండునో తెలుపవలయునని మేమడుగుచున్నాము. మౌనమునువహించుట యుచిత మని చెప్పుటయే దీనికి సదుత్తరము శ్రీకృష్ణుఁడీమాట స్పష్టముగనే చెప్పియుండెను. ఈవిషయమున మతభేదము లేదు. కాని దస్యు లాతనమౌనమును నిలువనీయక ప్రత్యుత్తరమునకుఁ బీడించినచో నేమి చేయవలయును? ఎంతపీడించినను జావునకైన నంగీకరించి మౌనమును వీడకుండుటయే యప్పు డాతనికిఁ గర్తవ్యమని కొందఱు చెప్పవచ్చును. అదికూడ మేమును సంపూర్ణముగ నంగీకరింతుము కాని యిట్టిధర్మము పృథ్వియందు సామాన్యముగఁ బ్రచారమునందుండుటకవకాశ మున్నదా లేదా యని సంశయము కలుగుచున్నది. మహర్షియగుకపిలుఁడు "నాశక్యోపదేశ విధిరుపదిష్టేను

ప్యనుపదేశః" * ఇట్టి ధర్మప్రచారమునకు బ్రయత్నించుట నిష్ఫలమని తోచుచున్నది. సఫలమైనచో నది మానవజాతికి బరమసౌభాగ్యమే.

"అవశ్యం కూజితవ్యేవా శంకేరన్ వాప్యకూజతః"

అట్లయినచో నేమి చేయవలయును? సత్యము చెప్పి బుద్ధిపూర్వకముగా నరహంతృకు సాహాయ్యము చేయవలయునా? ఈవిధముగా ధర్మతత్త్వమును బోధించువాని ధర్మవాదము సత్యమైనను, నసత్యమైననునగుగాక! అది కేవలమును గ్రూరమైనదనుమాట మాత్రము నిశ్చయము. హంతకుని జీవనరక్షార్థమై మిథ్యాప్రమాణముచేయుట కూడ ధర్మమేయని యీకృష్ణనీతివలన దేటపడుచున్నదనియెవ్వరెవ్వరైనఁ బ్రతిపాదనము చేయవచ్చును ఎవ్వఁడిట్టియాక్షేపముఁ గావించునో, యాతని కింకను సత్యతత్త్వము బోధపడలేదని చెప్పవచ్చును. హంతకుని దండించుట మానవజీవనరక్షణమున కత్యంతమును బ్రయోజనీయమైనది. హంతకుని దండింపకున్నచో నగపడినవానినెల్ల నాతఁడు చంపుచునే యుండును. కావున హంతకుని దండించుట ధర్మము. మఱియు నాతని రక్షించుట కసత్యమాడినవాఁ డధర్మము చేసినవాఁ డగుచున్నాఁడు.

కృష్ణోక్తం బగు నీసత్యతత్త్వము నిర్దోషమైనదియో కాదో, యిది సర్వసాధారణముగ నాచరణీయమైన దగునోకాదో నిర్దేశించుటకు మేమిప్పుడు పూనుకొని యుండలేదు. కాని కృష్ణచరిత్రమును స్పష్టపఱుచుటకై యీవిషయమును బ్రస్ఫుటముగఁ జేయుటకు మేము బాధ్యులమైతిమి. సత్యము సకలసమయములందును సత్యమేయనియు నద్దియేయవస్థయందును బరిహరింపదగినది కాదనియు పాశ్చాత్యులేకారణమును జెప్పుచున్నారో వానికిమూలమునం దొక గొప్ప

* ప్రథమాధ్యాయము ౘ సూత్రము.

విషయమున్నది. ఇది ధర్మమే యైనచో—మానవహితకరంబగుసమ యమున సత్యము ధర్మమనియు, మానవాహితకరంబగుపట్టున సత్య మైనను నధర్మమే యనియు బోధించుబోధ ధర్మమే యైనచో మాన వజీవనమును. మానవసమాజమునుగూడ విశృంఖలమైపోవును. మఱి యు లోకహితోద్దేశము విఫలమైపోవును. అవస్థావిశేషము తటస్థించి నప్పుడీసమయమున సత్యమునవలంబింపవలయునా. యసత్యము నవ లంబింపవలయునా యనుతర్కమును సిద్ధాంతము చేయువారెవ్వరు? అమీమాంసచేయుట కారంభించినచో నది యెన్నడును ధర్మాను మోదితము కాజాలదు. శిక్ష, జ్ఞానము, బుద్ధియునుగూడజాలమందికి సామాన్యముగా నుండును. వానియందు సంపూర్ణు లెవ్వరును లేరు. సామాన్యముగ నందఱకును ప్రథమమున విచారశక్తి యల్పముగా నుండును. దానిపై నింద్రియావేగము, మమతావేగము, భయము, లోభము, మోహము మొదలగునవి ప్రకోపించి యుండును. సత్యము నిత్యపాలనీయ మనుధర్మవ్యవస్థ లేకయున్నచో మానవజాతి సత్య శూన్యమైపోవుట కవకాశ మున్నది—అని—

ప్రాచీనహైందవమహర్షులీవిషయము నెఱుంగనివారు కారు. తెలిసియే వారు విశేషవిధులను గావించి యేయేస్థలములయందసత్య ముపయోగింపవలయునో నిర్దేశించియున్నారు ప్రాణాత్యయే' మొద లుగాఁగల యావిధులను మేమిదివఱకే యుదాహరించి యున్నాము. మనుగౌతమాదిమహర్షులమతముగూడ నిట్లే యున్నది. వారేర్పఱచిన విశేషవిధులు ధర్మానుమతము లగునాకాదా యనువిమర్శనమువలన ప్రయోజనము లేదు. కృష్ణకథితం బగుసత్యతత్త్వమునుబరిస్ఫుటముగ జేయుటయే మాయుద్దేశము. విశేషవిధులు లేకుండ నీసాధారణవిధి ననుసరించుట జనసామాన్యమునకు దుస్సాధ్యమని యాధునిక యూరపి యనులవలెనే శ్రీకృష్ణుడును నెఱింగి యుండెను. కాని పైని జెప్ప

బడిన 'ప్రాణాత్యయే' మొదలగు విశేషవిధులు చెప్పినంతమాత్రమున లోకమునకు ధర్మానుమతం బగుసత్యాచరణమును సంపూర్ణముగ బోధించినట్లు కా జాలదని శ్రీకృష్ణుడెఱింగియే యుండెను. అందుచే నాతఁ డేయవస్థయం దేవిషయమున సాధారణవిధి నుల్లంఘించుట యుచితమో చెప్పి యున్నాఁడు. మేము దానిని స్పష్టపఱుచు చున్నాము.

దానము, తపము, శౌచము ఆర్జవము, సత్యము మొదలగు కార్యముల సముదాయమును ధర్మమని చెప్పవచ్చుచు. ఇవి యన్నియును సాధారణధర్మములు; మఱియు నివియే యవస్థావిశేషమునం దధర్మము లగుచున్నవి. అనుపయుక్తప్రయోగము గాని, యనుపయుక్తవ్యవహారముగాని యధర్మమగును. దానిసంబంధమున నాలోచింతము. సమర్థుఁడైనను జోరునకు ధనదానము నెన్నటికిని గావింపగూడదు. పాపాత్మునకు ధనదానంబు చేసినచోఁ బాపాచరణుం డగు నాతఁడు దాతనుగూడ హింసింపవచ్చును. సత్యసంబంధమునఁగూడ నిట్లే—ఈవిషయమున శ్రీకృష్ణుఁ జూపినయుదాహరణములు రెంటిలో నొకదాని నిదివఱకే తెలిపియున్నాము. ఇఁక రెండవయుదాహరణ మేమనిన.

''మిథ్యాశపథమూలంబునఁ జోరసంసర్గమునుండి విముక్తలాభము దొరకుచున్నప్పుడు మిథ్యావాక్యప్రయోగముం గావించుటయే శ్రేయము. ఆమిథ్య నిశ్చయముగ సత్యస్వరూపమే యగును'' అని.

ఇంతేకాక ప్రచారమునందున్న, ధర్మశాస్త్రమునుండి ''ప్రాణాత్యయే'' మొదలుగాఁగల వచనములు పునరుక్తంబు లయ్యెను.

శ్రీకృష్ణుని సత్యతత్త్వ మిట్టిది. దీనిస్థూలతాత్పర్య మిట్లున్నది.

(1) ఏది ధర్మానుమోదితమో యదియే సత్యము—ఏదిధర్మ విరుద్ధమో యది యసత్యము.

(2) ఏది లోకహితమో యది ధర్మము.

(3) కావున నేది లోకహితమో యదియే సత్యము. ఏది లోకవిరుద్ధమో యది యసత్యము.

(4) ఇట్టిసత్యమే యెల్లప్పుడు నెల్లయుగములను బ్రయోక్తవ్యము. దీనికంటె నుత్కృష్టంబగు సత్యతత్త్వ మెచ్చటనైనఁ జెప్పఁబడినట్లెవ్వరైనఁ జూపఁగలిగినచో మేము కృష్ణమతమును బరిత్యజించుటకు సిద్ధముగా నున్నారము. అట్లులేకుండుటచేత నే యిది యాదర్శమనుష్యోచితవాక్యమని యంగీకరింపవలసి యున్నది.

పర్యవసానమున నీమాటకూడఁ జెప్పవలసి యున్నది. ఏమనిన దేనిమూలమున లోకరక్షణము, లోకహితమును సాధితము లగునో యదియే ధర్మము. మనము భక్తిపూర్వకముగఁ గృష్ణోక్తమగు మతము నుండి హిందూధర్మమూలస్వరూపమును గ్రహింపఁగలిగినచో నచిరకాలమునందే హిందూధర్మమును, హిందూసమాజమును నభివృద్ధి నందఁగలవు. అట్లయినచో నుపధర్మము లనియెడి భస్మరాశినుండి జగత్పవిత్రంబును నసమానంబునగు హిందూధర్మము ప్రజ్వలించి యచిరకాలముననే ప్రకాశింపఁగలదు. అందువలన శాస్త్రవిశ్వాసము ననుసరించియే చేయఁబడు కుక్రియలును, కుతర్కములును, వ్యర్థ కాలక్షేపములును దేశమునుండి దూరీభూతములై సత్కర్మములతోడనుసడను స్థానముతోడను హిందూసమాజము ప్రభాన్వితము కాఁగలదు. అందువలన మూర్ఖత్వమును, మతకలహములును, బరస్పరవిద్వేషములును ననిష్టచేష్టితములు నిఁక నుండఁబోవు. మనము గీతోక్తంబగు మహాత్తరకృష్ణనీతిని బరిత్యజించి శైవవైష్ణవమతముల నాశ్రయించుచున్నాము లోకహితమునుబరిత్యజించి,తిథితత్త్వము,మూఢమాసతత్త్వము మొదలగు తత్త్వాన్వేషణములం బడి కొట్టుకొనుచున్నాము. మనజాతీయాన్నత్యమే మనకుఁ గావలయును గాని యితరజాతినిందతోఁ బ్రయోజ

నమేమున్నది? మనమదృష్టవంతులమైనచో హిందువుల మందఱము నొక్కటిగఁ గూడి "నమో భగవతే వాసుదేవాయ" అని శ్రీకృష్ణపాదపద్మములకుఁ బ్రణామంబు గావించి లోకహితంబగు తదుపదిష్టధర్మము ననుసరింపవలయును * అట్లయినచో మనము నిశ్చయముగా మనజాతీయౌన్నత్యమును సాధింపఁగలము.

## సప్తమపరిచ్ఛేదము

### కర్ణవధ

కృష్ణునియుపదేశము నర్జునుఁడు గ్రహించెను. కాని యర్జునుఁడు క్షత్రియుఁడు; ప్రతిజ్ఞాపాలనమునకై వ్యాకులపడుచుండెను. అందుచేత నేయప్పు డర్జునుఁడు "ఈరెండుధర్మములకును భంగము లేకుండునట్టి యుపాయమును బోధింపుము" అని కృష్ణుని బ్రార్థించెను.

అప్పుడు కృష్ణుఁడు "మానవంతున కవమానమే మృత్యుస్వరూపము. నీవు యుధిష్ఠిరుని వాగ్రూపమున నవమానింపుము. అట్లయినచో నాతని జంపినట్లే యగును" అని చెప్పెను. అర్జునుఁ డప్పుడు యుధిష్ఠిరునింగూర్చి యవమానసూచకము లగు వాక్యములతో నిందించెను. కాని యందువలనఁ గృష్ణునకు మఱియొక కష్టము సంఘటిల్లెను. అనంతర మర్జునుఁడు కృష్ణునిం గాంచి "నేను నాయగ్రజు నవమానించి మహాపాపముం గావించితిని. కావున నేనాత్మహత్యఁ గావించుకొందును" అని చెప్పి యొరనుండి కరవాలమును దెమలించెను. కృష్ణుఁడాతని మరణమునకుఁ గూడ నప్పు డొక స్పష్టవ్యవస్థం

---

* బేస్టాము వాక్యము నింగ్లండు విశ్వసించెను. కృష్ణుని యుపదేశమును భారతవర్ష మాలింపఁగూడదా?

గావించి "సజ్జనుల కాత్మశ్లాఘనమే మృత్యుస్వరూప మనుమాట న్యాయసంగతమైనది" అని చెప్పెను. అర్జునుఁ డప్పు డనేకవిధములఁ దన్నుఁ దానుఁ బొగడుకొనియెను. దానితో గందరగోళ మంతయును వదలిపోయెను.

కృష్ణుఁ డర్జునునకు సారథియే కాని యాతఁ డర్జునాశ్వముల కెట్టి నియంతయో, యట్లే యర్జునునకుఁ గూడ నియంతయై యుండెను. ఒకప్పుడు కృష్ణుఁ డర్జునుని యాజ్ఞానానుసారముగనే రథము నడపుచుండెను. ఒకప్పు డర్జునుఁడే కృష్ణునియాజ్ఞానుసారము నడచుచుండెను. ఇప్పుడు కృష్ణుఁ డర్జునుని కర్ణవధయందు నియుక్తునింగావించెను.

ఈకర్ణవధము మహాభారతమునందొక ప్రధాన సంఘటనము, చాలకాలమునుండి దీనికి సూత్రపాతమగుచున్నది. కర్ణుఁడే యర్జునునకుఁ బ్రతియోధుఁడు. భీమార్జుననకులసహదేవులు నలువురును యుధిష్ఠిరునికొఱకు దిగ్విజయముంగావించియుండిరి. కర్ణుఁడొక్కఁడే దుర్యోధనునకు దిగ్విజయమును గావించెను. అర్జునుఁడు ద్రోణశిష్యుఁడు, కర్ణుఁడు ద్రోణగురుండగు పరశురామునిశిష్యుఁడు. అర్జునునకు గాండీవమున్నట్లే కర్ణున కంతకంటె నుత్కృష్టంబగు విజయధను వున్నది, అర్జునునకుఁ గృష్ణుఁడు సారథి; మహావీరుఁడగు శల్యుఁడు కర్ణునకు సారథి. కర్ణార్జునులిరువురును దివ్యాస్త్రవేదులే. ఇరువురు నొండొరులను వధించుటకొఱకుఁ జిరకాలమునుండి ప్రతిజ్ఞాతులైయుండిరి. భీష్మద్రోణులను వధించు విషయమున నర్జునుఁ డంతగా శ్రమపడలేదు. కాని, కర్ణవధంబున కాతఁడతిప్రయత్నుఁడు కావలసివచ్చెను. కుంతీదేవి కర్ణున కాతని జన్మవృత్తాంతమును దెలుపుసందర్భమున నాతని యొద్ద తనయేవురు పుత్రుల ప్రాణభిక్షమును యాచించెను. అప్పుడు కర్ణుడు ధర్మభీమనకులసహదేవులను మాత్రము రక్షింతునని తల్లికి

వరమొసంగెను. కాని యర్జునప్రాణభిక్షము నెంతమాత్రము నొసంగ లేదు. అతని వధించుటయో, యాతనిచేఁజచ్చుటయో జరుగవలయు నని కర్ణుఁడు తల్లికిఁ దన నిశ్చితాభిప్రాయము నెఱింగించెను.

ఈ మహారణంబునకుఁ గృష్ణుఁడిప్పుఁ డర్జునుని దీసికొనిపోవలసి యుండెను. ఇందుకొఱకే యాతఁడిప్పు డర్జునునియుధిష్ఠిరశిబిరమునకు దీసికొనివచ్చెను. యుధిష్ఠిరుని క్షేమవార్త దెలిసికొని రమ్మని భీముఁ డర్జునునితోఁ జెప్పినమాట నిజమే; కాని యుద్ధముముగియకుండ శిబి రమునకు వచ్చుట యర్జునున కిష్టములేదు. కృష్ణుఁ డొకయెత్తువేసి యాతనిం దీసికొనివచ్చెను. కర్ణుఁడు క్రమముగా యుద్ధముచేసి పరి శ్రాంతుఁడు కావలయుననియు, నర్జునుఁ డంతవఱకును విశ్రాంతిలాభ ముం గాంచి పునస్తేజస్వి కావలయుననియుఁ గృష్ణునియభిప్రాయము. మఱియు నాతఁ డర్జునుని రణరంగమునకుఁ గొనిపోవు సమయమునఁ దేజోవృద్ధికరంబుగా నాతని వీరత్వమును బ్రశంసింప నారంభించెను; ఇంతేకాక యాతనిపూర్వకృతంబులగు నతిలోకసామాన్య వీరకృత్యం బుల నుగ్గడించెను. ద్రౌపది యవమానము, అభిమన్యుని యధర్మమరణ మాత్య మొదలగుకర్ణకృతంబులగుపాండవాపకారవృత్తాంతములనన్నిటి నాతని స్మృతికిఁదెచ్చెను. ఈమాటలలో నేభాగమునైనను నిట ను దాహరింపవలసిన యావశ్యకములేదు. కేవలమొక్కవిషయమునుమా త్రమే దెలుపవలసి యున్నది. అప్పుడు కర్ణుఁడు "పూర్వము దానవగ ణము విష్ణుదేవునిచే నిహత బయ్యెను; పూర్వమువిష్ణుదేవుఁడు దానవ వినాశనముం గావించినట్లె" అని యిట్టిమాటలనే చెప్పెను. ఈమా టలనుబట్టిచూడఁగా గృష్ణుఁ డెన్నడును దానువిష్ణునియవతారమునని తెలుపుకొనలేనట్లు దోఁచుచున్నది. అతని దేవత్వము నెంతమాత్రమును బ్రకటింపకుండుటయే ప్రథమశ్రేణియందలి కవిలక్షణము. రెండవతరగతి కవిభావము దీనికిభిన్నమైనది.

తరువాతఁ గర్ణార్జునులకు యుద్ధారంభ మయ్యెను. ఆరణవర్ణనములో మనకెట్టి ప్రయోజనమును లేదు. కర్ణుని సర్పముఖశరంబునుండి కృష్ణుడర్జునుని రక్షించినట్లు మహాభారతమున వర్ణితమై యున్నది. అర్జునుఁ డాయస్త్రమును నివారింపఁజాలకపోయెను. అందుచేతనే కృష్ణుఁడు తనపదాఘాతమువలన రథము నించుక భూభాగమునకుఁ గ్రుంగించి యశ్వములను మోకరిలఁబడునట్లుగావించెను. అప్పు డర్జునుఁడు కూడ నించుక తలవంచికొనియెను. ఆకారణముచే నయ్యస్త్రాఘాతమున నాతనికిరీటముమాత్రము భగ్నమైపోయెను. అర్జునుఁడు తలవంచుకొనుట చేతనే యట్టిలాభము గలిగినది. ఈవిషయము విమర్శకు యోగ్యమైనదిగా నగపడుట లేదు. శ్రీకృష్ణుని సారథ్యముం గూర్చినప్రశంస మహాభారతమునందుఁ దఱచుగా నగపడుచునే యున్నది.

యుద్ధమునందు శేషభాగమునఁ గర్ణునిరథచక్రము భూమిలో గ్రుంగిపోయెను. దానిని పైకెత్తుటకై కర్ణుడు క్రిందికి దిగియెను. తన రథచక్రము నుద్ధరించుకొనువఱకును యుద్ధము నాపవలయునని కర్ణుఁ డర్జునునిం గోరియుండెను. అర్జునుఁ డట్లు యుద్ధమును మానినట్లె యగపడుచున్నది. ఏమనిన—తరువాతఁ గర్ణుఁడు మరల రథారూఢుఁడై పూర్వమువలెనే యుద్ధము చేసినట్లున్నది. కాని యిందుఁ గర్ణునిదురదృష్టమేమనిన—అతఁ డర్జుని యుద్ధమునాపుమని కోరినప్పుడు "యుద్ధధర్మానుసారముగా నీవిట్లు చేయుటకు బాధ్యుఁడవు!" అని యుగ్గడించి యుండెను. కృష్ణుఁ డధర్మమునకు శిక్షకుఁడు. అతఁడప్పుడు కర్ణునింగాంచి—

"ఓసూతపుత్రా! అదృష్టవశమున నీవిప్పుడైనను ధర్మమును స్మరించుచున్నావు. నీచుఁడు దుఃఖనిమగ్నుఁడైనప్పుడు తఱచుగా దైవమునే నిందించును గాని తనదుష్కర్మములంగూర్చి యించుకైనను నా

లోచించుకొనఁజాలఁడు. చూడుము! దుర్యోధనదుశ్శాసనులును, శకు నియును నీమతము ననుసరించి యేకవస్త్రయగు ద్రౌపదిని సభా మధ్యమున కీడ్చుకొనివచ్చినప్పుడు నీకీధర్మబుద్ధి యేమైపోయినది? దుష్టుఁడగు శకుని దురాలోచనాపరతంత్రుఁడవై నీయామోదముచేతనే ద్యూత క్రీడానభిజ్ఞుం డగుయుధిష్ఠిరుని బరాజితునిం గావించునప్పుడు నీ యీ ధర్మమెక్కడకుఁ బోయినది? రాజగుదుర్యోధనుఁడు నియుపదేశము ననుసరించి భీమసేనునకు విషాన్నముం బెట్టించినప్పుడు నీ ధర్మవేదిత్వ మేమంటఁ గలసిపోయినది? వారణావతనగరంబున లాక్షాగృహంబునఁ బ్రసుప్తులై యున్న పాండవులను దహించు నుద్దేశముతో మీరందఱు నాలోచించి యగ్నిప్రదానముం గావించుసమయమున నీ యీధర్మప్రవృత్తి యేయేటఁ గొట్టుకొనిపోయింది? సభామధ్యమున దుశ్శాసనవశీభూతయైయున్న రజస్వలయగు ద్రౌపదిం గాంచి నీవు "ఓ ద్రౌపదీ! పాండవులు భ్రష్టులై శాశ్వతనరకగాములై పోయిరి; ఇఁక నీవు నీకుఁదగినయన్యభర్తను వరింపుము," అని తూలనాడితివి. అప్పుడన్యాయులగు దురాత్ములు నిరపరాధిని యగు నామెను నెన్నిరెనోవిధముల బాధించుచుండఁగా నూరక చూచుచు నీవుపేక్షించి యుంటివి. ఆసమయమున నీయీధర్మోపదేశము లేమూలఁబడిపోయినది? కూటరాజ్యలోభముచే శకుని నాశ్రయించి పూటనిమూలమునఁ బాండవులను మాయాద్యూతమున శాహ్వానించినప్పుడు నీధర్మనిర్ణయ మేమైపోయినది? నీవు మహారధసహితుండవై బాలకుఁ డగునొక్కయభిమన్యుని ముట్టడించి యన్యాయముగవధించినప్పుడు నిధర్మాలోచన మేమైపోయినది? ఓకర్ణా! నీవిన్నియధర్మములను నిర్భయముగఁ గావించియు నిప్పుడు నోరెండుకొనిపోవునట్లుగా ధర్మాధర్మప్రశంస గావించుటవలన నేమిలాభమున్నది? ధర్మపరాయణత్వమున జీవన్ముక్తుండను గాఁగలనని నీ వెన్నటికిని భావింపవలదు. పూర్వము నిషధదేశా

ధీశ్వరుండగునలచక్రవర్తి ద్యూతక్రీడయందుఁ బుష్కరునిచే విజితుండ య్యును మరల రాజ్యలాభముంగాంచినట్లే ధర్మపరాయణులగుపాండ వులును భుజబలంబుచే సర్వశత్రువినాశనంబు గావించి రాజ్యలాభంబు గాంచెదరు. ధర్మసంరక్షితు లగుపాండవులచేతులలో ధార్తరాష్ట్రు లవశ్యముగ నిహతు లయ్యెదరు" అనియెను.

కృష్ణునివాక్యముల నన్నిటి నాకర్ణించి కర్ణుండు లజ్జావనతవద నుండయ్యెను. తరువాత నాతఁ డెప్పటివలె మహారణంబు సేసి యర్జు నుశరంబులచే నిహతుం డయ్యెను.

---

## అష్టమ పరిచ్ఛేదము

### దుర్యోధన వధ

కర్ణుండు మరణించినంతనే దుర్యోధనుఁడు శల్యుని సేనానాయ కునిగాఁ జేసెను. పూర్వదినంబున జరగినయుద్ధమునందు యుధిష్ఠిరుడు క్షత్రియుండయ్యును భీరుండనుకళంకమునకుఁ బాల్పడియెను. ఆతని కీకళంకమును బోఁగొట్టుకొనుట యత్యంతము నావశ్యకమై యుండెను. సర్వధర్మియగుకృష్ణుఁడు నేఁటియుద్ధమున యుధిష్ఠిరునే ప్రధానునిగాఁ జేసెను. . అతఁడుకూడ నతిసాహసముతో సమరంబుసేసి శల్యసం హారంబు గావించెను.

ఈదినమున సమస్తకౌరవసైన్యమును పాండవులచే నిహతం బయ్యెను. ఇరువురుబ్రాహ్మణు లగుకృపాశ్వత్థామలును, యదువంశీ యుఁడగుకృతవర్మయు, దుర్యోధనుఁడు నీనలుగురుమాత్రమే జీవించి యుండిరి, దుర్యోధనుఁడు పలాయితుఁడై పోయి ద్వైపాయనహ్రదం బున మునిఁగి యుండెను. పాండవు లాతనిని వెదకి పట్టుకొనిరి; కాని యుద్ధము సేయకుండ నాతని వధింపలేదు.

యుధిష్ఠిరుని చిరకాలస్థూలబుద్ధిమూలముననే పాండవుల కిన్ని కష్టములు సంప్రాప్తించెను. ఆతఁడీసమయమునఁగూడ నపూర్వంబగు నాస్థూలబుద్ధికి వికాసముం గల్పించెను. అప్పుడాతఁడు దుర్యోధనుం గాంచి "నీవు నీమనసువచ్చిన యాయుధములను గైకొని మాలో నే వీరునితోనైనను యుద్ధము చేయుము. తక్కినవారందఱమును రణస్థలమున నిలిచి యేమియుం జేయక మీసమరవ్యాపారమును నిరీక్షించుచుందుము. అట్లు యుద్ధంబునేసి నీవు మాలో నొక్కరుని జంపఁ గలిగినచో సమస్తరాజ్యమును నీయదియే కాఁగలదు" అని చెప్పుటయు దుర్యోధనుండు "నేను గదాధరుండనై రణంబు చేసెదను" అనియెను, గదాయుద్ధమున భీముఁడుగాక! పాండవులలో మఱియెవ్వఁడును దుర్యోధనుని జయింపఁజాలరని కృష్ణుఁ డెఱుంగును. ఇప్పుడు దుర్యోధనుఁడు పాండవులలో మఱియెవ్వరినైన యుద్ధమున కాహ్వానించినచోఁ బాండవులు మరల భిక్షావృత్తినే యవలంబింపవలసి యుందురు—అప్పు డెవ్వరు నేమియు ననలేదు. అందఱును బలగర్వితులై యుండిరి, ఇఁక యుధిష్ఠిరుని దిరస్కరించుభారమును గృష్ణుఁడే వహించి యాకార్యము నుచితప్రకారముగ నిర్వహించెను.

దుర్యోధనుండును నతిశయబలగర్వితుఁడై యుండెను. అతని గర్వముచే యుధిష్ఠిరునిబుద్ధిదోషము పరిమార్జిత మైపోయెను అప్పుడు దుర్యోధనుఁడు "మీలోనిష్టమున్న వారెవ్వరైనను వచ్చి నాతోఁ గదాయుద్ధము సేయవచ్చును" అనియెను. తోడనే భీముఁడు గదాధారియై రణంబున కగ్రసరుండయ్యెను.

ఇప్పుడు మరల మహాభారతస్వరము మార్పు చెందినది. ఈపదునెనిమిదిదినముల యుద్ధమునందును నెన్నియోసారులు భీమదుర్యోధనులకు గదారణము జరిగినట్లును, ప్రతిపర్యాయమును దుర్యోధనుఁడే సంపూర్ణముగ భీమునిచే బరాభూతుఁడైనట్లును గానవచ్చుచున్నది.

కాని యిప్పుడు క్రొత్తమాటపుట్టినది. ఇచ్చట భీముఁడు గదాయుద్ధము నందు దుర్యోధనునితో సమానుఁడు కాడని యాభారతమే చెప్పుచున్నది! నేఁడు భీముఁడే పరాభూతప్రాయుఁడై యుండెను. ముఖ్యవిషయము భీమసేనుని దారుణప్రతిజ్ఞ యే. సభాపర్వమున ద్యూతక్రీడానంతరమున దుర్యోధనుండు ద్రౌపదిని గెలుచుకొని సభామధ్యమునకు రావించెను. అప్పుడు దురాత్ముఁడగు దుశ్శాసనుఁడేకవస్త్రయు రజస్వలయునగు ద్రౌపదిని కేశాకర్షణము గావించి సభలోనికీడ్చుకొనివచ్చి వివస్త్రం జేయుటకుఁ బ్రయత్నించెను. ఆసమయమున భీముఁడు "నేనీ దుశ్శాసనుని వధించి యీతనివక్షమును జీల్చి యందలిరక్తమును పానముచేసెదను" అని ప్రతిజ్ఞచేసెను భీముఁడుమహాశ్మశానతుల్యంబగు వికటరణస్థలంబున నట్లే దుశ్శాసనుని నిహతుం గావించి రాక్షసునింబోలి యాతనితప్తశోణితముం గ్రోలుచు నందఱకును వినఁబడునట్లుగా "నేనమృతపానము చేయుచున్నాను" అని కేకవైచెను. మఱియు దుర్యోధనుఁడాసభామధ్యముననే మదహాసముచేయుచు ద్రౌపదివంక దృష్టిప్రసారముం గావించుచు సర్వలక్షణసంపన్నంబును వజ్రతుల్యంబును, కదళీదండగజతుండసన్నిభంబును నగు తనదృఢోరుమధ్యము నామెకుఁజూపించెను. అప్పుడు భీముఁడు "నేను మహారణంబున గదాఘాతముచే నీపాపాత్ముని యూరుభగ్నంబు గావింపనైతినేని మహానరకగామి నయ్యెదను" అని ప్రతిజ్ఞ చేసెను.

ఇప్పుడాయూరువుగదాఘాతముచే భంగితము కావలసియుండెను. కాని దానికొకప్రతిబంధక మున్నది. నాభికధోభాగంబున నాఘాతంబు సేయరాదనిగదా యుద్ధమున కొకనియమ ముండెను అందుచే నిప్పుడు భీముఁ డన్యాయయుద్ధముచేతనే దుర్యోధనుని వధింపఁగలిగినచో నాతని ప్రతిజ్ఞ విఫలమైపోవును.

ఎవ్వఁడు తనపెదతండ్రి కుమారుని హృదయరుధిరమును పానముచేసి యానందతాండవముం గావించెనో యట్టిరాక్షసుని దృష్టియం

ము. తలపై గదాఘాతమునకును నూరువులపై గదాఘాతమునకును భేద మేముండును? ద్రోణు నెట్లైన వధించుటకై మిథ్యాప్రవంచనమునకుం బూనుకొనిన యసత్యవాది యగు భీమునకు గదాఘాతంబున దుర్యోధనుని యూరుభంగంబు సేయు విషయమున నితరులుపదేశింప వలసిన యావశ్యక మేమున్నది? కాని యట్లు జరుగలేదు. భీముఁడిప్పుడాయూరుభంగప్రతిజ్ఞ మాటయే మఱచిపోయెను. (ఇది రెండవతరగతికవి కల్పన. ఇచ్చట నాతనిచేయి యగపడుచున్నది.) ఆతనికిఁ జరిత్రమునందలి సందర్భశుద్ధివిషయంబున నించుకంతయును దృష్టియే యుండదు. ఆతఁ డిచ్చట భీమచరిత్రమునం దెట్టియౌచిత్యమును నిలుపలేదు. అర్జునుని విషయమునఁగూడ నట్లే చేసెను. అర్జునుఁ డిదివఱకు ద్రోణవధసమయమునఁ దనయస్త్రగురుండును, ధర్మాచార్యుండును, సఖుండును బరమగౌరవపాత్రుండునగు శ్రీకృష్ణునిచే నుపదేశింపఁబడియు నసత్యవాదమున కంగీకరింపఁజాలకపోయెను. అట్టివాఁ డిప్పుడు భీముఁడు తనప్రతిజ్ఞ మఱచిపోయినసంగతిని గ్రహించి తనయంతదానే యాతని నన్యాయయుద్ధమునకుఁ బ్రవృత్తునిం గావించుటకై పూనుకొనియెను. అప్పుడు పరమధార్మికుఁ డగునర్జునుఁ డిప్పు డధర్మమునకు శంకింపలేదు. కాని యిందు శ్రీకృష్ణునిప్రోత్సాహము లేకుండఁ జేసినచోఁ గవియుద్దేశము సఫలము కాదు. అందుచేఁ గవి యీక్రిందివిధముగాఁ గల్పించెను.

అర్జునుఁడు భీమదుర్యోధనుల యుద్ధమును బరిశీలించుచు గదాయుద్ధమునందు వీరిలో నెవ్వరు శ్రేష్ఠులని శ్రీకృష్ణు నడిగెను. 'ఈయిరువురిలో భీముఁడే బలాధికుఁడు; కాని గదాయుద్ధమునఁ బరిశ్రమయును నైపుణ్యమునుగూడ దుర్యోధనునకే యధికముగా నున్నది. మొట్టమొదట రణరంగమునుండి పలాయితుఁడై మరల యుద్ధమున శత్రువు నెదుటఁ బడినవానికి జీవితాశ లేకుండుటవలన సాహస మధికముగా

నుండును. ప్రాణములకుఁ దెగించి యతిసాహసముతోఁ బోరాడు వీరుని బరాభూతునింగావించుట దుస్సాధ్యము, కావున భీముఁడిప్పుడు దుర్యోధను నన్యాయయుద్ధమున వధింపకున్నచో నాతఁడు యుధిష్ఠిరునివాక్యానుసారముగ సమస్తరాజ్యమును మరలఁ బడయఁగలఁడు.' అని శ్రీకృష్ణుడు చెప్పెను.

ఆకృష్ణునిమాటలను విని యర్జునుఁ డప్పుడు తనవామజానువుపైఁ జరచుకొనుచు భీమునకు సంకేతముం గావించెను. పిమ్మట భీముఁడు దుర్యోధనుని యూరువులను భగ్నంబు చేసి పడఁగొట్టెను.

'న్యాయ మెట్లీశ్వర ప్రేరితమో యన్యాయముకూడ నట్లీశ్వర ప్రేరితమే.' అనునది రెండవతరగతికవియుద్దేశమై యున్నది.

ఆయుద్ధసమయమునఁ బ్రేక్షకులలో బలరాముఁడుకూడ నుండెను. గదాసాధనమున భీమదుర్యోధను లాతనినిశిష్యులై యుండిరి. కాని వారిలో దుర్యోధనుఁడే యాతనికిఁ బ్రియశిష్యుఁడు. మఱియును బలరాముఁడు సర్వదా దుర్యోధనపక్షపాతియైయుండెను, ఇప్పుడు భీముఁడు దుర్యోధను నన్యాయయుద్ధమున జయించుటగాంచి రేవతీవల్లభుఁడు క్రుద్ధుఁడై తనహాలాయుధమును బైకెత్తి భీమునిమీఁదికి లంఘించెను. ఆతనిభుజమునం దెప్పుడును హాలాయుధ ముండుటచేతనే యాతనికి హాలాయుధుఁ డనుపేరు వచ్చినదని చెప్పనక్కఱలేదు. ఇదియేమిక్రోధమని యెవరు ప్రశ్నించినను బలరాము డెట్టియుత్తరమును జెప్పుట లేదు. ఏమైననేమి—కృష్ణుఁ డాతనిని శాంతింపఁజేయుటకై యతిప్రయత్నముం గావించెను. కృష్ణునిమాటలవలనఁ హాలధరుడు శాంతిని వహింపక చటాలున నచ్చటినుండి వెడలిపోయెను.

తరువాత నింకనొకబీభత్సవ్యాపారము తటస్థించెను. భీముఁడు నిహతుం డగుదుర్యోధనుని యుత్తమాంగమునఁబదాఘాతముంగావించెను. యుధిష్ఠిరుఁడు వారించుచునే యుండెనుగాని భీముఁడుమాత్ర

మాటమాటల నాలింపలేదు. ఇట్టిదుష్కార్యముం గావించుచున్న భీముని వారింపనందుకై యుధిష్ఠిరుని కృష్ణుఁడు తిరస్కరించెను. ఇటఁబాండవపక్షవీరులు దుర్యోధనుని వధించినందుకై భీము ననేకవిధముల బ్రశంసించుచు దుర్యోధనుని గటుభాషణంబులచే నిందింపఁదొడంగిరి. కృష్ణుఁడు వారిం గాంచి విరక్తుఁడై——

'మృతకల్పుఁడగు శత్రునింగూర్చి కటువాక్యప్రయోగంబు గావించుట న్యాయము కాదు' అనియెను.

కృష్ణునియీవాక్యములన్నియునాదర్శపురుషోచితములై యుండెను. కాని తరువాత నీగ్రంథమునఁగానవచ్చుచున్న విషయముపరమాశ్చర్యకరముగా నున్నది.

ఇందుఁ బ్రథమాశ్చర్యవ్యాపారమేమనిన——''మృతకల్పుఁడగు శత్రునిం గూర్చి కటువాక్య ప్రయోగముం గావించుట న్యాయము కాదు'' అని యితరులకు బోధించిన కృష్ణుఁడప్పుడు తానే దుర్యోధను నాక్షేపించినట్లున్నది.

దుర్యోధనునియుత్తరము ద్వితీయాశ్చర్యవ్యాపారము. దుర్యోధనుఁడు భగ్నోరుఁడయ్యును నప్పటికిని మరణింపక పడియుండెను. అతఁడిప్పుడు కృష్ణునికటూక్తులనాలించి యిట్లు ప్రత్యుత్తరము చెప్పం దొడంగెను.

ఓకంసదాసతనయా! ధనంజయుఁడు నీయుపదేశానుసారముగా నాయూరు భగ్నముం గావించుటకు భీమునికి సంజ్ఞ చేయుటవలన భీముఁడధర్మయుద్ధమున నన్ను నిహతునిఁ గావించియున్నాఁడు. ఇది నీకు లజ్జాకరముగ లేదా? నీయన్యాయోపాయముల మూలముననే ధర్మయుద్ధప్రవృత్తు లగు వేలకొలది క్షత్రియవీరులు ప్రతిదినమును నిహతులైపోయిరి. (ఇట్టి సందర్భము మహాభారతమునం దెచ్చటను లేదు. ఏతరగతి కవికల్పనయందును లేదు.) నీవే శిఖండిని ముందుగ నిలిపి పితామహుని నిహతునిం గావించితివి. (కృష్ణునికి దీనితో నెట్టి సంబంధమును లేదు. మహాభారతమునఁగూడ నెచ్చటను నీమాట లేదు)

అశ్వత్థామయనుగజంబు మరణించుటయు నీవొక తంత్రమును బన్ని యాచార్యునిచే శస్త్రసన్యాసముం జేయించితివి. ఆసమయమున దురాత్ముఁడగు ధృష్టద్యుమ్నుఁడు నీయెదుటనే యాచార్యుని నిహతునిం గావించుచుండఁగా నీ వెంతమాత్రము నిషేధింపవైతివి. శత్రువును వధించుచుండఁగా నేల నిషేధింపవలయును? అర్జునుని వధింపవలయు నని చాలదినములనుండి యతిప్రయత్నముతోఁ గర్ణుఁడు దాచుకొని యున్నయస్త్రమును నీవతినిపుణముగ ఘటోత్కచునిపైఁ బ్రయోగింపఁజేయించి వ్యర్థముచేయించితివి. (కృష్ణుఁడీవిషయమున నెట్టికౌశలమును గావింపలేదు. కౌరవవీరుల బలవంతముచేతనే కర్ణుఁ డాయస్త్రమును ఘటోత్కచునిపైఁ బ్రయోగించినట్లు మహాభారతమునందున్నది.) సాత్యకి నీప్రవర్తనమునే యాదర్శముగఁ జేసికొని ఛిన్నహస్తుండును బ్రాయోపవిష్టుండును నగు భూరిశ్రవుని నిహతునిం గావించెను. (ఈమాట కేవల మసత్యము. ఇట్లు మహాభారతమునఁ జెప్పి యుండలేదు. సాత్యకి భూరిశ్రవుని జంపినమాట నిజమే. మీఁదుమిక్కిలి ఛిన్నబాహుఁడగు భూరిశ్రవుని వధించుట న్యాయము కాదని శ్రీకృష్ణుఁడు నిషేధించి యుండెను.) మహావీరుఁడగు కర్ణుఁ డర్జునుని వధింపనుద్యుక్తుం డగుచుండఁగా నీతికౌశలంబున నాతని సర్పముఖాస్త్రమును నిరర్థకముగఁ జేయించితివి. (ఆకౌశలము నిజపదబలంబున రథచక్రములనుభూమిలోనికిఁ గ్రుంగించుటయే. ఆయుపాయము న్యాయమైనదియే. రథికుని రక్షించుటయే సారథికి ధర్మము) తుట్టతుదను కర్ణునిరథము భూమిలోనికిఁ గ్రుంగినప్పుఁడాతఁడు దానినుద్ధరించుకొనుచుండఁగా నీ వతికౌశలంబున నర్జునునిచే నాతని వినాశసాధనముం గావించి కృతార్థుండవైతివి. (ఇది కుతంత్రమా? మహాభారతమునం దీపట్టునఁ గృష్ణునికౌశలముం గూర్చి యెట్టిమాటయును లేదు. యుద్ధమునం దర్జునుఁడు కర్ణుని వధించినట్లే యున్నది.) కావున నీకంటె పాపాత్ముఁడును నిర్దయుఁడును నిర్లజ్జుఁడును మఱి యెవ్వఁ డున్నాఁడు?

భీష్మునితోఁగాని, ద్రోణునితోఁగాని కర్ణునితోఁ గాని, నాతోఁ గాని న్యాయయుద్ధము నేగావించినచో మీ కెన్నటికైన జయము లభించునా? మీయనార్యోపాయంబుల మూలమున నే స్వధర్మానుగతులగు పార్థివ గణంబులతోఁ గూడ మేమందఱమును నిహతులమైపోయితిమి."

ఈవాక్యముల కన్నిటికిని ప్రత్యుత్తరములను జూపి మేమిందే కుండలీకరణముంగావించి యుంచితిమి. పాఠకులు వానిని గ్రహింతు రుగాక! ఈమాటలన్నియు నసత్యములే. ఇట్టిసంపూర్ణమిథ్యాతిరస్కారము భారతమునందు మఱియెచ్చటను లేదు. అందుచేత నే దుర్యోధనుని ప్రత్యుత్తర మాశ్చర్యముగా నున్నదని చెప్పి యుంటిమి.

తృతీయాశ్చర్యమేమనిన—దీనికిఁ గృష్ణుఁడిచ్చిన ప్రత్యుత్తరము కృష్ణుఁడు గంభీరస్వభావుఁడును, క్షమాశీలుఁడును, నెవ్వరితిరస్కారమునకును బదులు చెప్పనివాఁడునని మేమిదివఱకే చూపి యున్నాము. సభామధ్యమున శిశుపాలుండు గావించిన యసహ్యనిందావాదమును మారుమాటాడకుండ నాతఁడు సహించియుండెను. విశేషించి దుర్యోధనుఁ డిప్పుడు మరణోన్ముఖుఁడై యున్నాఁడు. అతని మాటలకు నుత్తరము చెప్పుటవలన నెట్టి ప్రయోజనమును లేదు. అతని నెంతమాత్రము నిందించినను దనకే యగౌరవమని కృష్ణుఁడు భావింప వలసియుండెను. అయినను గృష్ణుఁడు దుర్యోధనుని తిరస్కారమునకుఁ బ్రత్యుత్తర మిచ్చుటయే కాక కటూక్తినిగూడఁ బ్రయోగించెను; అప్పుడు దుర్యోధనుని పాపకృత్యములనన్నిటినుగ్గడించుచుఁ గట్టకడపట "నీవెన్నియో పాపములను గావించితివి. ఇప్పుడిఁక వానిఫలంబు ననుభవింపుము" అని తూలనాడెను.

అప్పుడు దుర్యోధనుఁడు గంభీరస్వరముతో "నేనధ్యయనంబు చేసి విధిపూర్వకస్నానాదినియమంబులం గావించుచు ససాగరంబగు నీభూమండలమునంతను శాసించి విపక్షగణంబులమస్తకోపరిస్థలంబున నుపస్థితుండనై యత్యుత్కృష్టం బగునైశ్వర్యలాభంబు గాంచి యుట్ట

తుదకు ధర్మపరాయణు లగు క్షత్రియవీరులకుఁ బ్రార్థనీయంబగు సమరమరణంబును గాంచి యుంటిని. కావున నత్సమానుం డగు సౌభాగ్యశాలి మఱి యెవ్వఁడు; నేనిప్పుడు భ్రాతృవర్గంబుతోడను, బంధుగణంబులతోడను, స్వర్గమునకుఁ బోయెదను. మీరందఱును శోకాకులితహృదయులగుచు మృతప్రాయులై భూమియందుండుఁడు!" అనియెను.

ఈయుత్తరమునం దాశ్చర్యము లేదు. పరులసర్వస్వమును బాపద్యూతమునందపహరించిన దుర్యోధనునివంటి దాంభికుఁడు తన్ను జయించినశత్రునిం గాంచి నేనే జయించితిని; నీవోడితివని ధిక్కరించుటలో నాశ్చర్య మేమున్నది? దుర్యోధనుఁడు ప్రారంభమునం దుండియే యిట్టిమాట లనియుండెను. యుద్ధమున మరణించినచో స్వర్గలాభంబు గలుగు నని క్షత్రియు లందఱును జెప్పుదురు. ఈయుత్తర మాశ్చర్యము కాదు. కాని యీయుత్తరమునకుఁగలిగినఫలముమాత్ర మన్నిటి కంటె నాశ్చర్యకరమైనది. ఈమాట చెప్పినంతమాత్రముననే యాకాశమునుండి సుగంధకుసుమవృష్టికురియం దొడంగెను; గంధర్వులు మధురవాద్యములను బ్రయోగింపఁదొడంగిరి. అప్సరలు రాజగు దుర్యోధనుని యశోగీతములను గానముచేయఁదొడంగిరి. సిద్ధులాతనింగూర్చి సాధువాదములం గావించిరి. సుగంధసంపన్నంబును, సుఖస్పర్శంబు నగుసమీరణంబు మందమందముగ వీతెంచుచుండెను. దిఙ్మండలంబును నభోమండలమునుగూడ సునిర్మలంబు లయ్యెను. అప్పుడు వాసుదేవ ప్రముఖు లగుపాండవులు దుర్యోధనునిసన్మానసూచకం బగు నీయద్భుతవ్యాపారముంగాంచుచు నతితరలజ్జావనతవదనులై పోయిరి. మఱియును వారు భీష్మద్రోణకర్ణభూరిశ్రవుల నన్యాయముగ వధించినందుకై యాసందర్భములను స్మరించుకొనుచు నతిశోకాకులితహృదయు లగుచుండిరి.

మహాభారతంబునఁ బాపాత్ములలో నెల్ల నధమాధముండని వర్ణింపఁబడినదుర్యోధనున కిట్టియద్భుత సన్మానసాధువాదంబులును

నందు ధర్మాత్ములలో నెల్ల శ్రేష్ఠులనివర్ణింపబడిన మహాత్ముల కిట్టియధర్మాచరణమూలకంబగు లజ్జయును సంభవించుట యాశ్చర్యముకాదా? సిద్ధగణము, అప్సరోగణము, దేవగణమునుగూడ దురాత్ముఁడగు దుర్యోధనుఁడు ధర్మాత్ముఁడనియుఁ గృష్ణపాండవులు మహాపాపాత్ములనియుఁ బ్రకటించిరి. ఇదియే మహాభారతమునందెల్ల నాశ్చర్యవిషయము. ఇది మహాభారతమున కంతకును విరుద్ధముగానున్నది. సిద్ధాదులమాట యటులుంచి యేమానవుఁడైనను నిట్టిసాధువాదము మహాభారతమునం దాశ్చర్యవిషయమని చెప్పకమానఁడు. ఏమనిన— దుర్యోధనునియధర్మమునుగూర్చియుఁ గృష్ణపాండవుల ధర్మముంగూర్చియుఁ బ్రశంసించుటయే భారతోద్దేశము. భీష్మద్రోణకర్ణభూరిశ్రవులనుదామధర్మయుద్ధమున సంహరించినట్లు దుర్యోధనునివలనగ్రహించి కృష్ణపాండవులుశోకాకులితస్వాంతులైరని చెప్పుటమఱియు నద్భుతరసవంతముగానున్నది. ఇంతకాలమువఱకును వారించుకంతయు నెఱుంగనివారై యుండియిప్పుడు పరమశత్రుముఖంబున దమయపరాధముం దెలిసికొని పెద్దమనుష్యులవలె విచారమును బ్రదర్శింపఁ జేయఁదొడంగిరి. భీష్మునిగాని, కర్ణునిగాని వధించుపట్టునఁ దామెట్టియధర్మమును గావింపలేదని వారెఱుంగుదురు. ఇప్పుడు పరమశత్రువగుదుర్యోధనుడు చెప్పినంతమాత్రమునఁ దానుధర్మముం గావించినట్లే విశ్వసించి శోకప్రకటనముం గావించిరి. భూరిశ్రవుని వారిలో నెవ్వరునువధించియుండలేదు. ఆతనిని సాత్యకి వధించెను. అప్పుడు కృష్ణార్జునులును, భీముఁడునుగూడ సాత్యకిని నిషేధించియుండిరి. అయినను బరమశత్రుడగుదుర్యోధనుం డాతనిని మీరే చంపితిరనియు, మీరేయధర్మముం గావించితిరనియు నిందించినంతనే మూఢులగుపాండవు లామాటల నవశ్యము విశ్వసించి తాచంపితి మనియుఁ దామే యధర్మముంగావించితి మనియు నంగీకరించుటకు బాధ్యులై పెద్దమనుష్యులవలెనేడువ

నారంభించిరి. ఇఁక నీవిషయముంగూర్చి విమర్శించుట నిష్ప్రయోజనము కాదా? అయినను నీనిర్భాగ్యదేశమునందలి ప్రజలనమ్మక మేమనిన—గ్రంథమధ్యమున లిఖింపఁబడినవిషయములన్నియుఋషివాక్యములే యనియు, నభ్రాంతము లనియు, శిరోధార్యములనియు వారియుద్దేశము. అందుచే బలవంతముగా నిట్టివిషయములను మనము గూడ నంగీకరింపవలసి వచ్చుచున్నది.

ఆశ్చర్యకరవృత్తాంతములింకను ముగియలేదు! కృష్ణుఁడప్పుడు తనయధర్మాచరణముంగూర్చి సిగ్గుపడియెనుగదా! మరల నప్పుడే యాతఁ డత్యంతమును నిర్లజ్జాభావముతో నీవిధముగాఁ దనపాపాచరణముంగూర్చి యాత్మశ్లాఘనముం గావించుకొనియెను.

"భీష్మప్రముఖమహారథగణంబులును, రాజగుదుర్యోధనుఁడునుగూడ నసాధారణసమకళావిశారదులు; మీరెన్నటికిని వారినిధర్మయుద్ధమున జయించుటకు సమర్థులు కాజాలరు నేను కేవలమును మీహితానుష్ఠానపరతంత్రుఁడనై యనేకోపాయముల నాలోచించిమాయాబలప్రదర్శనపూర్వకముగ వారిని సంహరింపఁజేయించితిని. నేనిట్టి కుటిలవ్యవహారముం గావింపకున్నచో మీకిట్టిజయలాభంబును, రాజ్యలాభంబును, నర్థలాభంబును నెన్నటికిని గలుగబోదు. భీష్మప్రముఖులగు నానలువురు మహాత్ములును భూమండలమున నతిరథులనిప్రఖ్యాతిగాంచినవారు. లోకపాలకులందఱు నేకమై వచ్చినను వారినిధర్మయుద్ధమునం దోడించుటకు సమర్థులు కాఁజాలరు. మఱియును సమరాంగణమున నపరిశ్రాంతుండును గదాధారియునగు నీదుర్యోధనుని గదాపాణి యగుకృతాంతుఁడైనను ధర్మయుద్ధమున వధింపజాలఁడు. కావున నేభీముఁడాతని నధర్మోపాయమున వధింపవలసివచ్చెను. దీనికొఱకు విచారింపవలసినపనిలేదు. ఇది సర్వసామాన్యశ్రుతమే—శత్రుబలము వృద్ధియైనప్పుడు కూడయుద్ధమునఁ బరవినాశముం గావింపవలయును.

మహాత్ములగు దేవతలు కూటయుద్ధమునే యవలంబించి యసురనాశన మును జేసి యున్నారు. వారి ననుసరించుట యెల్లరకును గర్తవ్యము" అనియెను. ఇంతకంటెసిగ్గుమాలిన యధర్మము మఱి యెచ్చటనైన నున్నదా ?

దుర్యోధనకృతం బగునీతిరస్కారవృత్తాంత మంతయు నస్వభావముగ నున్నదని వేఱుగఁ జెప్పనక్కరలేదు. ద్రోణవధాదిస్థానముల యందలి యసామాలికభాగములను మేమిదివఱకే సప్రమాణముగ నిరూపించియున్నాము. అసామాలికవిషయముంగూర్చి ప్రసంగమెక్కడవచ్చినను నదికూడ నసామాలికమే యగుచున్నది. ఇంకొకసంగతి చెప్పవలసి యున్నది. ఈభాగమున రెండవతరగతికవిలేఖనీచిహ్నముకూడనగపడుటలేదు. రెండవతరగతికవి కృష్ణభక్తుఁడు. ఈవ్రాతఁ కృష్ణద్వేషివ్రాతవలెనున్నది. శైవాదులును, నవైష్ణవులును, వైష్ణవద్వేషులును గూడి యప్పుడప్పుడు భారతకళేబరము నచ్చటచ్చటనుబ్బించి యున్నారను సంగతి నిదివఱకే చెప్పియుంటిమి. అట్టివారెవ్వరో యీవృత్తాంతమును గల్పించి యుండవచ్చును. ఇది కృష్ణభక్తుఁడు గావించనకల్పనమని యును జెప్పినఁ జెప్పవచ్చును, భారతవర్షీయులగుకవిశేఖరులకు నిందాస్తుతి గావించుట యొకవిధమగు ప్రౌఢత్వము, ఈరచన యట్టిదియే యైయుండును,

అదియేమైనఁ గానిండు—దీనితరువాతనే దుర్యోధనుఁ డశ్వత్థామతో "అమితతేజోమయుం డగువాసుదేవుని మాహాత్మ్యవిశేషమును నేనవగతంబు చేసికొంటిని. అతఁడు నన్ను క్షాత్రధర్మమునుండి పరిభ్రష్టునిం గావింపలేదు. కావున నాకొఱకు విచారింపంబనిలేదు" అని పిచ్చెక్కినట్లగపడుచున్నది.

ఇట్టి పూర్వాపరవిరుద్ధవిషయములను విమర్శింపఁ బూనుట యనావశ్యకము !

## నవమపరిచ్ఛేదము

### యుద్ధశేషము

దుర్యోధనుఁ డన్యాయయుద్ధమున హతుఁ డయ్యెనని యుధిష్ఠిరునకుఁ జాలభయము కలిగెను. తపఃప్రభావశాలిని యగుగాంధారి యీమాట విని పాండవులను భస్మము చేయునేమో యని తల్లడిల్లుచు నాతఁడు హస్తినానగరమునకుఁ బోయి గాంధారీధృతరాష్ట్రులను శాంతింపఁజేసివచ్చుటకు శ్రీకృష్ణునియంగీకారమును బ్రార్థించెను.

ఈవ్రాఁత ప్రథమతరగతివిరచనము కాదు. ఏమనిన—ఇప్పట్టున యుధిష్ఠిరుఁడు కృష్ణునిం గాంచి "నీ వవ్యయుఁడవు; లోకమునకు సృష్టిసంహారకర్తవు" అని కీర్తించి యుండెను. ఇంత కించుక ముందుగనే కృష్ణుఁ డర్జునునిరథమునుండి దిగినప్పు డారథము మండిపోయెను, అర్జునుం డాయద్భుతసంఘటనముం గాంచి యిది యేమని యడుగుటయుఁ గృష్ణుఁ డాతనితో "బ్రహ్మాస్త్రప్రభావముచే నీరథ మిదివఱకే యగ్నిసంలగ్నమై యున్నది. నేను దీని నధిష్ఠించియుండుట కారణంబుగా నిది యింతపర్యంతమును దగ్ధంబు గాకయుండెను. అనగా (అనఁగా నేను విష్ణువునని చెప్పుట)" అని చెప్పి యుండెను. ఇది ద్వితీయకవి రచనమో, తృతీయకవిరచనమో యైయుండును.

కృష్ణుఁడు హస్తినాపురంబునకుఁ బోయి గాంధారీధృతరాష్ట్రుల కించుక బోధించెను, ఆమాటల నిచ్చట నుదాహరించుటకు గాని, విమర్శించుటకుఁగాని యావశ్యకము లేదు.

తరువాత దుర్యోధనుఁ డశ్వత్థామను సేనానాయకునిం గావించెను. కాని, యప్పుడు సేనామధ్యమున నశ్వత్థామయుఁ గృపాచార్యుఁడును. కృతవర్మయుమాత్రమే యుండిరి, దీనితో శల్యపర్వము పరిసమాప్తం బయ్యెను,

తరువాత సౌప్తికపర్వము. సౌప్తికపర్వ మతిభీషణవ్యాపార పరిపూర్ణమైనది. అందు మొదటిభాగమున నశ్వత్థామ చోరునివలె నిశీథకాలంబునఁ బాండవశిబిరంబునఁ బ్రవేశించి నిద్రాభిభూతులగు ధృష్టద్యుమ్నుని, శిఖండిని, ఉపపాండవులను, సమస్తపాంచాలగణంబులను సేనను, సేనాపతిగణంబులనుగూడ వధించెను. పంచపాండవులును గృష్ణుండునుదక్కఁ బాండవపక్షమున మఱియెవ్వరును జీవించియుండలేదు.

వాస్తవముగా నీకురుక్షేత్రయుద్ధము కురుపాంచాలయుద్ధమే, పాంచాలవంశ మంతరించుటతోడనే యుద్ధము పరిసమాప్తమయ్యెను.

తరువాత సౌప్తిక పర్వమునం దొకయైషీకపర్వాధ్యాయ మున్నది. అశ్వత్థామచోరోచితం బగునిట్టిదుష్కృత్యముం గావించి పాండవభయంబున వనంబునకుఁ బోయి దాఁగియుండెను. మఱునాఁడు పాండవులాతని వెదకి పట్టుకొనిరి. అశ్వత్థామ యట్లు పట్టువడి యాత్మరక్షణంబుకొఱ కతిభయంకరంబగు బ్రహ్మశిరోనామకాస్త్రమును బ్రయోగించెను. దానిని నివారించుటకై యర్జునుండును బ్రహ్మశిరోనామకాస్త్రమును బ్రయోగించెను. ఈయస్త్రద్వయతేజముపలనను బ్రహ్మాండమువిధ్వస్తంబగునేమోయని తోఁచుటయు మహర్షులందఱును వచ్చి యాయిరువురినడుమను శాంతిస్థాపనంబు గావించిరి. అప్పు డశ్వత్థామ తనయుత్తమాంగమున సహజముగానున్నమణిని దీసి ద్రౌపదికుపహారముం గావించెను. ఇంతలో బ్రహ్మశిరోనామకాస్త్రము పాండవవధువగు నుత్తరగర్భమునందలి యర్భకుని విగతాసునింగావించెను.

అనైసర్గికంబు లగునిట్టిసమస్తవృత్తాంతములను మేము వదలివైచెదము. ఈసౌప్తికపర్వమునఁ గృష్ణచరిత్రముతో సంబంధించిన విమర్శనీయంబగు నొక్కవృత్తాంతమును లేదు.

దీనివెనుక స్త్రీపర్వము. స్త్రీపర్వము మఱియును భీషణమైనది. మరణించిన వీరగణంబుల వీరపత్నులయార్తనాదములే యందు

న్నవి. ఇంతటిభయంకరార్తనాదము లిదివఱ కెన్నఁడు నెచ్చటను వినఁబడియుండలేదు. కాని యిందుఁ గృష్ణచరిత్రకు సంబంధించిన రెండువిషయములుమాత్ర మున్నవి—

(1) ధృతరాష్ట్రుఁడు భీము నాలింగనము చేసికొని చూర్ణము గావించె ననియొకకల్పన చేయఁబడి యుండెను. కాని కృష్ణుఁడందు కొఱ కొకలోహమయభీమవిగ్రహమును జేయించి యుంచెను. అంధుడగుధృతరాష్ట్రుఁడు దానినే చూర్ణముగాఁ జేసివైచెను. అస్వాభావంబగునీవృత్తాంతము మనము పరిత్యజింపఁదగినదే. కావున నీవిషయమున నిఁకఁ జెప్పవలసిన దేదియును లేదు.

(2) గాంధారి కృష్ణునియొద్ద ననేకవిధముల విలపింప కట్టకడపటఁ గ్రోధముతోఁ గృష్ణుని శపించుచు—

'ఓజనార్దనా! కురుపాండవులు పరస్పరక్రోధానలమున దగ్ధులై పోవుచుండఁగా నీవూరకచూచుచు నుపేక్షించి యుండుటకుఁ గారణ మేమి? నీకసంఖ్యంబగుభృత్యవర్గంబును, సైన్యంబునుగూడనున్నది. నీవు శాస్త్రజ్ఞానసంపన్నుడవు, వాక్యవిశారదుండవునై యుండియు నసాధారణవినాశనము నుపేక్షించి యుంటివి. కావున నవశ్యముగ నీపాపమునకుఁ దగినశాస్తి కావలయును. నేను పతిశుశ్రూషామూలంబున నించుక తపస్సంచయంబు గావించుకొనియుంటిని. అత్యంత దుర్లభంబగునట్టి తపఃప్రభావముచే నేనిప్పుడు నిన్ను శపించుచున్నదానను. జ్ఞాతులగు కురుపాండవుల వినాశనమును నీవూరక యుపేక్షించి చూచుచుంటివి. కావున నీజ్ఞాతివర్గము కూడ నీమూలముననే వినాశము గాంచునుగాక! ఇఁక నఱువదిమూఁడేండ్లకుఁదరువాత నీవు పుత్రమిత్రామాత్య విహీనుండవై వనమధ్యంబున నతనిచోపాయమూలంబున నిహతుండవు కాఁగలవు. (అఱువది మూఁడేండ్లనుట యేలెక్కయో) నీకులవధూమణులు, భరతవంశమహిళామణులవలెనే పతిపుత్రహీనలై విలాపపరితాపంబు లనుభవించెదరుగాక!'' అనియెను.

అప్పుడు కృష్ణుఁడు సప్రశ్చు "దేవీ! యదువంశ ధ్వంసముం గావించుటకు నాకంటె సమర్థుఁడగువాఁ డెవ్వఁడును లేఁడు. ఆపని చేయవలయునని నేనిదివఱకే నిశ్చయించుకొంటిని. నాకేది యవశ్య కర్తవ్యమో దానినే నీవిప్పుడు చెప్పితివి. యాదవులు మానవులకుఁగాని దానవులకుఁ గాని, దేవతలకుగాని, వధ్యులుకారు. కేవలమును వారికి వారే వినాశనముం గల్పించుకొనవలసియుండెను" అనియెను.

ఈవిధముగా రెండవ తరగతి కవి మౌసలపర్వ రచనమునకుఁ బూర్వసూచనముం గావించియుంచెను. మౌసలికపర్వము రెండవతర గతి కవికల్పితమని మేము కూడఁ బూర్వసూచనముం గావించి యుంటిమిగదా!

---

## దశమపరిచ్ఛేదము

### విధిసంస్థాపనము

మేమిప్పటి కతిదుస్తరంబగు కురుక్షేత్ర యుద్ధవిచారమునుండి యుత్తీర్ణుల మైతిమి. కృష్ణచరిత్రము మరల వినిర్మలప్రభాభాసితమగు చున్నది. కాని శాంత్యనుశాసనపర్వములు శ్రీకృష్ణుఁ డీశ్వరుఁడని సంపూర్ణముగఁ బ్రకటించుచున్నవి.

యుద్ధావశేషమున నగాధబుద్ధియగు యుధిష్ఠిరుఁడు మరల నొకయగాధబుద్ధిఖేలనమును గావించెను. అతఁడప్పుడర్జునునింగాంచి "ఇంతమంది జ్ఞాతులను వధించుట కారణంబుగా నా హృదయంబున కెట్టి సుఖంబును లేకుండఁ బోయినది. నే నింక వనంబునకుఁ బోయి భిక్షాన్నమును భుజించుచుఁ గాలక్షేపము చేసెదను" అని చెప్పెను. అర్జునుఁడు చాలఁ గోపించి యుధిష్ఠిరున కనేకవిధంబుల బోధించెను. పిమ్మట భీమనకులసహదేవులును, ద్రౌపదియును స్వయముగాఁ

గృష్ణుండును గూడ బోధించిరి. కాని దుర్బలహృదయుఁడగు యుధిష్ఠి రుఁడు తేరుకొనఁ జాలకపోయెను. వ్యాసనారదాదులు కూడ నాతనికి బోధించిరి. ఏమియు లాభము లేకపోయెను. తుదకుఁ గృష్ణుని యుపదేశమువలన యుధిష్ఠిరుఁడు మహోత్సాహముతో హస్తినాపురమునఁ బ్రవేశించెను.

తరువాతఁ గృష్ణుఁ డాతనికి రాజ్యాభిషేకముం జేయించెను. అప్పుడు యుధిష్ఠిరుఁడు కృష్ణునిస్తుతించెను. ఆస్తోత్రము కేవలమీశ్వర స్తోత్రమే. యుధిష్ఠిరుఁ డట్లు స్తుతించి కృష్ణునకు నమస్కరించెను. కృష్ణుఁడాతనికంటెఁ జిన్నవాఁడు. యుధిష్ఠిరుఁడాతనికిదివఱకెన్నఁడును స్తోత్రనమస్కారములను జేసియుండలేదు.

ఇటఁ గౌరవశ్రేష్ఠుండగు భీష్ముఁడు శరశయ్యాశాయియై తీవ్ర బాధ ననుభవించుచు నుత్తరాయణంబుకొఱకు నిరీక్షించుచుండెను. ఆతఁ డప్పుడు మహర్షిగణపరివృతుండై సర్వమయుండునుసర్వాధారుండును బరమపురుషుండునగు కృష్ణుని ధ్యానించుచుండెను. అతనిస్తుతివాక్యంబులచేఁ జంచలచిత్తుండగు కృష్ణుండు యుధిష్ఠిరాదులతోఁ గూడ నాతని దర్శింపఁబోయెను. అట్లు పోవుచుండఁగా మార్గమధ్యమున యుధిష్ఠిరుఁడు కృష్ణునివలనఁ బరశురామోపాఖ్యానమును వినియెను.

భీష్మునియొద్ద జ్ఞానలాభంబు గాంచుమని కృష్ణుఁడు యుధిష్ఠిరున కనుమతి నొసంగెను. ఏమనిన-భీష్ముఁడు సకలధర్మవేత్త; ఆతని జ్ఞాన మాతనితో నంతరించిపోవలసియుండెను. ఆతఁ డట్లు మరణింపకుండఁగనే యాతనిజ్ఞానము జగంబున వ్యాపింపవలయునని కృష్ణునియుద్దేశము. అందుచేతనే కృష్ణుఁడు భీష్మునియొద్ద జ్ఞానోపదేశముం గాంచవలయునని యుధిష్ఠిరునకు బోధించెను. మఱియుధిష్ఠిరునకు జ్ఞానబోధచేయునట్లు కృష్ణుడు భీష్మునకుఁగూడ ననుమతి నొసంగెను.

భీష్ముఁడట్లు చేయుట కంగీకరింపక "ధర్మాధర్మములు నీవలననే యగుచున్నవి. నీవే సర్వజ్ఞుఁడవు. కావున నీవే యుధిష్ఠిరునకుపదే

శింపవలయును. నేనిప్పుడు శరచ్ఛిన్నశరీరుండనై మరణావస్థయందలి క్లేశము ననుభవించుచుంటిని. బుద్ధిభ్రష్టుండ నగుటవలన నీకార్యంబుగా నేరదు” అని చెప్పెను. అప్పుడు కృష్ణుఁడు “నీకు శరాఘాతంబువలన వేదన లేకుండునట్టి వరంబును బ్రసాదించితిని. నీయంతఃకరణము జ్ఞానతేజంబుచేఁ బ్రకాశమానంబు గాఁగలదు. నీబుద్ధి నిశ్చలమై యుడఁ గలదు. నీమనంబు కేవలమును సత్త్వగుణాశ్రయం బగును. దివ్యదృష్టి ప్రభావముచే నీకు భవిష్యదర్థంబు లన్నియును దేటబడుంగాక!” అని వరప్రదానముం గావించెను.

కృష్ణునికృపాతిరేకంబున నట్లే యయ్యెను. కాని యప్పుడు గూడ భీష్ముఁడు తనయసమ్మతిం దెలియఁజేయుచు “జనార్దనా! స్వయముగా యుధిష్ఠిరునకు నీ వేలహితోపదేశంబు సేయఁగూడదు?” అని ప్రశ్నించెను.

కృష్ణుఁడు దానికిఁ బ్రత్యుత్తరముగా “హితాహితకర్మంబులు సర్వంబును నావలననే సంభూతంబు లగుచున్నవి. చంద్రునకు శీతాంశుఖ్యాతివలెనే నాకును యశోలాభం బయ్యెనని యెఱుంగుము. నిన్నిప్పుడు సమధికయశస్సాంద్రునిం గావింపవలయుననియే నాయుద్దేశము. అందుచేతనే నాసర్వశక్తులును నీకుఁ బ్రసాదించి యుంటిని” అని చెప్పెను.

అప్పుడు భీష్ముఁడు ప్రఫుల్లహృదయుఁడై యుధిష్ఠిరునకు ధర్మతత్త్వమును ప్రబోధించుటకుఁ బ్రవృత్తుండయ్యెను. అతఁ డీవిధముగా రాజధర్మమును, ఆపద్ధర్మమును, మోక్షధర్మమును సవిస్తరముగా ధర్మజు కెఱింగించెను. మోక్షధర్మోపదేశముతో శాంతిపర్వము ముగిసెను.

ఈశాంతిపర్వమునందు మూడుతరగతులకవులచేతులును గానం బడుచున్నవి. ఈశాంతిపర్వకళేబరముమాత్రము మొదటితరగతికవిది.

తరువాత నెవ్వరికే ధర్మము తెలిపెనో వారాధర్మమున కీశాంతిపర్వ మున నాశ్రయ మొసంగుచు వచ్చిరి. ఈపర్వమునందు మనము బాగుగ విమర్శింపఁదగిన యొక గొప్పవిషయమున్నది. కేవలమును ధార్మికుని రాజుగాఁ జేసినంతమాత్రమున ధర్మరాజ్యసంస్థాపనముం గావించినట్లు కానేరదు. రేపాతినియుత్తరాధికారి యగువాఁడు పాపాత్ముఁడు కావచ్చును. కావున ధర్మరాజ్యస్థాపంబు నేసి దానిని రక్షించుటకై ధర్మ వ్యవస్థను గావించుట యావశ్యకమై యుండెను. రణవిజయ మనునది రాజ్యస్థాపనమునకుఁ బ్రథమకార్యమాత్రమే—దానిని శాసించుటకు (Legislation) విధివ్యవస్థ యవశ్యమై యుండెను. కృష్ణుఁ డాకార్యముం దీర్చుటకు భీష్ముని నియోగించెను. అట్లు భీష్ముని నియోగించుటకు విశేషకారణ మున్నది. ఆకారణము నాదర్శనీతిజ్ఞుఁ డొక్కఁడుమాత్రమే గ్రహింపఁగలఁడు. ఆకారణముంగూర్చి సవిస్తరముగఁ గృష్ణుఁడే స్వయముగ భీష్మునకెఱిఁగించెను:—

'నీవు వయోవృద్ధుండవును, శాస్త్రవిదుండవును, శుద్ధాచారసంపన్నుఁడవునై యుంటివి. నీ కవిదితంబు లగురాజధర్మంబులునుతరని ధర్మంబులును లేవు. జన్మావధి నీజీవితమునం దెట్టిదోషంబును గానవచ్చుటలేదు. నరపతులందఱును నిన్ను సర్వధర్మవేత్తగాఁ గీర్తించి యున్నారు. కావునఁ దండ్రివలె నీవే యీభూపాలగణంబునకునీతి నుపదేశింపుము. నీవు నిరంతరము నుమహర్షిగణంబును దేవగణంబునునుపాసించువాఁడవు. ఇప్పుడీభూపాలురు నీవలన ధర్మవృత్తాంతమును దెలిసికొనవలయు నని కుతూహలపడుచున్నారు. కావున నీ వవశ్యముగసకలధర్మతత్వములను సవిస్తరముగ దెలుపవలయును. విద్వాంసుఁడగువాఁడే ధర్మోపదేశకుఁడు కావలయునని పండితులు చెప్పుదురు'

తరువాత ననుశాసనపర్వము—ఇందుఁగూడ హితోపదేశమే యున్నది. యుధిష్ఠిరుఁడు శ్రోత; భీష్ముఁడు వక్త; కొన్ని వ్యర్థవిషయ

ములతో నీయనుశాసనపర్వము కూర్పఁబడినది. చాలవఱకిదిమూఁడ వతరగతివికల్పితమని తోఁచుచున్నది. అందు మనకుఁ బ్రయోజనీయం బగువిషయ మేదియును లేదు.

అనంతరము భీష్ముఁడు స్వర్గారోహణముం గావించెను. ఇది మాత్రమే మొదటితరగతికవికృతమని చెప్పవచ్చును.

---

## ఏకాదశపరిచ్ఛేదము

### కామగీత

భీష్మస్వర్గారోహణానంతరమున యుధిష్ఠిరుడు మరలదుఃఖము లోమునిఁగిపోయెను; మరల వనమునకు బోయెదనని పట్టుపట్టెను; అనేకు లనేకవిధముల బోధించిరి. కాని కృష్ణుఁడీసారిమాత్రమీరోగము నకుదగిన యౌషధమును బ్రయోగించెను. అట్టిరోగమును నిర్ణయించుట మఱియెవ్వరికిని సాధ్యము కాదు. యుధిష్ఠిరున కిప్పుడు కలిగిన రోగ మహంకారము. ఇంగ్లీషువిద్యాశాలయందు మనము నేర్చిన 'ప్రైడ్' అనుశబ్దము సరిగా దీనికిఁ బ్రతిశబ్దము. కాని వాస్తవముగా మాత్ర మది కాదు. అహంకారమును మాత్సర్యమును వేఱువేఱు భావములు. 'ఇదియంతయు నేనేచేయుచున్నాను' 'ఇది నాదుఃఖము' 'ఇదినాది' అనుభావమే యహంకారము, ఇదియే యుధిష్ఠిరుని దుఃఖమునకుఁగారణము. 'నే నీపాపమును గావించితిని; అందుచేత నే నాకీదుఃఖము కలిగినది; నామూలముననే యిది యంతయును తటస్థించినది; కావున నేనువనంబునకుఁ బోయెదను' అనునీయాత్మాభిమానమే యుధిష్ఠిరుని దుఃఖమునకు మూలమై యున్నది. ఆమూలమునఁ గుఠారాఘాతముం గావించి యుధిష్ఠిరు నుద్ధరించుటయే యీశ్రేష్ఠధర్మవేదియుద్దేశము. అందుచేతనే కృష్ణు డప్పుడు యుధిష్ఠిరునింగాంచి పౌరుషవాక్య

ములతో 'ఇంకను నీ కొకశత్రువు మిగిలియున్నాడు. నీశరీరాభ్యంతర మున నహంకారరూపం బగుదుర్జయశత్రువున్నట్లు నీవు గ్రహించి తివా?' అని చెప్పి శ్రీకృష్ణుఁడు తత్వజ్ఞానమూలంబున నయ్యహంకారమును దూలించుటకై యొకరూపకమును యుధిష్ఠిరునకు వినుపించెను. తరువాత నాతఁ డత్యుత్కృష్టోపదేశంబున యుధిష్ఠిరునిం దేర్చెను. దానిని సవిస్తరముగ నీక్రింద నుదహరించుచున్నాము. గీతలయందు మనము చదివిన నిష్కామధర్మ మిందుఁగూడ నున్నది. ఇట్టి యతిమహాత్తరంబగు ధర్మోపదేశముచే కృష్ణచరిత్రమునకు విశేషస్ఫూర్తి యగుచున్నది:—

'ఓధర్మరాజా! వ్యాధి రెండువిధంబులైనది. శారీరక మనియు మానసికమనియును. ఈద్వివిధవ్యాధులును బరస్పర కారణంబున నుత్పన్నంబు లగుచుండునుశరీరమునందోఁచువ్యాధి శారీరకంబనియు మనోమధ్యంబునఁ బీడించువ్యాధి మానసికవ్యాధి యనియుఁ జెప్పఁబడుచున్నది. కఫవాతపిత్తంబులు శరీరగుణంబులు, అవి మూఁడునుసమ భాగమునందున్నప్పుడు శరీరము స్వస్థముగా నుండును; అవి విషమంబులైనప్పుడే దేహమున రోగముదయించును. పైత్యముద్రేకించినప్పుడు కఫము తగ్గును; కఫ మతిశయించినప్పుడు పైత్యము తగ్గియుండును. శరీరమునకుంబోలి యాత్మకును మూఁడుగుణంబులున్నవి, రజస్సు, సత్వము, తమము నని వానినామములు. ఈగుణత్రయమును సమభావమునం దున్నచో నాత్మస్వస్థమై యుండును. ఈగుణత్రయమునం దేదేనతిరయించినచో మఱియొకటి లోపించుచుండును. హర్షము కలిగినచో శోకమును, శోకము కలిగినచో హర్షమును దిరోహిత మగుచుండును. దుఃఖసమయంబున సుఖంబును, సుఖసమయంబున దుఃఖమును నెవ్వఁ డనుభవించును? ఏమైననేమి? ఇప్పుడు సుఖదుఃఖములను రెంటిని స్మరించుట నీకుఁ గర్తవ్యము గాదు, సుఖదుః

ఖాతీతం బగుపరబ్రహ్మమును స్మరించుటయే నీకువిధేయమైయున్నది. నీ కిదివఱకు భీష్మద్రోణాదులతో నెట్టి మహారణము సంప్రాప్తించి నదో, యట్లే యిప్పుడొక్క యహంకారముతో నంతకంటెను నతి భీకరం బగుసంగ్రామము తటస్థించినది. ఈయుద్ధమునం దాభిముఖ్యం బు గాంచుటయే నీకిప్పు డవశ్యకర్తవ్యము. యోగంబును, దదుప యుక్తం బగు కార్యకలాపమును నవలంబించినచో నీవీయుద్ధంబున జయలాభంబు నందగలవు. ఈయుద్ధమున బాణములు, సైనికులు, భృత్యులు, బంధువులు మొదలగుసహాయులతో నెంతమాత్రమును సంబంధములేదు, ఏకమాత్రసునస్సహాయముచేతనే యుద్ధరంగమునం బ్రవేశింపవచ్చును. ఈరణంబున విజయుంబుం బడయకున్నచో దుఃఖ మునకుం బారమే లేక యుండును. కావున నాయీయుపదేశమును గ్రహించి యచిరకాలంబుననే యహంకారమును జయించి శోకపరి త్యాగంబు నేసి స్వస్థచిత్తుండవై పైతృకరాజ్యప్రతిపాలనంబు గావిం పుము.

ఓయుధిష్ఠిరా! కేవలరాజ్యాదిపరిత్యాగమూలంబున సిద్ధిలా భంబు వడయుట యెన్నటికి సాధ్యంబు కానేరదు ఇంద్రియసముదా యమును జయింపం గలిగినచో సిద్ధిలాభంబు కలుగుట కెట్టి సందేహా మును లేదు, ఎవ్వరు రాజ్యాదివిషయసముదయంబును బరిత్యజిం చియు మనంబున విషయభోగాభిలాషులై యుందురో వారికిం గలు గుసుఖమువంటి సుఖము నీశత్రువులకు లభింపనిమ్ము. మమత సంసార ప్రాప్తికిని,నిర్మమతబ్రహ్మపదప్రాప్తికి నిగారణంబులనినిర్దేశింపఁబడియె నుఇట్టివిరుద్ధధర్మములుగలమమత్వమునునిర్మమత్వమునుగూడమానవ హృదయంబులసలక్షితముగబ్రవేశించియుండియొకదానినొకటియాక్ర మించి పరస్పరవిజయంబునకు బ్రయత్నించుచుండును. ఎవ్వడీశ్వరునిం బోలి జగంబునకును, నస్తిత్వమును, నవినశ్వరత్వమును గలవనివిశ్వ

సించునో యాతఁడు ప్రాణివినాశంబు గావించియు హింసాపాపవిలి ప్తుండు గానేరఁడు. ఎవ్వఁడీస్థావరజంగమాత్మకంబగు జగంబున కం తకు నాధిపత్యంబు గాంచియు, మమకారమును బరిత్యజించియుండునో, యాతఁడెన్నఁడు నీసంసారపాశంబులచే బద్ధుండు కాఁబోఁడు. మఱియు నెవ్వఁ డరణ్యావాసంబు చేయుచు, ఫలమూలాదులవలన జీవికానిర్వ హణంబు గావించుచుండియును, విషయవాసనాపరిత్యక్తుండు కాఁజాలఁడో యాతఁడు నిశ్చయముగా నీసంసారజాలంబునఁ బడిపో వును. కావున నింద్రియంబులును, విషయసముదయంబునుగూడ మా యామయంబులని యెఱుంగుటనీకవశ్యకర్తవ్యము. వీనిపై మమతలే కుండువాఁడే నిశ్చయముగా సంసారమునుండిముక్తిలాభంబుఁ గాంచుటకు సమర్థుఁడగును. కామపరతంత్రులగు మూఢవ్యక్తు లెన్నటికిని బ్రశం సాస్పదులు కాఁజాలరు. కామమనునది మనసునుండియే సముత్పన్నం బగును. అదియే సకలవృత్తులకును మూలకారణ మైనది. బహుజన్మా భ్యాసవశంబునఁ గామము సధర్మముగా గ్రహించి దానము, వేదా ధ్యయనము, తపము, వ్రతము, యజ్ఞము, నియమము, ధ్యానము, యోగము మొదలగువానిని ఫలాపేక్ష లేకుండ నాశ్రయించువాఁ డొక్కఁడే యెప్పటికైనఁ గామమును జయించుటకు సమర్థుఁ డగు చున్నాఁడు. కామనిగ్రహమే యథార్థధర్మము—అదియే మోక్షమునకు బీజస్వరూప మనుటకు సందేహము లేదు.

పూర్వకాలమున విజ్ఞానమయులగుపండితులచేఁ గీర్తింపఁబడిన కామగీతను నీకిప్పు డుపదేశించెదను వినుము. కామము స్వయముగా నిట్లు చెప్పెను. నిర్మమత్వమును, యోగాభ్యాసమును లేకుండ నన్నె వ్వరైనను జయించుటకు సమర్థులు కాఁజాలరు. జపాదికార్యంబులచే నెవ్వరైన నన్ను జయించుటకుఁ బ్రయత్నించినచో నే నభిమానరూ పంబున వారిహృదయంబులఁ బ్రవేశించి వారిప్రయత్నమును విఫలం

బుగఁ జేసినవాఁడ నగుచున్నాఁడను. వివిధంబు లగుయజ్ఞానుష్ఠానాదులచే నెవ్వరైన నన్ను నిర్జింప నెంచినచో నేను వారిహృదయమధ్యమున జంగమ మధ్యగతం బగుజీవాత్మంబోలి వ్యక్తరూపంబున నుదయింతును. వేద వేదాంతాలోచన రూపంబున నెవ్వరైన నన్ను శాసింపఁ బ్రయత్నించినచో నేను వారిహృదయంబున స్థావరాంతర్గతంబగు జీవాత్మంబోలి నిలిచియుందును. ధైర్యమూలంబున నెవ్వరైన నన్ను జయింపఁ బ్రయత్నించినచో వారిహృదయమును నే నెన్నఁడును విడువనే విడువను. తపోమూలంబున నెవ్వరైన నన్ను జయింప నెంచినచో నేను వారి తపోమధ్యమునుండియే ప్రాదుర్భావంబు నందెదను. మోక్షార్థియై యెవ్వఁడైన నన్ను జయింపఁ దలఁచినచో నే నాతనిం గాంచి నవ్వి నాట్యము చేయుచుందును. సర్వభూతంబులునుగూడ నన్ను జయింపఁ జాలవనియును నాస్థితి సనాతనం బనియును బండితులు నుద్దేశించి యున్నారు.

ఓయుధిష్ఠిరా! నే నిప్పుడు నీయెదుటఁ గామగీతను గీర్తించి యున్నాను కావునఁ గామమును జయించుట దుస్సాధ్య మని యెఱుంగుము. నీవు విధిపూర్వక బుగ నశ్వమేధంబును నితరయజ్ఞానుష్ఠానంబును గావించుచుఁ గామంబును ధర్మవిషయంబున నుపయోగింపుము. మాటిమాటికిని బంధువియోగక్లేశాభిభూతుండ వగుచుండుట నీవంటి వానికిఁ గేవల మనుచితము. నీ వెంత విలపించినను వారి నెన్నటికిని మరల దర్శించుటకు సమర్థుండవు కాఁజాలవు. కావున నీవిప్పుడు మహాసమారోహముతో సుసమృద్ధంబు లగుయజ్ఞాదికార్యంబుల ననుష్ఠించుటకుఁ బ్రయత్నింపుము. అట్లయినచో నిహలోకంబున నతులకీర్తియును, బరలోకంబున నుత్కృష్టగతిలాభంబును గాంచుటకు సమర్థుండ వయ్యెదవు.

---

## ద్వాదశ పరిచ్ఛేదము

### కృష్ణప్రయాణము

ధర్మరాజ్యము సంస్థాపిత మయ్యెను. ధర్మము ప్రచారిత మయ్యెను. ఈగ్రంథమునంగల పాండవులతోడి కృష్ణసంబంధ మిందు కొఱకే మహాభారతమున శ్రీకృష్ణుఁ డెందులకుఁ బ్రదర్శింపఁబడి యెనో యాపని పూర్తియైనది. ఇఁకఁ గృష్ణుఁడు మహాభారతమునుండి యంతర్హితుం డగుటయే యుచితము. కాని, రచనాకండూతిపీడితు లంతసులభముగాఁ గృష్ణుని విడిచిపెట్టఁగలరా? తరువాత వారర్జునునిము ఖమునుండి యొక యప్రాసంగికవిషయమును వెలువరించిరి. అది యేమనిన—అర్జునుఁడు కృష్ణునిం గాంచి "నీవు నాకు యుద్ధసమయమునఁ గావించిన ధర్మోపదేశ మంతయును నేను మఱచిపోయితిని. కావున మఱియొకసారి బోధింపవలయును" అని ప్రార్థించెను. అప్పుడు కృష్ణుఁడు కేవలమును సాధారణునింబోలి "నాకావిషయ మంతయు నిప్పుడు మరల స్మృతికి రానేరదు. నే నిప్పుడు యోగసహితుండనై సమస్తము నుపదేశించితిని. నీవు మూఢుఁడవు, శ్రద్ధాశూన్యుఁడవు. కావున నీకిఁక నేమియును జెప్పఁదలఁచుకొనలేదు. అయినను నీకొక పురాతనేతిహాసమును వినిపించెదను వినుము.

కృష్ణుఁడప్పు డయ్యితిహాసవ్యక్తినవలంబనము జేసికొని యర్జునునకు మరలఁ దత్త్వజ్ఞానము నుపదేశించెను. అతఁడు మొదట బోధించినవిషయము గీతారూపమునఁ బ్రసిద్ధమైయుండెను. ఇప్పు డుపదేశించినవిషయమునకు గ్రంథకారుఁడు "అనుగీత" యని నామకరణముం గావించెను. ఇందలి యొకభాగమునకు బ్రాహ్మణగీత యనిపేరున్నది.

భగవద్గీత, ప్రజాగరము, సనత్సుజాతీయము, మార్కండేయసమస్య, అనుగీత మొదలగు ననేక ధర్మవిషయములు మహాభా

రతమధ్యమమునఁ బ్రవేశించి యింతవఱకు నవి మహాభారత భాగము లుగనే పరిగణింపఁ బడుచున్నవి. ఈ యన్నిటియందును శ్రేష్ఠమైనది గీతయే గాని తక్కినవానియందుఁగూడ సారగర్భితంబులగు వచనము లగపడుచున్నవి. అనుగీతయు నుత్తమగ్రంథమే. "మోక్షమూలరు" దీనిని దన "Sacred of the East" అనుగ్రంథమునందుఁ బ్రశంసించి యున్నాఁడు. బొంబాయి హైకోర్టు జడ్జియగు శ్రీయుత కాశీనాథ త్రియంబక తేలంగుగారు దీని నింగ్లీషునం దనువాదము గావించియు న్నారు. కాని యాగ్రంథ మెట్టిదైనను మనకు దీనితో నెంతమాత్ర మును బ్రయోజనము లేదు. అది యెంతయుత్తమమైనదైనను కృష్ణోక్తము కాదు. గ్రంథకారులో, యితరులో దాని నిట్లవతరింపఁజేసి కృష్ణోక్త ముగాఁ జేసియున్నారు. కాని యిందు భిన్నహస్తచిహ్నములు స్పష్ట ముగా నగపడుచున్నవి. ఈ యనుగీతోక్తధర్మమునకును, గీతోక్త ధర్మమునకును నెట్టి సాదృశ్యమును లేదు. ఈసంగతి గీతావేత్తలే విమర్శింపవలయును. శ్రీ కాశీనాథత్ర్యంబకుఁడు తన యనువాదగ్రంథ మున దీర్ఘానుక్రమణికను వ్రాసియున్నాఁడు. అందలి సంతోషజనకం బులగు ప్రమాణప్రయోగములమూలముననే యనుగీత గీతకు వెనుక ననేకశతాబ్దులకు రచింపఁబడినట్లు తేటపడుచున్నది. ఆప్రమాణము లనువిస్తరించి విమర్శించుటవలన నెట్టిప్రయోజనమును లేదు. కృష్ణ చరిత్రమునందలి యేభాగమునుగూడ ననుగీతపై నాధారపడియుండ లేదు. అయినను ననుగీతయు, బ్రాహ్మణగీతయుఁ బ్రక్షిప్తములని నిరూపించుట కీసంగతి మాత్రము తెలుపుట చాలును. పర్వసంగ్రహా ధ్యాయమున వీనిప్రసంగ మేమియును లేదు.

అర్జునున కిట్లుపదేశించిన తరువాతఁ గృష్ణుఁడు పాండవులను వీడ్కొని ద్వారకానగరమునకు వెడలిపోయెను. ఈవీడ్కోలు మా నవప్రకృతిసులభమైస్నేహప్రపూర్ణమై యుండెను. కృష్ణుని మానవ

త్వముం గూర్చి మే మిదివఱకే యనేక ప్రమాణములను జూపి యున్నాము. కావుననిఁకవిస్తరించివర్ణింపవలసిన యావశ్యకము లేదు.

కృష్ణుఁడు మార్గమధ్యమున నుతంకుని దర్శించినట్లు వర్ణింపఁబడినది. మహారణమునునివారింపనందుకై యప్పుడుతంకుఁడు కృష్ణుని శపించుటకుసంసిద్ధుఁడయ్యెను. అప్పుడు కృష్ణుఁడు "మహాత్మా! నన్ను శపింపవలదు. శపించినచో నీతపస్సంక్షయంబు కాఁగలదు. నేను సంధిస్థాపనంబు గావించుటకై ప్రయత్నించితిని. మఱియు నేనుజగదీశ్వరుఁడను" అని చెప్పెను. అప్పు డుతంకుఁడు కృష్ణునకుఁ బ్రణామంబు సేసి స్తోత్రంబు గావించి శ్రీకృష్ణుని విశ్వరూపమును జూపింపవలయునని ప్రార్థించెను; కృష్ణుఁడును దనవిశ్వరూపమును జూపించెను! మఱియు నుతంకునకు బలవంతముగ వరప్రదానముం గావించెను. తరువాత నొక చండాలుండును శునకంబును వచ్చినట్లును, చండాలుఁడు శునకమాంసమును భుజింపవలయు నని యుతంకుని బలవంతపెట్టినట్లును నిట్టివే యెన్నియో భీభత్స వ్యాపారము లందు వర్ణింపబడియెను. ఈయుతంక సమాగమవృత్తాంతము మహాభారతసంగ్రహాధ్యాయమున లేదు. కేవల మిది మహాభారతము కాదు. అందుచే నీవిషయమున నాలోచించుట మన కావశ్యకము కాదు. ఇందు మూఁడవ తరగతి కవిహస్తము స్పష్టముగా నగపడుచున్నది.

ద్వారకకుఁబోయి కృష్ణుఁడు తన బాంధవుల నందఱను గలిసికొనియెను. అప్పుడు వసుదేవుఁడు కృష్ణునివలన యుద్ధవృత్తాంతమును వినవలయునని కుతూహలపడియెను. కృష్ణుఁడుబుద్ధుఁడుసంక్షిప్తంబుగను, సత్యోక్తిశూన్యంబుగను, సనైసర్గికదోషవిరహితంబుగను యుద్ధచరిత్రమును దండ్రికి వినుపించెను. ఆతడు కేవలము నప్పు డభిమన్యువధవృత్తాంతమును మాత్రము గూఢముగా నుండెను. తక్కినవిషయముల

నన్నిటిని స్పష్టముగా నెఱింగించెను. కాని సుభద్ర కృష్ణునితోఁ గూడ ద్వారకకుఁ బోయి యుండెను. కావున నామెయే స్వయముగ నభిమన్యువధంగూర్చిన ప్రస్తావము నెత్తెను. అప్పుడు కృష్ణుఁ డాసంగతిని గూడ సవిస్తరముగఁ దెలియఁ జేసెను.

ప్రయాణసమయమున యుధిష్ఠిరుఁడు తనయశ్వమేధయాగ కాలమునకు మరల రావలయు నని శ్రీకృష్ణుని బ్రార్థించి యుండెను. ఇప్పు డట్టిసమయము తటస్థించెను. కావున శ్రీకృష్ణుఁడు యాదవ గణ పరివృతుఁడై మరల హాస్తినాపురమునకు బయలుదేఱి పోయెను.

కృష్ణుఁ డచ్చటికిఁ బోయినతరువాత నభిమన్యుపత్ని యగు త్తర యొకమృతశిశువును బ్రసవించెను. కృష్ణుఁడామృతపుత్రునిఁ బునర్జీవితుని గావించెను. కాని కృష్ణుఁ డీశ్వరశక్తిమూలముననే యికార్యమును నిర్వహించెనని సిద్ధాంతము చేయఁగూడదు. ఇప్పటిడాక్టరులలోఁ జాలమంది మృతప్రాయులై జనించిన బిడ్డలను బునర్జీవితులంగావింపఁ గలుగుచున్నారు. వారెట్లు చేయఁగలుగుచున్నారో చేయుచుండిరో మనము బాగుగ నెఱుంగుదుము. ఇట్లు చేయుట యాకాలపువా రెవ్వరు నెఱుంగ రనియు, నప్పుడు శ్రీకృష్ణున కొక్కనికే యీ పద్ధతి తెలిసియుండెననియు దీనినిబట్టి మనము నిర్దేశింపవచ్చును. అతఁ డాదర్శపురుషుఁడు గావున సమస్తవిద్యలు నాతనికిఁ గరతలామలకములై యుండెను.

తరువాత యజ్ఞము నిర్విఘ్నముగా సంపన్నం బయ్యెను. కృష్ణుండును మరల ద్వారకానగరంబునకుఁ బోయెను. తరువాత నాతఁ డెన్నఁడును మరలఁ బాండవులకు సాక్షాత్కరింపలేదు.

---

# భాగవతకథాసారము

## ద్వితీయభాగము

### సప్తమఖండము

యోஉసౌ యుగసహస్రాంతే ప్రదీప్తార్చి ర్విభావసుః
సంభక్షయతి భూతాని తస్మై ఘోరాత్మనే నమః

శాంతిపర్వము ౪౭ అధ్యాయము

### ప్రథమపరిచ్ఛేదము

#### యదువంశధ్వంసము

తరువాత నాశ్రమవాసపర్వము. దానితోఁ గృష్ణచరిత్రమున కెట్టిసంబంధమును లేదు. దానితరువాత నీతిభాషావహంబగు మౌసలపర్వము. ఇందు సమస్తయదువంశధ్వంసమును బలరామకృష్ణుల దేహత్యాగమును వర్ణింపబడియెను. యదువంశీయు లందఱు నొండొరులను వధించుకొనిరి. ఈభయానకవ్యాపారమును నివారించుటకుఁగృష్ణుడు స్వయముగా నెట్టిప్రయత్నమును గావించి యుండలేదు. ఇంతేకాక యనేకయాదవవీరు లాతనిచేతనే నిహతులైనట్లుగూడ వర్ణితమై యుండెను.

ఆవృత్తాంత మంతయు నిట్లున్నది—గాంధారిచేఁ జెప్పంబడిన యుఱువదియాఱవయేఁడతీతం బయ్యెను. ఒకనాఁడు లోకవిశ్రుతులగువిశ్వామిత్రుఁడు, కణ్వుఁడు, నారదుఁడు ననునీమువ్వురు ఋషులును ద్వారకకు వచ్చిరి. అప్పటికి యాదవు లందఱును దుర్నీతిపరాయణులైయుండిరి. అప్పుడు దుర్వినీతులగు యాదవులు కృష్ణపుత్రుఁడగు

సాంబున కొడుకు వేషము వైచి యాఋషులయొద్దకుఁ దీసికొనిపోయి 'ఈమె గర్భవతియై యున్నది. ఈమెకు బుత్రసంతానము కలుగునా?' అని ప్రశ్నించిరి. పురాణేతిహాసములయందు మహర్షు లందఱును భయంకరక్రోధస్వరూపులుగా వర్ణింపఁబడియుండిరి. మాటిమాటికిని వారిచ్చు శాపములనుబట్టి చూడగా వారీశ్వరపరాయణులగు జితేంద్రియులు గారనియు, నతినృశంసు లగునరపిశాచస్వరూపులనియు బోధపడక మానదు. ఇక్కాలమునఁ బెద్దమనుష్యు లెవ్వరైన నిట్టిపరిహాసవ్యాపారముంగాంచినచో నొక్కించుక మందహాసమును గావించి విడిచివైతురు. కాకున్నచో నొక్కతిరస్కారవచనమును బ్రయోగించి యూరకుందురు. కాని యీజితేంద్రియు లగుమహర్షులుమాత్ర మొక్కసారిగా సమస్త యదువంశధ్వంస మగునట్లతిక్రూరమగు శాపప్రదానముం గావించుచు "ఈగర్భమున లోహమయం బగుముసలము ప్రసవించును. దాని మూలమునఁ గృష్ణబలరాములుకాక తక్కినయదువంశ మంతయును విధ్వస్తమైపోవును." అని ధిక్కరించి పలికిరి. అంతేకాని యాశాపనివారణమున కెట్టియుపాయమును గావింపలేదు.

సాంబుఁడు పురుషుఁడైననేమి, మఱియెవ్వరైననేమి—ఆతనిగర్భమునుండి యథావిధిగ నొకముసలము ప్రసవించెను, అప్పుడు యాదవేశ్వరుఁడగు నుగ్రసేనుఁడు (కృష్ణుఁడు యాదవేశ్వరుఁడు కాఁడు) భయపడి యాముసలమును జూర్ణముగఁ జేయవలయునని యాజ్ఞాపించెను. ముసలము చూర్ణమైనది—చూర్ణమంతయును సముద్రమున నిక్షిప్తం బయ్యెను. ఇటయాదవు లందఱును ధర్మబాహ్యులై పోయిరి. అప్పుడు కృష్ణుఁడు వారలవినాశనంబును గోరి ప్రభాసతీర్థమునకుఁ బోవలయునని సమస్తయాదవులకు నాజ్ఞాపించెను,

యాదవు లందఱును, బ్రభాసతీర్థమునకుఁ బోయి యట సురాపానపరవశులై యనేకోత్సవంబులఁ గావింపఁ దొడంగిరి. తుదకు వారి

లో వారికిఁ గలహము లారంభ మయ్యెను. కురుక్షేత్రయుద్ధమున మహారథుం డగుసాత్యకియె మొట్టమొదట వివాదమున కారంభించెను. ఆతఁడు కృతవర్మతోఁ గలహము పెట్టుకొనుటయుఁ బ్రద్యుమ్నుఁడాత నిపక్షము నవలంబించెను. సాత్యకి యప్పుడు కృతవర్మశిరఃఖండనంబు గావించెను. అనంతరము కృతవర్మజ్ఞాతులు (యాదవులు యదువృష్ణి భోజాంధకాదిభిన్న భిన్నవంశీయులై యుండిరి) వచ్చి సాత్యకిప్రద్యుమ్ను లనుజంపివైచిరి. అప్పుడు కృష్ణుఁడుక్రోధముతో నొకగుప్పెఁడుజెల్లు గడ్డిని గ్రహించి దానిమూలమున ననేకయాదవులను నిహతులం గావించెను. ఈజెల్లుగడ్డియే ముసలచూర్ణంబనియును, రాజాజ్ఞచే సముద్రుని క్షిప్తం బగునాచూర్ణమునుండియే యిది యుత్పన్నం బయ్యెననియు గ్రంథాంతరమునఁ జెప్పఁబడి యుండెను. మహాభారతమునం దీవృత్తాంత మగపడుట లేదు. కాని కృష్ణుఁడు గ్రహించినజెల్లుగడ్డి ముసలరూపమునఁ బరిణమించెననియు, బ్రాహ్మణశాపముచేనచ్చటిజెల్లంతయు ముసలీభూతమై యుండెననియు, యాదవు లందఱును దానిమూలము ననే ఘెండొరులఁ బ్రహరించుకొనుచు నశించిపోయిరనియు భారతమునం దున్నది. అప్పుడు దారుకుఁడును, బభ్రుం డనునొకయాదవుడును, కృష్ణునిం గాంచి "ఓజనార్దనా! నీవిప్పు డసంఖ్యప్రాణసంహారంబు గావించి వెడలిపొమ్ము! మేము మహాత్ముఁ డగుబలభద్రుని యొద్దకుఁ బోయెదము" అని చెప్పిరి.

కృష్ణుఁడు దారుకుని హస్తినాపురమున కర్జునునియొద్దకుఁబంపించెను. అర్జునుఁడు వచ్చి యాదవకులకామినులను హస్తినాపురమునకుఁ గొనిపోవలయు నని యాజ్ఞాపించెను. కృష్ణుఁడు యోగాసనాసీనుండగు బలరాముని దర్శించెను. అప్పు డాతనిముఖమునుండిసహస్రభృతులచే జితంబగు నొకసర్పము వెలువడి సాగరవరుణనదీవాసుకిప్రభృతులచే నభినుతింపఁబడి సముద్రమధ్యంబునఁ బ్రవేశించెను. బలరాముని దేహ

ము జీవశూన్యం బయ్యెను. అప్పుడు కృష్ణుఁడు స్వాయముగామ ర్త్యలో కత్యాగంబుఁ గావింపఁ దలంచి మహాయోగావలంబనపూర్వకంబుగ భూతలశాయి యయ్యెను. ఆసమయమున జరానాముండగు నొకవ్యా ధుఁడు మృగభ్రాంతిచేఁ గృష్ణపాదపద్మమును శరవిద్ధంబు గావించెను. తోడనే యాతఁడు తనవిభ్రాంతి నెఱింగి శంకితహృదయముతో వచ్చి కృష్ణచరణనిపతితుఁ డయ్యెను. కృష్ణుఁ డాతని నాశ్వాసించి యాకాశ మండలమును బ్రభాసితముగఁ జేయుచు స్వర్గారోహణంబు గావించెను

ఇట నర్జునుండు ద్వారకకు వచ్చి రామకృష్ణుల కౌర్ధ్వదైహిక కృత్యంబులు నిర్వర్తించి యాదవకులకామినులను వెంటఁబెట్టుకొని హస్తినాపురమునకుఁ బ్రయాణ మయ్యెను. మార్గమధ్యమున దండ హస్తులగుదస్యు లాతని నాక్రమించిరి. భీష్మకర్ణులను మహారణంబున నిర్జించినట్టియు, నీపృథ్వీమండలమునంతను జయించినట్టియు నర్జునుఁ డప్పుడు దండధారులగు దస్యులచేఁ బరాజితుండై పోయెను. ఆతఁడు గాండీవమునే యెత్తఁజాలకపోయెను. రుక్మిణి, సత్యభామ, హైమవతి, జాంబవతి మొదలుగాఁగల కృష్ణమహిషీగణంబునుదక్కఁ దక్కిన కాంతల నందఱను దస్యులపహరించుకొని పోయిరి.

ఈవృత్తాంత మంతయును మూలికమేనా? ముసలవ్యాపారము కేవల మనైసర్గికముగా నున్నది. కావున మేము దీనిని బూర్వనియ మానుసారంబుగఁ బరిత్యజించుటకు బాధ్యుల మైతిమి. దానిని త్యజి చినను స్వాభావానుగతంబుగ నిలిచియున్న స్వల్పవృత్తాంతమున మాత్ర మంతిశీఘ్రముగాఁ ద్రోసివైవ జాలకుంటిమి. యాదవుల పానాసక్తు లనియు, దుర్నీతిపరాయణులనియు నిదివఱకే చెప్పంబ యుండెను వారందఱు నేకవంశీయులుగారు. భిన్నభిన్నవంశీయులును ననేకసమయములయందుఁ బరస్పర విరుద్ధాచారులు నై యుండిరి కురుక్షేత్రయుద్ధంబున వార్ష్ణేయులును, సాత్యకియుఁ గృష్ణుఁడునుమ

త్రము పాండవపక్షమునం దుండిరి. కాని యంధకకుకురభోజవంశీయులును, కృతవర్మయు దుర్యోధనునిపక్షము నవలంబించిరి. మఱియు యాదవులకు రాజనువాఁ డెవ్వఁడును లేఁడు. ఉగ్రసేనుని రాజని చెప్పవలసి యుండెను. కాని యాదవులకు రాజ్యాధికారము లేదనుప్రవాద మొకటి యున్నది. కృష్ణుడు తనగుణాధిక్యము కారణంబుగా యాదవుల కందఱకును నేతయై యుండెను. కాని కృష్ణునకు బలరామునితో మతభేద మున్నట్లు శాంతిపర్వమునఁ గానంబడుచున్నది. భీష్ముఁడు కృష్ణనారదసంవాదముం గూర్చి చెప్పుచు శ్రీకృష్ణుఁడు జ్ఞాతిరంజనమునకై తా నెంత ప్రయత్నించినను విఫలమనోరథుండనైతినని విచారించుచు నారదునితోఁ జెప్పినట్లు వర్ణించియుండెను. ఈసకలవృత్తాంతమును బూర్వమే చెప్పియుంటిమి. కావునయాదవులు పరస్పరవిద్వేషవిశిష్టులును, స్వస్వప్రధానులును, నత్యంతబలగర్వితులును, దుర్నీతిపరాయణులును, కేవలసురాపాన నిరతులునై యుండిరని చెప్పుట కెంతమాత్రమును సందేహము లేదు * అట్టివారు పరస్పరకలహంబు గావించుకొని సకలయదుకులక్షయంబు గావించిరనియు, నిచ్ఛాధీనముగనో, యనిచ్ఛాధీనముగనో రామకృష్ణులుకూడ నాయూలమున నే దేహత్యాగంబు గావించిరనియు జెప్పుట యసంభవముగాని యస్వభావముగాని కానేరదు. ఇట్టిప్రవాదము లోకమున వ్యాపించియుండె ననియు, నందుపై గ్రంథకారు లీయదువంశధ్వంసవృత్తాంతము నీవిధముగా గ్రంథస్థముగావించి యుందురనియుఁ దోఁచుచున్నది. అందుచే నీవృత్తాంత మెంతవఱకు చారిత్రకమని విమర్శించుటవలన నుపయోగము లేదు. కానియొకటిరెండుమాటలు చెప్పవలసియున్నది.

---

* యాదవులు మద్యపానాసక్తి యెంతయు విజృంభించెనుగా — దాని నడంచుటకై బలరామకృష్ణులు ద్వారకానగరమున సురనుసిద్ధము చేయువారికి శూలారోపణశిక్ష యగునని చాటింపు చేయింపవలసివచ్చినది. మేమిప్పుడు పాశ్చాత్యరాజపురుషులంగూర్చి యిట్టియాత్మనీతి నవలంబింపవలయునని ప్రార్థించుచున్నాము

యదువంశధ్వంసమును నివారించుటకై కృష్ణుఁ డెట్టిప్రయత్నమును జే యకుండుటయే కాక దానికిఁ బ్రోత్సాహముఁ గూడ జేసినట్లు చెప్పఁ బడిఁయుండెను. ఇది యొకవేళ సత్యమే యైనను దీనివలనఁ గృష్ణచరి త్రమున కసంగతిగాని, యగౌరవముగాని యెంతమాత్రమును లేదు. ఆదర్శపురుషుఁ డాదర్శపురుషునకుఁ దగినకార్యమునే గావించి యుం డెను. ఆదర్శపురుషున కాత్మీయులు ననాత్మీయులు ననువా రెవ్వ రును లేరు. ఆతనికి ధర్మమే యాత్మీయమైనది. యదువంశీయు లం దఱు నధార్మికులై పోవుచుండుటచే వారిని దండించుటయును నావశ్య కసమయమున వారివినాశసాధనముం గావించుటయును గృష్ణునకుఁ గర్తవ్యములై యుండెను. అధర్మాత్ములను కారణంబున జరాసం ధాదులను సంహరించినవాఁడు దుర్వినీతులగు యాదవులకు వినా శనంబు గల్పింపకయే యున్నచో నిఁక ధర్మబంధుఁ డెట్లగు ను? ఆత్మీయులకు బంధుఁడును, తనకు బంధుఁడు నగువాఁ డెన్నటికిని ధర్మపక్షపాతి కాఁజాలడు. ఆతఁడు స్వపక్షపాతియే యగును. అట్టివా డాదర్శధర్మాత్ముఁడు కాఁడు. కావుననే కృష్ణుఁ డట్టివాఁడు కాలేదు.

కృష్ణుని దేహత్యాగమునకుఁ గారణములు కొన్ని యనిశ్చి తములై యుండెను. దానికి నాలుగుకారణములను నిర్దేశింపవచ్చును.

మొదటిది టాల్ వయన్ హుయిలు సాంప్రదాయమువారు కృష్ణు డు జూలియస్ కై జరువలె ద్వేషవిశిష్టులగు బంధువు చేనిహతుండయ్యె నని చెప్పుదురు. ఇట్లే గ్రంథమునందును జెప్పఁబడి యుండలేదు.

రెండవది—ఆతఁడు యోగావలంబనముం గావించి దేహత్యా గంబు గావించెనని—పాశ్చాత్యవైజ్ఞానికులకు శిష్యులగువారు యోగా వలంబనము దేహత్యాగంబు చేసె ననుమాటను విశ్వసింపరు. ఆయ విశ్వాసమునకుఁ గారణమేమో నాకు బోధపడలేదు. యోగాభ్యాస కాలంబున నిశ్వాసమును నిరోధించు నలవాటుగలవారు శ్వాసనిరో ధంబుచేసి ప్రాణత్యాగంబు చేసికొనఁజాలరని మేము సాహసించి చెప్పఁ జాలము. ఇట్టిసంఘటనము విశ్వస్తసూత్రంబున వినవచ్చుచునే యుండెను. ఇద యాత్మహత్య యగుటచేఁ గేవలయును బాపకృత్య

మనియు, నాదర్శపురుషున కనుసరణీయ మనియుఁ గొండఱు చెప్పె దరు. కాని మే మట్లు చెప్పజాలము. ప్రాచీనవయస్సున జీవితకార్యముల నన్నిటిని సంపన్నంబు గావించుకొని యనంతర మీశ్వరుని యందు విలీనుండగుటకై మనోమధ్యంబునఁ దన్మయుండై శ్వాసనిరోధించుట యాత్మహత్య యనవలయునా? ఈశ్వరప్రాప్తి యనవలయునా? అదియే విమర్శింపఁదగినవిషయము ఆత్మహత్య మహాపాపమనియే యంగీకరింతము. కాని జీవితవిశేషమునఁ యోగావలంబన పూర్వకముగాఁ బ్రాణత్యాగంబు చేయుటకూడ నట్టిదియేనా?

మూడవది—ముసలితనమున శరీరఘాతి యగుట.

నాలుగవది—అప్పటికిఁ గృష్ణునకు నూఱేండ్లవయసు దాఁటిపోయినది. విష్ణుపురాణమునం దీసంగతి చెప్పఁబడినది. ఇది జరావ్యాధియేనా?

కృష్ణుని మనుష్యత్వమును మాత్రమే యంగీకరించి యాతని యీశ్వరత్వముంగూర్చి యంగీకరింపనివా రీనాలుగుకారణములలో నేదే నొకదాని నంగీకరింతురు. కాని మేము కృష్ణుని నీశ్వరావతారమని విశ్వసించుచున్నాము. అందుచే మేము కృష్ణునియిచ్ఛయే యాతని దేహత్యాగమునకుఁ గారణమని చెప్పుదుము. జగత్తునందు మానవత్వమున కాదర్శమును బ్రచారము గావించుటయే యాతనియిచ్ఛ. ఆయిచ్ఛాపూరణార్థమే యాతఁడు సకలకార్యములను మానవశక్తి మూలముననే నిర్వహించెను. అయినను నాతఁ డీశ్వరావతారుఁ డగుటచే జననమరణము లాతనియిచ్ఛాధీనములై యుండెను. ఇదియే మామతము. కావునఁ గృష్ణునియిచ్ఛాధీనములై యుండెను. ఇదియే మామతము. కావునఁ గృష్ణునియిచ్ఛయే యాతనిదేహత్యాగమునకేకమాత్రకారణమని మేము చెప్పుచున్నాము.

మౌసలపర్వము మహాభారతప్రథమశ్రేణికవితాంతర్గతమౌనా కాదా యనుసంగతిని మేము పరిశీలింపలేదు. విశేషప్రయోజనము లే

కుండుటచే విడిచివైచితిమి. అందుచే గొన్నిస్థూలసంఘటనములుసత్యములనియే బోధ యగుచున్నది. అయినను నివి మహాభారతప్రథమకవికృతాంతర్గతములు కావని తోఁచుచున్నది. పురాణములయందును హరివంశమునందును గల కృష్ణజీవితసంఘటనములు చాలవఱకు మహాభారతమున లేవు. ఈ వృత్తాంతముమాత్రము పురాణములయందును, హరివంశమునందును మహాభారతమునందునుగూడనున్నది మహాభారతమున గృష్ణచరిత్రముపాండవులతోసంబంధించినంతవఱకు మాత్రమే యున్నది. అనేకంబు సనిశేయము గా నుండుట కవకాశము లేదు. ఈవిషయము మాత్రమా నియమమునకు బహిర్భూతమైయున్నది. ఇచ్చటఁ గృష్ణుఁ డీశ్వరావతారుఁడుగాఁ జెప్పఁబడియెను. ఇందు రెండుమూఁడుతరగతుల కవికలదిహ్నము లగపడుచున్నవని యిది వఱకే చెప్పియుంటిమి. ఇట్లు నిశ్చయించుటకు మఱికొన్ని యితర కారణములను జూపవచ్చునని ప్రయోజన మంతగా నగపడుటలేదు. అయినను నసుక్రమణికాధ్యాయమున మౌసలపర్వప్రస్తావ మేమియును లేదనుసంగతిమాత్రము చెప్పవలసి యున్నది. పరీక్షిత్తు జనించినతరువాత మఱియెట్టి వృత్తాంతమునుగూడ ననుక్రమణికాధ్యాయమున ముగిసియుండు నని మాయభిప్రాయము. ఆతరువాతివృత్తాంతములన్నియు రెండుమూఁడుతరగతుల కవులకల్పనలై యుండును.

---

## ద్వితీయ పరిచ్ఛేదము

### ఉపసంహారము

ప్రయోజనము ననుసరించి విమర్శించుపద్ధతి యిరు తెఱంగులై యుండును. ప్రాచీనకుసంస్కారములను నిరసించుట మొదటివిధము. సత్యమును దెలిసి గ్రహించుట రెండవవిధము. ఈకృష్ణచరిత్రమున మొదటిపద్ధతియే ప్రధాన మైయుండెను. అందుచే సుగామయమును, ప్రయత్నమునుగూడ దానికొఱకే విశేషముగ వినియోగపడియెను.

కృష్ణచరిత్రమునందు సత్యమును నూతనముగ గ్రహించుట దుస్సాధ్య వ్యాపారము. ఏమనిన—మిథ్యాస్వభావోపన్యాసము లను భస్మ మధ్యమున మరుగుపడియున్న సత్యవృత్తాంతములను నగ్నికణంబులను వెదకి కనుఁగొనుట చాలగష్టము. ఏయుపాదానమూలమున శ్రీకృష్ణ చరిత్రమును బునస్థాపితముగఁ జేయవలసియుండెనో, యాయుపాదాన ముకూడ మిథ్యాసాగరమధ్యమున మునిఁగి యుండెను. అయినను మాకు సాధ్యమైనంతవఱకు మేము దీనిరూపము నేర్పఱచితిమి.

పురాణేతిహాసములయం దెంతవఱకు సత్యమును గ్రహించి తిమో దానినంతను గృష్ణచరిత్రమునం దెట్లు ప్రయోగించితిమో మేమీయుపసంహారమునఁ జూపవలసియున్నది.

బాల్యకాలంబునఁ గృష్ణుఁడు శరీరబలంబున నాదర్శబలవంతుఁ డని చూచి యున్నాము. అశిక్షితం బగునాతనిబలప్రభావముచే బృం దావనమునందలి క్రూరజంతువు లన్నియును నశించెను. ఆతని యన భ్యస్తబలవిశేషంబుననే కంసునిమల్లులు నిహతులైపోయిరి. గోపాలన కాలంబునను, గోపాలగణంబులతోడి విలాస క్రీడాసమయంబునను గావించు వ్యాయామాదులచేఁ గృష్ణునకు శారీకబలస్ఫూర్తి యైనట్లగ పడుచున్నది. ద్రుతగమనంబునఁ గాలయవనుఁడుగూడ నాతనికిఁ జాల లేకపోయెను. కురుక్షేత్రయుద్ధమునం దాతనిరథసంచాలనవిద్య విశే షముగఁ బ్రశంసింపఁబడియెను.

ఈబలము క్రమముగా సక్రమశిక్షితమగుటచేఁ గృష్ణుఁ డాస మయమున క్షత్రియసమాజమునం దెల్లఁ బ్రధానాస్త్రవిదుండని ప్రసి ద్ధిం గాంచెను. ఆకాలమునం దాతని నెవ్వరును బరాభూతునిం గావిం పఁజాలకుండిరి. ఆతఁ డప్పుడు కంసజరాసంధశిశుపాలాది సర్వప్రధాన యోధులతోడను, గాశీకళింగపౌండ్రకక గాంధారాదిదేశాధీశ్వరులతో డను యుద్ధముం గావించి యుండెను. అందెవ్వరు నెన్నఁడు నాతని బరాభూతునిం జేయఁజాలకపోయిరి. యుద్ధవిద్యయం దాతనిశిష్యులగు సాత్యకియు, నభిమన్యుండునుగూడ రణరంగమునం దెప్పుడు నజేయులై

యుండిరి. ఒక్కొక్కసమయమునం దర్జునుఁడు గూడ యుద్ధసంబంధమునం దాతనిశిష్యత్వము నంగీకరించియుండెను. రణపాటవము కేవల శరీరబలమునందును, నభ్యాసమునందును నాధారపడియుండునని పురాణేతిహాసములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యట్టి రణపాటవము కేవల మొక సైనికునకుఁ గూడఁ గలిగి యుండవచ్చును. సేనాపతిత్వమే యోధునిశ్రేష్ఠత్వమునకుఁ బ్రధానగుణము. ఆకాలమున యోధులెవ్వరును సేనాపతిత్వమునందు సమర్థులైయుండలేదు. పురాణములయందుఁగాని, మహాభారతమునందుఁగాని యెవ్వరికిని నట్టి రణపాటవమున్నట్లగపడదు. భీష్మునకును, నర్జునునకును గూడ నట్టి సామర్థ్యము లేదు. జరాసంధయుద్ధమున శ్రీకృష్ణునిసేనానాయకత్వసామర్థ్యము విశేషముగఁ గానవచ్చుచున్నది. ఆతని సేనానాయకత్వమువలనఁ గొలఁదిపాటి యాదవసైన్యముచే జరాసంధుని యసంఖ్యాసైన్యము మధురాపురమునుండి విముఖమైపోయెను. అగణనీయంబగు జరాసంధసైన్యమును నిర్జించుట యాదవసైన్యమునకు దుస్సాధ్యంబని యెంచి మధురను బరిత్యజించి సాగరద్వీపమున ద్వారకయను నూతననగర నిర్మాణంబు గావించుటయు, దానికి సమీపమునందలి రైవతకగిరి పంక్తియందు దుర్భేద్య దుర్గములను నిర్మించుటయును శ్రీకృష్ణునియసాధారణరాజనీతిజ్ఞతను వెల్లడించుచున్నవి. అట్టిసామర్థ్యము పురాణేతిహాసములయందలి యే క్షత్రియులయందును గానవచ్చుటలేదు. పురాణకారులగు మహర్షులకుఁ గూడ నిది యబోధగమ్యంబైనది. కావుననే కృష్ణేతిహాసము కల్పనామాత్రము కాదనియు, సత్యమే యనియుఁ దెలుపుట కిదియు నొక నిదర్శనమైయున్నది.

శ్రీకృష్ణుని జ్ఞానోపార్జితంబు లగు సమస్త వృత్తులును జరమస్ఫూర్తిం గాంచినట్లు మనకుఁ గావలసినన్ని నిదర్శనము లగపడుచు

న్నవి. ఆతఁడద్వితీయ వేదజ్ఞుఁడనియర్ఘ్యప్రదానసమయంబున భీష్ముఁడు ప్రశంసించి యున్నాఁడు. అట్లు పూజించుట కదియొక కారణముగఁ గూడ నాతఁడు తెలిపియున్నాఁడు. శిశుపాలుఁడు గూడ నామాటకు మాఱువలుకలేదు. వేదవ్యాసుఁ డుండఁగా నీతనినే పూజించుటయేల కని మాత్రమే యాతఁ డాక్షేపించి యుండెను.

శ్రీకృష్ణుని జ్ఞాన వృత్తులన్నియు సంపూర్ణవికాసముం గాంచి యున్నట్లాతనిచేఁ బ్రచారితంబగు ధర్మోపదేశమే విస్పష్టప్రమాణమై యున్నది. ఈధర్మము కేవలమును గీతయందే కాక మహాభారతము నం దనేకస్థలములయందుఁ గూడఁ గానంబడుచున్నది. కృష్ణునిచేఁ జెప్పఁబడిన ధర్మముకంటె నున్నతంబును, సకల లోకహితకరంబును సర్వజనాచరణీయంబును నగు ధర్మమే కాలమునందును జగత్ప్రచారితమైయుండలేదు. ఈసంగతి సవిమర్శముగ మేము గ్రంథాంతరమున సిద్ధాంతీకరించి యున్నాము. ఈధర్మము మనుష్యాతీతంబగు జ్ఞానమును బ్రసాదించుచున్నది. కృష్ణుఁడుమానవశక్తిమూలముననే సకల కార్యములును సాధించెనని మేము మాటిమాటికిం జెప్పుటయే కాక ప్రమాణములను గూడఁ జూపియున్నాము. కేవల మాగీతోపదేశము నందు మాత్రము శ్రీకృష్ణుఁడు విశేషించి యసంభవజ్ఞానమునే యాశ్రయించియుండెను.

సార్వజనీనధర్మమునుండి శ్రీకృష్ణుఁ డవతరింపఁజేసిన రాజధర్మమునుబట్టియు, రాజనీతినిబట్టియు నాలోచించి చూడఁగా నాతని జ్ఞానప్రవృత్తులు చరమస్ఫూర్తిం గాంచినవని స్పష్టముగా బోధయగుచుండును. సర్వశ్రేష్ఠంబును, సంభ్రాంతంబునునగు రాజనీతి నెఱింగిన వాఁడాతఁ డొక్కఁడే యగుటచేతనే యుధిష్ఠిరుఁడు వ్యాసభగవానునిచే నుపదేశింపఁబడియును శ్రీకృష్ణుని యాలోచన లేకుండ రాజసూయయజ్ఞముం గావించుటకుఁ జేయిసేసికొనలేదు. అబాధ్యులగు యా

దవులును, బాధ్యులగు పాండవులునుగూడ నాతనితో నాలోచింప కుండ నేకార్యమును జేయుట లేదు. జరాసంధుని నిహతునిం గావించిరాజమండలమును గారాగారమునుండి యుద్ధరించుట శ్రీకృష్ణునియుత్కృష్ట రాజనీతికి స్పష్టోదాహరణ మైయున్నది. ధర్మరాజ్యస్థాపనంబున కతిసులభంబును, బరమధర్మంబు నగునుపాయ మదియే—ధర్మరాజ్యస్థాపనానంతరమున ధర్మరాజ్యశాసనంబు గావింప నెంచి భీష్ముని రాజధర్మోపదేశంబునకు నియోగించి రాజవ్యవస్థను సంస్థాపించుట శ్రీకృష్ణుని రాజనీతిజ్ఞత కతిప్రశంసనీయం బగుద్వితీయోదాహరణముగా నున్నది. ఇంకను నిట్టివెన్నియో యుదాహరణములను పాఠకులు చూచి యున్నారు.

శ్రీకృష్ణునిబుద్ధి సర్వవ్యాపినియు, సర్వదర్శినియు, సకలోపాయోద్భావినియునై సర్వోత్కృష్టస్థానమును గాంచి యున్నట్లు మన మెన్నియో సారులు పరికించి యున్నాము. మానవశరీరధారు లెంతవఱకు సర్వజ్ఞు లగుట కవకాశ మున్నదో శ్రీకృష్ణుఁ డంతవఱకును సర్వజ్ఞుఁడై యుండెను. ఎవ్వనిబుద్ధి నిరంతరము నధ్యాత్మతత్త్వాలోచనమును, ధర్మతత్త్వాలోచనమును విడువక వానినే యాశ్రయించి యుండెనో యట్టిశ్రీకృష్ణునకు వైద్యవిద్య, సంగీతవిద్య, అశ్వవిద్య మొదలగునితరవిద్యలుకూడ నాయత్తములై యుండెను. ఉత్తరాగర్భజనితుండగు మృతపుత్రునిబునర్జీవితునిం గావించుట మొదటివిద్యకును, జగద్విఖ్యాతంబగు మురళీమోహనగానము రెండవవిద్యకును, జయద్రథవధదినంబున నశ్వశల్యోద్ధారంబు గావించుట తృతీయవిద్యకును నుదాహరణములు.

కార్యోపయుక్తంబు లగుశ్రీకృష్ణునిసమస్తవృత్తులును జరమస్ఫూర్తిఁ గాంచినవి. ఆతనిసాహసమును, క్షిప్రకారిత్వమును సకలకర్మతత్పరత్వమును మనక నేకసమయములయందుఁ గానంబడుచున్నవి.

ఆతనిధర్మమును, సత్యమును నిశ్చలంబులైనవని సూచించునిదర్శనము
లచే నీగ్రంథమంతయును నిండి యున్నది. ఆతనిసర్వభూతదయాగుణం
బును, నిర్మలప్రేమయు నీయితిహాసముసందు స్పష్టముగా నగపడుచు
న్నది. ఆతఁడు బలగర్వితులగు వీరులకంటె నధికబలవంతుం డయ్యు
ను, లోకహితార్థంబుగ శాంతిని స్థాపించుటకు దృఢప్రయత్నుండును,
దృఢప్రతిజ్ఞుండు నై యుండెను. శ్రీకృష్ణుఁడు సర్వలోకహితైషియై
యుండెను. మానవులయందే కాక గోవత్సాదితిర్యగ్జంతువులయందుఁ
గూడ నాతఁడు దయామయుఁడై యుండెను. ఈసంగతి గిరియజ్ఞమున
స్పష్టముగా నగపడుచున్నది. ఆతఁడు బాల్యకాలమున వానరములకు
బెట్టుటకై నవనీతమును దొంగిలించుట, ఫలవిక్రేత్రికథ మొదలగు
వృత్తాంతము లన్నియును గింవదంతులనియే త్రోసివైవఁ గూడదు.
గోవత్సముల కుత్తమభోజనముం గల్పించుటకై యింద్రయాగమును
గూడ మాన్పించినయాతని కట్టిగుణ ముండుననుట యాశ్చర్యము
కాదు. ఆతఁ డాత్మీయులు, బంధువులు జ్ఞాతులు మొదలగువారికంద
ఱకు నెంతటిహితుఁడై యున్నట్లగపడుచుండెనో, పాపాత్ములైనచో
నాత్మీయులకైనను నంతటియహితుఁడై యున్నట్లు కానవచ్చుచున్నది.
ఆతఁ డపరిమితక్షమాగుణసంపన్నుఁడుగా నగపడుచుండును. కానిసమ
యము వచ్చినచో లోహమయహృదయముతో నకుంఠితుఁడై దండ
విధానముం గావించుచుండును. ఆతఁడు స్వజనప్రియుఁడు; అయినను
లోకరహితార్థమై యాత్మీయులనైన వధించుటకు సంశయింపఁడు. కం
సుఁ డాతనిమేనమామ; ఆతనికిఁ బాండవు లెట్టిబంధులో శిశుపాలుఁ
డుగూడ నట్టిబంధుఁడే—మేనత్తకొడుకు! శ్రీకృష్ణుఁ డట్టికంసశిశుపా
లురను వధించుటకుఁ గుంఠితుఁడు కాలేదు. తుట్టతుదను దుర్నీతిప
రాయణులును, సురాపానవివశులు నగుటచే యాదవు లాత్మీయులై
నను వారిరక్షణవిధానమును గావింపక యూరకుండెను.

ఇట్టి శ్రేష్ఠవృత్తు లన్నియును సర్వోత్కృష్టస్థానము నాక్రమిం చినంతమాత్రమున నాతఁడు చిత్తరంజనీవృత్తి ననుశీలనముం గావిం చువిషయమునఁగూడఁ బరాఙ్ముఖుఁడు కాలేదు. బృందావనమునందలి వ్రజలీలయుఁ బరిణతవయస్సున సముద్రవిహారము, యమునావిహా రము, రైవతకవిహారము మొదలగునవి దాని కుదాహరణంబులై యున్నవి. వానినిగూర్చి సవిస్తరముగ నిట వర్ణించు టంతయావశ్య కముగా నగపడలేదు.

కేవల మిఁక నొకమాటయే చెప్పవలసి యున్నది. భక్తియే మానవునకుఁ బ్రధానవృత్తి యని ధర్మతత్త్వమునఁ జెప్పఁబడి యుం డెను. కృష్ణుఁ డాదర్శపురుషుఁడు—మానవత్వమున కాదర్శమును బ్రచారము సేయుటకే యాతఁ డవతరించి యుండెను. ఆతనిభక్తిస్ఫూ ర్తిమన కెచ్చట నగపడినది ? కాని యాతఁడే యీశ్వరావతార మైనప్పు డిఁక నాతనిశక్తి కాశ్రయులు మఱియెవ్వరున్నారు ? స్వయ ముగ నాతఁడే * తాను బ్రహ్మపదార్థముకంటె భిన్నుఁడను గానను జ్ఞాన మెప్పు డనుభవమునకు వచ్చునో యప్పుడే తనయందు భక్తికలుగు చున్నది. ఇదియే జ్ఞానమార్గమునకుఁ బరమస్థానము. దీనినే యాత్మ రతి యందురు. ఛాందోగ్యోపనిషత్తునందు దీనినిగూర్చి "ఏష ఏవం పశ్యన్నేవం, మన్వాన ఏవం విజ్ఞానన్నాత్మరతి రాత్మక్రీడా ఆత్మమిథున ఆత్మానందః స స్వరాడ్భవతీతి" అని వర్ణింపఁబడియెను.

ఎవ్వఁడు దీనిని జూచి భావించి, దీనిని దెలిసికొని యాత్మర తుండును, నాత్మక్రీడాశాలియు నగునో ఎవ్వని కాత్మయేమిథునంబును, నాత్మయే యానందంబు నగునో యాతఁడే స్వరా ట్టగుచున్నాఁడు.

ఇదియే గీతయందును జెప్పఁబడియెను. కృష్ణుఁ డాత్మారా ముఁడు; ఆత్మజగన్మయమైనది. ఆతఁడే జగంబునఁ బ్రీతివిశిష్టుఁడు పర

* మహాభారతమునం దన్నిభాగములయందును శ్రీకృష్ణుఁడు శివోపాసకుం డుగా వర్ణింపఁబడియుండెను. అవి యన్నియును బ్రక్షిప్తలక్షణవిశిష్టములై యున్నవి.

మాత్మయుం డాత్మరతి మఱి యేవిధముచేతను దెలియఁజాలము. అం దును మేము తెలిసికొనఁజాలమని చెప్పుచున్నాము—

శ్రీకృష్ణుఁడు సర్వస్థలములయందును, సర్వసమయములందు ను సర్వగుణాభివ్యక్తిచే సముజ్జ్వలుండని యుపసంహారమునఁ జెప్పవలసి యున్నది. అతఁడజేయుఁడు; అపరాజితుఁడు; విశుద్ధుఁడు; పుణ్యమ యుఁడు; ప్రేమమయుఁడు; దయామయుఁడు; అనుష్ఠేయ కార్యము లయందపరాఙ్ముఖుఁడు-ధర్మాత్ముఁడు; వేదజ్ఞుఁడు నీతిజ్ఞుఁడు; ధర్మ జ్ఞుఁడు; లోకహితైషి; న్యాయనిష్ఠుఁడు; క్షమాశీలుఁడు, నిరపేక్షుఁడు శాస్త; నిర్మముఁడు; నిరహంకారుఁడు; యోగయుక్తుఁడు; మఱియుఁ దపస్వియై యుండెను. అతఁడు మానవశక్తిచేతనే సకలకార్యనిర్వహ ణముం గావించెను. కాని యాతనిచరిత్ర మమానుషమైనది. ఈవిధ ముగా మానవశక్తిచే నతిమానుషచరిత్రము వికాసముం గాంచుటవ లన నాతని మానవత్వముగానిఁ యీశ్వరత్వముగాని యనుమోదిత ముగునా కాదా యనువిషయమును పాఠకులే తమబుద్ధివివేచనాను సారముగా స్థిరపరచుకొనవలయును. కృష్ణుఁడు మనుష్యమాత్రుఁడే యని మీమాంసచేయువాడు. రేన్ డేవిడ్సు శాక్య సింహునిగూర్చి జ్ఞానియనియు, హిందువులలో నుత్తమోత్తముడనియుఁ జెప్పినట్లే కృష్ణునింగూర్చియును ప్రశంసింపఁగలఁడు. మఱియు నీకృష్ణచరిత్ర మునం దీశ్వరప్రభావమును గాంచగలిగినవాఁడుమాత్రము చేతులు జోడించుకొని యీగ్రంథసమాపనకాలమున మాతోఁగూడఁ గంఠ మును గలిపి యీక్రిందివిధముగా గానము చేయును—

నాకారణాత్ కారణాద్వా కారణాకారణాన్నచ।
శరీరగ్రహణంవాపి ధర్మత్రాణాయ తే పరమ్.

సమాప్తము.

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# ఆంధ్ర నాటకములు

| | రు | అ |
|---|---|---|
| **బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి** | | |
| రామదాసు | 1 | 8 |
| **బళ్ళారి కె. బాలసరస్వతి** | | |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| **గురజాడ అప్పారావుగారి** | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| **బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్యంగారి** | | |
| ప్రేమలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| **ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి** | | |
| తులసీదేవి (సతీతులసి) | 1 | 8 |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి** | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| **చందాల కేశవదాసుగారి** | | |
| కనకతార | 1 | 8 |
| **విద్వత్కవి మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి** | | |
| సక్కుబాయి (అసలు స్టేజినాటకం) | 1 | 8 |
| **శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి** | | |
| సావిత్రి | 1 | 8 |

| | రు | అ |
|---|---|---|
| **కీ. శే. కాళ్ళకూరి నారాయణరావుగారి** | | |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాభ్యుదయము (సారంగధర) | 1 | 8 |
| **బలిజేపల్లి లక్ష్మీకాంతంకవిగారి** | | |
| సత్యహరిశ్చంద్రీయము | 2 | 0 |
| **మానాపురం అప్పారావు పట్నాయిక్ గారి** | | |
| రేవతి | 1 | 8 |
| **శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి** | | |
| బొబ్బిలియుద్ధము | 1 | 8 |
| **విష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి** | | |
| సారంగధర | 1 | 8 |
| **కాజ రాధాకృష్ణశాస్త్రిగారి** | | |
| జన్మభూమి | 1 | 4 |
| అసురజ్యోతి | 1 | 8 |
| మాధవశర్మ | 1 | 8 |
| ఝాన్సీరాణి | 1 | 8 |
| **వేదాంత కవిగారి** | | |
| తెనుగుతల్లి | 1 | 8 |
| ఆకలిమంట | 1 | 8 |
| కష్టకాలము | 1 | 8 |
| మహారథికర్ణ | 1 | 8 |
| విశ్వస్వరాజ్యం | 1 | 8 |
| **ఊటుకూరు సత్యనారాయణరావుగారి** | | |
| వీరాభిమన్యు | 1 | 8 |
| అనార్కలి | 1 | 8 |
| ఛత్రపతి శివాజీ | 1 | 8 |
| అహల్య | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.